

# అనర్ఘరాఘవనాటకము

శ్రీమాన్. శతావధాని,

రత్నాకరం అనంతార్య

ప్రణీతము.

శ్రీరస్తు.
శ్రీశారదాయైనమః.

నిర్వచన
# కుశలవాభ్యుదయము.

శ్రీమాన్. శతావధాని,

రత్నాకరం అనంతార్య
ప్రణీతము.

తెనాలి రజత ముద్రాక్షరశాలయందు
కొమ్మూరి వెంకట్రామయ్యచే
ముద్రింపఁబడియె.

1924.

 దీని వెల రు. 1.

# విజ్ఞాపనము.

ఆర్యులారా! విద్వన్మణులారా!

నేను కించిజ్ఞుఁడను. మీవంటి పెద్దలయెదుట మాటలాడలేనివాఁడను. నావిన్నపమొక్కటి నాలింపుడు. నేను బాల్యచాపల్యమున నూరకుండలేక యొక మహాప్రయత్నమునకుఁ గడంగితి. ఏమన— "క్వసూర్యప్రభవోవంశః, క్వచాల్పవిషయామతిః। తితీర్షుర్దుస్తరంమోహా, దుడుపేనాస్మిసాగరం॥ మందఃకవియశఃప్రార్థీ, గమిష్యామ్యుపహాస్యతాం। ప్రాంశులభ్యేఫలేలోభా, దుద్బాహురివవామనః" అని కాళిదాసమహాకవి వక్కాణించినాఁడు. మొదట నట్టి మహాకవుల కనిర్వాచ్యమగు సూర్యవంశంబున జన్మించిన శ్రీరామోదంతమును వర్ణింప నేరికి నలవియే? అట్టిచరితమున నుత్తరకాండకథావిశేషముల వర్ణింబూనితి. ఆవిశేషము లిదివరకు మీరు వినియే యుందురు. అనేకులు వర్ణించియే యుండిరి. నేనేమియు నంతకంటె వర్ణింపజాల. ఐనను "రాఘవేశ్వరు చారిత్రము లెందరెన్నిగతులన్ వర్ణించినం జాలునే" అని యీమహాప్రయత్నమునకుఁ గడంగితి. ఫలాపేక్షకొఱకు చేతులెత్తెడివామనునివలె పరిహాసాస్పదమగునేమోయని తలఁచియు శ్రీరామునియందు భక్తివిశేషములచే తత్కథామధుర రసప్రవాహములంగ్రోల మొదలిడితి. కానన గ్రంథంబున నెచ్చోనైన లోపముండిన సుహృద్భావమున మన్నించి తెలుపుచు రాజహంసము క్షీరనీరముల వేఱుచేసి క్షీరములఁ గ్రోలి నీరముల విడుచుచందంబున నందలిసుశబ్దభావపాకశయ్యాలంకారధ్వని చమత్కారాదుల స్వీకరించి దోషముల వీడుడని ప్రార్థించుచున్నాను.

ఇది రామాయణము. ఈరామాయణ మెవ్వ రెన్నివిధముల నెన్ని వర్ణించినను జాలదు. లోకములో రామాయణమును మించిన గ్రంథరాజ మేదియుఁ గానరాదు. ఇదియునుంగాక గానకలాప్రవీణుండును, కలియుగనారదుండును, భక్తకులాగ్రేసరుఁడు నగు త్యాగరాయలవారుకూడ శివమంత్రమునకు "మా" జీవము మాధవమంత్రమునకు రాజీవము. అని నుడివియున్నారు. మఱియు "రాశబ్దోచ్చారమాత్రేణ, ముఖాన్నిర్యాంతిపాతకాః। పునఃప్రవేశనార్థంవై, మశబ్దస్తుకవాటవత్" అన్నట్లు రామశబ్ద మిట్టిపవిత్రమైన వస్తువు. మఱియు వైకుంఠవాసుండగు శ్రీమన్నారాయణుండు "పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ, సంభవామియుగేయుగే" అని శాసించె. కాన సాధువుల రక్షించి దుష్టుల శిక్షించి ధర్మమును నిలుపుటకొఱకు ప్రతియుగమున నవతరించెద

నన్నట్లు త్రేతాయుగంబున రావణాదిదుష్టనిశాటవ్రాతంబును సంహరించుటకై శ్రీమన్నారాయణుండు రామావతారంబుందాల్చె. "రాఘవత్వే భవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని" అని విష్ణుపురాణము. శ్రీమహాలక్ష్మియు స్వామి కనుకూలముగా సీతాస్వరూపముందాల్చె. మఱియు "వేదానాం పరమో దేవః, హరిర్నారాయణః పరః। పతిం విశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివమచ్యుతం, నారాయణ పరంబ్రహ్మ పరమాత్మా పరోఽవ్యయః నారాయణః పర ఇతిశ్రుతిరాహ సనాతనీ॥ అగ్నిర్వై దేవానామవమో విష్ణుః, పరమస్తదంతరేణ, సర్వా అన్యా దేవతాః, సబ్రహ్మ సశివస్సేంద్రస్సోక్షరః పరమస్స్వరాట్॥ ఏక ఏవ పుమానాస్తే నబ్రహ్మ నేశ్వరస్థితః అణోరణీయాన్ మహతో మహీయాంశ్చ గుహాస్థితః స్థాస్నువాంశ్చ భవశ్చేతి విష్ణ వేచార్చ్యతేతిచ" అనగా సమస్తదేవతలలో శ్రేష్ఠుండగు దేవుఁడు హరినారాయణపరశబ్దములచేఁ జెప్పఁబడుచున్నాఁడు. ఇందుకు జగత్తునకుఁ బతియు, నాత్మేశ్వరుఁడును, శాశ్వతుఁడును, మంగళప్రదుఁడును, అవ్యయుఁడును" అను మొదలగు నర్థముగల శ్రుతిప్రమాణము. నారాయణుఁడు, పరబ్రహ్మము, పరమాత్మ, పరుఁడు, అవ్యయుఁడు అను శ్రుతియే వానిని నుత్తముఁడని చెప్పుచున్నది. ఇదియునుంగాక, అగ్ని చివరవాఁడు, విష్ణువు ప్రధానుఁడు. వీరిద్దరిమధ్య నధికారములో, దక్కిన దేవతలందరును చేరియుండు. ఇందుకు వెనుక చెప్పిన శ్రుతియే ప్రమాణము. ఈనారాయణుండే బ్రహ్మరుద్రాదులలో నంతర్యామియై బ్రహ్మరుద్రాదిపదములచేఁ బిలువఁబడుచున్నాఁడు. ఇతఁడక్షరుఁడు. స్వయంప్రకాశముగల పరమస్వరూపుఁడు. మఱియు సత్యరుండగు నితఁడొక్కఁడే త్రికాలములయం దున్నాఁడు. బ్రహ్మాదులు లేరు. ఆపరమాత్మశబ్దవాచ్యుఁడగు నారాయణుండు నణువుకంటె నణువును, మహత్తుకంటె మహత్తును, నైయుండి యాపదార్థములయందే యంతర్యామియై యెవ్వరికిఁగాని దెలియఁబడకుండరహస్యముగా నున్నాఁడు. మఱియు నితఁడు నిత్యుఁడై నిత్యులగు చేతనులను నిత్యమగు ప్రకృతిని తనయాధీనమం దుంచుకొనియున్నాఁడు. ఈతఁడు జన్మరహితుఁడు. అట్టి మహానుభావుని వర్ణింప శ్రుతులుకూడ చాలకున్నవి. ఇందుకు "నారాయణాత్ప్రాణో జాయతే, నారాయణాద్రుద్రో జాయతే, నారాయణాదింద్రో జాయతే, నారాయణాత్ప్రజాపతిః ప్రజాయతే॥ బ్రహ్మనారాయణః శివశ్చ నారాయణః, శక్రశ్చ నారాయణః, అధశ్చ నారాయణః, ఊర్ధ్వంచ నారాయణః, సర్వశ్చ నారాయణః, సర్వవ్యాపకో నారాయణః, నిష్కళంకో, నిరంజనో, నిర్వికల్పో, నిరాఖ్యాతశ్శుద్ధః, దేవఏకో నారాయణః, నద్వితీయోఽస్తి॥ అని నారాయణోపనిషత్తు" ఇట్టి శ్రీమన్నారాయణుని వేదములైనను వర్ణింపఁజాలకున్నవి. మనుష్యమాత్రులు వర్ణింపఁగలరా? అట్టి మహానుభావుఁడు తన పరివారముతో

భూలోకములో రామావతారుండై యుద్భవించె. కాబట్టి యట్టియవతారమూర్తి యగు శ్రీరాముని కథాసుధామాధురి సామాన్యులకుఁ జిక్కునే? ఐనను భగవత్కథావిశేషముల వర్ణించి జన్మముఁ దరింపఁజేసికొనుట కీగ్రంథంబును రచించితిని. ఇదియునుంగాక యిది మొదటి కూర్పగుటచేతను, ధనసహాయకులు తొందరగాకావలయు ననుటచేతను, అచ్చటచ్చట కొన్నికొన్ని లోపములుండిన పాఠకు లూహించుకొందురుగాక యని ప్రార్థించుచున్నాను. నాకు చేతనైనంతవరకు అరసున్నలు వర్ణవ్యత్యాసములు లేకుండగనే సవరించితి. ఎట్లు జాగ్రత్తగా చూచినను అరసున్నలు కొన్నిచోట్ల పడలేదు. కొన్ని పడరానిచోట్ల పడినవి. కాబట్టి యవి శుద్ధాశుద్ధపత్రములో సవరించితిని. శుద్ధాశుద్ధపత్రములలో లిఖించినవన్నియు చదువరులకు నర్థవ్యత్యాసముంగు తప్పులుకావు. ఐనను పడరానిచోటుల నరసున్నలు, ద్రుతములుపడుట, వ్యాకరణవిరుద్ధములగును. కాన జాగ్రత్తతో సవరించితి. ఐన నిటువంటివి యింకెచ్చటైన గాన్పించినచో నాకు తెలియపరచిన రెండవ కూర్పులో నేమియు లేకుండ సవరించుకొనియెద. మఱియు విద్వాంసులు కవులు పాఠకులు నాయీగ్రంథమును చదివి సంతసించి నన్ను మఱింత ప్రోత్సహించుటకు ప్రార్థించెద. మీకనుమానమగు చోట్ల శుద్ధాశుద్ధపత్రమును పరికింపవలెను. నాకు మొదట కావ్యచంపూగ్రంథముల చెప్పిన వేమూరి శివస్వామిశాస్త్రిగారికిని, పిదప నాటకాలంకారములను శబ్దశాస్త్రమును నేర్పిన గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారికిని, శతావధానచాతుర్యము నలవడఁజేసిన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికిని, నాగ్రంథము జదివి శ్రద్ధతో పీఠిక లిఖించి యిచ్చిన నాగలింగం వెంకటేశ్వరశాస్త్రిగారికిని ననేక వందనముల సమర్పించి యీనావిజ్ఞాపనము నింతటితో విరమించుచున్నాను. ఇందుకు పండితులు నన్ను మఱింత ప్రోత్సహింతురుగాక యని ప్రార్థించుచున్నాను.

గుంటూరుజిల్లా
తెనాలి తాలూకా,
అమృతలూరుపోస్టు,
తురుమెళ్ల.

ఇట్లు
విద్వజ్జనవిధేయుఁడు,
రత్నాకరం అనంతాచార్యులు,
శతావధాని.

నమో గిరిజాయై.

# పరిచయము.

'సంసార విషవృక్షస్య ద్వేఫలే అమృతోపమే,
కావ్యామృతరసాస్వాదః————.'

అన్నారు సహృదయులు. మానవప్రాప్యము నిరవధికము, నిశ్చలమునగు బ్రహ్మానందము. కావ్యామృతరసాస్వాదజన్యమగు నానందమును, అట్టిద. కావుననే లాక్షణికులు కావ్యజన్యమగు నానందమును బ్రహ్మానందసబ్రహ్మచారియన్నారు.

అయితే, కావ్యమెటువంటిది? అని ప్రశ్నకలుగుచున్నది. సాహిత్యశాస్త్రజ్ఞుల యాశయములు ఈక్రింద వివృతములగుచున్నవి.—

౧ తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి—మమ్మటుఁడు.

౨ గుణాలంకారసహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ—విద్యానాధుఁడు.

౩ వక్రోక్తిః కావ్యజీవితమ్—కుంతకాచార్యుఁడు,

౪ రీతిరాత్మా కావ్యస్య—వామనుఁడు.

౫ ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్యజీవితమ్—క్షేమేంద్రుఁడు.

౬ వాక్యం రసాత్మకం కావ్యమ్—విశ్వనాధకవిరాజు.

౧, ౨ లక్షణముల భిన్నములనవచ్చును. ఈనిర్వచనమునే మఱికొందరు లాక్షణికు లంగీకరించినట్టు కన్పట్టుచున్నది. కాని, యీ నిర్వచనమునందు ప్రధానమగు రసవిషయముక్తము కాలేదు. ఒకానొక కావ్యము దోషములుండినను, సహృదయహృదయాహ్లాదకము కావచ్చును. మఱియొకటి అదుష్టశబ్దార్థసంవలితమయినను, రసికమనః ప్రీణనమొనర్పలేక పోవచ్చును. కావున, కావ్యజీవితభూతమయిన రసము పరిపుష్టమయినయెడల, నాకావ్యము, హృదయరంజకమనియు, అది లేనిది చేతః ప్రీతిని కలిగింపఁజాలదనియు సునిశ్చితము. ఈ యాశయమునే బలపఱచు నీసంవాదము కాంచుఁడు :—

> A book may be amusing with numerous errors, or, it may be very dull without a single absurdity.——Oliver Goldsmith.

అయితే, గుణాలంకారాదులు లేక రసయుక్తమైనచో, కావ్యమనఁజెల్లునా? అని శంకకలుగుచున్నది. అనవచ్చును. అయితే, గుణాలంకారము లనావశ్యక, ములా? అనావశ్యకములని ఎవరును చెప్పలేదు. అవి చక్కగా గ్రథితములం...

యెడల, రసపరిపోషకములయి, కావ్యశోభాకరములగుచున్నవి. "ఉత్కర్షా హేతవః ప్రోక్తా గుణాలంకరరీతయః" గుణాదులు కావ్యోత్కర్షమాత్రాధాయకములుకాని స్వరూపాధాయకములు కావు. అలంకారాదులులేకున్న, సహ్యముకావచ్చును. అలంకృతీ పునఃక్వాపి, అని కదాలాక్షణికసూక్తి. కాని, రసములేకున్న యెడల, అది కావ్యమే కాఁజాలదు. కావ్యము నొకవ్యక్తితో పోల్చినప్పుడు గుణములు ధర్మాది గుణములవంటివనియు, అలంకారములు కటకకుండలాదులవంటివనియు, రసము జీవిత భూతమనియు, చెప్పియున్నారు. కావున, జీవితభూతమగు రసములేనికావ్యము శవప్రాయమనిచెప్పిన తప్పుకాదేమో? పై యుపమానమువలన అలంకారాదులు విశేషములయినయెడల, ఆకారము వికారమగునేమోయన్నయూహమును తట్టుచున్నది. కావున, మొదటి రెండు నిర్వచనములును కావ్యముయొక్క సత్యస్వరూప నిరూపణమొనర్చుటలేదు.

3 అలంకారవిశేషము కావ్యజీవితమగునా?

4 రీతి, రసపోషణమున కనుకూలించెడు వర్ణసంఘటనము కావున కావ్య జీవితముకానేరదు,

5 ఔచిత్యము అన్నివిషయములందు నుండఁదగినదే కాని, అది కావ్యజీవితము కాదు. కావ్యసౌందర్యపరిపోషకమయిన దగుగాక. కావున, పైలక్షణములు సమగ్రకావ్య స్వరూపమును వెల్లడింపవు.

6 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అను విశ్వనాథకవిరాజు నిర్వచనము సమగ్రకావ్యసత్యస్వరూపమును వెలిఁబుచ్చుచున్నది.

'వాగ్వైదగ్ధ్యప్రధానేపి రసఏవాత్రజీవితమ్' అని యగ్నిపురాణమును రసపక్షపాతమునే సూచించుచున్నది.

"కావ్యస్యాత్మని సంగిని రసాదిరూపే నకస్యచిద్విమతిః"
అని వ్యక్తివివేకకారుఁడును అంగీకరించుచున్నాఁడు.

"బ్రహ్మైవరసః, రసోవైసః"

అని కవికర్మ జీవాతువయిన రసమును ఇట్లు శ్రుతులే వర్ణించుచున్నపుడు, కావ్యమున ప్రధానమెయ్యదియో విచికిత్సించుట నవసరముకదా.

ఆంధ్రసారస్వత క్షేత్రమునసీ కావ్యవ్యవసాయమెట్లు కొనసాఁగినదో, నుంత యాలోచింతము. భారతకవుల కవిత సరళమై, మత్తేభగంభీరగమనమున సాఁగినది. వారికవిత మహోదాత్తమయినది. గభీరభావసంవలితమయినది. రసపరిపుష్టమయినది. ఆకాలమున శబ్దవైచిత్రీమాత్ర దత్తదృష్టులయి, రసభావాదుల విస్మృతిపథము

జేర్చుదుర్దశ తటస్థింపలేదు. కావుననే, ఆకావ్యములు నాఁటికిని, నేటికిని——అట్లన నేల——ఆంధ్రదేశ మున్నంతవఱకు——ఆంధ్రత్వము నిల్చియున్నంతవరకు——కమనీయ యశఃప్రభాభాసమానములయి విరాజిల్లఁగలవు. భారతకవులకవిత్వమునందే ప్రబంధలక్షణములు కేకెత్తినవని విచారించిన మనకు తెలియఁగలదు. ఆకేకెత్తిన లక్షణములు శ్రీనాథాదుల గ్రంథములయందు వికసించినవి. శ్రీనాథాదుల గ్రంథములు సమగ్రప్రబంధతాసంపాదకములు కాకున్నను, మనోహరభావసంకలితములయి, శ్రవణసుభగపదఘటితములయి,

Poetry we will call musical thought——Carlyle.

అనులక్షణమునకు లక్ష్యములై యొప్పారుచున్నవి. ఈకాలమునందు ప్రవహించినపోతనభక్తి భావవాహినిఁగూర్చి మనమేమిచెప్పఁగలము? అనిర్వచనీయమై, అనన్యసాధ్యమై యొప్పారునాభక్తిశృంగారములసమ్మేళనము ఎవరు వర్ణింపఁగలరు? ఆయన భాగవతమునందును కావ్యసూచనలు కొన్నియున్నవి. తరువాత రాయలకాలమున ఆస్థానస్థకవులు తెలుఁగు ప్రబంధమునకు సమగ్రస్వరూపమును సంపాదించిరి. అప్పటి ప్రబంధములు వర్ణనాపూర్ణములై, రసభావాదులయందును, రీతియందును, దృష్టినిలిపి చక్కఁగా సాఁగినవి. కొన్నిటియందు శబ్దవైచిత్రీప్రాధాన్యముండిన నుండవచ్చును. కాని, యవిప్రత్యేక వ్యక్తిత్వముగలవి. తరువాత కొంతకాలమువఱకు స్వతంత్రప్రబంధములు తలచూపినవి. కొన్ని కథావైచిత్ర్యమును సాధించియు, కొన్ని సంవిధానపరిపాటిని పాటించియు, చక్కని, శైలిలో, మధురభావములలో. స్వతంత్రరచనలలో తమమార్గమును సాఁగించినవి. తరువాత ననుకరణము ప్రారంభమయినది. స్వతంత్రత చచ్చినది. స్వాతంత్రమెప్పుడు నశించినదో, కవితారామణీయక మప్పుడేనశించినది. వస్తువులో, వర్ణనలో, భాషలో, భావములో బట్టీపట్టి దింపుట ప్రారంభమయినది. అట్టి ప్రబంధములు జీవవంతములుగాక నిస్సారములై, సహృదయులకు జుగుప్సగలిగించినవి. పాడినపాట పాడుదాసరి ఎవరిమెచ్చుకోలుకు వచ్చువాఁడు. కొందరు కవులు శబ్దచిత్రములందును, గర్భకవిత్వములందును దత్తదృష్టులయి రచనల సాగించిరి. కవితాకన్యక యీబంధనములలో చిక్కుకొని వాపోవవలసిన స్థితితటస్థించినది. ఈశబ్దవినోదముల మధ్య భారతి చిక్కువడి రసమయజగద్విహారమునకయి బంధనములు త్రెంచుకొనిపోవ వాంఛించినది. కావుననే, కవికర్మమర్మజ్ఞులు "అధమం చిత్రకవిత్వమ్" అన్నారు. కాని యీయనుకరణయుగమునందును స్వతంత్రరచనలు లేకపోలేదు. మనోహరసంవిధానకములు, సుమధురరసభావపోషితములు, ఉద్వేగాంకితములగు

ములు పుట్టకపోలేదు. కాని, ప్రాయికముగ నీయుగమంతయు, నిట్లునడచినది.

ము, కొన్నికావ్యములు చూచినయెడల భేదమేమాత్రమును చూపట్టదు. ఒకటే

మచ్చు. ఒక పేయచ్చు. ఒక నగరము. రాజు. వేట. కన్యకాసందర్శనము. విరహము. సంయోగము. కథావిధాన మంతియతప్ప భేదమేమియు నుండదు. ఒకటి చూచి మఱియొక్కటి చూడనక్కఱలేదు. ఇట్టిస్థితి చాలకాలమువఱకునున్నది. కాలము జరుగుకొలఁది పరిణతిపొడచూపినది.

సారస్వతప్రపంచకమున నవ్యపదము లనేకములు బయలుదేరినవి. మున్ను లేని కావ్యవిశేషము లనేకములు నిర్మాణ మొందినవి. సారస్వతకుంజమునందలి యీ నవ్యకుసుమముల యామోదము రసికులకు ఆమోద సంధాయకమయినది. ఆమార్గ విశేషములన్నియు వివరించుటకిది తావుకాదు; ఆవశ్యకమునుగాదు. నవ్యకావ్యముల గూర్చిమాత్రము యోజింతము. ఇవి చాలవఱకు స్వతంత్రరచనలు. వర్ణనలు, పోకడలు, క్రొత్తవి. మహాకావ్యములుకాదు బయలుదేఱునవి. దీర్ఘకథలయినను రచింపవలనుగానివి. భావపూరితము, రసమధురమును, కవిత్వము. భాషయు క్రొత్తతెన్నులతో నడచుచున్నది. తీరుతియ్యములుగల తెలుఁగుపలుకుల యందచందములు తేర్చి చూపఁబడుచున్నవి. వృత్తములు భావాలకు సరిపడినవే తీసుకొనుచున్నారు. నూతనములను సృష్టించుచున్నారు. వర్ణనములు సాధారణముగా ప్రకృతివిషయకములు. వస్తువు జీవితమందలి ఏదేని వేదనావిశేషమును దెలుపుఘట్టము. ఇట్టినూతన రీతులతో కావ్యప్రణాళిక సాఁగుచున్నది.

ఈకాలమునకూడ పూర్వశైలి ప్రబంధములు బయల్పడకుండుటలేదు. మొత్తముమీఁద నీకాలమున అట్టి ప్రబంధములు రచించుటకు వలయు పాండిత్యప్రకర్షయు, ఓపికయు, తగ్గుచున్నటుల తలంచుట సాహసముకాదేమో! జరుగుచున్న పరిణామచరిత్రము చాలమందికి హృద్గతముకాలేదు.

జీవవంతమగుదానికి పరిణామము సహజము. ప్రపంచమునందు మార్పు ప్రతి వస్తువునందును తీవ్రవేగముతో జరుగుచున్నది. అట్లే, జీవవంతమయిన యీ భాషావాహినియందు నాఁడు నాఁటికి పరిణతి గొడసూపుట వింతకాదు. పరిణామమే జీవ వల్లక్షణమని చెప్పిన తప్పుకాదేమో! మార్పులేనిది యెండిన మొద్దుమాత్రమన్న సాహసముకాదు. కొందరు యీ నవ్యవికాశముల నిరసింప ప్రారంభించిరి. మఱి కొందరు పూర్వరీతికావ్యముల చులకనచేయఁజూతురు. "భిన్నరుచిర్హిలోకః" లోకమునందు భిన్నదృష్టులును, భిన్నరుచులును ఎప్పుడునున్నవే. మనమేమిచేయఁగలము? పరిణామవిషయమును గమనింపకుండుటమాత్రము లోపమని చెప్ప సాహసింతుము.

"కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ"—భవభూతి.

మెచ్చనంటావీవు;

సీవిక మెచ్చకుంటే మించిపాయెను;
కొయ్యబొమ్మలు మెచ్చు కళ్ళకు,
కోమలుల సొరెక్కునా ?—అప్పారావు.

అను సూక్తులు ఉభయులకు ప్రతివచనము కాఁగలవని సూచింతుము.

వాల్మీకి ఆదికవి. "క్రౌంచద్వంద్వ వియోగోత్థః శోకశ్శ్లోకత్వ మాగతః" అన్నాఁడు ఆనందవర్ధనుఁడు. కవితారసాలమెక్కి వాల్మీకికోకిల మొనర్చిన గానమునే రామాయణమంటుము. మహాకవుల కావ్యములు ఒక సమస్తదేశముయొక్క, ఒక సమస్తయుగముయొక్క హృదయమును వెలార్చుచుండును. అవి యొకదేశము సొత్తుకాదు. ఒకకాలమునందుమాత్రమే అన్వయించునవియుఁగావు. దేశకాలపాత్రములు వానిని నిరోధింపఁజాలవు. సర్వకాలములయందు, సర్వదేశములయందు, అవి సమానాదరగౌరవముల వెలయుచుండును. యుగములు గడచినను, వానికీర్తిసౌధమునకు చెక్కుచెదరలేదు. వానికి విస్మృతిలేదు.

భారతదేశమునందు భారత రామాయణములట్టివి. అవికావ్యములు కావు. భారతజాతి హృదయప్రతిబింబములు సంపూర్ణభారతవర్ష-చరిత్ర ఈరెంటియందును చిత్రితమై యున్నది. పురాతన భారతవర్ష యశోగానమొనర్చుచు, అవితిలకించిన వారిని పులకింపఁజేయుచున్నవి. కనుకనే, ఆరసప్రవాహమునకు, ఆకవితాప్రవాహమునకు శుష్కతలేదు. ఇప్పటికిని—అట్లననేల ? —భారతజాతి జీవించియుండునంత వఱకు భారతహృదయమున వానికి స్థిరస్థానము కలదు. భారతవర్షముయొక్క సాధన, ఆరాధన, ఆకావ్యములయందు సుస్థిరముగా అంకితమై యున్నది.

గ్రీసులోని హోమర్‌కవికృత, ఇలియడ్ కావ్యమట్టిది. అది సమస్తగ్రీసుదేశ హృదయసంజనితము. మహాకావ్యములననట్టివి.

ఏనాఁడు తన జీర్ణకుటీరమునుండి వాల్మీకిగాన మొనర్చెనోకాని, ఇంకను ఆ గానమాధుర్యము వినఁబడుచునే యున్నది. ఇందొకమహోదాత్తుఁడగు పురుషుఁడు వర్ణింపఁబడియున్నాఁడు. తనగుణగణముచే నాతఁడు దేవతులకన్న మిన్నయగుచున్నాఁడు. రామాయణమునందు వర్ణితమయినది. పరిపూర్ణత్వము అదికొన్ని జాతులకు అతిశయోక్తిగా తోఁపవచ్చును. అందుభారతజాతి అతిశయోక్తిని గుర్తింపదు. భారతజాతిలక్ష్యమే సమగ్రత్వము. ఈజాతియొక్క ఆరాధన, హృదయము, అంతయు దానిమీఁదనే ఆధారపడి యున్నవి. ఇందు మానవాదర్శస్వరూపములు సమగ్రముగ చిత్రింపఁబడినవి. ఆదర్శపతి. ఆదర్శపత్ని. ఆదర్శసోదరుఁడు. ఆదర్శమిత్రుఁడు. ఆదర్శసేవకుఁడు. ఇంతకంటె, ఆదర్శస్వరూపము లెందు దొఱుకఁగలవు? రామాయణమునందు గృహకృత్యవిశేషములే చక్కగా సంతరింపఁ

బడినవి. భారతకుటుంబముయొక్క సత్యస్వరూపము నిరూపితమైనది. తండ్రికొడుకులకు—ఆలుమగలకు—అన్నదమ్ములకు—కలధర్మ, ప్రణయముల సామరస్యము చక్కగా చూపఁబడినది. ఇది గృహస్థధర్మమునందున్న ప్రేమప్రవాహమును జాల్వార్చుచు, ప్రశాంతభారతగార్హస్థ్యమును విప్పి చెప్పుచున్నది. రామాయణము నిశ్చలమైనగార్హస్థ్యధర్మమును — భారతీయలక్ష్యమగు గార్హస్థ్యధర్మమును — సమాజపోషకమగు గార్హస్థ్యధర్మమును—నిరూపించుచున్నది. దీని యుత్తరభాగము నుత్తరరామాయణ మందురు. అది కరుణరసమునకు జీవగఱ్ఱ. "ఏకో రసః కరుణ ఏవ" అని ప్రపంచమునంతను కరుణమయముగా తిలకించినభవభూతి సూక్తికి ఆలంబనమైనది. ఈమన ప్రస్తుతగ్రంథము "నిర్వచనకుశలవాభ్యుదయము." ఆరామాయణమునందలి కథావిధానమును స్వీకరించి రచించిన యొకకావ్యము.

ఈకావ్యనామమందలి "నిర్వచనము" ను విశేషణమే కావ్యము పూర్వశైలీ సంకలితమని చెప్పక చెప్పుచున్నది. ఏనియమో యొకనియమము మున్నతరువాత, కొంత వఱకు సారస్యభంగము కాకతప్పదు. "నిర్వచన" మగుచో కావ్యమెట్లు రసపరిపుష్టము కాదో కొంత చెప్పెదము. కావ్యమున కొన్నిపట్టులు వచనమునకును, కొన్ని పద్యరచనమునకును, అందగించును. ఉదారభావములు పద్యములలో నిముడ్చుటయు, సామాన్యపరిస్థితులు వచనమున చెప్పుటయు, కవుల యాచారమని సాహిత్యకర్మమర్మజ్ఞులకు అనుభవ పునరుక్తమగు విషయము. నియమశృంఖలాసంగతపదయయి కవితాకన్యక నిరాఘాటప్రచార మొనర్పఁగలుగునా? కావుననే, మమ్మటుఁడు కావ్యముయొక్క సత్యస్వరూపము నిట్లు వివరించియున్నాఁడు.

నియతికృతినియమరహితాం
హ్లాదైకమయీమనన్యపరతంత్రాం
నవరసరుచిరాంనిర్మితి
మాదధతీభారతీకవేర్జయతి.

నియమములతో సరసముగా రచించుట కష్టమని నుడువవచ్చును. కుశలవుల యభ్యుదయము చివర యుక్తముగా నుక్తమగుటచేతను, అది పూర్వకథను పరంపరా ద్వారమున సూచించుటచేతను, ఈ నామమిా కావ్యమునకు తగియే యున్నది. ఇదియొకగొప్పకావ్యము. లాక్షణికులు చెప్పిన యష్టాదశవర్ణనములు ఇందు "తు" చ" తప్పకుండ నున్నవి. ఒందు రెండు మొండేమో.

"ఏతానియత్రవర్ణ్యన్తే, తన్మహాకావ్యముచ్యతే" అని లాక్షణికులు చెప్పినమహాకావ్యలక్షణమునకు ఇది లక్ష్యమగుచున్నది. ఇందు ప్రధానకథకు ఏమాత్రము సంబంధింపని కొన్ని కథలు—ప్రహ్లాదచరిత్రాదులు—నిబద్ధములయి

ఉన్నవి. అవి చూచిన, ఇది పురాణమా యనిపించును. నాయికానాయకసమాగము ముక్తము కాకపోవుటచే— "మంగళాదీని.................మంగళాన్తాని కావ్యాని ప్రథన్తే" అను పూర్వోక్తికి వ్యతిక్రమము సంభవించుచున్నది. దానికి మాకు విచారము లేదుకాని, కావ్యములయం దిట్టి పద్ధతి అపూర్వమేమో యని విచికిత్సింతురు కొందరు. లేదేని. దీని నొక చిన్నపురాణమనియైన చెప్ప నొప్పును, అవాంతరకథలు, దీర్ఘ-వేదాంతోపన్యాసాలు, దానికి తార్కాణాలై, దీని పురాణత్వమును బలపఱచుచున్నవి.

వస్తువు : ప్రధానవస్తువు రామచరిత్ర. ప్రథమాశ్వాసమున పూర్వరామాయణకథ, ప్రహ్లాదచరిత్ర, ద్వితీయమున ఉచ్చావచవర్ణనములు, సీతావిషయక నిందాశ్రవణము, సీతావివాసనము, వాల్మీక్యాశ్రమప్రవేశము. తృతీయమున లవణాసురవధ, శంబుకవధ, కుశలవజన్మము, యాగము, శ్రీరామ వైకుంఠప్రాప్తియు- వర్ణితములు.

గ్రంథరచనాకారణము—పవిత్రరామచరిత్రము ఎవరెన్నివిధముల రచించినను తనివి లేదనియు, కొండుభట్టు గోదావరీస్నాన మొనర్చిన తక్కినవారు మానుదురా యనియు, శ్రీరామపాదారవింద మకరందాస్వాదనాయత్త చిత్తతయు, గ్రంథవిరచనమునకు కారణములు గానోపును.

నాయకుఁడు శ్రీరాముఁడు. పవిత్రచరిత్రుఁడు. ఆదర్శపతి. భారతగార్హస్థ్యదృఢశాంతభావమును తన కష్టపరంపరాశ్రువుల నభిషేక మొనర్చి మెఱుగుపెట్టినాఁడు. దీనదయాపరతంత్రుఁడు. త్యాగమూర్తి. అఖర్వసర్వసర్వంసహాధూర్వహత్వమును అవలీల త్యాగించిన వీరుఁడు. హరధనస్సును విఱచివైచిన శూరశిఖామణి. భాగ్యభోగ్యముల విసర్జించుట త్యాగము కాకపోవచ్చును. తండ్రియాజ్ఞకనక, ప్రాజ్యసామ్రాజ్యము విడుచుట త్యాగము కాకపోవచ్చును. కాని, సీతను- తన చిటికెన పట్టినది మొదలెన్నఁడు ఎడఁబాసియుండని సీతను—తన్నే భగవంతుఁడుగ నమ్మి తన నామస్మరణమే నిత్య మొనర్చు సీతను—కష్టము లనుభవించి, యనుభవించి, మఱల సుఖస్వరూపమును సందర్శించుచున్న సీతను—తాను రాజ్యముకంటె, ప్రాణములకంటె ఎక్కుడుగా ప్రేమించినసీతను—దుర్భరగర్భిణియైన సీతను— ప్రజల యిష్టమునకయి—కాదు—పామరజన సంతోషమునకయి విసర్జించుటయున్న దే, అంతకన్న త్యాగమున్నదా? పామరజన సంతోషమునకయి ప్రాణపత్నిని త్యజించుట ఘోరపాపముకదా! ఇది న్యాయమా? అని శంక రావచ్చును. ఇక్కడ ధర్మసూక్ష్మత విచారింపవలసియున్నది. రాజునకు తన సంతోషము, సంతోషము కాదు. తనదుఃఖము, దుఃఖముకాదు. ప్రజానురంజ

నమే ముఖ్యకర్తవ్యము. ప్రజలు సంతోషింతురా, తాను సంతోషించినట్లే. రాజ్య
మున ప్రజానురంజనము లేకున్న, రాజులేనట్లే. ఈ భారము ఇక్ష్వాకుకులమునందు
స్థిరాంకితమైపోయినది. ప్రజానురంజనమే వారి ముఖ్యకర్తవ్యము. అందువలననే
రామునిచే భవభూతి ఇట్లనిపించినాఁడు. "ఆరాధనాయ—లోకస్య......అథవా
జానకీ మపి......ముంచతోనాస్తి మేవ్యథా" జానకీప్రణయసర్వస్వముకన్న—లోకా
రాధనము మిన్నగ—రామునిహృదయమున ప్రతిష్ఠితమైనది. కావున, ఇక్ష్వాకు
కులప్రతిష్ఠకయి—రాజధర్మనిర్వహణమునకయి సీతను—తన ప్రాణాపాయమైనను
శంకింపక—విసర్జించినాఁడు. ప్రేమలేకనా? నిండుచూలాలై యున్న యిల్లాలిని వదలి
పెట్టకూడదని తెలియకనా? తెలియును. సంపూర్ణముగ, తెలిసియే రాజధర్మము
నిర్వర్తించినాఁడు. దోషమాయది? గుణమగుఁగాక. ఆత్మసంతోషమును విచా
రింపక, లోకారాధనమునకయి, యిట్టిత్యాగము సామాన్యనృపతులొనర్పఁగలరా?

నిశ్చయమే. ఈపనివలన రాముని మహోదాత్తచరిత్ర స్పష్టమగుచున్నది.
ధీరుఁడు, రాముఁడు—స్వయం కృతాపరాధమునకయి—సీతాపరిత్యాగసంత
ప్తుఁడై—దుఃఖించుటెందులకు? అని ప్రశ్నింపవచ్చును. రాముఁడు తనధర్మమును-
ప్రజారంజకత్వము—సీతావివాసన మొనర్చి స్థాపించుకొన్నాఁడు. సీతావియుక్తుఁడై
ఉండఁగలఁడా? సీత ప్రణయసర్వస్వము. అరణ్యావాసప్రియసఖి. గృహాలక్ష్మి.
తననేత్రముల కమృతవర్తి. సీతాసాహచర్యముననే రామునకు అరణ్యానీతలములు
స్వర్గతలములయినవి, సీతాప్రణయకటాక్షామృతసేచనముచేతనే కష్టములు, సుఖ
ములయినవి. జీవితాధారభూతయగు సీతనువిడనాడిన రామునకేమున్నది? ప్రపంచ
మంధకారబంధురము. సుఖములు కష్టములు. రాజ్యభాగము కంపతోడుగు. ఇంత
యేల—సగముప్రాణములే నశించినట్లయినది. తాదృశపరిస్థితులలో రాముఁడు
మానవుఁడుగ ప్రవర్తించినాఁడు. అంతియ. అతనిదుఃఖమున కఖండకారణమున్నది.
కావుననే దుఃఖించినాఁడు. ధీరోదాత్తుఁడు బేలతనమున దుఃఖమును ప్రకటింపవచ్చు
నాయందురా? అవును. ధీరోదాత్తుఁడు మనుష్యుఁడుకాఁడా? వానికి హృదయము
లేదా? అయ్యది పాషాణమా, వజ్రమా? ఇతరులకన్న కష్టసహనశక్తి వానికుండ
వచ్చును. కాని, వానికి హృదయమున్నది. కావుననే, మానవసహజధర్మము
కావున—దుఃఖమునఁ బ్రవర్తించినాఁడు. రాజుగ సీతాపరిత్యాగకర్కశహృదయ
మును—ప్రేమంపుఁబతిగ దుఃఖార్ద్రహృదయమును—రాముఁడు చూపినాఁడు.
సీతను త్యజించినాఁడేకాని దుఃఖాగ్నియాతని శరీరమును శుష్కేంధనమునువలె కాల్చి
వైచుచున్నది. యీగ్రంథమున చిగురుకు సీతాదర్శనముమాత్రమయినది. రాముని
వైకుంఠయాత్ర వర్ణితమయినది. "సంభవామి యుగేయుగే" అను హైందవ ధర్మ
మునకు సాదృశ్యము చూపఁబడినది.

**సీత.** మహాగుణవతి. అసమానపాతివ్రత్యలసమాన. తా నసూర్యంపశ్యయగు రాజకన్యయయ్యు, వనవాససందర్భమున అనుగమింప పట్టుపట్టినది. మీ రెక్కడనున్న, అదియే స్వర్గము. మీరు లేని యయోధ్య మహాటవి"యని ప్రతివచించినది. రామమయజీవిత. రావణాపహృతయై, అశోకవనీస్థయై, ఏకవేణితో సంతతరామనామజపపరాయణయై కాలము గడిపిన సుభగచరిత. లోకప్రత్యయము కోసము అగ్నిపరిశుద్ధయై తన పవిత్రచరిత్రను ప్రదర్శించిన వీరపతివ్రత.

అయోధ్యయందొకనాఁడు కేళీలాలసయైయుండ మఱల తపోవనముల కేఁగి ఋషిపత్నుల సందర్శింప బుద్ధి కలుగఁబోవు కర్మయే ఆమెచే నట్లనిపించినది.

" శా. సారంగాళికి దప్పిఁదీర్పఁగఁ బులుల్ ♦ సారంగహస్తాంబువుల్
సారంగారికులశ్రమం బణఁప ని ♦ చ్చల్గూర్చు భాగీరథీ
తీరారణ్యములం జెలంగు మునిప ♦ త్నీ శ్రేణితోడ న్బలా
హారంబుంగొని యొక్కనాఁడు దిరుగన్ ♦ బ్రార్థింతు రాగంబునన్."

అనవుడు సమ్మతించి మనుజాధిపుఁడున్.

తరువాత కల్గిన నిందావృత్తాంత మామె యెఱుఁగదు. స్వచ్ఛసువిశాల యశోవితానముపై కళంక మాపాదితమైనదని యామె కెఱుక లేదు. సహజహృదయమాధుర్యము మాఱలేదు. లక్ష్మణుఁడు—"వచ్చితిఁ దేరుం దెచ్చితి, విచ్చేయుమనంగ—సీత వేడుకతోడన్ -సచ్చరితుఁడు నాథుఁడు సెల, విచ్చెనె వనములకుఁ బోద మేయని పలికెన్" సంబరపడినదికాని—తిరిగిరాని వనప్రయాణమునకని తెలియదు. ప్రయాణసిద్ధయైనను, కారణము భిన్నమైనదని మాత్రము తెలిసికోలేదు. రథమధిరోహించినది. మార్గమున దుశ్శకునములయినవి. గుండె గతుక్కుమన్నది.

"నాసఖు నాపతిం బ్రియుని నారఘురాముని నాదు కాంతునిం, బాసి వనాళిలో మునుల పత్నులఁ గాంచుట కేటికిట్లు పేరాస నహించి వచ్చితి?

అని చింతించినది. తన్నుతా దూరుకొన్నది. దుశ్శకునములు తనవారికి కష్టాపాదకమేమోయని " వీటరాఘవునకు నీకు నత్తలకు గాదిలిబాంధవకోటికెల్లఁ బౌరవితతికిన్ శుభంబులు సురప్రచయం బిడునంచు."

ప్రార్థించినది. లక్ష్మణుఁడు దీనుఁడై యున్నాఁడు. కారణమడిగిన, నిరుత్తరముగ దుఃఖించును. చివరకు మెల్లగా లక్ష్మణుఁడు దుఃఖాతిరేకకలుషితకంఠుఁడై చెప్పినాఁడు వృత్తాంతము. మూర్ఛిల్లినదామె. తెలివినొంది రాముని పల్లెత్తుమాట నలేదు. దుర్గతికి చింతించినది. పూర్వజన్మకృత పాపమనుకొన్నది.

“ రామ మహీనాథుని కెంతటి వాదువచ్చె నేనున్న మఱెట్టిసందలగునో ”
అని శంకించినది.

“ శా. ఆకర్ణాయతలోచనాబ్జములతో ♦ నాకుండలద్వందలీ
లాకీర్ణామలగండభాగములతో ♦ హార్యాలకశ్రేణితో
శ్రీకమ్రస్మిత పూర్ణచంద్రికలతోఁ ♦ జెల్వారు శ్రీరాము మో
మేకాంతంబునఁ గాంచుభాగ్యమిఁక లే ♦ దేమో” అని విలపించినది. లక్ష్మణునితో నందఱకు నమస్కారములు చెప్పుమని సెలవిచ్చినది.

కాని, ఘోర భీకర మహాటవి. ఏకాకిని. నిర్భరగర్భభరాలస. గుండె బిగఁబట్టుకొన్నను విలాపము బాహిరపడినది. రోదనధ్వనిశ్రవణసంజాతదయాతరంగితస్వాంతుడై వాల్మీకి సీతను బుజ్జగించి తన కుటీరము జేర్చినాఁడు. కుశలవులంగన్నది. పిల్లల ముద్దు ముచ్చటలతో కాలముగడచినను సంతోషము చిక్కలేదు. ప్రాణపతితోఁబాలు పంచుకొన్న, ఆయానంద మమందమయ్యెడిది. ఆ భాగ్యములేదుకదా. చివరకు రామదర్శనమునొంది, పృథివీ నిలీనమైనది.

సీత నిష్కారణముగా తన్ను రాముఁడు పరిత్యజించినాఁడని వినికూడ ఒక నిందావాక్యమునయినఁ బలుకలేదు. ఆమె ప్రేమామృతమున, ఒక బిందువును కలుషితము కాలేదు. ఇది సహజమామానవ ప్రకృతికి? అలోక సామాన్యముగాదా? అని ప్రశ్నింపవచ్చును. కాని, భారత పతివ్రతామతల్లుల చరిత్రఁ దిలకించిన నీసందియము తోఁపదు. పతిదేవతలగు యువతులు పత్యాజ్ఞను దైవప్రసాదమువలె శిరసావహించవలసినదే కాని, కారణవివక్ష వారికి పనిలేదు. పతులఁ దిరస్కరింపకుండుట వారి స్వభావము. సీత పతిదేవతాతిలకము. రాముని పల్లెత్తుమాట అనలేదన్న నాశ్చర్యముకాదు. మహోదాత్త ప్రకృతులతో సామాన్య వ్యక్తుల పోల్చుట అసంగతము. మన సాధనయు, దీక్షయు, సమగ్రతాపర్యాప్తములు. ఇట్టి చిరత్న పతివ్రతారత్నములకు భారతదేశము సువిశాలఖనికదా.

**లక్ష్మణుఁడు.** దేహా బద్ధమయిన భ్రాతృప్రణయము. గృహాన, అరణ్యాన, సీతారాముల పాదసేవచేసి తరించినాఁడు. నిశ్చలభక్తి యుక్తుఁడు. రాముఁడే సర్వమని నమ్మినవాఁడు. సీతావదనమునైన సరిగ వీక్షింపని నైష్ఠికుఁడు.

శ్లో. నాహంజానామికేయూరే, నాహంజానామికుండలే,
నూపురేత్వభిజానామి, నిత్యంపాదాభివందనాత్.

అని యలంకార ప్రత్యవేక్షణ సందర్భమున నుడువఁగలిగిన మహోదాత్త ప్రకృతి. లక్ష్మణుఁడీ గ్రంథమున రామాహూతుఁడై భరత శత్రుఘ్నులతోఁబాటు ప్రవేశించుచున్నాఁడు. శ్రవణవిదారణదారుణమైనవార్త నందఱ దుఃఖాంబుధి ముంచినది. అట్టి నిశ్చలభక్తి యుక్తునిపై సీతాపరిత్యాగకార్యము పడినది. నిశ్చయముగా అది వజ్రపాతము. లక్ష్మణుఁడు రామాజ్ఞను తిరస్కరింప లేదు. సీత యొద్దకువచ్చి కారణముచెప్పక—కాదు—చెప్పఁజాలక—"జగతీపావని గాంగతీర వనదేశప్రేక్షణాసక్తిచేఁ దగు నిన్నుం గొనిపొమ్మటంచు నిటకుఁ ధాత్రీవిభుండంపిన స్వచ్ఛితి." అని చెప్పి ప్రయాణముచేసినాఁడు. మార్గమధ్యమున దుఃఖోద్రేకము నడఁచుకొనియు, లోన గుమారిల్ల సాఁగినాఁడు. అతని దీనత్వముంగాంచి సీతఁ మానసిక వ్యథాతతుల మాన్పఁజాలఁగెడి పుణ్యరాశి గంగానదిఁజేరి యాకరణి గాసిలఁ జెల్లునె? అన్నది. దుశ్శకునములు నాకు సంతాపకారణము లన్నాఁడుకాని, నిలువలేక ఘోరముగా నాక్రందించెను, సీత కారణమేమని ప్రశ్నింప—లక్ష్మణుఁడు "భయంకర శోకవార్ధిలోఁ దలఁకుచు మున్గుచుం బలికె? చెప్పలేక, చెప్పలేక, కారణము బాహిరపుచ్చినాఁడు. "నిను నెట్టుల డించి పోదునా?" అని సంశయింపడినాఁడు. "అతిశయోత్తుంగ ఘోరాచలాధరములు కనక సాధంబులే జనని నీకు?" అని విలపించినాఁడు. "నిన్నుడించిన పాపుఁడ" అని తిట్టుకొన్నాఁడు. "మాతల్లినిడించిపోయెద నెద వనదేవతలార ప్రీతి సంధిల్లఁగఁ గావరేయనుచు" నభ్యర్థించినాఁడు. వెళ్ళలేక, వెళ్ళలేక, వెళ్ళినాఁడు. లక్ష్మణుఁడు పట్టనమునకు వచ్చి, వైదేహీవియోగతప్తుఁడై క్రందిల్లుచున్న రాముని చేరి యతనిపాదము లశ్రుల గడిగివైచినాఁడు. తరువాత సోదరుని దుఃఖవిముఖుని చేయుచు, కార్యప్రవృత్తుని జేయ సంకల్పించి, వేదాంతార్థములు వాక్రుచ్చుచున్నాఁడు.

**కుశ లవులు.** మనోహరమూర్తులు. తల్లియొక్క యసమానలావణ్యమును, తండ్రియొక్క నిర్వక్రపరాక్రమమును, వీరియందు వియ్యము, నెయ్యము, నెఱపినవి. పది వత్సరముల లోపుననే సమస్త శాస్త్రములు, కళలు అభ్యసించిన మేధావులు. "తేజసాంహినవయస్సమీక్ష్యతే" అన్నాఁడు భవభూతి. వారి యాటపాటలు దల్లికి కొంచెమూరట కలుగఁ జేసినవి. వారి యాకారములే వారి క్షత్రియత్వమును విప్పి చెప్పినవి. వారి మధురమోహనక్రీడాసంరంభముచే వాల్మీక్యాశ్రమము అంకితమయినది. ఆవీర కుమారరత్నములు ఆ బ్రాహ్మణ వటువుల మధ్యవిలక్షణస్వరూపస్వభావవిలసితులై యుండిరి. శ్రీరామాయణ రసాస్వాదానందితచిత్తులు. సీతారాములు తమ జననీ జనకులని తెలిసికొని తమ జన్మముల కృతార్థములుగ తలపోసిరి. అనంతరము శ్రీరామసింహాసనమున పట్టాభిషిక్తులైరి.

**వాల్మీకి.** "మధుమయఫణితీనాం మార్గదర్శీమహర్షిః" అమృతమయహృదయుఁడు. ఆ రసార్ద్రహృదయమే స్రవించి, రసమహితకవితగా పరిణమించిన దన్న సత్యము మనకు చేరువ. రసమయమగు రామచరితము ఈతని సుకుమార కవనముచే సౌకుమార్యముల వెదఁజల్లినది. మహాతపస్వి. మహాతేజస్వి. తన కుటీరస్థుఁడయియుండ స్త్రీరోదన వృత్తాంతము శ్రవణగోచరమయినది. దివ్యదృష్టి వృత్తాంతమును కరబదర సమానమొనర్చినది. సీతదగ్గరకువచ్చినాఁడు. ఆపన్నయగు సీత "విలపించుచుం జరణరాజీవంబులన్" వ్రాలినది. "మునిచంద్రుఁడట బుజ్జగించి, "వగవుం బోనాడుమో తల్లిరో" అని యోదార్చినాఁడు. "ననున్నీ తండ్రిగా నెంచుమా" అని లాలించి యాభయమిచ్చినాఁడు. "ఇటఁ దేకువతోఁ జరియించు మౌనిసుందరు లుచితోపచారము లొనర్తురని" తనవెంట నాశ్రమమునకు తీసికొనిపోయినాఁడు. మౌనిసతులతో "రవికులవార్ధిసోముఁడగు రాముని దేవి, విదేహమేదినీధవుని తనూజయున్, దశరథ క్షితిపాలుని పెద్దకోడలియ్యువిద" కనుక జాగ్రత్తతో రక్షింపుఁడని యాజ్ఞాపించినాఁడు. అరణ్యమే కాని, సీతకెట్టి లోటుపాటులును లేవు. కుశలవులకు యధోచితముగ సకలశాస్త్రములు, క్షత్రియవిద్యలు గఱపినాఁడు. యాగము జరుగుచుండఁగా, కుశలవులను, కుశీలవులనుగాఁ జేసి, రామాయణమును పాడించుచు తీసికొనివెళ్ళి, రామునికి పుత్రులనొప్పగించి, సీతను కన్పఱచి, కృతార్థుఁడైనాఁడు. రాముఁడేరీతిగా వాల్మీకిఋణమును దీర్చుకొనఁగలఁడు? ఇక్ష్వాకు కులమును కీర్తించినకవియేకాక, ఇక్ష్వాకు కులము కీర్తించిన కవియునై యశఃకాయమును శాశ్వతమొనర్చినాఁడు.

**ఉపకథలు.** ప్రహ్లాదచరిత్ర. పూర్వరామాయణము, నృగమహారాజు చరిత్రము. లవణాసురవధ, శంబుకవధ.

ప్రహ్లాదచరిత్రమున బాలభావముననే విష్ణుభక్తుఁడై తండ్రిచే పలుబాములఁ బడి తుదకీశ్వరసాక్షాత్కారముగాంచిన ప్రహ్లాదభక్తునిచరిత్రము వర్ణింపఁబడినది. దౌర్జన్యమునకు, సాత్త్వికనిగ్రహమునకుఁగల బలాబలములు నిర్ణయింపఁబడినవి. పరమేశ్వరస్వరూపనిరూపణము, యాతాయాత జీవస్వరూపము, జీవాత్మజన్మరాహిత్యము—మున్నగు వేదాంతచర్చలు ప్రతిపాదితములయినవి. పూర్వరామాయణకథ సంగ్రహీతమయినది. నృగచరిత్రమున—నృగభూపతి గోదానము, గోవిషయకవివాదము, శాపము వర్ణితములు. చ్యవనాదులువచ్చి, రామునితో లవణాసురుని బాధలు వివరించుట, రాముఁడు తద్వధార్థమై శత్రుఘ్నుబంపుట, లవణాసురహననము వర్ణితములు.

## కథాశరీరము. 

కవులు స్వతంత్రులు.

"అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మైరోచతే విశ్వం తథేదం పరివర్తతే."
నిరంకుశాఃకవయః"

ఒకకథను వలసినట్లు మార్చుటకుఁగాని, కూర్చుటకుగాని, లేదా తీసివేయుటకు గాని కవికి సర్వస్వాతంత్ర్యము కలదు.

"ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్యజీవితమ్"

ఔచిత్యము కావ్యజీవితము కాకున్నను, దానిని చక్కఁగా గమనించి, ఏది యెక్కడనుండిన బాగో విచారించి, సంవిధానము సంతరించుట కవికృత్యము. పురాణోక్తకథను యథాస్థితముగా వర్ణించుట చాతుర్యమును దెల్పఁజాలదు. పురాణమునకు సంగ్రహరూపమగునుగాక; కార్యము కానేఱదు. కవికులతిలకుఁడు శాకుంతలమున నాయకాపగుణనిరాసమునకయి అంగుళీయకవృత్తాంతమును, మునిశాపమును గల్పించుటయు, భవభూతి యుత్తరరామచరితములో చిత్రపటవృత్తాంతమును, సీతాసమాగమమును కల్పించుటయు, పాఠకులకుఁ గ్రొత్త కావు. అవి తత్తత్ప్రయోజనముల నర్థించి యొనర్చినవనుట నిశ్చయప్రవచనము. అవి వివరింప నిది యదను కాదు; ఆవశ్యకమును కాదు. కావ్యఘట్టములు కొన్ని ముఖ్యముగను, కొన్ని యముఖ్యముగను ఉండును. ముఖ్యతాముఖ్యతల నేర్పఱచుకొనక, వేర్పఱచుకొనక, వ్రాయుట "గుడ్డి దర్బారు" అగును. అన్ని విషయములందును ఔచిత్యమును మన్నించి, కథాసంవిధానము కూర్పవలయును. కథా శరీరము విస్తృతము కావలయును. ఈగ్రంథమున పూర్వరామాయణ కథ గ్రహింపవలెనా? అని మా సంశయము. కావ్యమునందు పూర్వ కథాప్రణాళికయంతయు వర్ణించుట సముచితముగా నుండదు. సంగ్రహముగా వర్ణించుట సరసమునుగాదు. ప్రథమాశ్వాసమున నిన్ని పద్యములు దీనికివ్యయించుట శోచనీయము. ఇది మాహృదయంగమము కాలేదు. మధ్య ప్రహ్లాదోపాఖ్యానము వర్ణితమయినది. ఉత్తరరామాయణ కథతోనే, కావ్యారంభము చేసినయెడల, బాగుండెడిది. ప్రహ్లాద చరితము ఇంత దీర్ఘముగా వర్ణించుటకుఁ గతమేమయ్యాది? వేదాంతవర్ణనముల నెక్కించుటకన్న— పట్టి చొప్పించవలసినబాధ యేమికలిగినది? కవికిఁగల్గిన వేదాంతవిషయకసంవేద్యాంశములు మఱియొకచో వివరించి విప్పించఁగూడదా? తన యిష్టమును పాఠకుల యిష్టమును— అన్నిటికన్న ముఖ్యముగ ఔచిత్యమును గౌరవింపవలదా? మొదటియాశ్వాసమున కథా ప్రారంభము కాలేదు. రెండవయాశ్వాసము కథతో ప్రారంభించునందురా? లేదు. భ్రమ సుమండీ. వరుసనే

వర్ణనాంశములు ప్రారంభమగుచున్నవి. వర్ణనాంశములమధ్య కథా శరీరము చిక్కుకొని పోయినది. అసంబద్ధముగా నిన్ని వర్ణనలు వెగటేమో! మన కథ యుద్యానవనవిహారములతోను, సంగమముతోను, ప్రారంభించుచున్నది. మన కవుల సంగమవర్ణనము లింకను వీడలేకుండుట విచిత్రము. రామునివంటి యుత్కృష్టపాత్రముయొక్క ప్రవేశము నిట్లు చేయవచ్చునా? భవభూతియుత్తర రామచరిత్రలో ప్రవేశమెట్లున్నదో? విచారింపుఁడు. అది నాటకమందురా? కానిండు విహార సంగమములతోతప్ప మఱి వీళ్ళు లేవా ప్రవేశపెట్టుటకు? ప్రణయస్వరూపము సంగమ వర్ణనము వినా చేయరానిదా? సల్లాపములు, వీక్షణములు, చాతుర్యములు, ప్రణయ ప్రదర్శనములు—ఇత్యాదులు వర్ణనీయములు కావో? కావున ఈపాత్ర ప్రవేశపద్ధతి మాహృదయము నాకర్షించలేదు. అదియుంగాక సీతారాము లవతారస్వరూపులు. లోకమునకు జననీజనకులవంటివారు. వారి సురత వర్ణనము యోగ్యము కాదేమో! ఈపరిస్థితులలో:—

> " తస్మాదభినేయార్థే, చ, కావ్యేయదుత్తమ ప్రకృతే
> రాజాదేరుత్తమ ప్రకృతిభిర్నాయికాభిస్సహ
> గ్రామ్యసంభోగ వర్ణనం; తత్పిత్రోః సంభోగవ
> ర్ణనమివ నితరామసహ్యమ్, తథైవోత్తమ
> దేవతావిషయమ్. నచసంభోగ శృంగారస్య
> సురతలక్షణ ఏవైకః ప్రకారః. యావదన్యేపి
> ప్రభేదాః పరస్పర ప్రేమ దర్శనాదయస్సంభవంతి
> తేకస్మాదుత్తమ ప్రకృతి విషయే నవర్తన్తే. "

ఆనందవర్ధనుడు.

అను పంక్తులు జ్ఞప్తికెలయించుచున్నాము. భద్రముఖమున కర్ణకఠోరమగు సీవృత్తాంతమును విని, రాముఁడు తన పూర్వసంవేదనాంశముల తలపోయమి కరుణరసము పరిపోషము కాఁబడినది. వర్ణనముల పట్టిక తయారుచేయుటలో నున్న జాగ్రత్త యిందు చూపిన సహృదయులు సంతసించి యుందురు. చివర సీతాసందర్శనమైనతరువాత కేవలము రాముని దుఃఖాతిరేకము మాత్రము వర్ణితమయి, రాముని వైకుంఠప్రవేశము వర్ణితమయినది. ఇదిసహృదహృదయావర్జకము కాలేదు.

సీతారామ సమాగమము వర్ణించిన యెడలదీనికి కావ్యత్వమును, అత్యంత శోభయు ప్రాప్తించెడిని. కాని, యిట్లువర్ణించుటవట్టి పురాణభావము. నీగ్రంథమునందు కలిగించుచున్నది. చివర సీతాసంభాషణమున అల్పదూషణభావము నపగతమొనర్చిన బాగుండెడిది. ద్వితీయాశ్వాసమున సీతాపాత్రము చక్కగనున్నది.

చివరదూషణ సీతవంటి పతిదేవతకు తగినదికాదు. సమాగమము వర్ణితమయిన నీచిక్కులుండెడివికావు. లవణాసురాదిప్రసంగము తీసివేసినను, నష్టములేదు. ఈ యుపకథలు——ఈవర్ణనములమధ్య——కథాశరీరమునకు పుష్టికలుగలేదు. తద్వారమున రసపరిపోషమును కొంచెము కొఱవడినది.

ఈ కావ్యశకటము పురాతనమార్గముల గమించినది. క్రొత్తదారులు త్రొక్కిచూడదలఁపలేదు. కాలమునకు తగినట్టు నవ్యతావాసనలు గుబులొందను చున్నఁగాని, కావ్యకుసుమములు నవభావసంకలితులకు రుచింపకపోవచ్చును. పరిణామము గ్రహింపఁదగినదనిమాత్రము మామనవి. పోనిండు, పురాతనమార్గమయినను ఇది చక్కనిప్రబంధము. రామకథావర్ణనమగుట ప్రశస్తము; శిరోధార్యము. కాని, యొకవిషయము చెప్పక యుపేక్షింపఁజాలము. అనుకరణముమాత్రము కవితావిషయమునఁగాదు, మఱేవిషయమునైన నెక్కుడు పనికిరాదు. కవిత స్వతంత్రమైనపుడే, తన్మయీభవనయోగ్యత కలుగఁజేయును. స్వతంత్రమైనకవిత గొప్పది కాకున్నను, ఇంపు నింపును. స్వతంత్రభావమున దీప్తిఉన్నది. తేజస్సున్నది. ఉద్వేగమున్నది, అనుకరణపరాయణమైన కైత, ఉడుకాఱి, చప్పవడును. పరతంత్రవ్యక్తుల, స్వతంత్రవ్యక్తుల పరిస్థితులుపోల్చిచూచినఁజాలును. స్వతంత్రవ్యక్తులలో జీవితవిషయక నవనవోన్మేషమున్నది. పరతంత్రవ్యక్తులలో జీవకళతగ్గుచున్నది. స్వతంత్రభావము జీవవత్త్వమునకు చిహ్నము. అనుకరణము కొన్నియెడల సుగుణమయినను, "అతి సర్వత్రవర్జయేత్" అనుట అఖండసత్యసూక్తి.

ఈకావ్యమునందు కొన్ని కొన్నిపోలికలు——పోకడలు ఇతరకవులవి - కాన్పించుచున్నవి. ప్రహ్లాదచరిత్రములోని కొన్నిపద్యములుచదివిన, పోతనకవిత్వమును తలపించుచున్నవి. మఱికొన్నియెడలనుసాదృశ్యముచూపవచ్చును. ఇట్టివిధము, తత్తద్గ్రంథముల యనసకృత్పఠనముచేతనైనఁ గావచ్చును. ఎట్లయినను, అనుకరణము పరిహరణయోగ్యమని మాయాశయము. ప్రస్తుతము ప్రతిజాతియు, ప్రతివ్యక్తియు, స్వతంత్రతాసంపాదన నిమగ్నమయి యున్నది. పారతంత్ర్యము—— "పరతంత్రజనములపాలి కష్టములు చెప్పంగనలవియే శివునకునైన"——అని శ్రీనాథుఁడన్నట్లు—— మహాహేయముగనున్నది. కావున, స్వాతంత్ర్యము కవితయందును వాంఛనీయము. పూర్వానుకరణమువదలి, పాశ్చాత్యానుకరణ మవలంబనీయమనికాదు మాభావము. కావ్యము స్వతంత్రవ్యక్తిత్వసముల్లసితము కావలయుననియే మాహృదయావేదనము.

ఇందలిరసము కరుణము. స్థాయిభావము శోకము. తక్కిన వీర, రౌద్ర, శృంగారములంగములు. ఈ గ్రంథమునందు దాయాపట్టుల చక్కగా సవరించుటచే

రసము పరిపుష్టమయినది. ప్రహ్లాదచరిత్రమున భక్తిభావము జాల్వాఱినది. శమమును చక్కగానిరూపితమయినది. తక్కినచోటుల నాయారసము లొప్పారుచున్నవి. ద్వితీయాశ్వాసమున సంభోగ శృంగారమువర్ణితమయినది కావున, నీగ్రంథమురసోత్తరమై సహృదయుల తనుపార్చుచున్నది. కరుణరసము సామాన్యమయినదా? హృదయవిద్రావకమైనది. రాముని కరుణమునకుఅచలచలించినది. పర్వతములుద్రవించినవి. మానవులహృదయములు చెప్పనేల? ఆర్ద్రార్ద్రములగుచున్నవి. కాని, కావ్యమునందు "శృంగారో వీరఏవవా" అనిచెప్పినట్లు ముఖ్యరసత్వము(అంగిత్వము)శృంగారవీరాన్యతరమునకుఁ గదా నిబంధించవలె? కరుణరసమునకు అంగిత్వ మంగీకార్య మగునా అనిప్రశ్న కలుగుచున్నది. దానికి, "ఏవకారః ఉపలక్షణార్థమ్" అనియు, కావున, కరుణరసము ముఖ్యమయినను లోపము కాదనియు, పండితులు ప్రత్యుత్తరించుచున్నారు.

**కవిత్వము.** ఇట్టి గ్రంథమును నిర్వచనముగ, సరసముగా, పూర్తించుటకు మిగుల శ్రమించవలెను. ఇద్దానికి పాండిత్యమును, మనీషావిశేషమును-ముఖ్యముగా ఓపికయు నవసరములు. ఆచార్యులవారు పండితులు. శతవధానులు. పండితకవిత యుండవలసిన రీతినే ఈగ్రంథమున కవితయున్నది. వీరు తమ కవితాకన్యకు అలంకారములు దిద్దిదిద్ది, రమణీయోజ్జ్వలవేషము సవరించి, సవరించి, గుణగణవిభూషిత నొనర్చి, పలుకుపలుకులు, కులుకునడకలు నేర్పి, రసికపరిభోగ్య నొనర్చినారు. కవిత్వము నాతికఠినము. కొన్నియెడల నించుక కఠినమనిపించినను, కొఱుకరాని కొయ్యలుగాక—పద్యములు రమణీయార్థప్రతిపాదకములయి యుండును. తెలుఁగు పలుకులును, సంస్కృతశబ్దములును, సమానములై వియ్యమొనర్చుచున్నవి. కవిత్వము చాలవఱకు నాతిదీర్ఘ సమాసములతోను, అలఁతియలఁతి తునియలతోను కూర్పఁబడినను, మధ్యమధ్య దీర్ఘసమాససంకలితపద్యావళులు నాయకత్వము వహించుచుండును. ఈకవితా స్రోతస్సు నిరాతంకముగా సహజధోరణితో ప్రవహించుచున్నను, మధ్యమధ్య చిన్నచిన్న గుట్టలవలె కఠినపద్యము లెదురొక్కనుచుండును. వర్ణనములు కొంచెము దీర్ఘములయినను, రమణీయపదసంఘటితములయి మధురభావ పోషితములై, రసికులకు ముదము నించుచున్నవి. ప్రహ్లాదచరిత్రమున గూఢమును, గాఢము నయిన విశిష్టాద్వైతగహస్యములు, తేఁటమాటలతో సాయించుట ప్రశస్తముగా నున్నది. వస్తుపట్టికలనిపించు వర్ణనములు తీసివేసిన బాగుండెడిది. పాఠకులకయి కొన్ని పద్యములు ఉపహారీకరించుచున్నాము. ఇవి మచ్చునకయియే కాని, ఇంతకన్న మంచిపద్యములు లేవనికాదు. ఇవియే శ్రేష్ఠములనియు గాదు—

ఈ క్రిందిపద్యములు తెలుఁగుపలుకుల కులుకునడలతో నెట్లొయ్యార మొలుకుచున్నవో తిలకింపుఁడు.

ప్రథమాశ్వాసము ౭౬ పద్యము.

సీ. కడువిల్వగలబల్వ ♦ గలవల్వఁ గటిఁజెల్వ, మీఱుభూషణముల ♦ మేనఁ దాల్చి
ననుదళ్కులం జిల్క ♦ కనుబెళ్కులంగుల్క, నెమ్మోముబల్వన్నె ♦ నేర్పుమీఱఁ
గడుఠీవిఁ దగుతావి ♦ నిడుకావి జిగిమోవి, కడఁబైడిముంగెర ♦ లక్కంతిఁజూప
వగనెన్నఁదగుచన్న ♦ జిగిమిన్నలగుచన్ను, లెదఁగప్పుజిల్గుప ♦ య్యెదను గదుమఁ
గీ. పైడిగాజులు కేల్దోయిఁ ♦ బరిఢవిల్ల, నచ్చరలపోల్కి మేడలఁ ♦ జొచ్చి వార
కామినీమణు లొప్పిహిని ♦ భామలనఁగ, వీణవాయించుచుండి ర ♦ వ్వేటనెపుడు.

ద్వితీయాశ్వాసము ౨౩ పద్యము.

సీ. విరిమల్లెబోదెపం ♦ దిరులసౌరులు మీఱఁ, జామంతు లతివిలా ♦ సంబుఁజూపఁ
గమనీయగంధంబుఁ ♦ గాంచి వైభవముతో, మల్లికానూనంబు ♦ లుల్లసిల్ల
వెలలేనితళ్కుబె ♦ ళ్కులఁ దాలుచు గులాబి,పువ్వు లింపగు తావి ♦ నివ్వటిల్ల
నవకాంచనప్రసూ ♦ నములు సంశోభిల్లఁ, దాంబూలికాలతా ♦ తతులుమీఱ
గీ. సన్నవిరజాజు లతివిలా ♦ సంబునెఱప, మొల్ల గొజ్జఁగి గిరిమల్లె ♦ లుల్లసిల్ల
లలితమధురఫలంబులు ♦ నలర నెపుడుఁ, గేలికావన మతిశయ ♦ కీర్తిఁ గాంచె.

వీనియందలి సులలితపదఘటితదీర్ఘసాంస్కృతికసమాససౌభాగ్యముం గాంచుఁడు.

ద్వి. ఆ. ౨౨ ప.

సీ. ఏలాలతాజాల ♦ డోలాచరత్కీర, బాలాస్ఫుటాలాప ♦ లాలితంబు
సానాబ్జమాలావి ♦ హారాతికామాళి, నీరామనిక్వాణ ♦ పూరితంబు
మల్లీలతాకుంద ♦ వల్లీకుటజనాగ, వల్లీమతల్లీప్ర ♦ వేల్లితంబు
శ్రీమాలతీవల్ల ♦ రీమాగధీమంజ, రీమాధవీలతా ♦ కామితంబు
గీ. మాననీయపికశ్రేణి ♦ కానినాద, రూపవనదేవతాగాన ♦ దీపితంబు
సకలరాజాధిరాజసం ♦ చారయోగ్య, మై విరాజిల్లెఁ దత్కేళి ♦ కావనంబు.

ద్వి. ఆ. ౩౨ ప.

శా. పాటీరాద్రివిహారకిన్నరసతీ ♦ వ్యాలోలలీలాకలా
కోటీగేహనటీనటత్కుచఘటీ ♦ కోటీతటీవాటికా
వాటీప్రోత్థితసౌరభోత్కటపరి ♦ వ్యాలీఢసర్వాంగుఁడై
పాటీరాద్రినటత్సమీరుఁడు వనిన్ ♦ భాసిల్లె మాంద్యంబునన్.

చక్కగా దిద్ది తీర్చిన ప్రసాదగుణమును సహృదయులు పరీక్షింపుఁడు.

ద్వి. ఆ. ౨౯ ప.

ఉ. నాసఖు నాపతిం బ్రియుని ♦ నారఘురాముని నాదుకాంతునిం
బాసి వనాళిలో మునుల ♦ పత్నులఁ గాంచుట కేటికిట్లు పే
రాస వహించి వచ్చితి హి ♦ తాహితబుద్ధులు లేనివారు గా
రే సతులంచు నెంచ కిట ♦ కెందుల కాతఁడు పంపెనో కదా.

ద్వి. ఆ. 303 ప.

చ. రవికులవార్ధిసోముఁడగు ♦ రాముని దేవి విదేహమేదినీ
ధవునితనూజయున్ దశర ♦ థక్షితిపాలుని పెద్దకోడలి
య్యువిద సుధామయూఖునిస ♦ హోదరిఁ బోలుఁ దలంచి యీమెకున్
సవినయబుద్ధి సేవలను ♦ సల్పుదు మీరలు సత్కృపామతిన్.

రసార్ద్రములయి ఆనందపరకాష్ఠను కల్గించు నీపద్యముల నందిచూడుఁడు.

ద్వి. ఆ. ౨౬౩ ప.

సీ. అతిశయోత్తుంగ ఘో ♦ రాచలాధరములు, కనక సౌధంబులే ♦ జనని నీకు
మితిలేని దుర్మార్గ ♦ మృగ సమూహంబులు, తగు సఖీజనములే ♦ తల్లి నీకు
ఘోరనక్రగ్రాహ ♦ కులముతో వ్యాపించు, హ్రదములు సరసులే ♦ యంబనీకుఁ
గంటకావృత మహా ♦ కాననస్తోమము, లగిన పూదోఁటలే ♦ తల్లి నీకుఁ
గీ. బరమకాఠిన్యతరమహో ♦ పలగణంబు, లిందుమణివేదికలె జన ♦ యిత్రి నీకుఁ
గటకటా యౌవనంబున ♦ నెటుల నోఁటి, గావసింతువో యెట్టియి ♦ క్కట్టులువచ్చె.

ద్వి. ఆ. ౨౭౭ ప.

శా. ఆకర్ణాయతలోచనాబ్జములతో ♦ నాకుండలద్వంద్వ లీ
లాకీర్ణామలగండభాగములతో ♦ హార్యాలకశ్రేణితోఁ
శ్రీకమ్రస్మితపూర్ణ చంద్రికలతోఁ ♦ జెల్వారు శ్రీరాముమో
మేకాంతంబునఁ గాంచు భాగ్యమిఁక లే ♦ దేమో సుమిత్రాత్మజా.

తృ. ఆ. ౧౪౨ ప.

ఉ. ఎక్కడ జొత్తుమేమిపుడు ♦ నెవ్వరు దిక్కగువారలింక నీ
చక్కదనంపు పాదజల ♦ జంబుల గజ్జెలు మ్రోయుచుండ మా
చక్కి నటించువారెవరు ♦ చక్కని ముద్దులతండ్రి మాయెడన్
మక్కువదీరెనో నిమిష ♦ మాత్రములో మముఁ బాసిపోతివే.

ఇందలి యలంకారసౌకుమార్యమెట్లు ఇంపునింపుచున్నదో గమనింపుఁడు
ప్రథమాశ్వాసము 27వ, పద్యము.

సీ. రాజహంసవిహార ♦ రాజితంబులెకాక, రాజహంసవిహార ♦ రాజితములు
సరసాళినికురంబ ♦ సముచితంబులెకాక, సరసాళినికురంబ ♦ సముచితములు
బహుచారుకమలాధి ♦ భాసితంబులెకాక, బహుచారుకమలాధి ♦ భాసితములు
రమణీయచమరవి ♦ భ్రాజితంబులెకాక, రమణీయచమర వి ♦ భ్రాజితములు
గీ. చూపఱకు నివ్విధంబునఁ ♦ జోద్యమగుచు, రత్నరత్నాకరంబులై ♦ నూత్నవిమల
కాంచనాంబరమణివిలా ♦ సాంచితంబు, లై చెలంగినవి మణిగే ♦ హంబులచట.

ప్రథమాశ్వాసము 37 వ. ఉపమాలంకారము, అతిశయోక్తి.

మ. లలనారత్నము లప్పురిం బరమ లీ ♦ లామందిరేందూపలో
జ్జ్వలితోత్తుంగక భర్మహర్మ్యములపై ♦ సౌఖ్యంబుతోనుండ వా
రల కాళీజనమట్ల నాకలల నా ♦ రత్నంబు లేతెంచి ని
స్తులతల్లోకలసద్విలాసకములం ♦ జూపింతు రశ్రాంతముల్. 37
ప్రథమాశ్వాసము 39వ, పద్యము సామాన్యాలంకారము, భ్రాంతిమదలంకారము.
కం. అటవిపణిసురభిలోభా, నటదళినిర్ మృగమదంబు ♦ నకుఁ బోలికగా
ఘటియించు పణితుఁడు రవా, ర్చటిఁజేయ నవేదియయ్యె ♦ బహువిభ్రాంతిన్. 39

వృత్త్యనుప్రాసాలంకారము ద్వి. ఆ. 4వ, పద్యము.

ఉ. సంతసిలన్ జనంబులు వ ♦ సంతము భాసిలెఁ గాంతిమంతమై
కాంతనితాంత కాంతియుత ♦ కామ్యల తాలయసుప్తవారణో
ద్భ్రాంతక దానగంధహర ♦ బంభరడింభకులాంగనాగణా
త్యంతకలక్వణాభియుత ♦ మై సతతాంతలతాంతకుంతమై.

ఉత్ప్రేక్షాలంకారము. ద్వి ఆ. 6. పద్యము

సీ. లలితకాననలక్ష్మి ♦ కలరు మాధవునిపై, రహిఁగల్గు రాగాంకు ♦ రములనంగ
లీలానిలయసాల ♦ జాలఁబులు ధరించు, రమణీయశోణాంబ ♦ రములనఁగఁ
దిజగంబులం గెల్వఁ♦దివిరి కాముఁడు దాల్పు, నవమోహనాదిఁబా♦ణములనంగ
గాననాంతరములఁ ♦ గ్రాలుదావాగ్నిజా, జ్వల్యమానజ్వాల ♦ చయములనంగఁ
గీ. గలితలతికాంగనామణుల్ ♦ గట్టినట్టి, వలిపచెంగావిజిల్గుపా ♦ వడలనంగ
నలరుబోఁడుల కరచర ♦ ణాధరములఁ, దెగడి రాజిల్లుచున్నవి♦చిగురులపుడు. 6

శ్లేషానుప్రాణితోపమాలంకారము. ద్వితీయాశ్వాసము. 13వ, పద్యము.

సీ. రామాయణమువోలె ♦ శ్రీమేఘనీజాభి, రామమై హరికమా ♦ రకశిలీము
ఖాసనంబై శ్రీమ ♦ హాభారముపోల్కి, నామోదితసుమన ♦ స్తోమరాజి
తంబై సుర్యోదప ♦ త్తనము వైఖరి ఘల. పాకసౌభాగ్యసం ♦ పన్నశుకల
లితభాషణాభిరా ♦ జితమైమహాభాగ, వతముకైవడిఁగుంద ♦ వర్ధమాన
గీ॥ మై విలాసిధనపతిగే ♦ హంబు రీతి, నధికకమలాధిశోభిత ♦ మైముకుంద
మందిరముమాడ్కి విలసిల్లె♦మహిఁగీర్తి, గాంచి పూజ్యమంజులచైత్ర♦కాలమవని.

అపహ్నవాలంకారము. ద్వి. ఆ. 44 పద్యము.

చ॥ ఇదివదనంబుగాదు మృగ ♦ హీనకలానిధిమండలంబు చ
క్కదనపుగబ్బిగుబ్బ లివి ♦ గావు మెఱుంగుపసిండికుంభముల్
మృదుకచపాళికాదిది చ ♦ రింపనినీలబలాహకవ్రజం
బిది కనుదోయికాదు ♦ బహు ♦ హేలలమేలగుశృంఖలంబగుౕ.

ఉత్ప్రేక్ష, రూపకము, అతిశయోక్తి. తృ. ఆ. 112 పద్యము

క॥ అనవరతము మణిసౌధము, లినగతిచేఁ దప్పిఁగాంచి ♦ యెలమిఁ బతాకా
గ్రనిబిడజిహ్వాలతో ని, క్కినాకుచున్నవి సుధాంశు ♦ కిరణముల నటౕ.

అతిశయోక్తి, వస్తుధ్వని. తృ. ఆ. 113 పద్యము

క॥ నిలయావళిచలచేలాం, చలదండవితాడనములు ♦ సతతం బచటౕ
జలజాప్తసారథికి విర, తులఁ గూర్చుచునున్నవి బహు ♦ తోషం బలరౕ.

విషమాలంకారము. తృ. ఆ. 114 పద్యము

కం॥ వెలఁదులు దివ్వెలనారిచి, వలపులతో జాలమార్గ ♦ న్యాప్తేందు కరం
బులలో మార్జాలేక్షణ, ములఁ జూచి వెఱచిరిపురినిఁ ♦ పురుషులఁగలయౕ.

ఆచార్యులవారి పాండిత్యవిశేషమునుగూర్చి కాని, కవితావిశేషమునుగూర్చి కాని మిత్రులము కావున, మేమింతకన్న వ్రాయఁగూడదు. కావున, పాఠకమహాశయు లందందుఁగల విశేషములు పరికింతురుగాక.

మా మిత్రులు పరిణామమునుగుర్తించి, నవ్యవిధానచమత్కారమును గమనించి, ఇతోధికసరసమృదులకావ్యముల విరచించి, శారదాపీఠమున పూజా కుసుమములుగ నర్పించి, ఆంధ్రవాణ్యుపాసనచే ధన్యులగుదురుగాక.

రక్తాక్షి,
చైత్ర శుద్ధ ప్రతిపత్తు.
అమృతలూరు.

విద్వాౕ,
నా, వెంకటేశ్వర శాస్త్రి.

గీ॥ ఇవ్విధంబున నటఁదన్న ♦ హిధరాగ్ర, ఘనతరవిశేషకంబులఁ ♦ గచుచు సకల
సైన్యములు వెంటఁగొల్వఁగ ♦ సకలవిబుధ, వైరివైమించులవణుని♦వయికిఁజనుచు.

తృ. ఆ 69 పద్యము తరువాత చూచుకోవలెను.

---

ధనసహాయకుల వంశాభివర్ణనము.

శా॥ శ్రీవక్షోజ ధరాధరాగ్రవిలస ♦ జ్జీమూతుఁడుఁ సంలస
ల్లావణ్యాలయునిర్మలేంద్రమణి లీ ♦ లాహారగాత్రుండు నా
కావాసేంద్రముఖామరాదినుతపా ♦ దాంభోరుహుండై న రా
జీవాక్షుండిలఁ గాచుగాత శుభదృ ♦ ష్టిఁ వెంకటార్యుఁ ఘనుఁ. 1

శా॥ శ్రీరామాంగములఁ మనోహరముగఁ ♦ శృంగారయుజ్జ్వల్యాలం
కారశ్రేణులఁదాల్చి భక్తులకు భా ♦ గ్యంబుంగడుం గూర్చుచుఁ
నీరేజాక్షుభజించుచుఁ మనములో ♦ నిత్యంబువర్తిల్లు ల
క్ష్మీరామామణి వెంకటార్యునకు గూ♦ర్మింగూర్చు భాగ్యోన్నతుల్. 2

ఉ॥ లోకవిభుండునై సకల ♦ లోకములఁ సృజియించుచుఁ సురా
నీకము మెచ్చ వేదముల ♦ నిర్మలవక్త్రములం బఠించుచుఁ
శ్రీకరుఁడబ్జజాతుఁడు ప్ర ♦ సిద్ధగుణాకరు వెంకటార్య సు
శ్లోకుఁ జిరాయురున్నతుని♦ క్షోణితలంబునఁ జేయుగావుతఁ. 3

ఉ॥ జిలిబిలి మిన్కుటందియలు ♦ సిద్ధఝుణంఝుణఝుంఝుణక్వణం
బులఁ జరణాంబుజాతముల ♦ ముద్దులుగుల్కఁగ హేమవల్లకి
కలకలనిక్వణంబులన ♦ ఖండముదంబు వహించువాణితా
నలరుచు వెంకటార్యుని ర ♦ సాంగణరంగము న న్వసించుతఁ. 4

సీ॥ అసమాన వేదవే ♦ దాంగాదివిద్యావి, భాసితుల్తమిరి శా ♦ న్వయకభవులు
తరణిసూనుంబోలె ♦ దానక్రియా దివి, భ్రాజితుల్తమిరి శా ♦ న్వయకభవులు
సద్వదిక్శ్రేణికా ♦ సంపూర్ణసద్యశో, భాసితుల్తమిరి శా ♦ న్వయకభవులు
సురనాయకునిరీతిఁ♦ బరమభాగ్యైశ్వర్య, భాసితుల్తమిరి శా ♦ న్వయకభవులు

గీ॥ ప్రకటధార్మికచారిత్ర ♦ పాళికెల్ల, నవమణిసములు తమిరిశా ♦ న్వయకభవులు
మహి తనవఖండ మేదినీ♦మండలాధి, నాధవినుతులు తమిరి శా♦న్వయకభవులు. 5

కం॥ ధరణి హరిశ్చంద్రునివలె, సరసులు వీరసమ నిత్య♦సత్యవ్రతులై
పరగుచునుండిరి సతతముఁ, బరమానందములమీఱఁ ♦ బ్రజలేమొదలఁ. 6

శ్రీరస్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీసరస్వత్యైనమః.

# నిర్వచన కుశలవాభ్యుదయము

## ప్రథమాశ్వాసము.

మంగళశ్లోకము.

శ్లో॥ చరితంరఘునాథస్య శతకోటిప్రవిస్తరం ।
ఏకైకమక్షరంప్రోక్తం మహాపాతకనాశనం ।
రామాయరామభద్రాయ రామచంద్రాయవేధసే ।
రఘునాథాయనాథాయ సీతాయాఃపతయేనమః ।

## ఇష్టదేవతాస్తవము.

నారాయణస్తవము.




దేవీమణిఁగూడి వేడుకలతోఁ ♦ గ్రీడించుకాలంబునం
దాదైన్యంబునఁ గుందుచున్మనములోఁ ♦ ధ్యానింపఁ జక్రాయుధుం
శ్రీదేవిం బరివారము న్విడచి కూ ♦ ర్మిం బోయి కుంభీంద్రు నిం
ద్రాదుల్మెచ్చఁగఁ గాచినట్టిహరి క ♦ ల్యాణంబు సేకూర్చుతన్॥ 1.

లక్ష్మీస్తవము.

మ॥ అకలంకాంగములన్ మనోజ్ఞమణి భూ ♦ షాళిం దగందాల్చి పూ
ర్ణకలాంభోనిధిసోదరీమణియునై ♦ రాజీవనేత్రప్రియా
త్మకయై భక్తులకెల్ల సంపదలఁ బ్రే ♦ మంగూర్చి రాజిల్లు స
ర్వకళైశ్వర్యఫలప్రదాయిని మహై ♦ శ్వర్యంబు మాకిచ్చుతన్॥ 2

## బ్రహ్మస్తవము.

ఉ॥ లీలలతో జగంబులవ ♦ లీలగఁ బెంచుచు బత్తిమీఱులో
కాళితపోధనాధిపతు ♦ లందరుఁ గోరువరంబులం గృపా
లోలమనస్కుఁడై యొసఁగి ♦ లోకములన్నుతికెక్కినట్టి వా
ణీలలనావిభుండు ధర ♦ ణిం దయసేయు జిరాయురున్నతుల్ ॥ 3.

## సరస్వతీస్తపము.

ఉ॥ అంచితసర్వశాస్త్రనిగ ♦ మాంతరసీమలలోఁ జరించుచుం
గాంచనభూష లుల్లసిలఁ ♦ గాంతుని మోములలోవసించి శో
భాంచితమై చెలంగు జల ♦ జాంతరవాసినియైన వీణవా
యించు చెలంది వర్తిలుత ♦ నేయెడ మద్రసనాంగణంబునన్ 4.

## ఆంజనేయస్తనము.

ఉ॥ నీరధిదాటి రాముసతి ♦ నిం గని ముద్రికనిచ్చి వైరిదు
ర్వారబలంబులంజెలఁగు ♦ రామునివార్తలఁ దెల్పి నిర్జరేం
ద్రారికులంబులం దునిమి ♦ యంతకుఁడోయన లంకఁగాల్చియే
వీరుఁడువచ్చె సేమముగ ♦ వేడెదనట్టి గుణాఢ్యమారుతిన్ ॥ 5.

## సుకవిస్తవము.

మ॥ నెనరుం బూని భజింతు నాకుజుని దం ♦ డిన్ మల్హణుం గాళిదా
సుని మాఘున్ భవభూతిశంకరులఁ బూ ♦ జ్యున్ బిల్హణున్ రామభ
ద్రుని శ్రీహర్షుని బాణు భారవికవిం ♦ ద్రుం బోతనార్యాదిపా
వనులన్ భాస్కర తిక్కనాదులమదిన్ ♦ వాక్శుద్ధిసంసిద్ధికై 6.

## కుకవినింద.

మ॥ విమలాంగాళిఁ బరిత్యజించి రుధిరా ♦ భి వ్యాప్త దుష్ట వ్రణాం
గములం జేరెడు మక్షికాళి ఫణితిం ♦ గాన్పించు పాకాదిభా
వములన్ శయ్యలఁబాసి తప్పులనె దు ♦ ర్వాచాటులై పట్టు య
త్నములం జేసెడు కాకవీంద్రవితతిన్ ♦ దర్శించి దూషించెదన్ ॥ 7.

## గు రు స్త వ ము.

మ॥ అనఘున్ గాజులపల్లినామకులదు ♦ గ్ధాంభోధిరాకాసుధాం
శుని సద్వాక్యపదప్రమాణనిగమ ♦ జ్యోతిష్కలాప్రౌఢు స
జ్జనమాన్యాఖిలసద్గుణోల్లసితునిన్ ♦ సత్కీర్తివిభ్రాజితున్
హనుమత్కోవిదు మద్గురూత్తము నెదన్ ♦ ధ్యానింతు నే నీయెడన్॥ 8.

## క వి వం శా భి వ ర్ణ న ము.

సీ॥ అసమానవేదవే ♦ దాంగాదివిద్యావి, రాజితుల్ రత్నాక ♦ రంబువారు
తరణిపుత్త్రునిలీల ♦ దానక్రియాదివి, భ్రాజితుల్ రత్నాక ♦ రంబువారు
సకలదిక్శ్రేణికా ♦ సంపూర్ణకీర్తివి, భ్రాజితుల్ రత్నాక ♦ రంబువారు
సరసిజేక్షణురీతిఁ ♦ బరమకారుణ్యవి, భ్రాజితుల్ రత్నాక ♦ రంబువారు
గీ॥ ప్రకటధార్మికచారిత్ర ♦ పాళికమల, రత్నతుల్యులు రత్నాక ♦ రంబువారు
లలితకీర్తిసుధాంశు వి ♦ లసిత సకల, రాజమాన్యులు రత్నాక ♦ రంబువారు॥ 9,

కం॥ ధరణి హరిశ్చంద్రునివలె, సరసాగ్రేసరులు వీరు ♦ సత్యవ్రతులై
పరగుచునుండిరి నిరతముఁ, బరమానందము వహింపఁ ♦ బ్రజలు మనములన్॥ 10

కం॥ ఆ రత్నాకరసత్కుల, పారావారహిమకరుఁడుఁ ♦ బరమయశుండున్
ధీరుఁడు శేషార్యుండిలఁ, బేరుం గాంచెఁ దమిమీఱఁ ♦ బెద్దలకెపుడున్॥ 11

కం॥ ఆయనకార్గురు పుత్త్రులు, ధీయుతులు జనించి రతుల ♦ తేజోవంతుల్
శ్రీయుతులుఁ సకలసుగుణా, గ్రీయులు దిక్పూర్ణవిమల♦కీర్తివిలసితుల్॥ 12

సీ॥ సన్మాన్యశాంతివి ♦ జ్ఞానాదిగుణవితా, నములతో రంగార్యుఁ ♦ డమరుచుండె
నతిధీరభావపూ ♦ రితమహాస్వాంతుఁడై ♦ యొప్పారె భావనా ♦ ర్యోత్తముండు
బ్రహ్మచర్యాశ్రమ ♦ ప్రథితాగ్రగణ్యుఁడై, తగనృసింహార్యుండుఁ ♦ దగుజపముల
సతతంబుఁ గారుణ్య ♦ జలధియై సూర్యనా, రాయణార్యుండుఁ జె ♦ ల్వారుచుండె
గీ॥ ధీమహితుఁడు మంగాచార్య♦నాముఁడెలమిఁ, దనరె నెపుడుఁ బరోపకా♦రనిరతాత్ము
డై విరాజిల్లె రాఘవా♦ర్యాగ్రగణ్యుఁ, డతులసత్కీర్తివంతుఁడై ♦హితముమీఱ॥ 13

కం॥ ఆయార్గురిపుత్త్రులలో, నేయెడ నఖిలప్రియుండు ♦ హితమానసుఁడున్
శ్రీయుతుఁడున్ రంగార్యుం, డాయతకీర్తిం జెలంగె ♦ హరిభక్తుండై॥ 14

కం॥ ఆరంగార్యుండిలఁ జె, ల్వారం దమకంబు రాజ ♦ మాంబయనెడుఁ గాం
తారత్నముఁగైకొని సదు, దారగుణవినుతులము గురు♦తనయులఁ గాంచెన్॥ 15

గీ॥ మొదటివాఁడ నంతార్యుండు♦విదితగుణుఁడు, సత్యనారాయణార్యుండు♦సద్యశుండు
రెండవకుమారుఁ డతిధీవ ♦ రుండు శేష, యార్యుఁడుఁ దృతీయపుత్త్రుఁడా ♦ దార్య
యుతుఁడు ॥ 16

కం॥ దేశములఁదిరిగి బహు వి, ద్యాశేఖరులం భజించి ♦ దాక్షిణ్యముతోఁ
బేశలవిద్యలఁ దత్సం, కాశమునన్ నేర్చినాఁడఁ ♦ గవులు నుతింపన్ ॥ 17

కం॥ ప్రథముఁడనగు నేనీయెడ, నధికాలంకృతి రసాదు ♦ లలరారగనీ
విధిఁజేయంబూనితి జగ, దధిపతి కర్పించి కుశల ♦ వాభ్యుదయంబున్ ॥ 18

## షష్ఠ్యంతములు.

కం॥ శ్రీ కాంతాకాంతునకున్, శ్రీకరకాంచనదుకూల ♦ చేలునకున్ లో
కైకాధినాథునకు నా, ర్యాకాంతాజాది నిర్జ ♦ రాళి నుతునకున్ ॥ 19

కం॥ శాశ్వతునకుఁ గుంభోద్భవ, విశ్వామిత్రాదియోగి ♦ వితతినుతునకున్
విశ్వేశ్వరునకు మోక్షప, దైశ్వర్యాది ఫలదాత ♦ కబ్జాక్షునకున్ ॥ 20

కం॥ పుణ్యునకు సర్వలోక శ, రణ్యునకున్ భాగవత శ ♦ రణ్యునకు మునీ
డ్గణ్యునకు మనుజనుత సా, ద్గుణ్యునకు గభీరముఖసు ♦ గుణ గణ్యునకున్॥ 21

కం॥ హరికిన్ దుష్కృతకుంజర, హరికిం బార్శ్వగతహరికి ♦ నంతస్థిత గ
హ్వరికిన్ బాలితకరికిన్, గిరిసంధారికి హతారి ♦ కిన్నరహరికిన్ ॥ 22

కం॥ గుణికిన్ వినిహతభీకర, ఫణికిన్ సౌందర్యమణికిఁ ♦ బద్మావక్షో
మణికిన్ గీర్వాణశిఖా, మణికిన్ యోగీంద్రరాజి ♦ మానసమణికిన్ ॥ 23

కం॥ సీరికి మందరభూధర, ధారికి మణిశంఖచక్ర ♦ ధారికి హతము
ర్వైరికి జగదధికారికి, శౌరికి నుతసూరికి ఖగ ♦ చారికి హరికిన్॥ 24

గీ॥ అర్పణంబుగ నేను జే ♦ యంగఁబూని, నట్టినిర్వచన కుశల ♦ వాభ్యుదయ మ
హాప్రబంధరత్నమునకు ♦ నతిరసమున, నెసగునట్టి కథాక్రమం ♦ బెట్టిదనిన ॥ 25

## సాకేతవర్ణనము.

శా॥ శ్రీకాంతామణివాసరాజసదన ♦ శ్రేణీవిరాజన్మనో
జ్ఞాకారాంచితహేమకుంభరుచిచా ♦ ర్వస్ఫారఖద్యోతకా
నీకోద్యన్మణిబద్ధసౌధయుతమై ♦ నేర్పుం గనె న్మేదినిన్
సాకేతం బనిలోద్ధతధ్వజపటీ ♦ సంతాడ్యమానాభ్రమై ॥ 26.

సీ॥ రాజహంసవిహార ♦ రాజితంబులె కాక, రాజహంసవిహార ♦ రాజితములు
సరసాళినికురంబ ♦ సముచితంబులె కాక, సరసాళినికురంబ ♦ సముచితములు

బహుచారుకమలాధి ♦ భాసితంబులె కాక, బహుచారుకమలాధి ♦ భాసితములు
రమణీయచమర వి ♦ భ్రాజితంబులె కాక, రమణీయచమర ♦ విభ్రాజితములు
గీ॥ జూపరకునివ్విధంబునఁ ♦ జోద్యమగుచు, రత్నరత్నాకరంబులై ♦ నూత్నవిమల
కాంచనాంబరమణివిలా ♦ సాంచితంబు, లై చెలంగినవి మణిగే ♦ హంబులచట॥27.

మ॥ నటదుత్తుంగతరంగకప్రకరమీ ♦ న గ్రాహ దుష్కర్కటో
త్కటకౌర్యాంచితనక్రచక్రకపరి ♦ క్రాంతామ్మహాశుండు న
త్పటువీథిస్థమణుల్ గ్రహించి బహుళో ♦ ద్యద్వీచిహస్తాళితో
నటరత్నాకర నామధేయమునకున్ ♦ సార్థాభి సంజ్ఞం గనెన్ ॥ 28.

కం॥ ఘనరణయాత్రాద్వరదా, శ్వనిచయ ఖరఖురవిఘాత ♦ జపరాగము వా
రనిధిఁబడి యిప్పటికిఁ జం, ద్రునకది యొకలంకమనఁగ ♦ నుజులకగపడున్ ॥ 29.

సీ॥ సంతతం బపరప ♦ క్షముల వెన్నెలపులుం, గులు వెన్నెలలటంచు ♦ నెలమిమీఱ
నాశాంగనాశ్రేణు ♦ లమలావదాతచీ, నాంబరంబులుగట్టి ♦ నట్లువఱల
శృంగారగంగాత ♦ రంగముల్వ్రేటిపై, కెరలివచ్చెనటంచు ♦ సురలుబెదరఁ
గమనీయవిబుధగం ♦ గాభంగసంగచ, క్రాంగరబులనియోగు ♦ లక్షిసూడ
గీ॥ రామణీయకకాంత్యాభి ♦ రాజితావ, దాతశారదరాకాసు ♦ ధామయూఖ
మండితద్యుతినిరసన ♦ మహితవప్ర, దివ్యకాంతి పరంపరల్ ♦ దివముఁబ్రాకె ॥ 30

కం॥ వనితామణితనులీలలఁ, గనిసుర వేశ్యాభివినుత ♦ కమలాసనుఁడీ
వ్వనితల వేఱుగఁ జేయం, గనిమేషాంచితులఁ జేసెఁ ♦ గాకెట్లదియున్ ॥ 31.

మ॥ బహులీలానిలయాతిపీవరకుచ ♦ ద్వంద్వాతిభారంబునన్
విహరింపన్ బలహీనలై ఘననభో ♦ వీథిన్ నిజాగ్రోల్ల స
న్మహనీయోన్నతసౌధరాజిఁ గని వెం ♦ టన్ సోలుచుం బ్రాలి బ
ల్రహి వర్తించు బుధాంగనామణుల లీ ♦ లం గాంచి రింతుల్ పురిన్ ॥ 32.

మ॥ ధరణిన్ దత్పరిఖాంబురాసులకు భే ♦ దంబున్నరుల్ గాంచియో
ర్వరుపన్ జాలరటంచుఁ బద్మజుఁ డెదన్ ♦ భావించిభావించి తా
నెఱి దానిన్ వివరింపవారినిధికిన్ ♦ నీలాఁకమున్ వైచె లే
కరసాధీశునకేగతిన్ దదసితాం ♦ కంబబ్బె నెల్లప్పుడున్ ॥ 33.

ఉ॥ క్షీరవిభుండుఁ దన్నగర ♦ ఖేయముతో నతిమత్సరంబునన్
బోరి కడున్ బలంబుడిగి ♦ బూనిముఖంబున దీనభావమున్
నీరసనీరుఁడై పరమ ♦ నీలవికారముఁ గాంచె లేక యీ
నీరధి కెట్లు నివ్వటిలె ♦ నీలవికారము చూడ నేయెడన్ ॥ 34.

మ॥ విలసన్మంజుల సౌధవీధికలపై ♦ వేడ్కం గడుం గామలీ
లలకుంజోక్తి విలాసినీమణులు హే ♦ లం గూర్కఁగా వేకువం
జెలిమి న్వందులరీతి మేలుకొలుపున్ ♦ శృంగారకస్వర్గశై
వలినీహేమసరోజపాళిచరది ♦ వ్యక్వాణకాదంబముల్ ॥ 35.

చ॥ గగనతలంబునం జెలఁగు ♦ కైరవమిత్రుఁడు రాత్రులం గడున్
నిగనిగకాంతులం గులుకు ♦ నిద్దపుజిల్గుక డానిమేడలం
దగవిహరించినిష్కుటల ♦ తాసుమభాసురకేసరప్రసూ
నగణములన్ ధరించిచను ♦ నాకికదంబకసన్నుతాంగుఁడై ॥ 36.

మ॥ లలనారత్నము లప్సరింబరము లీ ♦ లా మందిరేంద్రోపలో
జ్జ్వలితోత్తుంగకభర్మహర్మ్యములపై ♦ సౌఖ్యంబుతో నుండ వా
రల కాళీజనమట్లు నాకలల నా ♦ రత్నంబు లేతెంచి ని
స్తుల తల్లోకలసద్విలాసకములం ♦ జూపింతు రశ్రాంతమున్ ॥ 37

మ॥ ప్రమదారామరసాలపల్లవములన్ ♦ భక్షించి కూకూనినా
దములం జేసెడుఁ గోకిలాతిమధుర ♦ ధ్వానంబులాలించి నం
దము న న్మందగతిన్ నటించి పవమా ♦ నస్వామి మాంద్యంబుతో
నమరెన్ వారిజగంధగంధిలసుశై ♦ త్యవ్యాప్తసర్వాంగుఁడై ॥ 38

కం॥ అటవిపణిసురభిలోభా, నటదళినిన్ మృగమదంబు ♦ నకుఁ బోలికగా
ఘటియించు బణిక్తుఁడు రవా, ర్భటిఁ జేయు నవేదియయ్యె ♦ బహువిభ్రాంతిన్॥ 39

కం॥ రసికజనాకర్షకచూ, ర్ణసురభి శాపణనిచయఘు ♦ రట్టకలహాజా
రసఘుర్ఘురనిర్ఘోషము, రసదంబుల విడువదచట ♦ రహినిప్పటికిన్ ॥ 40

మ॥ అలరెన్ సౌధదుకూలవల్లరి పురిన్ ♦ హార్యాకృతిన్ సద్వియ
త్స్థలి సద్వారిజయోనివారితనవ ♦ స్వర్గక్రియాకేళికా
బలదీక్షాయుతమౌనిసంఘటితమై ♦ భావించి ముక్తాభశై
వలినీరత్నమనన్ మరుచ్చలితమై ♦ ప్రాగ్దిక్ప్రదేశంబునన్. 41

మ॥ అతిఖేయాంబునిధిన్ జనంబులకు ని ♦ త్యానందసంధాయియై
ప్రతిబింబించి తదీయపత్తనము స ♦ త్ప్రాకారకశ్రేణికా
చతురేంద్రోపలసౌధరాజిమణి నా ♦ సాజాతరూపాంగణాం
చితపాతాలమనం జెలంగె నిలలో ♦ శ్రీదేవికావాసమై ॥ 42

మ॥ అమలాట్టాలకకుట్టిమాంబుధి జకాం ♦ తాభి స్రవద్భూరి నీ
రములన్ విక్రమనర్కకర్కటకఘో ♦ ర గ్రాహచక్రాలయాం

బుమహీశున్ విడనాడి కాంచి జలసం ♦ పూర్ణత్వమున్ సత్ప్రయో
దము ధారాధర నామమొందె నిధి వ్య ♦ ర్థంబయ్యె నప్పట్టునన్ ॥ 43

గీ॥ లలిత సౌధములం జేరి ♦ చెలఁగుపండు, వెన్నెలలఁ జందమామరా ♦ వేయటంచు
శివిఁ జందురుతోడ డీ♦డిక్కలిడుదు, రచట మోములఁ దిలకాంక ♦ మలర జెలులు॥ 44

సీ॥ కందోయిఁ ద్రిప్పి వె ♦ న్కకుఁ దిర్గి క్రీగంటఁ, జూడఁగా యతియైనఁ ♦ గూడ నెంచు
వలపించు నగలతో ♦ వన్నెలం జూపించి, మాటాడ మునియైన ♦ మరులఁ జిక్కుఁ
దళుకుబెళుకులఁ గుల్కు ♦ తనులీలఁ జూపఁగాఁ, గందర్పుఁడైన రా ♦ గంబుఁ గాంచు
లలిఁ గాంచు పైట చ ♦ ల్లనిగాలి సోకఁగా, వేదాంతియైనఁ దా ♦ వేడ్కఁ జూచు

గీ॥ నిటులఁ దమకంబుఁ గూర్చెడు ♦ నింపుఁ దాల్చి, చెలఁగుచుండిరి జాణలు ♦ లలిత కేళి
కావనాంతరములలో సు♦ఖంబుమీఱ, నాటలాడుచు మారుని♦బోటులనఁగ॥ 45

సీ॥ కడువిల్వగలబల్వ ♦ గల వల్వఁగట్టిఁ జెల్వ, మీఱుభూషణముల ♦ మేనఁ దాల్చి
నునుదళుకులం జిల్కు ♦ కనుబెళుకులం గుల్కు, నెమ్మోము బల్వన్నె ♦ నేర్పు మీఱఁ
గడుఁ దీవిఁ దగు తావి ♦ నిడు కావి జిగిమోవి, కడఁ బైడి ముంగెర ♦ ల్కాంతిఁ జూప
వగ నెన్నఁ దగుచున్న ♦ జిగిమిన్నలగు జన్ను, లెదఁ గప్పఁ జిల్గు ప ♦ య్యెదను గదుమఁ

గీ॥ బైడిగాజులు కేల్దోయిఁ ♦ బరిఢవిల్ల, నచ్చరలపోల్కి మేడలఁ ♦ జొచ్చి వార
కామినీమణు లొమ్మోహినీ♦భామలనఁగ, వీణ వాయించుచుండి ర♦వ్వేట నెపుడు॥ 46

సీ॥ ఎదమీఁద జిల్గు ప ♦ య్యెదమీఁద వెల్గు నీ, నెలతలవలపు ను ♦ ల్కల తెఱంగు
రతులం దుమదనునా ♦ రతులం దుఁగుల్కు నీ, వెలఁదుల నీటుఁ జూ♦ పుల బెడంగు
పాటలఁ బూవిల్తు ♦ బాటలం జెలఁగు నీ, మెలఁతల ముద్దుప ♦ ల్కుల తెఱంగు
మించులన్న గుమేని ♦ మించులం గెరలు నీ, వెలఁదుల యొయ్యార ♦ ముల బెడంగు

గీ॥ యూరయేమందు వారి యొ♦య్యారమెందుఁ, దలఁపఁ జక్కరవిల్కాని♦వలపుమందు
కళలబలుజిందు మెప్పొందు♦కలిమివిందు, జాణలనిగారవుపసందు♦జారులందు॥ 47

గీ॥ అలరు నస్త్రాద్రి కేగఁ బూ♦ర్వాద్రినుండి, పగలు నాలుగు జాములు ♦ బట్టునోయ
టంచు భాస్కరాశ్వములనో♦డించు వాజు, లుఱుకుగంటకు నెన్నని♦యోజనములు॥ 48

## పుష్పలావికా వర్ణనము.

సీ॥ చెలువాలు నీకుల్కు♦ చెండ్లేవి చూపుము, చూపట్టుచుండఁగాఁ ♦ జూపనేల
తనరు నీచిగురాకు ♦ దాచిపెట్టెద వేల, వలయువారలకుఁ జూ ♦ పంగవలయు
వలయుపున్నాగము ♦ లకల వెకుల్కు మిటారి, పున్నాగములకు నీ ♦ పురము కొంకి

జాణ నీచాపున ♦ జాతులేమున్నవి, సరసపద్మిన్యాది ♦ జాతులలరు

గీ॥ ననుచు వీధులసరస న ♦ ర్మానుకూల, వచనరచనలతోమించి ♦ వఱలువిటుల
కనుగుణంబుగ నుడువుచు♦ననుదినమున, వెలయుచుందురు పుష్పలా♦వికలువీట॥49

## దశరథ వర్ణనము.

కం॥ ఆనగరిఁ బ్రోచు జన, మానితుఁడగు దశరథుండు ♦ మహిరాజిల్లన్
భూనాథవినుతకీర్తి సు, ధానిధిసంపూర్ణదిగ్వి ♦ తానయుతుండై ॥ 50

సీ॥ తనకీర్తికైరవా ♦ ప్తవినిర్మలజ్యోత్స్న, లమలదిక్కాంతాంబ ♦ రములుగాఁగఁ
దనదానజలధరం ♦ బనిశంబుయాచక, సస్యసంతతికిఁ ర ♦ క్షణముగాఁగఁ
దనవిగ్రహము నిర్జ ♦ రనికురంబకమాన్య, రతిరాజలజ్జాక ♦ రంబుగాఁగఁ
దనచరిత్రము సర్వ ♦ ధార్మికచారిత్ర, పాళికిఁజాళువా ♦ బంతిగాఁగఁ

గీ॥ నలరె దశరథసార్వభౌ ♦ మాగ్రగణ్యుఁ, డఖిలరాజేంద్రమణికిరీ ♦ టాంచితాగ్ర
చరణసరసీరుహుండునై ♦ సకలలోక, జనగణాంచితపాక శా ♦ సనుఁడనంగ 51

సీ॥ లలితాకలంకలీ ♦ లాకలాపంబుల, నేరాజు రతిరాజుఁ ♦ బాఱదోలు
భాస్వత్పరమభోగ ♦ భాగ్యవైభవముల, నేరాజు సురరాజు ♦ నీసడించు
మనుజాళినుతనిజా ♦ ననవిలాసంబుల, నేరాజు రేరాజు ♦ నెగ్గులాడు
నిర్వక్రవిక్రమా ♦ ఖర్వగర్వంబుల, నేరాజుమృగరాజు ♦ నేపుజూపు

గీ॥ నతఁడు శాత్రవఘోర గ ♦ ర్వాంధకార, వారసంహారభీకరో ♦ జ్జ్వలదవార్య
సూర్యుఁడై వర్యనిర్వ్యా ♦ దార్యధైర్య, వీర్యగాంభీర్య ధుర్యుఁడై ♦ వెలసెనపుడు॥52

సీ॥ అక్షుద్రదక్షాక్షిణ ♦ దాక్షిణ్యవీక్షణో, త్కర సమీక్షదజాది ♦ సురవిపక్ష
రక్షోగ్రవక్షోభి ♦ విక్షోదనవిచక్ష, ణాక్షీణమనుజహ ♦ ర్యక్షరూక్ష
వీక్షణప్రభవాశు ♦ శుక్షణిప్రజ్వల, జ్జ్వాలికాపాళికా ♦ వార్యతీవ్ర
భైరవావిచ్ఛిన్న ♦ భానుచ్ఛటాక్షిప్న, విజయశీలాఖర్వ ♦ విక్రమాభి

గీ॥ రాజితుండై దశరథ భూ ♦ రమణుఁడధిక, రామణీయక రాజాధి ♦ రాజవినుత
కీర్తిశీతాంశుపూర్ణ ది♦గ్వితతివైభ, వోన్నతుండై చెలంగె భా♦గ్యోన్నతుండు॥ 53

సీ॥ ఆరాతితారహా ♦ రాబ్జజాతాబ్జాబ్జ, కరకరాబ్జాబ్జాబ్జ ♦ కరవిలాస
మారాతితారహా ♦ రాబ్జజాతాబ్జాబ్జ, కరకరాబ్జాబ్జాబ్జ ♦ కరవిలాస
మారాతితారహా ♦ రాబ్జజాతాబ్జాబ్జ, కరకరాబ్జాబ్జాబ్జ ♦ కరవిలాస
మారాతితారహా ♦ రాబ్జజాతాబ్జాబ్జ, కరకరాబ్జాబ్జాబ్జ ♦ కరవిలాస

గీ॥ మఖిలలోకైకవినుతత ♦ దతులితయశ, మఖిలలోకైకవినుతత ♦ దసమశౌర్య
మఖిలలోకైకవినుతత ♦ దధికదాన, మఖిలలోకైకవినుతత ♦ దాలయంబు॥ 54

సీ॥ ఆత్మజాత్మజాత్మజా ♦ త్మజాత్మజులఁ, జారుకీర్తితనూకృ ♦ పారసముల
నాత్మజాత్మజాత్మజా ♦ త్మజాత్మజుల, భావకళాభావ ♦ భావకముల
నాత్మజాత్మజాత్మజా ♦ త్మజాత్మజుల, భావకళాధికై ♦ శ్వర్యకముల
నాత్మజాత్మజాత్మజా ♦ త్మజాత్మజుల, భావవిజ్ఞానస ♦ ద్భావకముల

గీ॥ నసములుగఁ జేసి మహితధై ♦ ర్యాత్ముఁడగుచు, వఱలు సరసీజబాంధవ ♦ వంశదుగ్ధ
వారినిధిపూర్ణశీతాంశుఁ ♦ బంక్తిరథునిఁ, దలఁపవశమా నవేనోళ్ల ♦ చిలువకైన॥ 55

ఉ॥ తొలఁగె నుపాహితోదయజ ♦ దుర్భరదుశ్శకునంబు లేమెడన్
నెలనెలకున్ మొగుల్ గురియ ♦ నేరిచె నాలుగువానలం బురిన్
బలరిపుపాళినింగెలిచి ♦ పంక్తిరథుం డతినిర్మలాత్ముఁడై
కలిమి వెలందిచెల్వుఁడనఁ ♦ గా దయఁజూపుచు రాజ్యమేలఁగన్ ॥ 56

శా॥ నిశ్చింతాత్మ నిలాధిరాట్పదవిలో ♦ నిర్దిష్టుఁడైయుండి స
ద్దోశ్చక్రాసిగదాకుఠారవిశిఖ ♦ స్తోమంబు నప్పట్టునన్
నిశ్చేష్టత్వముగాఁగఁజేసె నిల వా ♦ ణీనాయకేంద్రాదుల
త్యాశ్చర్యాత్మకులై నుతుల్ సలుపఁగా ♦ నాసార్వభౌముండటన్ ॥ 57

శా॥ దిగ్దంతుల్ పలుభీతినిన్ దిశలఁజెం ♦ దెన్ సంతతంబున్ మరు
ద్భృద్గేవేంద్రుఁడుఁ గంపమొంది చనియెన్ ♦ భోగీంద్రలోకంబు నా
వాగ్దేవీంద్రముఖామరౌఘమునిజా ♦ వాసంబులం జేరె స
మృద్ధోద్దండుఁ డితండు విగ్రహమునన్ ♦ మార్వీం బ్రకర్షించినన్ ॥ 58

క॥ కని తద్విక్రమకీర్తుల, ఘనరవివిధుబింబములకుఁ ♦ గమలజుడుం జు
ట్టున వలయముఁ జుట్టె నగియుఁ, గన నిప్పటికిం జనులకుఁ ♦ గాన్పించునిలన్ ॥ 59

క॥ దిననాథశ్రీయుతుఁడీ, ఘనరాజేంద్రుఁడు సమయముఁ ♦ గడుపుచు నెపుడున్
ఘనులైనఁగవిబుధులతోఁ, దినదినమున నుదయముఁ గనుఁ ♦ తేజముమీరన్॥ 60

ఉ॥ సంతతమున్ జగద్వినుత ♦ సర్వహరిత్పరిపూర్ణసద్యశో
వంతులు లోకమాన్యగుణ ♦ వంతులు నీతికలాకుశాగ్ర ధీ
మంతులు సర్వశాస్త్రమతి ♦ మంతులు లోకులు మెచ్చునట్టి శ్రీ
మంతులు శౌర్యవంతు లల ♦ మంత్రివరేణ్యకులప్పురంబునన్ ॥ 61

సీ॥ దైత్యారి మాన్యాతి ♦ నిత్యసత్యవ్రతా, సక్తుఁడై దగుహరి♦శ్చంద్రుఁడనఁగ
ఘనవిలాసాంచిత ♦ కైలాసవాసుఁడై, భాసిల్లు పార్వతీ ♦ శ్వరుడనంగఁ
బరమసౌభాగ్యాతి ♦ భాగ్యభోగైశ్వర్య; శాలియైవఱలు వా ♦ సవుఁడనంగఁ
బ్రహ్మాదిదుర్లభ ♦ వైకుంఠవాసుఁడై, తనరారు శ్రీచక్ర ♦ ధరుఁడనంగ
గీ॥ సత్యమున నణిమాదుల ♦ సకలవైభ, వముల సత్వమునఁజెలంగి ♦ పంక్తిరథుఁడు
రాజ్యమేలుచు విశ్వంభ ♦ రాతలమున, నమలతరకీర్తిరాజితుఁ ♦ డై చెలంగె॥ 62

—•• పూర్వ రామాయణ కథాసంగ్రహము. ••—

గీ॥ ఇవ్విధంబున సార్వభౌ ♦ మేంద్రుఁడితఁడు, రాజ్యరక్షాతిదక్షుఁడై ♦ పూజ్యుఁడైనఁ
బుండరీకాక్షు వేఁడుచుఁ ♦ బుత్రహీన, తకువిచారించి మదినిట్లుఁ♦దలఁచుచుండె॥ 63

క॥ లలితాష్టైశ్వర్యంబులు, బలములు వాజిద్విపాది ♦ వాహనములుఁ బె
క్కులుఁగలవుగాని పుత్త్రులు, గలుగరె నేనేమిసేయుఁ ♦ గలవాఁడనొకో॥ 64

సీ॥ తనయహీనంబైన ♦ ధామంబునాయక, రత్నంబులేని హా ♦ రంబుగాదె
సంతానరహిత సం ♦ సారంబు విమలపూ, ర్ణకుముదాప్తుఁడులేని ♦ రాత్రిగాదె
పుత్రహీనైశ్వర్య ♦ పుజంబు పరమమం, దారంబులేని నం ♦ దనముగాదె
తనుజహీనాత్మజీ ♦ వనము లోకంబులో, నారిలేని శరాస ♦ నంబుగాదె
గీ॥ మాననీయతనూజులు ♦ లేనికులము, చతురకీరంబులేని పం ♦ జరముగాదె
యాత్మజులులేని భోగంబు ♦ లమలహంస. రాజహీనాంబుజాతాక ♦రంబుగాదె॥ 65

గీ॥ అనుచు నీరీతిఁ జింతించి ♦ జనవిభుండు, జనులువినుతింపఁగల్పభూ ♦ జంబుపగిది
నధికసంతానకాంక్షతో ♦ నలరి తావ, సిష్ఠుఁ బిలిపించి యొకయిష్టిఁ ♦ జేయఁబూనె.

ఉ॥ ఆసమయంబున న్విబుధు ♦ లందఱుఁ జేరి హరిం బరాక్రమో
ద్భాసిదశాననుండుఁ గడు ♦ బాధలఁబెట్టఁగ సంచలించె సం
త్రాసముతో దివంబిక నె ♦ దన్ దయతో నధికార్తులన్ మమున్
వేసటఁదీర్చి కావుమని ♦ వేడిరి నిస్తులభక్తియుక్తులై. 67

గీ॥ అవ్విధంబున వేఁడఁగా ♦ నఖిలవిబుధ ♦ వరుల నభయహస్తం బిచ్చి ♦ పంపి పిదపఁ
దగు నుపాయంబుఁ దలపోసి♦నగుచు భీక, రాశరోచ్ఛేదనోద్యోగి♦యైమురారి. 68

సీ॥ అంబుజాప్తకులదు ♦ గ్ధాబ్ధి నాకాంక్షించి, క్షీరాంబురాశిపై ♦ చెల్వమాని
సహజవాత్సల్యంబు ♦ సరిఁజూపఁగా నెంచి, వ్యాలాధిరాజుపై♦బాళి వీడి

ఖ్యాతనూజాతాంగ ♦ సౌఖ్యంబుఁ గాంక్షించి, శ్రీదేవిపైనుండు ♦ చెల్వువిడిచి
నవ్యమానుషలీల ♦ నటియింపఁ దలఁపోసి, తా నిజామానుష ♦ త్వంబుఁ బాసి

గీ|| వనచరత్వంబుఁ జేఁబూని ♦ మనుపఁ దలఁచి, బ్రహ్మదేవాది నిర్జర ♦ వరులవీడి
యలఘుతరగదానందకా ♦ ద్యాయుధాళి, రాముఁడ త్రిదశరథ♦ రాముఁడయ్యె 69

సీ|| తలవాకిట మెలంగు ♦ తలిరాకుబోఁడికిఁ, బెన్మిటిం గాంచినఁ ♦ బెద్దవేల్పు
ప్రామిన్కుబోటుల ♦ బలగంపుఁ బెన్మద్దు, మున్నీట నాకుపై ♦ చిన్నకుఱ్ఱ
పదునాల్గు జగముల ♦ బాలించు రారాజు, కలిమివాల్గంటి నో ♦ ములఫలంబు
వినుచూలిదిండిపా ♦ న్పునఁ బరుండెడుమేటి, వఱలుబుల్గుల తేని ♦ తురికిరౌతు

గీ|| కాఱుచీకటిలోన నో♦క్కటియెవెల్గు, మేటిమూల తేజుల గెంటు ♦ పోటుబంటు
తేయిఁ బగటినిఁ జేయుకం♦గోయివేల్పు, వేల్పు దశరథ సూనుఁడై ♦ వృద్ధిఁ జెందె. 70

క|| రాముఁడు భీకర పాపవి, రాముఁడు జననుతగుణాభి ♦ రాముఁడు లక్ష్మీ
రాముఁడు వైభవజితసు, త్రాముఁడు నవరత్నహార ♦ రాముఁడు సిదపన్. 71

క|| జనకుండుఁ బంప గాధిజ, మునివరమఖరక్షకధిక ♦ మోదముతోన
ద్వినుతదయాస్వాంతుండై, చనియెన్ నిజసోదరుండు ♦ సంసేవింపన్. 72

గీ|| ఇవ్విధంబున రఘువీరుఁ ♦ డెలమిఁ జూపి, సేవలం జేయు సౌమిత్రి ♦ తోడ విబుధ
నివహములు మెచ్చఁగా ధేయు ♦ నివసనమునకు సవనరక్షణముం జేయఁ♦ జనినపిదప.

సీ|| మహితామరారిధూ ♦ మకులంబు హోమధూ, మంబుతో దేవమా♦ర్గంబు నంటె
నసురోగ్రశోణకేఁ శాగ్ని కీలలు యజ్ఞ, వహ్నికీలలతో ది ♦ వంబుఁ బ్రాకె
ఘోర దేవారిసం ♦ కుల నినాదంబులు, నిగమమంత్రములతో ♦ నింగిఁ దాఁకెఁ
గర్బురాక్షిస్ఫులిం ♦ గములుఁ గుండ స్ఫులిం, గములతో గగనభా♦గంబు నానె

గీ|| నసురకులదుష్ప్రయత్నంబు♦ లధికపూజ్య, యాగదుష్ప్రయత్నములతో♦ నతిశయించె
నతఁడు శ్రీరాముఁ సమ్మతి ననుసరించి, మునివిబుధమాన్య మఖదీక్ష♦ బూనినపుడు.

మ|| ఘనుఁడున్ రాముఁడు బిమ్మటన్ మొదట న ♦ త్కాండంబునన్ శోణకే
శనిభాధికకృతహాటకం గపట భా ♦ షానాటకం దాటకన్
జనితోత్సాహు సుబాహునిం దురమునం ♦ జక్కాడి మారీచు నొ
క్కని నేసెం బరమాశుగాశుగమునం ♦ గంభీరవార్ధిం బడన్|| 75

ఉ|| జన్నము నిర్వహించి ముని ♦ చంద్రుఁడు మెచ్చఁగఁ బెద్దరాతినిం
గన్నెగఁ జేసి త్రోవ జన ♦ క క్షితిపాలుని పట్టణంబు ను

దృష్ణవరత్నభూషణవి ♦ తానవిరాజితమూర్తి మైథిలిన్
వెన్నుఁడు మానుషుండు రఘు ♦ వీరుఁడుఁ జేరె వివాహమాడఁగన్॥ 76

కం॥ ప్రముచ్చుల రేద్రిమ్మరులం, జెచ్చెరఁ దెగటార్చి మదినిఁ ♦ జెలిమిఁ జెలంగన్
వచ్చిన రఘుకులనాథున్, సచ్చరితున్ సత్కరించె ♦ జనకుం డంతన్. 77

సీ॥ శివధనుర్భంగంబుఁ ♦ జేయుట కీయోగి, తిలకుఁ డెట్టుల సమ్మ ♦ తించె ననుచు
నిజమిత్రు చాపంబు ♦ నెనరు బాసి యితండు, చిదుమ నెట్టుల సాహ ♦ సించె ననుచు
జనకుండు నిజకుమా ♦ రిని నిచ్చుటకుఁ జేయఁ, రానిపంతము నెట్లు ♦ బూనె ననుచు
నంబికాపతినాప ♦ మని విచారించి యీ, వసుధాధివిభుతేల ♦ వచ్చిరనుచు
గీ॥ గరుడగంధర్వయక్ష కి ♦ న్నర సురేంద్రు, లంబరంబున వేడ్కతో ♦ నధివసించి
చూచుచుండంగ రాముండు ♦ లేచి జీల్గ; బెండువలె ద్రుంచె శూలికో ♦ దండమపుడు.

మ॥ ధరణీనాథుఁడుఁ గౌశికాదిముని సం ♦ తానంబు ధాత్రీశ్వరు
ల్పరికింపన్ రఘురామచంద్రుఁ డవలీ ♦ లం జేతితో నెత్తి ని
ర్భర మోదంబునఁ బార్వతీపతి ధను ♦ ర్భంగంబుఁ గావించె నం
దరుఁ జూడం గలభం బిలం జెఱకుతుం ♦ టం గూల్చు చందంబునన్॥ 79

మ॥ పరమోదగ్రమహీధ్రజాపతిధను ♦ ర్భంగంబుచే నయ్యెడన్
వఱలం గూడినఁ గీర్తిలక్ష్మికరణిన్ ♦ వైదేహి సేకూర నా
సరసీజేక్షణ కేశపాశమున భా ♦ స్వత్కుందముల్ గూర్చు పో
ల్కి రహిన్ రామవిభుండు ముత్తియఁపుఁ బ్రా ♦ ల్నించెన్ వివాహంబునన్॥ 80

క॥ రాముఁడు మీఁదట భార్గవ, రామున్ రణభీముఁ గెలిచి ♦ రమణీయజన
స్తోమారాధ్యాయోధ్యన్, సేమముగా దేవితోడఁ ♦ జేరెం బ్రీతిన్॥ 81

మ॥ సురమాన్యాఖిలసద్గుణోల్లసితుఁడున్ ♦ క్షోణ్యాత్మజేశుండు ని
ర్భరశౌర్యాంచితదైత్యమత్తగజ హ ♦ ర్యక్షుండు సర్వంసహే
శ్వరవీరుండు రఘూత్తముండు జనకా ♦ జ్ఞన్ సీతతోఁ జేరె దు
స్తరగంభీరకదండకాగహనమున్ ♦ సౌమిత్రి సేవింపఁగన్॥ 82

సీ॥ జ్యోతిర్లతా చిత్ర ♦ ధాతుచిత్రతచిత్ర, చిత్రకూటాశ్రమాసీనుఁడగుచుఁ
జండశౌర్యోద్దండ ♦ పుండరీకాచ్ఛవే, దండగండాది వి ♦ ధ్వంసియగుచు
నిర్వక్రవిక్రమా ♦ ఖర్వగర్వోద్దీర్ణ, దానవోచ్ఛేదనో ♦ త్సాహియగుచు
నబ్జశేఖరసురేం ♦ ద్రాబ్జజాదినుతము, న్యబ్జసంపూజ్య పా ♦ దాబ్జుఁడగుచు

గీ॥ దూషణాధారరోష సం ♦ భాషణాది, భీషణాఖిలలోక వి ♦ ద్వేషణఖర
దూషణాదినిషూదన ♦ భీషణాస్త్ర, పోషణుఁడు మించె రఘుకుల ♦ భూషణుండు॥ 83

ఉ॥ శూర్పణఖోక్తిమారుతము ♦ సోకి దశాస్యుఁడు క్రోధవహ్నియున్
దర్పకబాణవహ్నియు నె ♦ దం దగులన్ నయపద్ధతి న్మదిం
జేర్పక తాటకాతనయుఁ ♦ జెచ్చెర లేడిని జేసి పంప న
మ్మార్పగురూపుతోడ రఘు ♦ మాన్యనిసుందరి డాసె నాతఁడున్॥ 84

శా॥ ఆమాయాహరిణాగ్రగణ్యముఁ దదీ ♦ యక్రీడలంగాంచి యా
శ్రీమత్సుందరహేమరూపహరిణన్ ♦ గ్రియంబుతో నాడ నా
కామోదంబు జనించెఁ గాన నిక డా ♦ యం బోయి తెమ్మంచు నా
రామున్ దైత్యవిరాము మైథిలి కడుం ♦ బ్రార్థించె నప్పట్టునన్. 85

మ॥ పిదపన్ రాముఁడు లేడినిం గదిసి వే ♦ వేబోయి తన్మాయలన్
మదిలోనెంచి మృగంబుకాదని మహా ♦ మర్షంబు వాటిల్ల దు
ర్మదు మారీచు సురారి నీచు నచటన్ ♦ బ్రహ్మాదులు న్మెచ్చఁగా
విదళింపన్ బహుభీషణాశుగమునన్ ♦ వేదండ మట్లుం బడెన్. 86

ఉ॥ ఆమెయి లక్ష్మణుం డరిగి ♦ నంత దశాస్యుఁడు వచ్చి మాయచే
భూమిజ మోసగించి కొని ♦ పోవఁగఁ దాఁ జను దెంచి శాలలో
సామజగామినిన్ సతిని ♦ జానకిఁ గానక కుందికుంది శ్రీ
ధాముఁడు రాముఁ డేగెఁ దమిఁ ♦ దమ్మునితో వెదుకంగ జానకిన్॥ 87

మ॥ చనుచున్ మార్గమునన్ జటాయువునకున్ ♦ సందర్శనం బిచ్చి భూ
తనయావార్తలనెల్ల వానివలనన్ ♦ దథ్యంబుగా నాలకిం
చి నయజ్ఞుండగువానికిన్ సలిపి శో ♦ చిష్కేశసంస్కారమున్
దనుజావద్యుఁ గబంధుఁ జంపి పిదపం ♦ దాఁ జేరెఁ బంపానదిన్॥ 88

గీ॥ హేమయజ్ఞోపవీతంబు ♦ హీరకుండ, లములు మణికంకణము లరు ♦ ణముఖమధిక
వాలముం గలిగిన నొక ♦ వానరుండు, వచ్చిపొడగట్టె ధారుణీ ♦ పాలుఁడలరి॥ 89

ఉ॥ ఆయన భక్తిఁజూపి తన ♦ కంబుజమిత్త్రతనూజు మిత్త్రునిం
జేయఁగ గౌరవించుచు న ♦ జేయభుజోత్కటశక్తితో శతా
రాయుతశాతకాండహతి ♦ నైంద్రి వెసం బరిమార్చి పేర్చి తా
రాయుతలోకపూజ్యకపి ♦ రాజ్య మిడెం గమలాప్తసూతికిన్॥ 90

శా॥ సారాసారము లంతటం గురియఁగా ♦ సౌదామినుల్ మీఱఁగా
సారంగంబులకున్ మనోంబుజములన్ ♦ సంతోష మేపాఱ శృం
గారంబై దగు మానసాంబరములన్ ♦ కాదంబకాదంబినుల్
పేరెంబూనఁగ వచ్చె నయ్యెడలఁ బ్రా ♦ వృట్కాల ముద్వేజమై ॥ 91

శా॥ ప్రావృట్కాలము నంతయుం గడిపి భా ♦ స్వన్మాల్యవంతంబునన్
సేవింపం దగురీతి లక్ష్మణుఁడు రా ♦ జీవాప్త సంజాతు సు
గ్రీవుం గూడి రఘూత్తముండు పిదపన్ ♦ శ్రీమేదినీపుత్రికై
భావాతీతసమీరజాదికపులం ♦ బంపించె మోదంబునన్ ॥ 92

క॥ పంబినదిటముల హనుమ, జ్జాంబవదాదు లటుమీఁద ♦ సమవర్తిదిశన్
సంబరమున లలనానికు, రంబమణిన్ వెదుకఁ జనిరి ♦ రఘువిభునాజ్ఞన్ ॥ 93

మ॥ చనుచున్ మార్గమునన్ బలోత్కట విభా ♦ స్వజ్జాంబవద్గంధమా
దననీలాంగదవాయుజాదికపిసం ♦ తానంబు ధైర్యంబునన్
గనె నిర్వక్రపరాక్రమోత్కమణాఖ ♦ డ్గవ్యాఘ్రవేదండకా
దినికాయోల్లసితాధికోగ్రవనమున్ ♦ దివ్యాశ్రమోద్దామమున్ ॥ 94

క॥ పిమ్మట స్వయంప్రభాగుహఁ, నిమ్మర్కటవరులు సేరి ♦ యెలమిన్ మధుపా
నమ్ములఁ దనియుచు నిజకా, ర్యమ్మునకుం జనిరి మత్తు ♦ లైవారలలోన్॥ 95

మ॥ పవమానాత్మజుఁ డంతటన్ మదిఁ బలిన్ ♦ భావించి శబ్దించి భై
రవనిర్వక్రిపరాక్రమోత్క్రి మణాన ♦ క్రగ్రాహకూర్మోదకా
శ్వనరాహెూగ్రభుజంగకర్కటవిభా ♦ స్వత్తుంగరంగత్తరం
గవితానాదివిరాజితాబ్ధిఁ గడు వే ♦ డ్కన్ దాటి వీరాంకుఁడై 96

సీ॥ తన ధైర్యమున కోర్వ♦దనినట్టు లోకగట్టు, వెస మెట్టి యొకగట్టు ♦ విఱుగఁదాకెఁ
దనగభీరతఁ జాల ♦ దనునట్లు వారాశి, మైజవంబునఁ దాఱు ♦ మాఱుఁజేసెఁ
దనతనుత్వము ఘన ♦ త్వముఁదెల్పువైఖరి, సురసలోఁ దనురీతిఁ ♦ జొచ్చివెడలెఁ
దనలోకబాంధవ ♦ త్వముఁ జూపుకైవడి, నతిశయచ్ఛాయాగ్ర ♦ హత్వమొందెఁ

గీ॥ దనతపఃఫలదేవతఁ, గనినరీతి, జనకజం గాంచి లంకలో ♦ దనభటత్వ
ముం దెలుప నంగుళీయక♦ము నిడి తనహ,రిత్వ మెఱిగింప దైత్యుల♦సత్త్వమణఁచె.

సీ॥ జనకాత్మజకు సంత ♦ సము మీఱఁ గూర్మితో, రామలక్ష్మణుల వా ♦ ర్తలవచించి
వనభంగముం జేసి ♦ వనపాలులం బ్రహ, స్తసుతు విక్రమశాలి ♦ జంబుమాలిఁ

బంచ సేనానులఁ ♦ బటువీరు నక్షుప్రము, ఖ్కాదులఁ బెక్కండ్రదుర ♦ క్కసులఁ ద్రుంచి
దానవేశ్వరునకుఁ ♦ దగుబుద్ధులం జెప్పి, రమణీయలంకాపు ♦ రంబుఁ గాల్చి

గీ॥ రఘుకులోత్తమఘోరమా ♦ ర్గణదహనశి, ఖాకులం బిట్లు నీదులం ♦ కాపురంబుఁ
గాల్చు నని చెప్పి శ్రీజన ♦ కతనయాజ్ఞఁ, బడసి చనుదెంచె రాముని ♦ కడకునతఁడు.

క॥ ఆతఁడు నటుమీఁదటఁ బృథి, వీ తనయాలోకనాది ♦ వృత్తాంతములన్
సీతాపతికి వచించెం, గోతులరా జపుడు మెచ్చఁ ♦ గుతుకాత్ముండై. 99

మ॥ పరమానందముతో రఘూద్వహుఁడుఁ ద ♦ ద్వాహ ప్రసిద్ధప్రతా
పరమావైభవము న్నుతించి శుభము ♦ ల్వాటిల్ల నాపత్పరం
పరల న్మాన్పెడు బాంధవుండవుగదా ♦ మాబోంట్లు నీవంటి స
ద్వరులుంటన్ శుభమొందరేయనుచు వీ ♦ ద న్వాని దీవింపుచున్. 100

సీ॥ పటువనాటనికురం ♦ బకమహోర్భటులచేఁ, బటువనాటంబులు ♦ భయముఁజెంద
వనచరౌఘోగ్రరా ♦ వములచే మేదినీ, ధరకులంబులుఁ బ్రతి ♦ ధ్వనుల నడల
శైలాటవేగాతి ♦ శయముచే నదులు భం, గములతో వ్యాకుల ♦ త్వమువహింపఁ
గీశసంతానోగ్ర ♦ కిలకిలధ్వనులచే, హరిదిభేంద్రంబులు ♦ వెఱపుఁజెంద

గీ॥ జిష్ణుబలసైన్యపతులు భ ♦ జించుచుండ, రాముఁడత్తరి లవణాంబు ♦ రాశిఁజేరి
తద్విశాలామలపులిన ♦ స్థలముమీఁద, నధికశౌర్యాంచితాత్ముసై ♦ న్యంబు విడిచె.

గీ॥ పిదప నరుదెంచి యటకు విభీషణుండు, దైత్యకుల నాయకుండగు ♦ దశముఖుండు
నన్నుఁ ద్వన్నిమిత్తంబుఁన ♦ దన్నె ననుచు, వేడెఁ బాలింపుమని రామ ♦ విభునిఁజేరి॥

క॥ మనుజాధినాయకుం డా, తని దయతోఁ బ్రోచి దైత్య ♦ ధవుఁజంపఁ బథం
బు నిటం జూపఁగదే యని, వననిధినిన్ మూఁడునాళ్లు ♦ ప్రార్థించె నటన్॥ 103

మ॥ పలుమాఱున్ రఘురామచంద్రుఁడు నుతిం ♦ పన్ వాని లెక్కింపక
జ్వలదుత్తుంగతరంగజాలవిచర ♦ త్సారోత్కటోద్వృత్తిమిం
గిలవాలాహతవిద్రుమాళిశకలా ♦ కీర్ణారుణాంబుద్యుతిన్
సలిలాధీశుఁడు సూపె ఘోరనిజతే ♦ జంబున్ విజృంభించుచున్॥ 104

క॥ అంతట నట వైదేహీ, కాంతుం డాలవణవార్ధిఁ ♦ గాంచి భవానీ
కాంతాద్యవార్యరోషా, క్రాంతుండై చాపమూని ♦ కడుసత్వమునన్ 105

సీ॥ ఘనతరోదగ్రభం ♦ గములు భంగములుగా, బడబాగ్నిసమకలం ♦ బములనేసె
భీకరాకారాద్రి ♦ పిండినిం బిండిగాఁ, బరమాశనిసమరో ♦ షములఁబరపె

భూరివారిచరాంగ ♦ భూతినిం భూతిగా, ఘనతరాగ్నేయాంబ ♦ కములనించెఁ
గమనీయరత్నజా ♦ లములు జాలములుగాఁ, గ్రకచాతితీవ్రాశు ♦ గముల నేసె
గీ॥ భీషణాశనిసమమహా ♦ ఘోషణాతి,వేగపరిజృంభమాణోగ్ర ♦ సాగరంబు
పై విశేషబలుండు సీతా ♦ విభుండు, రుద్రవిద్యాద్యవార్యోగ్ర♦రోషుఁడగుచు. 106

కం॥ కినిసి జగంబులు భీతిల ♦ వననిధు లింకించు రాము ♦ బహువినయముతోఁ
వననాయకుఁ డయ్యెడలం, గని పాదంబులకు నెఱఁగి ♦ కడు వినుతించెన్. 107

సీ॥ సరసీరుహాప్తుండు ♦ ఖరమయూఖంబుల, నేరీతి వెల్గించు ♦ నెట్లడంచు
నట్లాత్మశక్తిచే ♦ నబ్జయోన్యాదుల, బలవైరిముఖనిర్జ♦రుల సమస్త
జంతుజాలంబుల ♦ జగముల ధరణీధ, రంబుల న్వెల్గించు ♦ రహినడంచు
నేమహాత్ముండు స ♦ ర్వేంద్రియంబులు దానె, యై జగద్వ్యాపకుఁ ♦ డై వెలుంగు
గీ॥ నట్టిధీరాత్ము నాద్యు నంధ్యాత్మయోగ, గమ్యు విశ్వాత్ము యోగిసం♦ఘాతవినుతు
బరు జితేంద్రియుఁ బుణ్యాప ♦ వర్గనాథు, నిర్మలాత్ము జగన్నాథు ♦ నినుభజింతు.

మ॥ స్ఫురదుగ్రోత్కటబాడబంబున జలం ♦ బుల్ నాశముం గాంచువై
ఖరి యుష్మద్ఘనచాపముక్తశరసం ♦ ఘాతంబు డాయం జితా
శర? కారుణ్యవిశాల? నీకెదురె యీ ♦ సప్తాబ్ధు లింక న్ననుం
గరుణం గావు మటంచు వేడె నపుడుం ♦ గాండేశుఁడున్ నమ్రుఁడై. 109

క॥ అని యిట్లు వేడ రాముఁడు, వనరాశిం గాచి పిదపఁ ♦ బ్లవగేంద్రులచేఁ
బనివడి సేతువుఁ గట్టిం, చె నజేంద్రాదిసురగరుడ ♦ సిద్ధులు మెచ్చన్. 110

మ॥ స్థిరశౌర్యాంచితవానరోత్తములు సం ♦ సేవింప సేతుస్థలీ
సరణిం బోయి సువేల మెక్కి ధరణీ ♦ జాతాధినాథుండుఁ బ్రా
గ్ధరణీధ్రార్కుఁ డనం జెలంగి యెదుటం ♦ గాన్పించుదైత్యాధిరా
ట్పురినిం గాంచి బలంబుల న్విడిచె నా ♦ టోపంబునం బిమ్మటన్. 111

శా. భూనాథాజ్ఞ నుదగ్రదైత్యహృదయం ♦ బుల్ గాడ్పడం బత్రిసం
తానంబున్ మహి డుల్చుగాడ్పుకరణిం ♦ దైత్యాధినాథుం డటన్
గాన న్వానరసైన్యము ల్గదిసి లం ♦ కాసౌధసాలాదిసం
తానం బయ్యెడఁ గూల్చి తీర్చిరి వెసన్ ♦ నాకాంగనాత్రాసమున్॥ 112

మ. పవమానాత్మజగంధమాదనమరు ♦ త్వత్పుత్రిపుత్రార్కపు
త్రివిధాత్రాత్మజతారనీలగజమైం ♦ దశ్వేతకుల్ ధూమ్రనే

త్రవిరూపాక్షసురాంతకాదిదనుజుల్ ♦ ధైర్యంబుతోఁ బోర రు
ద్రవిధాత్రాదిసురానివార్యఘనయు ♦ ద్ధంబయ్యె నప్పట్టునన్॥ 113

సీ॥ శూరప్రహస్తాది ♦ సురవైరితూలజా, లము నీలఘోరజ్వ ♦ లనుఁడణంచె
నమరాంతకనరాంత ♦ కాదిరక్షోగజేం, ద్రములఁ బావనిమృగేం ♦ ద్రం బణంచె
వజ్రదంష్ట్రాదిగి ♦ ర్వాణారిదుష్టవృ, క్షముల సుగ్రీవఖ ♦ డ్గంబు నరికె
నతికాయమేఘనా ♦ దాంధకారౌఘంబుఁ, జటులసౌమిత్రిభా ♦ స్కరుఁ డణంచె
గీ॥ ఘోరవిక్రమోజ్జృంభిత ♦ కుంభకర్ణ, ముఖమృగపరివేష్టితపంక్తి ♦ ముఖవనంబు
సారమార్గణకీలజా ♦ జ్వల్యమాన, రామశితదావవైశ్వాన ♦ రము దహించె॥ 114

మ. సమరగ్రీష్మమునం గలంబఖరరు ♦ గ్జాలంబులన్ రామరా
ట్కమలాప్తుం డమరారిరాట్కుముదసం ♦ ఘాతంబుల న్వాడ్చి స
ర్వమునిస్వాంతసరోరుహంబు లలరం ♦ పం జేసి లోకాతిశు
క్తిమిరవ్యూహముఁ బాపి రాజిలె మహో ♦ తేజంబుతో నయ్యెడన్॥ 115

మ॥ వనజాతాసనవాసవప్రముఖగీ ♦ ర్వాణవ్రజం బాత్మహృ
ద్వనజాతంబులఁ మోద మొంది పటహ ♦ ధ్వానంబులం జేయుచున్
దనుజాధీశవిశేషరోషశుచిత ♦ ప్తక్షోణి శైత్యమునం
దనరారం గురిపించెఁ గల్పకుజసూ ♦ నస్తోమకాసారమున్॥ 116

సీ॥ రణములో దీర్ఘని ♦ ద్రలఁ గాంచువీరాట, వీచరోత్తములజీ ♦ వింపఁ జేసి
కారుణ్యమున నాత్మ ♦ వైరిసోదరునకు, రమణీయలంకాపు ♦ రంబుఁగట్టి
శుచిముఖంబున లోక ♦ శుచియై చెలంగుధా, త్రీకుమారీమణి ♦ స్వీకరించి
పవనజాదులు మహా ♦ భక్తితో సేవింపఁ, బరమగాంగేయపు ♦ ష్పకము నెక్కి
గీ॥ మార్గమందు భరద్వాజ ♦ మౌనిగొల్చి, భరతుసేమంబు నరయఁ బా ♦ వనిని నంపి
రవిసుతాదులతోఁ గూడి ♦ రామచంద్ర, భూవిభుండు నందిగ్రామ ♦ మునకు నరిగె॥

క॥ ఆనందించుచు రాముం, డానందిగ్రామమునకు ♦ నరుదెంచి మహీ
జానుజకపిసేవితుఁడై, తా నటఁ దగు భూషణములఁ ♦ దాలిచెఁ బిదపన్. 118

సీ॥ శ్రీవిరాజితనూత్న ♦ చీనాంబరంబులు, మెఱుఁగు నెమ్మేనిపై ♦ మెఱయుచుండఁ
బరమశౌర్యాంచిత ♦ బాహుదండంబులఁ, దతరత్నఖచితాంగ ♦ దంబు లలర
నసమానమంజులీ ♦ లాభిరాజితమస్త, కంబుపై మణికిరీ ♦ టంబు మెఱయ
భరతశత్రుఘ్నులుఁ ♦ బార్శ్వభాగంబుల, రమణీయమణిచామ ♦ రములు వేయ
గీ॥ నలసుమిత్రాత్మజుండు సే ♦ వాభిమాన, రతుఁడుఁ బూజ్యసితాతప ♦ త్రంబు వేయ
ననిలతనయాదికపిభటు ♦ ల్వినుతి సేయ, రామభద్రుండ యోధ్యాపు ♦ రంబుఁ జేరె.

## —* శ్రీరామ పట్టాభిషేక మహోత్సవము. *—

సీ॥ నేటికైనను రాము♦నిం గంటిమనుచుఁ గౌ, సల్యాదు లపుడు హ♦ర్షముల మీఱఁ
ద్వద్యశం బాచంద్ర ♦ తారార్కమగుగాత, యని వసిష్ఠుండు దీ ♦ వెనల నీయ
రఘురామ నీదు ధ ♦ ర్మములు నేటికిఁ బండె, నని పౌరజాలంబు ♦ వినుతిసేయ
వివిధవిశ్వంభరా ♦ విభులు కానుక లిచ్చి, వివిధమార్గముల సే ♦ వించు చుండ
గీ॥ భరతలక్ష్మణశత్రుఘ్న ♦ పవనతనయ, చిత్రభానుజముఖులుఁ బూ ♦ జించుచుండ
దివ్యరామాలలామ వై ♦ దేహిఁ గూడి, రాముఁ డత్తఱిఁ బట్టాభి♦రాముఁ డయ్యె॥

సీ॥ సస్యపాలాశకా ♦ చ్ఛాదనంబుల ధాన్య, భూషణంబుల మించె ♦ భూమిదేవి
రత్నోర్మికలఁ బూని ♦ రమణీయడిండీర, మలయజాంగుం డయ్యె ♦ జలవిభుండుఁ
గలికాభినూత్నము ♦ క్తాహారములఁ బల్ల, వపటంబులఁ జెలంగె ♦ విపినరాజి
కమనీయదేవగం ♦ గాదుకూలంబుతోఁ, జెలఁగె నాకాశల ♦ క్ష్మీలలామ
గీ॥ దిగ్గజామలరదనప్ర ♦ దీప్తివజ్ర, హారములఁ దాల్చి సకలది ♦ గ్వార మలరె
సీతతోఁ గూడి పట్టాభి ♦ షిక్తుఁ డైన, సమయమునఁ జూడ శ్రీరఘు♦క్ష్మావిభుండు.

మ॥ చతురంభోధిపరీతభూభరము దో ♦ స్తంభంబునం బూని భా
వితలక్ష్మీయుతుఁడై రఘూత్తముఁడు సం ♦ ప్రీత్యాత్మఁ బాలింపగాఁ
గ్రతుభుక్కిన్నరసిద్ధసాధ్యగరుడ ♦ వ్రాతంబులు న్మానవ
ప్రతతుల్ సౌఖ్యముతోఁ జెలంగిరి మహా ♦ భక్తిప్రపత్త్యాత్ములై. 122

శా॥ దిఙ్నాగంబులు భీతిని న్విడిచి ని ♦ ద్రింపం గడంగెన్ మరు
ద్భుఙ్నాథుం డలభోగినీమణులతో ♦ భోగింపఁగాఁ బూనెఁ బ్రా
గ్దిఙ్నాథావనిసుందరీగణ మటం ♦ గ్రీడింపఁగాఁ గల్గె స
మ్యఙ్నాత్నక్షితిభారమున్ రఘుకుల ♦ క్ష్మానాయకుం డూనినన్. 123

మ॥ రవివంశోద్భవుఁ డాసనంబున నిజ ♦ భ్రాత్రాంజనేయార్కపు
త్త్రివిధాత్రాత్మజనీలతారగజమైం ♦ దశ్వేతపాకారిసం
భవసంజాతవిభీషణాదు లెలమిం ♦ బార్శ్వంబులం గొల్వఁగాఁ
బ్రవిశేషప్రమదంబుతోఁ గొలువులో ♦ భాసిల్లు కాలంబునన్. 124

## —అగస్త్యాదులు రామునిఁ జూడవచ్చుట.—

మ॥ పరమోదగ్రతపఃప్రభావు లగు వి ♦ శ్వామిత్రకుంభప్రభూ
వరతంత్రాత్రిమరీచిగాలవభర ♦ ద్వాజాదిమౌనీశ్వరుల్
కరుణాశీలుఁ బరాక్రమాంచితు రఘు ♦ క్ష్మాపాలు దర్శింప నా
దరముప్పం జనుదెంచి నిల్చి సుబహి ♦ ర్ద్వారంబునం గూరిమిన్. 125

మ॥ మును లేతెంచి రటంచు నీవు రఘురా ♦ ముం జేరి వే తెల్పుమం
చని భృత్యోత్తము నంప నాతఁడుఁ దదా ♦ జ్ఞాయత్తుఁడై పోయి రా
ముని సేవించి ధరాధిపాల ఘటభూ ♦ మున్యాదు లేతెంచినా
రని విజ్ఞాపన మాచరింప విని తా ♦ నామోదపూర్ణాత్ముఁడై. 126

## శ్రీరాముఁ డగస్త్యాదుల నెదుర్కొని పూజించుట.

మ॥ కనకాద్రిందిగుబాలభాస్కరుడనం ♦ గాఁ జారుజాంబూనదా
సనముం డిగ్గి మహారయంబున రఘు ♦ క్ష్మాపాలముఖ్యుండు నా
మునిరాణ్ముఖ్యవితానముం గదిసి న ♦ మ్రుండై కరంబుల్మొగి
డ్చి నుతిం జేయుచుఁ దోడితెచ్చి సభలో ♦ శ్రీమన్మణీవేదికన్. 127

చ॥ విశదనిభావిరాజిత ♦ పీనసువర్ణమయాసనంబులం
గుశికకుమారకాదిముని ♦ కుంజరముఖ్యుల నుంచి గౌరవా
తిశయముఁ జూపి వారియెడ ♦ దివ్యవిధేయగుణాభిరాముఁడై
దశరథనందనుం డనె న ♦ దభ్రనవాభ్రనదభ్రమార్భటిన్. 128

శా॥ నేమంబే మునిచంద్రులార! తమకున్ ♦ శిష్యాళికిన్ శిష్యసం
స్తోమం బేయెడ సల్పునే చరణశు ♦ శ్రూషల్తపోనిష్ఠ లీ
భూమిన్ సాగునె దుంపలాకులు జలం ♦ బుల్ చిక్కునే కానలో
నేమూఢాత్ములుఁ జేయకుండిరిగదా ♦ యీమీయెడం గష్టముల్. 129

మ॥ భవదాశీర్వచనప్రభావములచేఁ ♦ బ్రాప్తించె మాకుం బ్రతా
పవిశేషాధికపుణ్యధర్మపరమై ♦ శ్వర్యాతికల్యాణవై
భవము ల్సంసృతిఘోరదాహము భవ ♦ త్పాదాంబుపానంబుచే
భువి శాంతిం గను నేమిఁ జేయుదు భవ ♦ త్పూజావిశేషం బికన్. 130

సీ॥ బ్రహ్మనిర్మాణంబుఁ ♦ బరికించి యీతండు, మాఱునిర్మాణంబు ♦ మఱలఁ జేసె
మహనీయనిజతపో♦మహిమచే నీతండు, నల్త్రిమూర్తులఁ గుమా ♦ రులఁగఁ గాంచె
సబ్జాసనాద్యవా ♦ ర్యతపోవిశేషశౌ, ర్యోగ్రగత్వమున నితం ♦ డుగ్రు గెలిచె
నతియోగశక్తిచే ♦ నా మానితిలకుండు, యత్నించి మ్రింగె ర ♦ త్నాకరంబు
గీ॥ నిట్టి యోగాతిశయముల ♦ నెసగునట్టి, మీపనుల నెల్ల విని నేను♦ మెచ్చితి నద
గాన మీవంటియోగులఁ ♦ గాంచుభాగ్య, మబ్బె నేటికి నాదుపు♦ ణ్యంబు పండె.

కం॥ అని యిట్లు భక్తితోఁ గడు, వినుతించిన రఘుకులాధి ♦ విభుచంద్రునితో
ఘనయశులు కుంభభవముఖ, మును లిట్లనిరి మది నధిక ♦ మోదంబలరన్. 132

—✤ అగస్త్యాదులు రాముని స్తుతించుట. ✤—

మ॥ భవదంచత్కరుణాతివర్షములఁ గీ ♦ ర్వాణారినాథోగ్రకో
పవిశేషాగ్నిశిఖానికాయపరిత ♦ ప్తక్షోణి శాంతింపఁగా
లవమైనన్ శ్రమ మేమెఱుంగమికఁ గ ♦ ల్యాణంబె మానిత్యక
ర్మవిశేషంబులకుం గొఱంతయె దయా ♦ త్మం జూడ నీ వీమహిన్. 133

మ॥ జలజాతంబులు వెల్గుచందమున భా ♦ స్వద్భానుజాలంబులం
దెలివిం గాంచు సమస్తలోకములు నీ ♦ దృష్టిప్రసారంబుచేఁ
దలఁపన్ సాధుజనైకరక్షకుఁడవై ♦ ధర్మంబుతో నీజగం
బులఁ బాలింపఁగ వేఱఁ జెప్పవలెనా ♦ పుణ్యాత్మ మా క్షేమముల్. 134

మ॥ ఘనమౌనీంద్రతపస్సమీరణమహా ♦ కాకోదరేంద్రుండు స
జ్జనశిక్షాభిరతుండు నిర్జరవిప ♦ క్షశ్రేణినాథుండు దు
ర్జనముఖ్యుండు దశాస్యుఁడు న్మడసె యు ♦ ష్మద్బాణఘోరాగ్నిచేఁ
గన నెవ్వాఁడిక మాతపంబులకు వి ♦ ఘ్నంబున్ రచించు న్మహిన్. 135

గీ॥ వేల్పులకు గుండెగాలంబు ♦ వివిధలోక, కంటకంబు మునీంద్రులఁ ♦ గలఁచు బంటు
గ్రహవితతులకుఁజక్కిలో ♦ కత్తియునగు, రావణుఁడు నీఁగె లోకముల్ ♦ రహిఁ
జెలంగె. 136

సీ॥ మాలలం డాగుది ♦ క్పాలు రెల్లరు హర్మ్య, ముల విహారముఁ జేయఁ ♦ గలిగె నిపుడు
జపముల న్విడనాడి ♦ సంచరించు మునీశ, సంఘు మీయెడ నిష్ఠ ♦ సలుపఁ గలిగె
బహుభీతిఁ గాంచు గీ ♦ ర్వాణులెల్ల విమాన, ములనెక్కి విహరింపఁ ♦ గలిగె నిపుడు
గానంబుఁ బాసిన ♦ గంధర్వ్వాలియెడ, లలితగానము సేయఁ ♦ గలిగె రెలమిఁ
గీ॥ బడిగెల న్మడిచి వసించు ♦ పాము లిపుడు, వేడ్కతో నాత్మఫణముల ♦ విప్పఁ గలిగె
రామ నీధర్మమున దుష్టు ♦ రావణాసు, రుని హరించి భయంబు దీ ♦ ర్చినకతమున.

సీ॥ మునిపక్షుఁడవటం ♦ చనుటకు న్మోదట వి, శ్వామిత్రయాగర ♦ క్షణమె సాక్షి
యతిపవిత్రుఁడవౌట ♦ కలగౌతమాంగనా, దోష మూడ్చినఁ బాద ♦ ధూళి సాక్షి
జగదీశ్వరుఁడ వౌట ♦ కగజాధిపతికార్ము, కముఁ ద్రుంచినభుజవి ♦ క్రమమె సాక్షి
యఘటనఘటనశ ♦ క్త్యాత్ముండ వౌటకం, బుధులశైలముల ని ♦ ల్పుటయె సాక్షి
గీ॥ సకలజీవప్రభుండ వౌ ♦ టకు వనచర, భటులచేఁ గార్యములను గొ ♦ నుటయె సాక్షి
యిట్టి నిన్నేము దీవింప ♦ నెంతవార, మీప్రతాపంబునకుఁ గ్గిరి ♦ కేమిసాక్షి. 138

సీ॥ ఖలుల శిక్షించి సా ♦ ధులఁ గాచుటకుఁగదా, తలఁచి తాతాజ్ఞఁ గా ♦ నలకుఁ జనుట
పగవానిఁ బరిమార్చు ♦ వ్యాజంబుచేఁగదా, విడనాడి సతి లేడి ♦ వెంటఁ బడుట

వెఱచువారలఁ గాచు♦కరుణఁ జూపనె కదా, జలజాప్తసుతునితోఁ♦జెలిమిఁ గనుట
నేకాంతభక్తుఁడౌ ♦ టెఱిఁగికావనె కదా, హనుమచేనంగుళీ ♦ యక మనుపుట

గీ॥ భువనకంటకు రావణుఁ ♦ బూరిపోల్చిఁ, దలఁచియొకదా విరోధిసో ♦ దరున కబ్ధిఁ
గట్టకయె లంకలోఁ బురిఁ ♦ గట్టుటెల్ల, రఘుకులాంబుధిచంద్ర శ్రీ ♦ రామచంద్ర.

చ॥ కరజలజంబునం గినిసి ♦ కార్ముక మూనిన సర్వలోకముల్
కరము వణంకుచుండెడివి ♦ కావె భవాద్యనివార్యకోపభీ
కరనయనోద్గతానలశి ♦ ఖాగణదగ్ధబుధేంద్రు రావణా
సురుని హరింప మీకెతగు ♦ శూరుఁ డెవం డిఁక జంపు నిమ్మహిన్. 140

సీ॥ అసమానబలుఁడు ధూ♦మ్రాక్షుండు ఘోరశ, స్త్రాస్త్రహస్తుండు దే♦వాంతకుండుఁ
జండయుద్ధాంగణో♦ద్దండశూరుఁడు నరాం, తకుఁడుఁ గుంభుండు దై♦త్యకులఘనుఁడు
ఘటకర్ణకంపనా ♦ కంపనాదులు శౌర్య, ధుర్యుండు వికటుండు ♦ దుర్ముఖుండు
రూక్షేక్షణులు విరూ ♦ పాక్షయూపాక్షులు, ఘనుఁడు నికుంభుండు ♦ ఖడ్గరోముఁ

గీ॥ డాదిగాఁగలబృందార ♦ కారిశూరు, లణఁగిపోయిరి నీదుసై ♦ న్యంబుచే భ
వత్సహోదరుచే మహా♦బలుఁడు మేఘ, నాధుఁ డనిలోఁ నణఁగె జగ♦న్నాధరామ.

మ॥ ప్రళయాంబ్దప్రతిమోగ్రమూర్తిపరిభా ♦ స్వత్కుంభకర్ణాద్రి త్వ
త్కులిశోదగ్రఖరాశుగప్రహతులం ♦ గూలె న్మహిన్ రావణ
జ్వలనుం డయ్యెడ నీదుఘోరవిశిఖా ♦ సారంబుచే నారె వా
రలఁ జంపం దగువాఁడ వీవెగదె శ్రీ ♦ రామా మహీశోత్తమా. 142

మ॥ అనియీరీతి నుతింప మౌనులు మహీ ♦ జాధీశ్వరుం డయ్యెడన్
విని యామౌనులఁ జూచి పూర్వమునఁ ద ♦ ద్వృత్తాంత మేరీతిగాఁ
దనరెం దానినిఁ జెప్పినాకిపుడు మో ♦ దంబు న్మదిన్ గూర్పు డో
మునులారా యని వేడఁ గుంభభవుఁ డ ♦ ప్డుం బల్కె నీవైఖరిన్. 143

—✿ అగస్త్యుండు రామునకు రావణాదుల పూర్వజన్మవృత్తాంతముఁ దెల్పుట. ✿—

చ॥ సనకసనందనాదిముని ♦ సత్తములొక్కెడ సంచరించుచున్
వనజభవాదిదేవగణ ♦ వందితు మాధవుఁ జూడఁ గోరి యొ
య్యన నయిదేండ్లయీడున ది ♦ గంబరులై హరిమందిరంబుఁ జొ
చ్చిన నట ద్వారపాలకులు ♦ ఛీయని నెట్టిరి వారలంతటన్. 144

సీ॥ వైకుంఠమునఁ బడ ♦ భ్రష్టులై శ్రీవిష్ణు, పాదాంబుజంబులఁ ♦ బాసి మర్త్య
భువనంబున రజస్త ♦ మోగుణోల్లసితులై, దనుజయోనిం బుట్టు ♦ డని శపింపఁ
దత్కారణమున నా ♦ ద్వారికులు మాకు, గతు లేమియనుచు నాఘనుల వేఁడఁ
బిదప వారలు దయా ♦ హృదయులై పరికించి, మీరు శ్రీపతితోడ ♦ వైరమూని

గీ॥ మూఁడుజన్మలలోనె యీ ♦ ముప్పువీడి, ఘోరశాపవిముక్తులై ♦ నీరజాక్షు
పరమపాదారవిందసే ♦ వాధురీణు, లయ్యెద రటంచు నుడివి వా ♦ రరిగి రపుడు.

క॥ సకలజగత్పరిపూజ్యులుఁ, బ్రకటయశులు వీరపుడు హి ♦ రణ్యాక్ష హిర
ణ్యకశిపులై మొదట నిట ది, తికి జన్మించిరి విశేష ♦ తీవ్రబలములన్. 146

మ॥ అతినిర్వక్రపరాక్రముం డగుహిర ♦ ణ్యాక్షుండు నిర్భీకుఁడై
క్రతుభుక్కిన్నరసిద్ధసాధ్యగరుడ ♦ వ్రాతంబులన్ దిగ్గజ
ప్రతతిన్ భూతనవగ్రహంబులఁ గడుం ♦ బాధింపుచున్ రాక్షస
క్షితినాథోత్తముఁడై చెలంగె నతిదు ♦ శ్శీల ప్రభావాఢ్యుఁడై. 147

శా॥ ప్రస్థామోల్లసితుండు వీఁడహితుఁడై ♦ బాధింప గీర్వాణులా
త్మక్షేమంబు లణంగి చిత్తముల సం ♦ త్రాసంబు వాటిల్ల ధై
ర్యస్థైర్యంబులు సంచలింప నపుడున్ ♦ రామామణీయుక్తులై
స్వస్థానంబుల వీడి పాఱిరి నిజ ♦ ప్రాణావనాత్యాశలన్. 148

శా॥ ప్రజ్ఞావంతులు లోకపాలకులు ధీ ♦ రస్వాంతులున్ యుష్మదీ
యాజ్ఞాబద్ధులుఁ దద్వ్యథాసహనులై ♦ యాత్మం గడుం భక్తితోఁ
నజ్ఞానాంధుఁ డితండు గూర్చుబహుబా ♦ ధాళి న్నివారింపుమో
విజ్ఞానేశ్వర యంచు వేడిరి నినున్ ♦ విశ్వేశ విశ్వాత్మకున్. 149

మ॥ అనియీరీతి నుతింప నాబుధులదీ ♦ నాలాపముల్ శ్రద్ధతో
విని నీవంతట వారలం గరుణతో ♦ వీక్షించి పంపించి దై
త్యనికాయోత్తము లోకకంటకు హిర ♦ ణ్యాక్షాఖ్యుఁ గోపంబుతో
ననిలోఁ ద్రుంచి జగంబుఁ గాచితి వరా ♦ హాంగంబునన్ రాఘవా. 150

మ॥ అటుమీఁదన్ ఘనుఁడున్ హిరణ్యకశిపుం ♦ డత్యుగ్రరూపేతుఁడై
కటునేత్రంబుల నిప్పుమంట లెగయం ♦ గా శాతదంతంబులం
బటునాదంబులఁ గీటుచుం బరివిభా ♦ స్వత్తీవ్రదృగ్జ్వాలికా
పటలాచ్ఛాదితశూలముం గొని కరా ♦ బ్జాతంబుతో నయ్యెడన్. 151

మ॥ సభలో నిల్చి పులోమకాదులను రో ♦ షస్వాంతులై కాంచి నే
డు భయోత్పాతము గల్గె నేమన బలా ♦ టోపాసురశ్రేణికా
విభు హేమాక్షు మదీయసోదరు ఘనున్ ♦ విష్ణుఁడు కోలాంగుఁడై
రభసం బొప్పఁగఁ జంపిపోయెనట మీ ♦ రల్ వింటిరే యీగతిన్. 152

సీ॥ అనియిట్లు వచియించి ♦ దనుజవీరుల కెల్ల, దివ్యాత్మ విష్ణు సా ♦ ధింపఁ దలఁచి
నిజభటశ్రేణుల ♦ నిఖిలదిగ్వీధుల, భూసురక్షేత్రకం ♦ బుల సురర్షి
లోకంబుల బుధాది ♦ లోకంబుల సమస్త, కంథుల గంభీర ♦ కాననముల
మున్యాశ్రమంబులఁ ♦ బుణ్యస్థలంబుల, నామ్నాయసప్తతం ♦ త్వాలయములఁ
గీ॥ గమల్లలోచనుఁ బరికించి ♦ కానరాక,యున్నచో మీబలంబుల ♦ యోగివరక
దంబకాశ్రమాదుల విద ♦ గ్ధంబుఁ జేసి, బహురయంబున రండని ♦ పంపెఁ గినిసి.

ఉ॥ అంతట శంబరాదివిబు ♦ ధారిగణంబులు శౌరివిద్విష
త్స్వాంతునిచే ననుజ్ఞఁగొని ♦ ఖడ్గశరాదుల స్వీకరించి శ్రీ
కాంతునికై మహాప్రళయ ♦ కాలపురాంతకులోయనం బలా
క్రాంతశరీరులై చనిరి ♦ కంజభవాదులు బెగ్గిలం గడున్. 154

మ॥ చని మున్యాశ్రమభూములన్ వనములన్ ♦ సంద్రంబులం బుణ్యలో
కనికాయంబుల యాగమందిరములన్ ♦ గాలించి లోకాధినా
థునిమార్గంబులఁ గానలేక మఱలన్ ♦ దుఃఖంబుతో వచ్చి దై
త్యునితో వారలు శౌరి చిక్కఁడని రెం ♦ దుం జూడ లోకంబునన్. 55

మ॥ అనియీరీతిఁ బులోమకాదు లనఁగా ♦ నాదైత్యనాథుండు ఘో
రనిదాఘార్కుఁడనన్ మనోంగణనట ♦ ద్రౌద్రాతిరోషాగ్నిహే
తినిభాప్రజ్వలితాంగుఁడై కెరలి ని ♦ స్త్రింశంబుఁ జేపట్టి యా
దనుజారిన్ వధియింతు నేనిపుడు నా ♦ తండెచ్చటన్ డాగినన్. 156

సీ॥ అనిచెప్పి వారలఁ ♦ బనిపి మీఁదట హిర, ణ్యకశిపుం డేగి పు ♦ ణ్యగిరి కచట
నూర్ధ్వదోర్దండుఁడై ♦ వ్యోమంబుఁగాంచుచుఁ, బరఖరద్యుతులతోఁ ♦ బ్రళయకాల
భానుండునుం బోలెఁ ♦ బరమదీర్ఘజటారు, ణాంశుజాలంబుతో ♦ నఖిలలోక
భీకరుండై కాలిఁ ♦ పెనువ్రేల నేల నూ, ని జితేంద్రియుండునై ♦ నిష్ఠఁ బూని
గీ॥ సరసిజోద్భవకైలాస ♦ గిరినివాస, వాసవప్రముఖామరా ♦ వార్యుఁ డగుచు
ఘనదయాసాగరుహిరణ్య ♦ గర్భుఁగూర్చి,పుడమిఘోరతపముఁ జేయఁ ♦ బూనెనపుడు.

మ॥ అదరెం గుంభిని తారకల్ చెదరె స ♦ ప్తాబ్ధుల్కలంగెన్ సమ
స్తదిశల్మండె ధరాధరంబు లదరెన్ ♦ జంతువ్రజస్వాంతముల్

చెదరెన్ విష్టపజాలము ల్వణఁకె వీ ♦ క్షింపన్ సురారీడ్విశా
రదగంభీరమహాతపోజ్వలన ఘో ♦ రజ్వాలికాశ్రేణులన్. 158

సీ॥ ఇటుల బాధించుఁ త ♦ త్పటుతపోజృంభణం, బునకోర్వలేక వి ♦ బుధగణములు
స్వర్గంబు విడనాడి ♦ సత్యలోకంబున, కేగి వారిజయోని ♦ కెఱిగి తండ్రి
దితికుమారకతప ♦ స్తీక్ష్ణత్వమున మేము, సమభీతప్తుల మైతి ♦ మమరపురిని
నిఁక నుండ వెఱతుము ♦ ప్రకటవీరుఁ డతండు, నీ వెట్లు తపముచే ♦ నెసఁగి సకల
గీ॥ భువననిర్మాణముం జేసి ♦ బుధులకంటె, నధికలక్ష్మిఁ జెలంగితో ♦ యటులలోక
సమితిహింసించితాఁదప♦శ్చటులమహిమ,మఱలజగములుగల్పించు♦మాడ్కినుండె.

గీ॥ అదియునుంగాక సకలజీ ♦ వాత్మలకు న, నిత్యముండుటఁ జేసి యా ♦ దైత్యనాథు
డతితపోయోగమహిమని ♦ త్యత్వమొంద, నుండెనోయనఁగాన్పించు ♦ చుండెనిపుడు.

మ॥ భవదీయంబగుశక్తి నెన్నుటకు శ ♦ ర్వాణీప్రియుం డిందిరా
ధవుఁడున్ నిర్జరులు న్సమర్థులె నిజో ♦ దంచత్ప్రతాపంబులన్
భువనాధీశ్వర ఘోరరాక్షసతప ♦ స్స్ఫూర్తి న్నివారించి యీ
భువనశ్రేణుల నెల్లఁ గావవె కృపా ♦ పూర్ణప్రసాదంబునన్. 161

కం॥ అనియిట్లు వేడ విబుధుల, ననిపి పిదప నజుఁడు మంద ♦ రాచలమునకున్
జని తపముం గావించెడుఁ, గనకకశిపు దైత్యనాథుఁ ♦ గని యిట్లనియెన్. 162

శా॥ క్రవ్యాదీశ్వర నీక్రియం దపము ము ♦ న్గావింపలేదెవ్వరే
నవ్యాజస్థితి నెవ్వరైన నిఁకఁ జే ♦ యం బోరు నేనిప్డు నీ
సేవోద్యదగ్రతపస్సమాధికినితు ♦ ష్టింగాంచితిన్ లెమ్ము నీ
దివ్యాత్మేచ్ఛల నిత్తుఁ గోరు మిఁక సం ♦ దేహింప నీకేటికిన్. 163

మ॥ అనిభాషింప నజుండు వాఁడపుడు భా ♦ షాధీశ్వరుం గాంచి స
జ్జనపూజ్యాంఘ్రిసరోజ సర్వజగతీ ♦ సంఘాతనిర్మాణ లో
కనికాయేశ్వర నిర్గుణాత్మ త్రిజగ ♦ త్కల్యాణరూపాత్మ నీ
కు నమస్కారము లాచరింతు నిపుడుం ♦ గూర్మి న్నన్నుం గావవే. 164

గీ॥ సకలజగదంతకుఁడు నిరం ♦ తకుఁడు లోక, కారణుఁడ కారణుండు జ ♦ గత్పరుండ
పరుఁడుజగదీశ్వరుఁడునిరీ♦శ్వరుఁడు నెవ్వఁ,డుఁగలఁడోయట్టినినుమదిఁ♦దగఁదలంతు.

గీ॥ అనుచునిట్లనె నిలభక్తు ♦ లడుగుకోర్కి, లనిడి నీక్రియమనిచెడు ♦ ఘనులుఁగలరె
కాన నర్థింతు నిచ్చెద ♦ వేనియిపుడు, మానసంబున నలరుఁ గా ♦ మములనెల్ల.

మ॥ ధరణిన్ వ్యోమమునన్ జలంబుల జగ ♦ త్ప్రాణంబునం గోలలన్
ధరణీధ్రంబుల ఘస్రఘోరనిశలన్ ♦ ధారాధరౌఘంబులన్
సురరక్షోమృగనక్రసర్పనరసం ♦ స్ఫోటంబునం జీకటిన్
వరవహ్నిన్ మృతిలేనిజీవనము దే ♦ వా నాకు నిప్పింపవే. 167

మ॥ అని వేడన్ తదభీష్టజాలముల భా ♦ షాధీశ్వరుం డిచ్చి దై
త్యనికాయేశ్వర యిట్టికోరికల ము ♦ న్నర్థింప రెవ్వార లై
నను నీకిచ్చితిఁ గాన నీవరిగి స ♦ న్మాన్యాగ్రగణ్యుండవై
ఘనకీర్తిం గనుమంచుఁ దెల్పి చనెఁ బా ♦ కార్యాదిదేవాళితోన్. 168

కం॥ అంతట దానవకులభూ, కాంతుం డలభారతీశు ♦ కారుణ్యముచే
సంతసమునఁ బడసిన వర, సంతతిచే నతిశయించి ♦ చనె పురికంతన్. 169

కం॥ సోదరుఁ గూల్చిన పగకై, తాఁ దగునీతిం ద్యజించి ♦ దైత్యేంద్రుఁడుఁ బ
ద్మోదరుపై శౌర్యమదో, న్మాదుండై కంటుఁ బూని ♦ మది నటుమీఁదన్. 170

మ॥ అతితేజోయుతుఁడై హిరణ్యకశిపుం ♦ డాత్మన్ దయన్మాని స
త్క్రతుభుక్కిన్నరసిద్ధసాధ్యగరుడ ♦ వ్రాతంబులం దిక్కరీం
ద్రతతిన్ భూతపిశాచభోగికులగం ♦ ధర్వగ్రహశ్రేణులన్
వెతలం బెట్టుచునుండె నేయెడల దు ♦ ర్నీతి న్విజృంభించుచున్. 171

క॥ మేడలఁ గోటల శాలలఁ, గోడల మణిగోపురములఁ ♦ గులశైలములన్
వాడలఁ గూలిచి జేజే, వీడుల హరియించెఁ బరమ ♦ వీరాగ్రణియై. 172

మ॥ దితిసూనుండు సమస్తలోకవిభుఁడై ♦ దిక్పాలకాద్యాసనో
ద్ధతుఁడై యుండఁగ మాధవేశ్వరవిధుల్ ♦ తప్పంగఁ ద్రాసంబుతో
నతులై తక్కినసిద్ధసాధ్యవిబుధేం ♦ ద్రశ్రేణులే తెంచి స
మ్మతిఁ బూజింతురు వాని దుర్మతి నసా ♦ మాన్యప్రతాపోద్ధతున్. 173

క॥ క్షితిఁ జేయు బుధులు మఖముల, నితఁ డరిగి విబుధులఁ దఱిమి ♦ హీనాత్ముండై
వెతకి హవిర్భాగముల న, హితుఁడై తా స్వీకరించి ♦ యేతెంచుఁగదా. 174

మ॥ ఖరనిర్వక్రపరాక్రమోల్లసితుఁడై ♦ క్రవ్యాదధీశుండు ని
ర్భరఘోరప్రతిఘాశుశుక్షణిశిఖా ♦ వ్రాతంబు దీపింపఁగా
సురపాతాళమనుష్యలోకముల సం ♦ క్షోభంబుఁ గావింపుచున్
ధరణీభాగమునన్ మహాప్రళయరు ♦ ద్రత్వంబునన్ రాజిలెన్. 175

గీ॥ ఇల నఖర్వగర్వంబుచే ♦ నిటుల నతఁడ, వక్రనీతిమార్గంబు న ♦ తిక్రమించి

సకలసౌభాగ్యవైభవై ♦ శ్వర్యజాల, శాలియై యుండి రాజ్యంబు ♦ సలుపుచుండ.

ఉ॥ ఎన్నఁడు ఘోరదానవకు ♦ లేంద్రుని బాధ లణంగు వృద్ధి మా
కెన్నఁడుఁ గల్గు దిక్కు గల ♦ దెన్నఁడు రక్షకులెవ్వ రంచు నా
పన్నగశాయి భక్తజన ♦ పాలు రమాపతి నెంచి భక్తిసం
పన్నులు నిర్జరోత్తములు ♦ మాన్యులుఁ గిన్నరసిద్ధసాధ్యులున్. 177

ఉ॥ ఎక్కడ నుండె సర్వజగ ♦ దీశుఁ డనంతుఁడు భక్తవత్సలుం
డెక్కడికేగి సాధులు ము ♦ నీశులు భక్తులు రాకు దీనులై
దిక్కనువారి కేమొడల ♦ దిక్కగునో యిపు డట్టివానికై
మ్రొక్కెద మేము భక్తిని మ ♦ ముం దరిఁజేర్చుటకై దయామతిన్. 178

సీ॥ శాంతిమూర్తికి సర్వ ♦ జగదీశ్వరునకు ని, ర్వాణకాంతునకు గీ ♦ ర్వాణపతికి
గూఢరూపునకు ని ♦ ర్గుణున కామ్నాయాంబు, ధికి నుత్తమోత్తము ♦ నకు విశేష
విజ్ఞానమయునకు ♦ విజితేంద్రియజ్ఞాన, కునకు సర్వాంతరా ♦ త్మునకు మోక్ష
సౌఖ్యసంవేదికి ♦ సకలసాక్షికి విచి, త్రాకారచారికి ♦ నఖిలలోక

గీ॥ పతికిఁ బరమాత్మునకుఁ బర♦బ్రహ్మమునకు, నాదిమధ్యాంతరహితున♦కవ్యయాత్ము
నకుఁ బరునకు జితేంద్రియు♦నకు ననేక, వందనంబులు జేతు మా♦నంద మొంది.

క॥ అనివినుతింపఁగ నాహరి, విని సాధుల కభయమిచ్చి ♦ వేడుకతో నా
ఘనులకుఁ బ్రత్యక్షుండై, యనితరసాధారణోక్తి♦ననె నీరీతిన్. 180

సీ॥ భయమేల మీకింక ♦ భద్రంబు సేకూరు, నఖిలభూతశ్రేణి ♦ కధికపూజ్య
మద్దర్శనంబుచే ♦ మహితలాభం బగు, వానిదుష్కార్యంబు ♦ లేనెఱుఁగుదుఁ
గాని కాలంబేచి ♦ కడతేర్చెదఁ జనుండు, గోవేదభూదేవ ♦ దేవసాధు
ధర్మమార్గములపై ♦ తగిలి నాయందుఁ వాఁ, డెపుడు కోపించుఁ దా ♦ నపుడెనీల్గు

గీ॥ నఖిలసద్గుణశాలి జ్ఞా ♦ నాంబురాశి, భక్తిసంపన్నుఁ బ్రహ్లాదుఁ♦బట్టియెపుడుఁ
గినిసి బాధింప నెంచునో ♦ దనుజు నపుడుఁ, బీచ మడగించి జగతికిఁ♦బ్రీతిఁ జేతు.

మ॥ జగతీనాథువరంబుల న్మిగుల దు ♦ ష్టాత్ముం డతం డేమొడన్
నెగులం బెట్టుచు నున్నవాఁడని మదిన్ ♦ నేనెంచి సాధింపఁగాఁ
దగుకాలం బిది కాదు కావున మహా ♦ ధైర్యంబుతో నైచితిన్
బగతుం బిమ్మటఁ గూల్తునేగుడుసురల్ ♦ వాక్యంబులింకేటికిన్. 182

కం॥ అనియిట్లుఁ జెప్పఁగా హరి, చనిరి వెఱపుఁ బాసి విబుధ ♦ సంఘము లంతం,
గనకకశిపుసూనులలో, ననఘుఁడుఁ బ్రహ్లాదుఁ డలరె♦హరిభక్తుండై. 183

—•• ప్ర హ్లా దో పా ఖ్యా న ము. ••—

సీ॥ మానసాంభోజంబు ♦ మధువైరివిమలక, ల్యాణపాదాంభోరు ♦ హంబులందె
లలితహస్తాబ్జముల్ ♦ జలధికన్యాకాంతు, రమణీయగేహ మా ♦ ర్జనములందె
శ్రవణద్వయంబు ఘో ♦ రదురితౌఘాపహ, రణవిత్తహరికథా ♦ శ్రవణమందె
నిర్మలేక్షణములు • నిఖిలలోకత్రాణు, కల్యాణరూప వీ ♦ క్షణములందె

గీ॥ కామమఖ్జాలమేశు • కైంకర్యమందె, రతులు దైత్యారి పుణ్యసం ♦ గతులయందె
జిహ్వ తులసీదళములందె♦శిరము చక్ర, పాణి వందనములయందె• బరగు నెపుడు.

సీ॥ వాసుదేవాతిచిం • తా సుధాస్వాదన, సంధానుఁడై సర్వ ♦ జగము మఱచు
నారాయణవిభావ • నాలగ్నచిత్తుఁడై, దైత్యారి మధుర కీ ♦ ర్తనలఁబాడుఁ
బంకేరుహాక్షు సే ♦ వారతుండై చారు, తర తత్పవిత్ర గా ♦ థలఁ బఠించుఁ
గమలాప్తుఁడను నిధా ♦ నముఁగాంచితినటంచు, నధికప్రియంబుతో • నాటలాడు

గీ॥ నమల వైకుంఠపాద చిం ♦ తామృతంబుఁ, ద్రాగినానని యొకసారి ♦ దమివహించు
భక్తవత్సలుఁడే తెంచి ♦ పలికెననుచు, నరసి యీబాలకుండు దే ♦హంబుమఱచు.

ఉ॥ తోయముఁ ద్రావుచుం దనకుఁ ♦ దోడగువారలతోఁడనాడుచుం
గాయలఁ బండులం దినుచు ♦ గంతులు వైచుచు మాటలాడు చుం
బాయసము ల్భుజించుచు వి ♦ భాస్వదనంతగుణాగ్రగణ్య నా
రాయణచింతనామృత ప ♦ రాయణుఁడై విలసిల్లెనేయెడన్. 186

సీ॥ దైత్యారిచింతా సు ♦ ధాపానమత్తుఁడై, నిరతంబుఁగాయఁబు ♦ మఱచువాఁడుఁ
జతురాననాదులు ♦ సాధింపఁజాలని, శ్రీవిష్ణుభక్తితోఁ ♦ జెలఁగువాఁడు
స్వర్గపాతాళాది • సకలలోకంబులు, హరిమయంబనుచుఁ దా ♦ వఱలువాఁడుఁ
బుట్టినప్పటినుండి ♦ పురుషోత్తమునిమీఁదఁ, జిత్తాంబుజాతంబుఁ ♦ జేర్చువాఁడు

గీ॥ సకలకార్యంబులనుభక్తి ♦ సహితబుద్ధి, శ్రీరమాకాంతునకు సమ • ర్పించువాఁడు
శాంత కారుణ్య వినయ వి ♦ జ్ఞాన లక్ష, ణాదిగుణనికాయములతో♦నలరువాఁడు.

గీ॥ ఇటుల భక్తాగ్రగణ్యుఁడై♦ యీతఁడలర, హేమకశిపుండుఁ దద్రీతి♦ నెంచియీతఁ
డచ్యుతస్మరణంబుఁ జే ♦యఁగఁబూనె, దీని నెవ్వారు నేర్పిరో♦తెలియదకట. 188

మ॥ అని దేవారివిభుండు హేమకశిపుం ♦ డాత్మ న్విచారించి వెం
టనె సర్వాగమవేద్యు శుక్రసుతుఁ జం • డామార్కు రావించి యీ
తని విద్యార్థిఁ జేసి నాకడకు స ♦ త్కారుణ్యతన్ మీరు బం
పనగుం జుమ్మని యానతిచ్చి పనిపెన్ ♦ బ్రహ్లాదు నహ్లాదుఁడై. 189

శా॥ అజ్ఞానాంధుఁ డితండు మీరు బహు వి ♦ ద్యాశోభితాగ్రేసరుల్
ప్రజ్ఞావంతులు సాధుమాన్యులు దయా ♦ స్వాంతుల్ జగత్పావనుల్
విజ్ఞానాఢ్యులు మాకుఁ బెద్దలు మము ♦ న్వీక్షించి యీబాలకున్
బ్రజ్ఞావంతునిఁ జేసి మత్కులమికం ♦ బాలింపరే కూరిమిన్ 190

మ॥ అని వేడన్ దనుజాధినాయకుఁడు శు ♦ క్రాచార్యపుత్త్రుండు వా
నినిఁ గొంపోయి సమస్తనీతివిధులన్ ♦ నెమ్మిం బఠింపింప నా
ఘనుఁ డాలించి పఠించె నయ్యెడ సమ ♦ గ్రప్రీతిమై లోకపా
వననారాయణభక్తిపూర్ణవిమల ♦ స్వాంతాబ్జుఁడై సర్వమున్. 191

కం॥ ఒకనాఁడు దనుజకుల నా, యకుఁడుం బిలిపించి తనయు ♦ నాత్మభటులచే,
నొకపద్యముఁ జదువుమనన్, సకలజ్ఞుండాతఁడిట్లుఁ ♦ జదువం గడఁగెన్ 192

సీ॥ సర్వాంతరాత్ముఁడై ♦ సకలలోకంబులఁ, బుట్టించు గిట్టించుఁ ♦ బ్రోచునెవఁడు
సకలలోకంబులు ♦ సకలలోకేశులు, సకలలోకస్థులు ♦ సమసినఁగడ
పటనలోకంబగుఁ ♦ గటికిచీకటికి న, వ్వల నెవండేకరూ♦పమున వెలుఁగు
గరుడగంధర్వ కి ♦ న్నర దేవులెవ్వాని, రీతులం దలఁచి కీ ♦ ర్తింపనేర

గీ॥ రట్టిమహనీయు నీశు న♦ధ్యాత్మయోగ, గమ్యుఁ బరమాత్ము నిందిరా♦కాంతు సూక్ష్మ
మోక్షతత్త్వజ్ఞు విశ్వాత్ము♦మునికదంబ, కాత్మసంచారు,ధీగాత్ము♦నాత్మఁ దలఁతు. 193

కం॥ అనియిట్లుఁ జదువఁగా విని, దనుజాధివిభుండు నవ్వి ♦ తగఁ బాపఁడీలం
జను లెట్లనిపించిన న,ట్లను నెట్లాడించు నటుల ♦ నాడునటంచున్ 194

శా॥ నాకున్నీవు సుతుండవై తివిగదా ♦ నాతండ్రి యీధ్యానముల్
నీకుం గల్గినవో దురాత్మకులు దు ♦ ర్నీతిం బఠింపించిరో
నాకుం దెల్పుము తెల్పిరో గురువుల ♦ న్యాయంపు మార్గంబులన్
శ్రీకాంతుండుఁ బరుండు వాని నిటుఁ గీ ♦ ర్తింపంగ నీకేటికిన్, 195

మ॥ కిటియై మీపినతండ్రిఁ జంపె మనకుం ♦ గృష్ణుండు విద్వేషి దు
ర్ఘటతద్ధ్యానములేల నీవతనికిం ♦ బ్రత్యర్థివై యుండి వి
స్ఫుటశౌర్యంబున నాదురాత్ముఁ బగతున్ ♦ శోధించి సాధింప ని
న్నిట సేవింతురుగాదె దానవులు దం ♦ డ్రీ వీడు మీశేముషిన్. 196

మ॥ అనిపల్కన్విని తండ్రిమాటలకుఁ బ్ర ♦ హ్లాదుండ నాహ్లాదుఁడై
ఘనుఁ డెవ్వాఁడుఁ దలంచి సర్వజగముల్ ♦ గల్గించి పోషించు న
వ్వనజాతేక్షణు భక్తవత్సలుఁ గృపా ♦ పారీణు లోకపా
వను నెవ్వారలు జూడనేరరెపుడున్ ♦ భావింతునామూర్తినిన్. 197

చ. మునివరు లేరిఁ జేరుటకుఁ ♦ బోయి వనంబుల దుంపలాకులం
దిని తపమాచరింతురు సు ♦ ధీవరు లేఘను సన్నుతింతు రా
వనజదళాక్షు దేవగణ ♦ వందితు సత్కరుణాపయోనిధిన్
వినుతగుణాఢ్యుఁ జక్రధరు ♦ వేడద నేయెడ బత్తితో మదిన్. 198

సీ|| ఆమ్రపల్లవముల ♦ నాసించుకోయిల, లలితంపుగిరిమల్లి ♦ కలకుఁజనునె
విమలాంబుజమకరం ♦ దములనాస్వాదించు, మధుపంబు కాఱుతు ♦మ్మలకుఁజనునె
గంగాతరంగసం ♦ ఘాతంబులం దేలు, కలహంస బురదకా ♦ ల్వలకుఁజనునె
ఫలములం దేనెల ♦ భక్షించు కీరంబు, ముదముతో మాతులం♦బులకుఁ జనునె
గీ|| పరమపావనతమచక్ర ♦ పాణిపాద, పద్మచింతామధురసుధా ♦ పానమత్త
చిత్తకమలంబు లన్యంబుఁ ♦ జేరఁగలవె, యెన్నిమాటలు బల్కిన ♦ నేమిఫలము.

మ|| అనిపల్కన్వినుచుం బురోహితుఁడు రో ♦ షావిష్టచిత్తంబునన్
గని వానిం గొనిపోయి శాస్త్రముల నే ♦ కాంతంబునం జేర్చి యూ
తనికిన్ నేర్ప బహుప్రకారముల నా ♦ తండుం బఠించెం బ్రియం
బున నారాయణభక్తిపూర్ణహృదయాం ♦ భోజాతుఁడై సర్వమున్. 200

గీ|| అంతఁడుఁజదివించి మఱలఁ బ్ర ♦ హ్లాదు దనుజ, వరుకడకుఁ దోడితెచ్చి యో ♦ సురవిపక్ష
నీదుపుత్త్రుఁడుఁ బఠియించె ♦ నీతివిధుల, నరసిచూడంగవలె నటం♦చనఁగనపుడు.

కం|| వినినిజపురోహితోక్తులు, దనుజవిభుఁడుఁ దనయుఁబిలిచి ♦ తండ్రి! గురులు నీ
కునిపుడు నేర్పిన నీతుల, వినుపింపుము వినఁగనాకు ♦ వేడ్కజనించెన్. 202

శా|| విద్యావంతుఁడుఁ మీకుమారుఁడని యా ♦ విప్రుండనన్వింటి నే
వేద్యాంశంబుల నేర్చితో యిపుడుఁ ద ♦ ద్వేదాంతసారంబులో
బద్యంబుం బఠియించి దానఁగల తా ♦ త్పర్యంబువాక్రుచ్చి
విద్యాసారముఁజూపఁగా నగుననన్ ♦ విజ్ఞుం డతం డంతటన్. 203

కం|| సదమలబుద్ధిన్విడువక, చదివితి నే నఖిలశాస్త్ర ♦ చయములనిపుడున్
జదివిన విధితత్త్వంబులఁ, జదివి వచించెదను వినుము ♦ జనకా నీకున్. 204

సీ|| కమలామనోహరుఁ ♦ గననినేత్రంబులు, విమలమంజులమే చ ♦ కములుగావె
మురవైరిచారిత్ర ♦ ములఁబఠింపని జిహ్వ, చెఱలాడు మండూక ♦ జిహ్వగాదె
విధుపుణ్యగాథల ♦ వినని కర్ణంబులు, ధరణీధ్రనిమ్నరం ♦ ధ్రములుగావె
జలజాక్షుపూజల ♦ సల్పనట్టికరముల్, శవములఁబట్టు హ ♦ స్తములుగావె

గీ॥ కలితతులసీదళసురభిఁ ♦ గననినాసి, కంబు హేయంపుకిటి నాసి ♦ కంబుగాదె
శౌరిచింతలవిడనాడు • జన్మమవని, దైత్యకులచంద్ర! జలబుద్బు ♦ దంబుగాదె. 205

సీ॥ కమలామనోహరు ♦ రమణీయనామ మం, త్రముఁ దలంపని మాన ♦ సములుశిలలు
సంతతంబు భార్గవీ ♦ పతికివందనముల, రచియింపనిశిరంబు ♦ రాతిగుండు
దామోదరున కర్చ ♦ తంబుఁజేయని సిరి, వనభూమిచంద్రికా ♦ వైభవంబు
పురుషోత్తమాలయం ♦ బులకుఁ బోవనిపాద, ములు కాననాంతర ♦ భూమిజములు
గీ॥ శౌరిభజనముసేయని • సర్వజనులు, ధరణిఁబెనుగాలిపోక్కి క • దలుశవములు
శ్రీహరిధ్యానములులేని ♦ జిహ్వలెల్ల, తాటిపట్టలు వింటివే • దనుజవీర. 206

కం॥ అనినావు డతనిమాటలు, దనుజాధిపుఁ డాలకించి ♦ తగుకోపమునన్
గని నిజపురోహితుని ని, ట్లనివక్కాణింపఁ గడఁగె ♦ నాసమయమునన్. 207

చ॥ ప్రకటగుణాఢ్య! నీతివిధి ♦ పారగుఁ జేసెద నంచుఁ జెప్పి డిం
భకుఁ గొనిపోయి నీవిటుల ♦ వాని కనర్హవిరోధిశాస్త్రముల్
వికటిలత న్వచించితివి • విప్రవరేణ్యసుతుండవంచు నే
నకుటిలమానసంబునఁ గ ♦ దా నిను నమ్మితి భూసురుండవే. 208

మ॥ అనిపల్కన్ దనుజేశ్వరుం డలిగి శు ♦ క్రాచార్యజుం డయ్యెడన్
విని దైత్యాధిప మేము చెప్పము భవ ♦ ద్విట్శాస్త్రము ల్వీని దు
ర్జను లెవ్వారు వదింప రాతనికి న ♦ స్మన్నీతివాక్యంబులన్
వినబోఁ డాతఁడు నందుకై మదిని న ♦ న్వేషింపు మన్యాధ్వమున్. 209

మ॥ అనఁ గోపంబుఁ బరిత్యజించి దనుజుం ♦ డాత్మాత్మజుం జూచి యో
తనయా! నీకెవరీమతిం దెలిపిరో ♦ తథ్యంబుగాఁ జెప్పుమం
చని పల్కన్విని తండ్రి కిట్లనియెఁ బ్ర ♦ హ్లాదుం డటన్ లోకపా
వననారాయణభక్తిపూర్ణవిమల ♦ స్వాంతంబునం గూరిమిన్. 210

మ॥ భవఘోరాంబుధిలో మునింగి విషయ ♦ వ్యాపారపారీణులై
భవనాశంబులఁ గాంచమానవులకున్ • స్వస్వాంతరంగంబులన్
ద్రవిణం బిచ్చిమహాత్మకుల్ బుధులు త ♦ త్త్వజ్ఞుల్ ప్రబోధించినన్
ధ్రువనారాయణబోధము ల్గలుగునే ♦ దూరాటవిం దూరినన్. 211

మ॥ సురవైరీంద్ర! సమస్తశాస్త్రముల సం ♦ శోధించితిం గాని దు
స్తరనారీతనయాదివారిచరవాం • ఛారుణ్మఖోల్లోల భీ
కరసంసారపయోధి దాటఁ గ రమా ♦ కాంతానుచింతాప్రధీ
తరి సంబంధమె కాని వెఱగునె వా ♦ దం బేల నాతో నికన్. 212

కం॥ అనిపలికిన నిజసూనుని, దనుజేశ్వరుఁడు ధిక్కరించి ♦ దరకరరోషం
బున మండిపడుచు దనుజులఁ, గని యిట్లని నుడువఁ గడఁగెఁ ♦ గాలోగ్రుఁడనన్.

ఉ॥ పంచశరద్వయస్కుఁ డతి ♦ బాలకుఁ డీతఁడు నాపథంబు నిం
దించి మదీయవైరిహరి ♦ నిం దురితాయను దుష్టచిత్తుఁ గీ
ర్తించుఁ దలంచి కూడదని ♦ తెల్పిన మానడు మీరు వీని శి
క్షించి భవత్ప్రతాపములఁ ♦ జేడ్పడఁ జేయుడు వైరిచింతలన్. 214

శా॥ సంగాతంబుఁ బరిత్యజించికడురో ♦ షస్వాంతులై మీరు దు
స్సాంగత్యాభిరతున్ దురాత్ము ఖలు న ♦ స్మద్వైరిచింతాత్ము ని
స్సంగున్ మత్సుతు నీతనిం దునిమి భా ♦ స్వన్నిర్జరద్విట్కులం
బుం గావింపుడు కీర్తియుక్తముగ మీ ♦ పూర్ణప్రతాపంబులన్. 215

మ॥ అనిదైత్యేశ్వరుఁ డాడఁగాఁ బిదప దే ♦ వారాతిసంఘాత మా
ఘనుఁ బ్రహ్లాదు జితేంద్రియున్ గుణనిధిన్ ♦ గారుణ్యముం బాసి ఘో
రనిశాతాగ్రవిశిష్టశూలముల గ ♦ ర్వస్వాంతులై గ్రుమ్మఁ బా
వననారాయణభక్తిపూర్ణవిమల ♦ స్వాంతాబ్జుఁడై రాజిలెన్. 216

చ॥ పదుగుస దానవుల్వొడువ ♦ బాలునిగాత్రము కందిపోదు త
ద్వదననిభావిలాసములు ♦ వాడవు లోపల రక్త ముబ్బనే
రదు నులిగావు శల్యనిక ♦ రంబులు మంజులనేత్రదృష్టి పో
వదు పలలంబు నల్గదు న ♦ వ్రశమ మబ్బదు చిత్ర మెంతయున్. 217

మ॥ సురవిద్వేషిశూలఘాతములకున్ ♦ శుద్ధాత్ముఁ డీతండు శ్రీ
హరి! నారాయణ! భక్తవత్సల! దయా ♦ వ్యాపారపారీణ! సా
గరకన్యాపతి! లోకపావన! జగ ♦ త్కల్యాణ! పుణ్యాత్మ! యం
చు రహిన్ విష్ణుఁదలంచుఁ గాని మదిలో ♦ శోకింపడాయెం గదా. 218

ఉ॥ పాఱడు వేఱుచోటులకు ♦ బాంధవసంఘములో భయంబుతో
జేఱడు మిత్రసంఘములఁ ♦ జీఱడుఁ గావుమటంచుఁ దండ్రినిం
దూఱడు హేమసౌధములఁ ♦ దూఱడుఁ దాఁ జని తల్లిప్రాపునుం
గోఱడు నేలపై బడడుఁ ♦ గుందడు గంద డిదేమి చిత్రమో. 219

కం॥ దనుజాధినాథుఁ డంతట, వనజేక్షణభక్తిపూర్ణ ♦ భావుఁ గుమారున్
ఘనగుణనిధిఁ బ్రహ్లాదుం, గని మదిఁ దర్కించి పిదపఁ ♦ గటురోషమునన్. 220

సీ॥ మత్తేభచయముచే ♦ మొత్తించు బాలకుఁ, గఱపించు ఘోరోర ♦ గప్రతతుల
బహుశిఖారాజిత ♦ భైరవానలములోఁ, ద్రోయించు బెట్టించుఁ ♦ గ్రూరవిషముఁ

కూలంకషోగ్రక ♦ ల్లోలాబ్ధిఁ నెట్టించుఁ, దీక్ష్ణశూలములబా ♦ ధించుఁ బట్టి
కట్టించు వ్రేయించు ♦ గదలతో నుర్వించు, గండోపలంబులఁ ♦ గటుశిలీము
గీ॥ ఖముల నేయించు వికళించు ♦ ఖడ్గహతుల, ధరణిఁ బాతించుఁ ద్రోయించు ♦ గిరితటములఁ
గశల నడపించు నిట్లు రా ♦ క్షసకులేశ్వ, రుండుఁ బీడింపుచుండ నా ♦ తండునపుడు.

శా॥ ధూర్తాగ్రేసరుఁడై మహాకుపితుఁడై ♦ దుర్మార్గుఁడై తండ్రి దు
ష్కీర్తిభ్రాజితుఁడై చెలంగి మది దా ♦ క్షిణ్యంబు వోనాడి యి
ట్లార్తిం బెట్టఁ గడంగె నీయెడ మదీ ♦ యధ్యాన మాలించి యో
యార్తత్రాణపరాయణా! సకలక ♦ ల్యాణాత్మ! రక్షింపవే. 222

మ॥ అరయన్ సద్భవదీయనామమధుర ♦ ధ్యానాసహిష్ణ్వాత్ముఁడై
పరమార్థంబుఁ బరిత్యజించి యిటులన్ ♦ బాధింప యత్నించె నా
మొరలాలించి నన్ విశేషకరుణా ♦ పూర్ణాత్మ నేతెంచి యో
హరి! నారాయణ! కావవే! వరద క ♦ ల్యాణాత్మ! రక్షింపవే. 223

కం॥ అనివినుతించు కుమారుం, గని వానినిఁ జంపఁ గలుగు ♦ కార్యంబునకై
ఘనచింతాక్రాంతుండై, దనుజాధిపుఁ డివ్విధమునఁ ♦ దలఁచె న్మదిలోన్. 224

ఉ॥ ముంచితి ఘోరవారిధుల ♦ మొత్తితి భీకరఖడ్గరాజిఁ ద్రో
యించితి నగ్నిలోపలన ♦ హీనవిషంబులఁ బట్టి తెచ్చి యి
ప్పించితి సర్పరాజిఁ గఱ ♦ పించితి గండశిలావ్రజంబు ను
ర్వించితిఁ బెక్కుభంగుల శ ♦ పించితి నీతఁడుఁ జావఁ డెన్నిటన్. 225

కం॥ అనితలఁచు హేమకశిపుం, గని కవిసూనుండుఁ బిదపఁ ♦ గనుఁ వేడ్కం ద
త్తనయప్రభావతత్త్వం, బు నెఱిఁగియుఁ గపటవాక్య ♦ ముల నిట్లనియెన్. 226

మ॥ ఖరనిర్వక్రపరాక్రమాంచితుఁడవై ♦ ఖడ్గంబుఁ జేఁబూని దు
ర్భరఘోరప్రతిఘాశుశుక్షణిశిఖా ♦ వ్రాతంబు దీపింప ది
గ్వరులన్ యుద్ధములన్ జయించితిగదా ♦ వాఁడెంతవాఁ డిట్టిదు
ర్భరభాష ల్గుణదోషహేతువు లగున్ ♦ భావింప నీ కేటికిన్. 227

ఉ॥ వాదములేల దుష్టుఁడగు ♦ వాఁడిల నార్యులసేవచేఁ జతు
ర్వేదసమస్తనీతివిధి ♦ విజ్ఞుఁడుఁ గాఁగలఁ డిట్టిఘోరదు
ర్వాదము మాను నీ సుతుఁడు ♦ భార్గవుడుం జనుదెంచునంతలో
వేదసమస్తనీతివిధి ♦ విజ్ఞుఁ డగుం బరితాప మేటికిన్. 228

సీ॥ అన వానిమాటలు ♦ విని హేమకశిపుండుఁ, బ్రహ్లాదుఁ గొనిపోయి ♦ రాజనీతి
విజ్ఞుఁ జేయు మటంచు ♦ వేడ నాతఁడు వెంటఁ, గొనిపోయి బాలు స ♦ ద్గుణగరిష్ఠుఁ

త్రైవర్గికాదిస ♦ ద్భావంబులం దెల్పి, నాలించి గురుభాషి ♦ తాగమముల
యోగ్యంబులనుచుఁ దా ♦ నూహించి గురుఁడాల, యమునకుం జనినకా ♦ లముననసుర

గీ॥ బాలు రాటలకై పిల్వ ♦ వారిఁ గూడి, బాలులార గురూక్తుల ♦ నాలకించి
నారె మంచివి కావవి ♦ వేఱునీతి, వినుఁడు వచియించెద నటంచు ♦ ననియె నిట్లు.

కం॥ మనవంటివారలెందరు, జనియించి మడసిరిట్ల ♦ జననాంతములం
గననిపదవి వెదకుటకై, మనము ప్రయత్నింపవలయు ♦ మహి నేయెడలన్. 230

సీ॥ నిఖిలార్థకారణు ♦ నిర్వాణనాథుం ద్రి, గుణశాలి నఖిల స ♦ ద్గుణగణాఢ్యు
సౌమ్యు శాంతాకారు ♦ సర్వలోకేశ్వరు, విజ్ఞానమయు శాస్త్ర ♦ వేదజలధి
నఖిలసాధునివాసు ♦ నద్భుతు సుగుణాకర, నిహితబోధాగ్ని ♦ నిత్యుఁ బూర్ణు
నతిదయాస్వాంతు స్వ ♦ యంప్రకాశు మహాత్ము, నతిధీరభావు స ♦ ర్వాంతరాత్ము

గీ॥ నిర్గుణాత్ము నిరంజను ♦ నిర్వికారు, నఖిలసాక్షిఁ బరాత్ము న ♦ వ్యక్తు నాద్యు
షడ్గుణైశ్వర్యసంపన్ను ♦ సరసిజాక్షుఁ, బరమభక్త్యాత్మలఁ దలంప ♦ వలయు నెపుడు. 231

—* ప్రహ్లాదుఁడు బాలురకు యాతాయాత జీవస్వరూపముం దెల్పుట. *—

సీ॥ జీవుండు పరమాత్మ ♦ శేషత్వైకరసుండు, జ్ఞానస్వరూపుండు ♦ జ్ఞానగుణుఁడు
నాత్మైకభోగ్యుండు ♦ నయ్యునాది క, ర్మాభిరూపాత్య వి ♦ ద్యాధిముకుళి
తగుణభూతజ్ఞానుఁ ♦ డగుచు నాత్మీయరూ, పపరమాత్మ స్వరూ ♦ పంబుల న్వి
చారింప నెఱుఁగమి ♦ సహజమోదవిముఖుం, డై యనాదినిజక ♦ ర్మానురూప

గీ॥ కప్రకృతిపరిణామవి ♦ గ్రహనిబద్ధుఁ, డగుచు బంధనతనువు ద ♦ న్నుగఁ దలంచి
యింద్రియాధీనచిత్తుఁడై ♦ యెసఁగు నిఖిల, విషయకాధీన సుఖుఁడునై ♦ వివిధగతుల.

సీ॥ వ్యాలదష్టునకు నిం ♦ బపలాశకంబులు, మధురంబులై తోఁచు ♦ మాడ్కిఁ గర్మ
బద్ధుఁడైనఁ దనకు ♦ స్వప్రకృతిపరిణా, మవిశేషములగు హే ♦ యవిషయములు
నతిశయభోగ్యంబు ♦ లై తోఁపఁగఁ దదను, భవబహులుబ్ధక ♦ స్వాంతుఁడగుచుఁ
గర్మంబుఁ జేయుచుఁ ♦ గాంక్షించి తత్ఫలం, బులయిన సుఖదుఃఖ ♦ ములసతంబుఁ

గీ॥ గాంచుచుం బూర్వవాసనా ♦ కారణమున, మఱల రుచిపుట్టి యుత్తరో ♦ త్తరముకర్మ
ము నొనరించుచు నుజ్జ్వల ♦ దనలతప్త, పాత్రసంసర్గకారణ ♦ వశమువలన. 233

గీ॥ అమృతమేయెడ నుష్ణభా ♦ వాదికముల, దొడరున ట్లచిత్సంసర్గ ♦ దోషమున న
వద్యదుఃఖాదినిలయమై ♦ వఱలు తద్వి, ధానమెట్లన వచియించె ♦ దన్వినుండు.

సీ॥ భూమిలోన ననాది ♦ పూర్వకర్మంబున, నఖిలభావంబులఁ ♦ యందుఁ దత్త
దమరమర్త్యాది రూ ♦ పముచే జరాయుజ, త్వమునుఁ బక్ష్యాదిరూ ♦ పమున నండ

జత్వంబుఁ గీటకా ♦ చరముఖాకృతులను,ద్విజభావంబు నుం ♦ బిదప నిఖల
యూకాదిశక్రిమి ♦ కాకృతి స్వేదజ, త్వముఁగాఁ జతుష్ప్రికా ♦ రములఁ బుట్టు
గీ॥ చుండు నిందలి నరభావ ♦ మొందుదక్క, నమరుదక్క నపుణ్య పా ♦ పాధికార
ధర్మసకలభావములఁ ద ♦ త్తత్ప్రయుక్త, కేవలసుఖదుఃఖములఁ ♦ గెరలికనుచు.

సీ॥ అతిపుణ్యపాప క ♦ ర్మాధికారంబైన, మానవత్వమునవి ♦ జ్ఞాననిలయ
బహిరంతరింద్రియ ♦ వ్యాపారరూపకం, బైన జాగ్రదవస్థ ♦ యందు జీవ
వర్తకద్వారకే ♦ శ్వరయత్న సంస్పృష్ట, విషయంబు లందుచు ♦ వివిధతదను
భవపరిశ్రాంతక ♦ బాహ్యేంద్రియ విరామ, భావరూపంబైన ♦ స్వప్నమందు
గీ॥ బొసఁగుఁదత్తత్సమయమాత్ర ♦ ములుసతంబు, నవనిఁదత్తత్సమనుష్యమా ♦ త్రానుభావ్య
ములుగఁ గేవలేశ్వరయత్న ♦ మిళితచిత్ర, విషయముల మిగుల ననుభ ♦ వించు చుండి.

సీ॥ తద్దశావిషయ వి ♦ స్తారానుభవవర్త, కబహుపరిశ్రాంత ♦ కప్రశస్త
బహిరంతరింద్రియో ♦ పరమరూపసుషుప్తి, దశలో ననంబుద్ధ ♦ త న్వహించి
బహిరంతరింద్రియ ♦ వ్యాప్తుల న్విడనాడి, విశ్రమస్థానమై ♦ వెలసినఁ బర
మాత్మయందుపరతుం ♦ డై విశ్రమించుచు, నాతనిచేఁ స్వస్థుఁ ♦ డగుచు మఱల
గీ॥ భోగములఁగాంచుకొఱకుం బ్ర ♦ బోధితుఁడయి, మేలుకాంచుచు నెపుడర్థ ♦ మృత్యభిప్ర
శూపమైనట్టి మూర్ఛలో ♦ నేఁపుఁజూప, నొప్పు జ్ఞప్తిసంకోచంబు ♦ నొందు చుండి.

సీ॥ ఉత్క్రాంతిరూపమై ♦ యొప్పునంతంబునఁ, గ్రమముగా బహిరింద్రి ♦ యములు నంత
రింద్రియంబున నంత ♦ రింద్రియంబసువుల, యందసువులుఁ దన ♦ యందుఁ దాను
భూతతన్మాత్రకం ♦ బులయందు నయ్యవి, పరమాత్మలోపలఁ ♦ బరిణమింప
నపుడు నిస్సంబోధుఁ ♦ డగుచు బాహ్యాభ్యంత, రంబులుమఱచి ని ♦ రంతరమున
నలరారుపరమబా ♦ హ్యాంతఃకరణభూత, తన్మాత్రసంయోగ ♦ ధర్మరూప
మైనట్టిసూక్ష్మదే ♦ హమునను త్క్రాంతుఁడై. స్వాంతకస్థానసం ♦ బంధమైన
నేకోత్తరశతనా ♦ డీకదంబానుల, త్యాజ్యైకనిర్గమ ♦ ద్వారమగుచు
గీ॥ దనరుమూర్ధన్యకధమని ♦ దక్క దక్క, నశతనాడీప్రధానాయ ♦ నముల వెంట
నేదియైనను నొక్కంట ♦ నెసగుచుండు, శ్రవణనేత్రాదికప్రదే ♦ శముల వెడలి. 238

సీ॥ కేవలపరమదు ♦ ష్కృతపరాయణుఁడేని, యాతనాతనుబద్ధుఁ ♦ డై నియమిత
పథమున న్సమవర్తి ♦ భటగణాకృష్టుఁడై, చని మహాఘోరత ♦ రనిరయంబు
లనుభవించినమీద ♦ ట నవశిష్టస్వక, ర్మాంతరవశముచే ♦ నవనిలోన
నప్పరబ్రహ్మ జా ♦ యస్వమియ స్వచ, యనుమనస్సంకల్ప ♦ మున పునఃపు
ఆ॥ వె॥ నర్నికృష్టజన్మ ♦ నాశంబు లందుచు, నిర్మలాతిపుణ్య ♦ కర్ముఁడేని
సూక్ష్మతనువుతోడ ♦ శోభిల్లుధూమాది, మార్గమునుగ నెపుడు ♦ నిర్గమించి. 239

సీ॥ పరమోత్తరోత్తర ♦ ప్రాపితుండగుచు స, క్రమమున ధూమరా ♦ త్ర్యపరపక్ష
దక్షిణాయనపితృ ♦ ధాత్ర్యంతరిక్షచం, ద్రస్థానముల కేగి ♦ తారకాధి
నాయకప్రాప్తిచే ♦ నవసుధామయదేహుఁ, డై హితంబునఁ దత్త ♦ దనుగుణసుకృ
తాధిభూములఁ దత్త ♦ దధిదేవతాభటుం, డగుచుఁ దత్తత్సమా ♦ నాధిభోగ

గీ॥ ములననుభవించిసుకృతాంత ♦ మునసతంబు, సమరుకర్మాంతరారంభ ♦ కమునఁదాను
మఱల నవరోహణాదిక్ర ♦ మమున సూక్ష్మ, దేహమునడిగ్గిశ్రీరమా ♦ధిపునినాజ్ఞ

సీ॥ సక్రమంబున వచ్చి ♦ చంద్రసమీరధూ, మాభ్రమేఘంబుల ♦ కరుగుదెంచి
వానిదంబుననుండి ♦ వర్షమైయోషధి, ప్రకరంబులంజెంది ♦ వానినుండి
యన్నంబునుం జేరి ♦ యటనుండిపురుషునిం, జెంది యప్పురుషుని ♦ యందుఁబరమ
రేతఃప్రకృతిగాఁ బ♦రిణమించి లలనోద, రముఁ జొచ్చి యందు గ♦ర్భమయిఁ బొదలి
క్రమ్మఱ జీవధ ♦ర్మంబునజన్మించు, సతతంబుని ట్టిసం ♦ సారవారి

గీ॥ నాయకావర్తగర్తంబు ♦ నందిరుగుచు, బాల్యకౌమారయౌవన ♦ ప్రముఖదశల
నొకటనైనను సౌఖ్యంబు ♦ నొందలేక, యన్నిట స్సర్వకష్టంబు ♦ లనుభవించు.

గీ॥ కాన నిటువంటిజన్మంబుఁ ♦ గాంచకేపుడు, మఱలఁ బుట్టనిచావని♦మార్గమునకు
పాయము నిల నన్వేషింప♦వలయు నందు, కై పథంబును జూపెదఁ ♦ గనుడటంచు.

—* భగవద్వర్ణనము. *—

సీ॥ కమనీయతిలసూన ♦ సమనాసికాభిరా,జితుఁడు బాలార్కకో♦టితులితమణి,
కుండలామలకాంతి ♦ మండితాతిమనోజ్ఞ, గండభాగాధ్యప ♦ కాశితుండు
లీలాలయవిపుల ♦ భూలతాశోభితుం, డమలేంద్రనీలతు ♦ ల్యాతిలలిత
కుంతలుం డసమాన ♦ కోమలారుణచారు, పాణిపంకజపరి ♦ భ్రాజితుండు

గీ॥ సుతులసీదళమాలికా ♦ శోభితుండు, మందహాసాభిభూషిత ♦ సుందరారు
ణాధరకిసలయుండు బా ♦ లార్కబింబ, సదృశమణిసముల్లసితవ ♦ క్షస్స్థలుండు.

సీ॥ అతిమనోహరపీవ ♦ రాంసుం డనంతమా, జులకాంతిపుంజసం ♦ శోభితుండు
గమనీయనవరత్న ♦ ఖచితకేయూరభా,సితబాహుదండుండు ♦ శ్రీకరుండు
విమలముక్తాహార ♦ సముదయోల్లసితుండు,గందర్పశతకోటి ♦ సుందరుండు
నీలధారాధర ♦ నిరసనాంగుండు వి,ష్వక్సేనగరుడాది ♦ సమధిపూజి

గీ॥ తుండు శంఖచక్రాలంకృ ♦ తుండుదుగ్ధ, వారినిధికన్యకారత్న ♦ వందితుండు
మహితకరుణాసముద్రుండు ♦ మహీధరాత్మ,జాధినాధాదివంద్యుండు♦ నై సతంబు.

—* ప్రహ్లాదుఁడు బాలురకు జీవాత్మ జన్మ రాహిత్యముం దెలుపుట. *—

సీ॥ అలరుశౌరికి నద్దె ♦ సల సమీపంబునఁ, బ్రథమావరణములో ♦ భవ్యులగుచుఁ
సరవి విష్ణుపురుష ♦ సత్యాచ్యుతానిరు, ద్ధులు విరాజిల్లుచుం ♦ దురటఁ దద్వా
రాట్స్వరూపాధిసం ♦ రాజితకేశవ, ముఖచతుర్వింశతి ♦ మూర్తిలోక
ములు ద్వితీయంబున ♦ నలరుమత్స్యాదిలోకములు రాజిలుఁదృతీ ♦ యమున నెపుడుఁ
గీ॥ దనరుచుండు విష్వక్సేన ♦ దంతిరాజ, వదనసత్యాచ్యుతాదిభు ♦ వనములుం జ
తుర్థమునఁ బంచమమునఁ జ ♦ తుష్షగమువి, హగకులపతిసావిత్ర్యాదు ♦ లలరుచుండు.
గీ॥ అలరు షష్ఠావరణమున ♦ నఖిలమాత్ర, మయభువనగణములు సప్త ♦ మమున నెపుడు
నష్టదిక్పాలకాదులు ♦ నధికశాశ్వ, తంబులై మంగళంబులై ♦ తనరుచుండు. 246
గీ॥ సకలకర్మంబులం బాసి ♦ సంతతంబుఁ, బరమహరిమూలమంత్రంబు ♦ భావమున జఁ
పించుచుం బరు హరి నుపా ♦ సించెడుమను, జుండుహరిసన్నిధిం జేరు ♦ సుస్థిరగతి. 247
సీ॥ మూఢాత్ము లజ్ఞాన ♦ మున ఘోరదుష్కర్మ, ములఁ జేసినను వారు ♦ తెలివిఁ గాంచి
వగుచుచు శ్రీరమా ♦ పతిని లోకాధీశు, ధ్యానించుచు న్దుష్కృ ♦ తంబుఁ దిరిగి
సేయకుండినచో సు ♦ శీలు రౌ వారికి, శాశ్వతపరలోక ♦ సౌఖ్య మబ్బు
దీని కెంతయును సం ♦ దియము లేదు నిజంబు, విష్ణుపావనతము ♦ విష్ణుభక్తి
గీ॥ ఘనసుకృతమున సేకూరు, ♦ గాన నట్టి, పరమపావను గోవిందుఁ ♦ బంకజాక్షు
భక్తవత్సలు శ్రీరమా ♦ పతి ననంతు, భవ్య మది నెంచఁగాఁదగు ♦ బాలులార.
సీ॥ ఉత్తమం బెయ్యది ♦ యో యయ్యదియె పర, బ్రహ్మం బదియు లోక ♦ పావనంబు
సత్యం బనంతంబు ♦ జ్ఞానస్వరూపంబు, నవ్యయం బాదిమ ♦ ధ్యాంతరహిత
మమలరూపంబు ని ♦ త్యము నిష్కళంకంబ, నామయం బనుపమా ♦ నం బఖండ
మానందమయము మ ♦ హాత్మకంబై యొప్పుఁ, దత్స్వరూపంబుతోఁ ♦ దనరు నప్ప
గీ॥ రమపురుషునిచే నెపుడుఁ బూ ♦ ర్ణమగు విశ్వ, మతని తేజంబుచే లోక ♦ వితతులుం బ్ర
కాశమానంబులగుచుండు ♦ గానవానిఁ, గొలిచి మోక్షంబుఁ జెందఁగా ♦ నలయుజనము.
క॥ ధరణిన్ శ్రీహరిసేవా, పరులు మనుజులఁ బుట్టరనుచుఁ ♦ బండితులెపుడున్
సరసీజనేత్రు మాధవు, హరి లోకాధిపు భజింతు ♦ రతిశయభక్తిన్. 250
గీ॥ అదియె జ్ఞానం బనంబడు ♦ నట్టిజ్ఞాను, లగు మహానుభావు లునిత్యు ♦ లనియు ముక్తు
లనియుఁ గేవలులు ముముక్షు ♦ లనియు బద్ధు, లనియు నైదువిధంబులై ♦ తనరుచుంద్రు.
సీ॥ ఇందు సంసారంబు ♦ నెఱుఁగక శ్రీహరి, ధ్యానాధిసక్తులై ♦ తనరువిహగ
నాయకవ్యాలాధి ♦ నాయకాదులు నిత్యు, లసమానమంత్రర ♦ హస్య మెఱిఁగి

ముక్తబాధనులై ప్ర ♦ పూజ్యు నారాయణుఁ, గమలాప్తు సేవించు♦ఘనులు ముక్తు
లాత్మానుభవముచే ♦ నానందముం జెందు, వారు కేవలు లనం♦బడుదు రెపుడు

గీ॥ మహితమోక్షార్థులై విష్ణు♦మంత్రముం జ, పించుఘనులు ముముక్షులై♦వెలయుచుందు
రిందు రెండువిధములు మ♦హిఁ దనుసంగ, మును సహింపనివా రార్తు♦లన బడుదురు.

క॥ యావజ్జీవంబును హరి, సేవానిరతులగు సుగుణ ♦ శీలురు తృప్తుల్
జీవించి తనుప్రీతిక్, భావాదికమోహపాశ ♦ బద్ధులు బద్ధుల్. 253

గీ॥ కాన నిట్టివైరాగ్యంబు ♦ గలిగి జనము, మఱలఁ బుట్టనిచావని ♦ మార్గమునకు
పాయముఁ దలంపఁగావలె♦హేయమోహ, పాశబద్ధసంసృతిఁ బాయ♦వలయు జగతి.

సీ॥ అసమానయోగని ♦ ష్ఠాధికారులకు భ, క్తులకు ముఖ్యప్రప ♦ న్నులకు నైన
నధికసుజ్ఞానుల ♦ కైనసత్కర్మని, ష్ఠులకైన మోక్షకా ♦ ములకు నైన
కామ్యకర్మనిషిద్ధ ♦ కర్మసంత్యాగంబు , కర్తవ్య మటుమీఁద ♦ గడఁగి స్వాశ్ర
మార్హంబుఁ గాఁగ జే♦యవలయు నిత్యక, ర్మంబు లెన్నఁడుఁ దప్ప♦రాదు లోక

గీ॥ మెట్టిపాపాత్ముఁడైన ల♦క్ష్మీశు నాత్మఁ, గొలిచినల్లైనఁ గల్యాణ ♦ లలితతత్త్వ
దమున కేగు నంచనుమాట♦తథ్యమని వ, చించెదరు బ్రహ్మవేత్తలు♦చిత్ప్రవరులు.

గీ॥ ఆగమంబులు ముక్త్యుపా♦యంబు లైద, టంచుఁ దెల్పుచునున్నవి♦యవియు జ్ఞాన
కర్మభక్తిప్రపత్తియో ♦ గంబులనఁ బ, రగినవి కలుషజాలహ ♦ రంబులగుచు.

సీ॥ శ్రీరమాపతికిఁ దా ♦ శేషభూతుఁడ నటం, చెఱిఁగి మానసమున♦ హృష్టుఁడగుట
జ్ఞానంబు సంధ్యాది ♦ సత్క్రియ లాచరించి, భగవదర్పణ మొన ♦ ర్పంగ దాని
కర్మమందురు రమా♦కాంతు శ్రీధరుఁ బరా, త్పరు నవ్యయు ననంతుఁ♦బంకజాక్షుఁ
జిత్తాంబుజంబునఁ ♦ జేర్చి సద్భక్తితో, ధ్యానించుటయె భక్తి ♦ యండ్రు విబుధు

గీ॥ లలప్రపత్తియు షడ్విధం♦బులుగఁ జెల్లఁగె, నందు నీలోకమంతయు ♦ నచ్యుతుతను
వనుచు సేవించుటయె నిర్మ♦లాత్మ నెపుడు, నానుకూల్య మనివచింతు♦రార్యవరులు.

సీ॥ కామ్యకర్మనిషిద్ధ ♦ కర్మంబుల నిరస్త, దురితభాగవతాది ♦ దూషణముల
సతతంబుఁ దెగడి ప్రా♦కృతమునం జేయుట, ప్రాతికూల్యము దాని♦బాయువలయు
నదియునుం బ్రాతికూ ♦ ల్యవిసర్జనమనంబ, డు జగదీశ్వరుఁడు నం ♦ బుజవిలోచ
నుండుఁ బాలించు న♦న్ను నితరంబులు శాశ్వ. తములు గావనుచుఁ జి♦త్తకమలమున

గీ॥ నరసి తలఁచుట విశ్వాస♦మండ్రు లోక, విభుఁడు నన్నుఁ గాచునటంచు♦విశ్వమయునిఁ
బ్రార్థనముసేయ రక్షక ♦ త్వమున కెలమి, హరివరించుటగోప్తృత్వ♦వరణమండ్రు.

గీ॥ ఆత్మరక్షణభారంబు ♦ నంబుజాక్షు, నందుఁ గావించి బహునిశ్చ♦లాత్ముఁ డగుచు
నాత్మఁ దల్లోకనాయకు ♦ నందె నిల్ప, నార్యులందరు దానిప ♦ న్యాసమండ్రు 259

గీ॥ బహుదరిద్రుఁడనను బుద్ధి • వర్గహీనుఁ, డగుచు దైన్యంబుచే మాధ • వాంఘ్రిసరసి
జముల నెంచుచుఁ జిత్తంబు • జమున నేమి, గోరమియె కృపణత్వంబు • ధీరులార.

గీ॥ కాంతికాంతిమంతుని రీతిఁ • గడఁగి తనకుఁ, గమలలోచనునకు విభా • గంబు లేక
సంతతంబు భజించుట • శాశ్వతమగు, యోగమందురు విద్వాంసు • లుచితఫణితి.

సీ॥ జగతిలో జంతుహిం • సావిహీనము ధర్మ, మర్థంబు సకలధా • న్యాదివస్తు
సంప్రాప్తిచే సర్వ • సౌఖ్యము గాంచుట, కామం బిహపరభో • గములఁ గనుట
స్వాత్మానుభవసుఖా • వాప్తిఁ దృప్తుండౌట, కైవల్య మదియె మో • క్షమని కొంద
అందురింక నిధిక ♦ న్యాయమనోనాథుప, దప్రాప్తిమార్గస ♦ త్క్రమము వినుఁడు
గీ॥ మొదట జీవుం డఖిలమార్గ•ములను దాటి, కడఁగి తుదకర్చిరాదిమా•ర్గమునఁ బోయి
భానుమండలముం జేరి• బ్రహ్మలోక, ముం బ్రవేశించి బ్రహ్మాండ•ము నటఁ గడచి.

సీ॥ హితబుద్ధి మూలప్ర • కృతిఁ బాసి చివరకు, విరజానదిని దాటి • తరుణుఁడన వి
శేషతేజఃప్రకా • శితుఁడై పరమపదం, బునకుం జని త్రిపాద్వి • భూతియందు
వఱల బ్రహ్మానంద • పదనివాసుండగు, శౌరినిం జేరి త • త్సామ్యమొంది
యుచట బ్రహ్మానంద • మనుభవించుచునుండు, నట్టివానికి జన్మ • మవని లేదు
గీ॥ కాన మీరెల్లరందుకై ♦ కమలనాభు, విశ్వమయు విష్ణు శ్రీరమా ♦ విభు ననంతు
నాది మధ్యాంతరహితున♦ బ్జాయతాక్షుఁ బరమపావనుమది నెంచ♦వలయు నెపుడు.

ఆ॥వె॥ ఈప్సితంబుల నిడు♦నిందొక్క యితిహాస, ము గలదదియుఁ బరమ♦మోక్షదంబు
నై చెలంగు దాని ♦ నాలించు డిఁక మీరు, బాలులార! చెప్పఁ♦బరగినాఁడ. 264

—* కోకిలీమాలినుల చరిత్రము *—

సీ॥ మాలినియనునట్టి ♦ మనుజుండు మున్ను శూ, ద్రకులంబులో దాన ♦ ధర్మదూష
కుండు దుష్టస్వభా ♦ వుండుఁ బాపాత్ముండుఁ, బరసతీలోలుండుఁ ♦ బరుషభాష
ణుండు సర్వప్రాణి ♦ మండలద్వేషణుం, డవని దేవధనాప ♦ హారణశీలుఁ
డతినికృష్టుండు దు ♦ ర్మతియుతుండుఁ గరుణా, హీనుండునై యుండ ♦ వానిఁ జూచి
గీ॥ బంధువర్గంబు రోసి కో♦పంబుఁ బూని, పోఁన డచిరంత వాఁడుగ్ర ♦ కాననమున
కరగి మృగములఁ జంపి త♦దామిషంబ, శనముగా నట భుజియించు♦చు నివసించె.

సీ॥ గహనాంతరమున నే ♦ కాకియై నివసించి, యీరీతి నాతఁడా ♦ హారమునకుఁ
దిరుగుచు నొక్కనా ♦ సరమున క్షుత్పిపా, సల దప్పి నీటికై ♦ సకలదిశల

రోసి పంకజరజో ♦ రూషితాంబుసరోవ,రము నొక్కటిం గాంచి ♦ రహినిఁదత్స
రసిలోఁ బ్రవేశించి ♦ రసబిసంబులఁదీసి, నోటితో నమలి యా ♦ నీటిలోన
గీ॥ మునిఁగి కడుపారఁ ద్రాగి ♦ తేఁపుచును వెడలి, తీరమునఁగొంతతడవు ని♦ద్రించివాఁడు
మృగపథంబులఁ జాడకై ♦ మెదలుచు నట,దాపుననొకజీర్ణరమేశు♦ధామముఁగని.

మ॥ అచటన్ వాసముఁ జేయఁ గోరి విధుపూ ♦ జాయత్తచిత్తంబునన్
శుచియై దానిని దారుపర్ణతృణసం ♦ స్తోమంబులం గూర్చి జం
తుచయంబున్ బరిమార్చి శుక్తి నిడుచున్ ♦ దోర్దండగర్వంబుతో
రుచిసంపూర్ణమతిం జెలంగె బహుధీ ♦ రుండాతఁడీవైఖరిన్. 267

సీ॥ ఒకనిషాదునినారి ♦ యుంకించి కోకిలి, యనునది పిదపఁ జె ♦ ల్వుని వధించి
వింధ్యాచలమునుండి ♦ విచ్చేసి విభునిగా,వానినిం జేపట్ట ♦ వాఁడు దానిఁ
గూడియుండె నిటులఁ ♦ గ్రూరులై వింశతి, వత్సరంబులు జంతు ♦ పలలభోజ
నులగుచు నచ్చోటఁ ♦ గలసి వారలు యథే,చ్ఛావిహారంబుల ♦ సంచరించు
గీ॥ చుండి యొకనాడు మధుమాంస ♦ ఖండభోజ,నముల మేనుల మఱచి యా♦
నలిననేత్రు, నాలయముముందు నిలిచి శ్రీ♦హరిహరియను, సద్వచనముల నాట్యం
బు ♦ సల్పునపుడు. 268

కం॥ కాలము సరిపోవుటచేఁ,గాలభటులు వచ్చి వారి ♦ కంఠంబులకున్
మేలగుపాశంబుల మదిఁ,జాలి న్విడనాడి వైచి ♦ సరగునఁ దిగువన్. 269

ఉ॥ ఆసమయంబునన్ జలరు ♦ హాయతలోచను లంచితాగమా
భ్యాసులు దివ్యగంధకన ♦ కాంబరమౌక్తికరత్నమాలికా
భాసిత విగ్రహు ల్వరమ ♦ పావను లంచితవిష్ణుమందిరా
వాసులు హాటకాంగదవి ♦ భాసితబాహులు సుందరాననుల్. 270

మ॥ జలదశ్యాములు భానుకోటిరుచిరా ♦ జత్కౌస్తుభాతిప్రభా
లలితోరస్కులు లోకపావనులు లీ ♦ లాశాలికేయూరకుం
డలకోటీరవిరాజమానులుఁ బరా ♦ నందు ల్విశుద్ధాత్మకుల్
తులసీదామయుతుల్ రమాధిపతి భ ♦ క్తుల్ శంఖచక్రాన్వితుల్. 271

గీ॥ అంబుజోదరప్రేరితు ♦ లై మణిమయ, మైనదివ్యవిమానంబు ♦ నతిరయమునఁ
గొని రమేశుపార్శ్వదులైనఁ♦గుముదముఖ్యు,లచటికేతెంచిరతిశయ♦రుచులుమీఱ.

గీ॥ వచ్చి సమవర్తిదూతలఁ ♦ బాఱదోలి, వారుదెచ్చితగిల్చినఁ ♦ బాశములనుఁ
గోసి సడలించి యికమోడ ♦ కుడనుచుఁ గరు, ణాత్ములై వెసవారల ♦ నాదరించి.

ఉ॥ వారలు ధర్మరాజభట ♦ వారములం గని యిట్లుఁ బల్కిరో
దారుణకర్ములార హరి ♦ దాసుల నిట్టుల ముట్టవచ్చునే
సారసనేత్రునామ మొక ♦ సారిఁ దలంచిన నాలకించినన్
గోరి పఠించిన న్నరునిఁ ♦ గూడునె పాపములీజగంబులన్. 274

ఉ॥ వీరలు జీవితాంతమున ♦ వెన్నుని మందిరచత్వరంబునం
జారునిజాంబరంబుల ధ్వ ♦ జంబుల నెత్తి మురారినామమున్
సారెకుఁ బాడి నృత్యముల ♦ సల్పిరి కావున విష్ణుసన్నిధిన్
జేరి వసింప నర్హులు వి ♦ శేషసుఖం బలరార నేయెడన్. 275

మ॥ జను లత్యుత్తమభక్తినైన నధిక ♦ జ్ఞానంబుచే నైన స
న్మనుజుల్మెచ్చుటకైనఁ గీరితికినై ♦ నం బ్రీతిచేనైనఁ బా
వను నారాయణు నంత్యకాలమున, సం ♦ భావించెనేని న్మహిన్
ఘనవైకుంఠపదంబుఁ జెందుదురు వీ ♦ కన్ సార్వకాలంబులన్. 276

క॥ పరమకుటిలుఁడైనను ని, ర్భరదారుణకర్ముఁడైనఁ ♦ బాపుండైనన్
హరినామ మొక్కసారిన్, స్మరియించిన ఘోరకలుష ♦ జాలం బణఁగున్. 277

ఆ॥ వె॥ నిమిషకాలమైన ♦ నిమిషార్ధమైనను, విమలబుద్ధి నాత్మ ♦ విశ్వమయునిఁ
దలఁచెనేని ఘోర ♦ కలుషజాల మణంగుఁ, దరణికరవినిహత ♦ తమము పగిది.

కం॥ నరుఁడు హరిమందిరంబున, నరనిమిషంబుండెనేని ♦ హరిగతిఁ జెందున్
నిరతంబున్ హరిఁ దలఁచెడు, నరులఫలముఁ జెప్పఁదరమె ♦ నాగేశునకున్. 279

ఉ॥ కావున నీవధూవరులు ♦ గౌరవనీయ లుదారభక్తితో
శ్రీవిభుజీర్ణగేహము ర ♦ చించి తదాలయచత్వరంబునన్
సేవకులై సతంబు నిన ♦ సించుచు దివ్వెల బెట్టుటం గదా
పావనులైరి విశ్వపతి ♦ పాదసమాశ్రయపాత్రు లెంచినన్. 280

గీ॥ ఇదియునుంగాక యీపుణ్యు ♦ లెలమి నిజపటముల ధ్వజములరచియించి ♦ కమలనేత్రు
విం దలఁచి పాడుచుం జారు ♦ నృత్యములను, సల్పిరి సదా విధుని మోల ♦ సద్విధముల.

కం॥ నరుఁ డెవ్వఁడైన ధరణిన్, మరణసమయమున ముకుందు ♦ మదిలో భక్తిన్
స్మరియించియైన వీనులఁ, బరు నాకర్ణించియైనఁ ♦ బరముం బడయున్ 282

కం॥ అని వారలపరితాపం, బు నణఁచి వచ్చినవిమాన ♦ మున మోదముతో
నునుచికొని శీఘ్రగతులన్, వనజాక్షుని కడకుఁ జనిరి ♦ వారయ్యెడలన్. 283

క౦॥ దారుణకర్ముం డైనం, గ్రూరాత్ముం డైన మిగులఁ ♦ గూరిమితో శ్రీ
నారాయణు మదిఁదలఁచిన, వారలకుం బుణ్యపరమ ♦ పదము లభించున్. 284

ఉ॥ బాలకులార! మీరు మన ♦ వారలు నీజగతిన్ జనించుచున్
గూలుచు నుంటఁ జూచితిరె ♦ కూడున యిట్టిపథంబు కాన నీ
లీల రమాధినాయకుఁ ద ♦ లింపనిభక్తిఁ దలంచి పుట్టుటం
గూలుట లేనిమార్గమున ♦ కుం దగుయత్నము సేయఁగావలెన్. 285

గీ॥ అట్టిమార్గంబుఁ జేరుట ♦ కంబుజాక్షు,సుందరామలపాదార ♦ విందచింత
నానిరర్గళదీపంబు ♦ లేని వాఁడుఁ, బుట్టి గిట్టుచు నుండడె ♦ భూరిగతుల. 286

ఉ॥ కావున మీరలే మొదలఁ ♦ గంజదళాయతలోచనున్ జగ
త్పావను సర్వలోకపరి ♦ పాలకుఁ బావనదుగ్ధవార్ధిక
న్యావిభు సుందరాంగు సుగు ♦ ణాలయు సత్కరుణారసాంబుధిన్
ధీవరునిం దలంచు డతి ♦ దివ్యవినిర్మలమానసంబులన్. 287

మ॥ పరుఁడంచున్ ఖగచారుఁడంచుఁ ద్రిజగ ♦ త్పాలుండటంచున్ మహే
శ్వరుఁడంచున్ నిగమాంతవేద్యుఁడనుచున్ ♦ సర్వేశ్వరుండంచు నే
హరి నీరీతిఁ దలంతురో చెలిమితో ♦ నాశౌరి విశ్వాత్ము శ్రీ
ధరు నారాయణు మీరలెంచుడి భవ ♦ త్స్వాంతాంబుజాతంబులన్. 288

మ॥ సరసీజాక్షు ముకుందు నీపగిఁది సం ♦ శ్లాఘించుపుణ్యాత్ము లి
ద్ధరణిన్ నిస్తులభోగభాగ్యయుతులై ♦ తామంత్యకాలంబునన్
బరఁగి త్యోత్తమమోక్షముం బడసి త ♦ ద్వైకుంఠు సేవించుచున్
స్థిరులై యుందురు వారలు న్మఱలఁ బృ ♦ థ్విం బుట్ట రేనాటికిన్. 2:9

మ॥ అనియీరీతి వచించి వారలకుఁ బ్ర ♦ హ్లాదుండు మోదంబుతో
ఘనవేదాగమగూఢతత్త్వముల వ ♦ క్కాణించి మోక్షాదిము
ఖ్యనయార్గంబుల వెల్లడించి తుదకుం ♦ గావించె లోకాతిపా
వననారాయణభక్తిపూర్ణవిమల ♦ స్వాంతాబ్జుల న్వారలన్. 290

మ॥ అమలాబ్జోదరపాదపద్మమధుర ♦ ధ్యానామృతాస్వాదన
త్వమునన్ విస్మృతదేహులై పిదప దై ♦ త్యత్వంబుఁబోనాడి స
ద్విమలస్వాంతములం దదర్భకులు గో ♦ విందస్మృతిం జేయుచుం
బ్రమదాంభోనిధిలో మునింగి రచటం ♦ బ్రహ్లాదవిద్యార్థులై. 291

మ॥ పిదపన్ భార్గవసూనుఁ డేగి విబుధ ♦ ద్విణ్ణాథు వీక్షించి దు
ర్మదుఁడై నీసుతుఁ డాశరార్భకుల క ♦ స్మన్నీతుల న్బాపిన

త్వదయాస్వాంతమునం జెలంగి కడు మో ♦ హాయత్తులం జేసె ని
ష్యది మోసంబగుఁ జక్కఁబెట్టఁదగు ను ♦ ద్యత్త్వత్ప్రతాపంబునన్. 292

కం॥ అనిపల్కువానిమాటలు, విని దనుజాధీశ్వరుండు ♦ విగతధిషణుఁడై
గినిసి నిజసూనుఁ గని తా, నను నిట్టుల వానితోడ ♦ నాసమయమునన్. 293

శా॥ ఆచార్యోక్తుల మాన్పి బాలకుల మో ♦ హాధీనులం జేసి దు
ర్వాచాటుల్ బహుదుష్టు నీచు దనుజ ♦ ప్రత్యర్థిఁ గీర్తించి దై
త్యాచారంబులఁ బాడుఁజేసితివి నీ ♦ చాత్మ న్నినుం జంపి వం
శాచారంబుల నిష్కలంకములగా ♦ యత్నించి కావించెదన్. 294

గీ॥ బలిమితో సర్వనిర్జ రే ♦ శ్వరుల ఘనబ, లుల జయించితి వారలు ♦ లొంగిలొంగి
నన్ను నెపుడు సేవింతురు ♦ నిన్నుఁగాచు, టకిఁక దిక్కెవ్వఁడుండె వె ♦ దకి తెలుపుము.

క॥ అనియిట్లుఁ బల్కు బాలుఁడు, జనకున కిట్లనియె సర్వ ♦ జగముల కెవఁడున్
జనకుండై తగనోయ, వ్వనజాక్షుఁడె నాకు దిక్కు ♦ భావింపనెదన్. 296

మ॥ అనిపల్క న్నిజసూను దైత్యవిభుఁడ ♦ త్యంతాగ్రహోపేతుఁడై
కని శ్రీకాంతుఁడె నాకుదిక్కనుచు వ ♦ క్కాణించి తీ వట్టివా
నిని నే ము న్వదకించితిన్ భటులచే ♦ నిస్సారుఁడై చిక్కఁడా
యె నతం డీజగతిన్ నటింపఁ డిక వే ♦ ఱెందుండునో తెల్పుమా. 297

సీ॥ అనిన నాతనికి వం ♦ దనముఁ గావించి యా, హరికింకరుం డిట్లు ♦ లని వచించెఁ
గలఁడు సాగరములఁ ♦ గలఁడు గాలిఁ గలండు, గగనంబున ధరిత్రిఁ ♦ గలఁడుదిశలఁ
గలఁడు నీహారాంశు ♦ ఖరమయూఖాదులఁ, గలఁడు వహ్నిఁ బగళ్లఁ ♦ గలఁడు నిశలఁ
గలఁడు భూతశ్రేణిఁ ♦ గలఁ డరణ్యాదులఁ, గలఁ డంతటం ద్రిమూ ♦ ర్తులఁగలండు
గీ॥ ఘననిగమముల నోంకార ♦ మునఁ గలండు, కాన నీశ్వరుఁ డిచ్చటఁ ♦ గలఁడు లేడ
చట ననెడుచిత్తము వలదా ♦ చక్రధరుఁ డె, చట నెచటఁజూడనచట నం ♦ చటఁగలండు.

మ॥ అనియీరీతి వచింప బాలకుఁడు రో ♦ షావిష్టచేతస్కుఁడై
దనుజుం డెచ్చటలేడటంచు తనయుం ♦ దర్జింప నా చక్రి వా
నిసిఁ జంప న్నరసింహరూపమున త్రో ♦ శం బ్రాణిభూతాదిగ
ర్భనికాయంబులనుండె నీశ్వరముఖా ♦ వార్యప్రతాపంబునన్. 299

క॥ అటుమీఁదటఁ బుత్త్రుం గని, పటురోషంబున నతండు ♦ బాలక విను మం
తట నాతఁ డుండునంటివె, యిటఁ జూపించెదవె వాని ♦ నీస్తంభమునన్. 300

మ॥ అని యీరీతివచించువాని కనెఁ బ్ర ♦ హ్లాదుండు సర్వాత్ముఁడై
తనరుం ధీరుఁడు భక్తవత్సలుఁడు నీ ♦ స్తంభంబునన్ లేడె చూ

డనఁగ౯ నీకనుమానమున్నలదు వే ♦ డ్క న్నేఁడుగాన్పించునా
వనజాక్షుండు విశేషకాంతియుతుఁడై ♦ ప్రత్యక్షరూపంబున౯. 301

మ॥ అన న బ్బాలుని ధిక్కరించి కడు దై ♦ త్యాధీశ్వరుం డంతట౯
ఘనఘోర ప్రతిఘాశుశుక్షణిశిఖా ♦ కాండంబు దీపింపఁగాఁ
దనచే ఖడ్గముతోడ వ్రేసె నధికో ♦ దగ్రప్రభోద్దామము౯
జననేత్రాధికభీమము౯ హరిజను ♦ స్సంరంభము౯ స్తంభము౯. 302

—* నరసింహావతారావిర్భవము. *—

సీ॥ సంఫుల్లసరసీజ ♦ సంకాశకోదండ,హలచక్రమీనరే ♦ ఖాంకితాంఘ్రి
తలముల న్విమలదు ♦ గ్ధపయోధిసంజాత,శుండాలశుండాతి ♦ సుందరప్ర
కాండాతిదీర్ఘప్ర ♦ చండకోరుస్తంభ,యుగళంబుతో మణీం ♦ ద్రగణఖచిత
బహుచారుమేఖలా ♦ వలయవేష్టితహేమ,పటశోభితోత్తమ ♦ కటితలమునఁ
గీ॥ బరమసురనిమ్నగావర్త ♦ వర్తులాంబు,జాకరగభీరనాభిని ♦ హరమునఁ దను
ముష్టిపరిమేయమధ్యమం ♦ బున గిరిస్ను, సదృశకఠినవిశాలవ ♦ క్షస్థలమున.
గీ॥ దనుజధైర్యలతాలవి ♦ త్రాయమాణ, దానవోరస్స్థలక్షేత్ర ♦ దళనఖరహ
లాయమానస్వభక్తాక్షి ♦ లఘుచకోర, చంద్రరేఖాయమాణతీ ♦ క్ష్ణనఖరముల.
గీ॥ శంఖచక్రగదాఖడ్గ ♦ శార్ఙ్గవిలసి, తాష్టభుజముల మౌక్తిక ♦ హారరత్న
ఖచితమంజీరకేయూర ♦ కంకణమకు, టమణికుండలయుగభూష ♦ ణముల నవుడు.

మ॥ ఖరకేశప్రథితాష్టబాహువులతో ♦ గంభీరరౌద్రంబుతో
వరదాత్రక్రకచోగ్రదంతనఖర ♦ వ్రాతంబుతో నయ్యెడ౯
నరసింహాకృతిఁ దాల్చి నీవె దనుజు౯ ♦ నాశంబుఁ గావించి స
ద్వరుఁ బ్రహ్లాదు సుధీరు గాచితిగదా ♦ స్వర్గాదిలోకంబుల౯. 306

మ॥ అతినిర్వక్రపరాక్రమోజ్జ్వలితబా ♦ హాదండగంభీరులై
క్రతుభుక్కిన్నరసిద్ధసాధ్యగరుడ ♦ వ్రాతంబు బాధించుదు
ర్మతులై రావణకుంభకర్ణులగుచు౯ ♦ క్ష్మామండలి న్వారె స
మ్మతిగాఁ గైకసికిం జనించిరి తలం ♦ ప౯ మీఁదట౯ రాఘవా. 307

ఉ॥ వారల దుష్టచిత్తుల న ♦ వార్యబలాఢ్యుల నీవె యీనరా
కారముఁ దాల్చి కూల్చితివి ♦ కాదె వచింపఁగ నేల మీద నీ
వీరవరేణ్యు లిట్లు పృథి ♦ వి౯ శిశుపాలకదంతవక్త్రులై
వైరముఁ బూని నీయెడల ♦ వర్తిలుచుందురు రాఘవేశ్వరా. 308

కం॥ ధరణిం గృష్ణుఁడవై నీ,వె రహిం జనించి కెడపెదవు ♦ భీత్యాకార
స్ఫురణులఁ గిన్నరసురముఖ,పరులన్ శిశుపాలదంత ♦ వక్త్రులఁ బిదపన్. 309
కం॥ అనికుంభసంభవుఁడు రా, మున కీపగిది న్వచించి ♦ మునివర్యులతోఁ
జనిరోఁ బిదప సంధ్యావం,దనసమయమటంచు రామ ♦ నాయకునాజ్ఞన్ 310
గీ॥ ఇవ్విధంబున సూర్యవం ♦ శేశ్వరుండు,కలశజుండువచించిన ♦ గాథలెల్ల
నాలకించి శ్రద్ధాతిపూ ♦ ర్ణాత్మ వానిఁ,బంచి నాటికిఁ గొల్వుసా ♦ లించె నపుడు.

—* ఆశ్వాసాంతము *—

మాలిని॥ పరమకనకచేలా ♦ వార్ధికన్యాధిలోలా
పరమపదవిహారా ♦ వైనతేయాధిచారా
నిరుపమజయకీర్తీ ♦ నిర్భరానందమూర్తీ
సరసిజసదృశాక్షా ♦ సర్వలోకైకరక్షా. 312
మాలిని॥ అకలుషగుణజాలా ♦ యాహవోత్సాహలీలా
సుకవినుతచరిత్రా ♦ సుందరాసంగగాత్రా
ప్రకటదనుజహారీ ♦ భక్తహృత్కంజచారీ
సకలభువనపాలా ♦ సత్యభామాధిలోలా. 313
మాలిని॥ ఖలనికరవిదారీ ♦ కల్మషౌఘాపహారీ
సలలితమణిహారా ♦ సాధుపీడాపహారా
కలితజలదగాత్రా ♦ కంధికన్యాకళత్రా
జలజసదృశనేత్రా ♦ శంబరామిత్రపుత్త్రా. 314

—* గద్యము *—

ఇదిశ్రీనారాయణకరుణాప్రసాదలబ్ధచతుర్విధకవిత్వచాతుర్యశతావధా
నీత్యాదిబిరుదాంకితరత్నాకరవంశపయఃపారావారరాకా
సుధాకరగౌతమగోత్రోద్భవరంగాచార్యపుత్త్ర
రాజమాంబావధూటికాగర్భశుక్తిముక్తా
ఫలానంతార్యకవిప్రణీతంబగునిర్వ
చనకుశలవాభ్యుదయమహా
కావ్యంబునఁబ్రథమా
శ్వాసముసంపూ
ర్ణము.

శ్రీ * శ్రీ * శ్రీ * శ్రీ * శ్రీ

శ్రీ ర స్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# నిర్వచన కుశలవాభ్యుదయము

## ద్వితీయాశ్వాసము.




లలనామణినిటలత, టీలలితమృగమదసంఘ ♦ టితనిర్మలరే
ఖాలంకృతసుకపోల, శ్రీలక్ష్మీరాజితాస్య ♦ శ్రీహరినాథా.

గీ॥ అవధరింపుము రామచం ♦ ద్రావనీశుఁ, డిటులసకలవైభవముల ♦ నెసగుచుం బ్ర
జలదయారసమొప్పఁబు♦త్త్రులవిధమున, నరయుచును రాజ్యమేలున♦య్యవసరమున.

—* వసంతకాల వర్ణనము. *—

ఉ॥ భాసిలెఁ జైత్రమాసము వి ♦ భాస్వరనూతనశోణపల్లవా
వాసము లోకజైత్రసుమ ♦ బాణమహోజ్వలఘోరకింశుక
ప్రాసము సాలసంతతిని ♦ వాసిపికాదివిహంగనిస్వనా
వాసము మల్లికాదిసుమ ♦ వారమనోహరగంధవాసమై. 3

ఉ॥ సంతసిలన్ జనంబులు వ ♦ సంతము భాసిలెఁ గాంతిమంతమై
కాంతనితాంతకాంతియుత ♦ కామ్యలతాలయసుప్తవారణో
ద్వాంతకదానగంధహర ♦ బంభరడింభకులాంగనాగణా
త్యంతకలక్వణాభియుత♦ మై సతతాంతలతాంతకుంతమై. 4

చ॥ లసదమలామ్రపల్లవము ♦ లం దిని కూయుపికాంగనాసమా
నసరససారపంచమని ♦ నాదములన్ విని సోలి యింపునన్

మసలుచు మందమందగమ ♦ నంబుల నిప్పటికిన్ జగంబులన్
శ్వసనుఁడు గాంచె మందగమ ♦ నత్వము నమ్మృగమానసంగతిన్. 5

సీ॥ లలితకాననలక్ష్మికి ♦ కలరు మాధవునిపై, రహిఁగల్గు రాగాంకు ♦ రములనంగ
లీలానిలయసాల ♦ జాలంబులు ధరించు, రమణీయశోణాంబ ♦ రములనంగఁ
ద్రిజగంబులం గెల్వఁ ♦ దివిరి కాముఁడు దాల్చు, నవమోహనాదిబా ♦ ణములనంగఁ
గాననాంతరములఁ ♦ గ్రాలుదావాగ్నిజా, జ్వలమానజ్వాల ♦ చయములనఁగఁ
గీ॥ గలితలతికాంగనామణుల్ ♦ గట్టినట్టి, వలిపచెంగావిజిల్గుపా ♦ వడలనంగ
నలరుబోఁడుల కరచర ♦ ణాధరములఁ, దెగడి రాజిల్లుచున్నవి ♦ చిగురులపుడు. 6

చ॥ కలితలతాంగనామణులు ♦ కామునితోఁ సుమకాలకాంతునిం
గలసి శలాటుసంతతులఁ ♦ గన్నవి గర్భిణులట్ల నయ్యెడన్
లలితగుళుచ్ఛకస్తనము ♦ లం దెలిచాయలతోఁ జెలంగు ని
ర్మలమకరందదుగ్ధములు ♦ రాజిల భూరివిలాసశాలలై. 7

చ॥ ఘనతరచైత్రకాలముల ♦ గంధలసద్వనదేవతాంగనా
ననతిలకాయమానహిమ ♦ నాగలతాంతములన్ వసించి కా
మునికి శరాసమై విరహి ♦ మోహములం బురడింపఁజేసి యొ
ప్పె నలికులంబు గానములఁ ♦ బేరిమితో రచియించుచున్ గడున్. 8

కం॥ అలమాధవీమధురరస, ములఁ గ్రోలి మదించిమిగుల ♦ మురువుననళినీ
కులము మధురగానంబుల, సలుపుచు రాజిల్లెఁ బాంథ ♦ జాలం బడలన్. 9

కం॥ వనజాక్షికుచజితస్తబ, కనమితనవవల్లి సకల ♦ కాంతామణులన్
గినిసి జయించుటకై కా, మునికిచ్చె నిజప్రసూన ♦ ముల సంప్రీతిన్. 10

కం॥ పికములకోలాహలములు, శుకములకలకలరవములు ♦ సుందరకేకి
ప్రకరమధురనాదము లళి, నికరక్వాణంబు లపుడు ♦ నెగడె న్మిగులన్. 11

సీ॥ ముద్దుకెంజిగురాకు ♦ మోవితియ్యనిపాన, కములఁ గ్రోలుచు నికుం ♦ జములఁ గామ
లీలాతిశయముల ♦ సోలి నిద్రించెడుఁ, గామినీకాముక ♦ స్తోమకులని
లయమై మనోజ్ఞంబు ♦ లం బాసి సిగ్గుల, వలపుతో రతిబంధ ♦ ములఁ బెనంగి
మురిపెంపువిరులపా ♦ న్పులమెలంగువిలాసి, నీవిలాసులకెల్ల ♦ నిలయ మగుచు
గీ॥ వెలుఁగుపండువెన్నెలలలో ♦ వలపుమీఱఁ, దాళలేకయె మల్లికా ♦ తల్పముల మె
లంగునాయికానాయకు ♦ లకుఁ గులాల, యంబగుచు మీఱె చైత్రకా ♦ లంబు చెలఁగ.

సీ॥ రామాయణముఁబోలె ♦ శ్రీమేదినీజాభి, రామమై హరికుమా ♦ రకశిలీము
ఖాసనంబై శ్రీమ ♦ హాభారతము పోల్కి, నామోదితసుమన ♦ స్స్తోమరాజి
తంబై సురేంద్రప ♦ త్తనము వైఖరి ఫల, పాకసౌభాగ్యసం ♦ పన్నశుకల
లితభావణాభిరా ♦ జితమైమహాభాగ, వతముకై వడిఁగుంద ♦ వర్ధమాన
గీ॥ మై విలాసిధనపతిగే ♦ హంబు రీతి, నధికకమలాధిశోభిత ♦ మై ముకుంద
మందిరముమాడ్కి విలసిల్లె ♦ మహితకీర్తిఁ, గాంచి పూజ్యమంజులచైత్ర ♦ కాల మవని.

సీ॥ వాసంతికాక్రాంత ♦ వకుళమాలాంతర, గతలతానిష్క్రాంత ♦ గంధబంధు
రమలయానిలకిశో ♦ రవిహారములు సాంద్ర, తమతమాలతమోవి ♦ తతిహరణచ
ణఖరాంశుఖరకిర ♦ ణాయమానాశోక, కుసుమాంతరప్రవి ♦ లసదమలమ
ధురరసాసవలోల్య ♦ చరదళిశ్రేణికా, ఝుంకారములు నికుం ♦ జనిలయంబు
గీ॥ లఖిలశుకశారికాదివి ♦ హగకిశోర, సముదయోద్దామకోలాహ ♦ లములుఁ గలిగి
విరహిణులకెల్ల వైరమై ♦ పరగె ధాత్రిఁ, గామునకుసాయమై చైత్ర ♦ కాలమెలమి.

సీ॥ సూతికారత్నంబు ♦ రీతి నూతనవిలా, సములఁ గల్యాణప్ర ♦ సవవిభవము
నఁ జెలంగి లలితకాం ♦ డంబునుం బోలె నూ, తనపత్రశాలియై ♦ కనకరాజి
తంబై నిధానంబు ♦ నుం బోలెఁ బరమగా, యత్రీజపాసక్త ♦ మై ద్విజాతి
మండలంబుం బోలె ♦ మాధవాలంకృత, మై నందకముఁబోలె ♦ నధికమన్మ
గీ॥ థాంచితంబయ్యె నీలకం ♦ ఠాధిలసిత, మై పలాశాభిశోభిత ♦ మై ప్రవేక
దేవవల్లభయుతమయ్యెఁ ♦ దేజరిల్లె, సరసలీలానిలయమైన ♦ సంత మవని. 15

సీ॥ సాలంబుల జనించి ♦ సరసిజాకరములఁ, గాన్పించుతారకా ♦ గణములనఁగ
వనమహాఖనిఁ బుట్టి ♦ యొనలేసిలీలల, రాజిల్లువిమలవ ♦ జ్రములనంగ
మల్లికాలతికామ ♦ తల్లిచైత్రగతిచే, రహిఁ గాంచుపులకాంకు ♦ రము లనంగ
వారాశిలోఁ బుట్టి ♦ వాసిఁగాంచిరుచుల, రాజిల్లుపటికంపు ♦ రాలనంగ
గీ॥ లలితవనదేవతాంఘ్రిప ♦ ల్లవయుగములఁ, గాంతులఁజెలంగు సితనఖ ♦ గణములనఁగఁ
గడువిలాసముల వహించి ♦ కలితకోర, కనికురంబములయ్యెడఁ ♦ గ్రాలుచుండె.

క॥ లలితుఁడు దూరగతుఁడగుటఁ, గలితవసంతోత్సవములు ♦ గతములటంచుం
బలుకుచు బంధూదితవా, ర్తల విని యొకచెలి సుఖించెఁ ♦ దత్కాలమునన్. 17
గీ॥ అట్టితఱి రామభూపాలుఁ ♦ డవనిపుత్రి, సఖులతోఁగూడి తోఁటలో ♦ సంచరింపఁ
జనఁగ నాసతితోఁ గూడి ♦ స్వాంతకమున, బ్రీతిమీఱంగఁ దా విహ ♦ రింపవెడలె.
సీ॥ అతిచారునిటలవి ♦ న్యస్తకస్తూరికా, తిలకంబు వదనాబ్జ ♦ దీప్తిఁ జెలుప
మకుటభూషితవజ్ర ♦ మణిరుచుల్ జనులకు, మల్లెలట్లధికకా ♦ మంబుఁగొల్ప

నాస్యభాస్వరమంద • హాసాచ్ఛరుచులుఁజూ, పఱకు వెన్నెలలట్ల • వలపుఁగొల్ప
వనమాలికాదులుఁ • గనుమానవులకు హృ, త్కమలోపగతసద్గు • ణములఁదెలుప
గీ॥ నతిమనోహరహేమచే • లాంచలంబు, లనుపమానాతితుంగాంజ • నాచలమున
వఱలుబాలారుణాతప • ప్రభలఁద్రోయ, రాముఁడత్తరి నయనాభి • రాముఁడయ్యె.
క॥ ఒకచోఁగాయకపరిహా, సకవైతాళికనటభట • చతురకవికదం
బకములు సేవింపఁగఁదీ, ప్రకరాన్వయుఁడుఁబురోప • వనమునకపుడున్. 20
మ॥ పురకాంతామణు లాత్మరూపవిభవం • బు ల్మీఱ రాగంబుతో
నరయన్ మంజులమందమారుతశతాం•గా రూఢుఁడై చైత్రునిన్
స్మరుఁడుం జూచుట కేగుచుండెనని సం • భావించుచుం జూడఁ బు
ష్పరథంబెక్కి రఘూత్తముం డరిగె హ • ర్షంబుబ్బ బూఁదోఁటకున్. 21

## —* ఉద్యానవనవర్ణనము. *—

సీ॥ ఏలాలతాజాల • డోలాచరత్కీర, బాలాస్ఫుటాలాప • లాలితంబు
సారాబ్జమాలావి • హారాతికామాళి, నీరామనిక్వాణ • పూరితంబు
మల్లీలతాకుంద • వల్లీకుటజనాగ, వల్లీమతల్లీప్ర • వేల్లితంబు
శ్రీమాలతీవల్ల • రీమాగధీమంజ, రీమాధవీలతా • కామితంబు
గీ॥ మానసీయపికశ్రేణి • కానినాద, రూపవనదేవతాగాన • దీపితంబు
సకలరాజాధిరాజసం • చారయోగ్య, మై విరాజిల్లెఁదత్కేళి • కావనంబు. 22
సీ॥ విరిమల్లెబోదెపం • దిరులసౌరులు మీఱఁ, జామంతు లతివిలా • సంబుఁజూపఁ
గమనీయగంధంబుఁ • గాంచివైభవముతో, మల్లికాసూనంబు • లుల్లసిల్ల
వెలలేనితళుక్కుబె • ళుక్కులఁ దాలుచు గులాబి, పువ్వు లింపగు తావి • నివ్వటిల్ల
నవకాంచనప్రసూ • నములు సంశోభిల్లఁ దాంబూలికాలతా • తతులుమీఱ
గీ॥ సన్నవిరజాజు లతివిలా • సంబునెఱప, మొల్లగొజ్జఁగిగిరిమల్లె • లుల్లసిల్ల
లలితమధురఫలంబులు • నలరనెపుడుఁ, గేలికావన మతిశయ • కీర్తిఁగాంచె.

## —* రాముఁడుద్యానవనముం బ్రవేశించుట. *—

కం॥ అతిమోదాంబుధిఁదేలుచుఁ,జతురత్వముమెఱయ రామ • చంద్రుఁడు సుమరా
జితకేలీవనమునకున్,సతితో విహరింపఁజనిన,సమయమున నటన్. 24
సీ॥ రాజీవసంచారి • రాజహంసాళిప,క్షాంచలక్షీర మ • ర్ఘ్యంబు గాఁగ
నుద్యల్లతాపరి • చ్యుతమల్లికాదిపు,ష్పకదంబకములు గా • నుకలు గాఁగఁ

డేఁటిరాయిడి సన్ని ♦ ధిం జాజులలితసూ,నరజంబు తావిగం ♦ దవొడి గాఁగ
బవమానచలితరం ♦ భాపలాశఁబులు,రమణీయతాళవృం ♦ తములు గాఁగ
గీ॥ లలితశుకపికశారికా ♦ కలకలంబు,పరమవైతాళికాగ ♦ స్తవంబు గాఁగ
నలరునుద్యానవనలక్ష్మి ♦ యారఘుపతిఁ,బూజఁగావించువైఖరిఁ ♦ బొలె నపుడు.

—* మలయానిలవర్ణనము *—

చ॥ ఘనసుమనోరజంబనెడు ♦ గందవొడిం గడుఁబైనచల్లుచున్
జననుతభృంగఝంకృతుల ♦ సన్నుతిఁ జేయుచు సన్మరందబిం
దునికరమోదబాష్పముల ♦ తోడ నెదుర్కొనెఁ బ్రీతిఁజూపఁ జ
య్యనఁ బవనార్భకుం డవని ♦ జాధిపమానస ముల్లసిల్లఁగన్. 26

మ॥ సురతాంతశ్రమయుక్తలీలలితవ ♦ క్షోజాచలాగ్రీయపా
ర్శ్వరసాన్యస్తశిరశ్శయాళుతరుణ ♦ వ్రాతంబు మేల్కొల్పుచున్
పరరాజత్కమలాటవీచరసుగం ♦ ధవ్యాప్తసర్వాంగుఁడై
పరగెన్ మందసమీరణుండు మలయ ♦ వ్యాయామకోద్దాముఁడై. 27

మ॥ సురతాంతాధికతాంతమూర్తితరుణీ ♦ స్తోమస్తనాద్రి స్థలాం
తరవాంతశ్రమవారిపూరకణసం ♦ తానప్రహారుండు ని
ర్ఝరకుంభీంద్రఘటీనటత్కచతటీ ♦ పాటీరసత్సౌరభా
కరమందానిలుఁడొప్పె నెల్లెడల శ్రీం ♦ గారప్రచారంబులన్. 28

స్రగ్ధర॥ బాళిం జూతాగ్రశాఖా ♦ పటలవలయిత ♦ స్ఫారమల్లీప్రపల్లీ
పాళీపుష్పప్రపధూళీ ♦ పరిమిళితహరి ♦ ద్వారమధ్యస్థలుండై
నాళీకాళీమధూళీ ♦ స్నపనశిశిరుఁడై ♦ నవ్యవాసంతికాళీ
మాలాకుంజోద్గతుండై ♦ మలయపవనుఁడున్ ♦ మాంద్యుఁడై వీచె లీలన్. 29

శా॥ లీలాకారసుమాళికోల్లసితమ ♦ ల్లీవల్లరీడోలికా
పాళీసంచరణాతికామనలినీ ♦ వ్యాప్తాళిలీలాకలా
నాళీకాళిమధూళికాస్వదనగా ♦ నస్ఫూర్తిభృంగాంగనా
పాళిం బాళిఁ గదల్చుచుం బవనుఁడున్ ♦ భాసిల్లె శైత్యాత్ముఁడై. 30

శా॥ కాలంబుం గని వారిరున్మధుధునీ ♦ కల్లోలమాలానట
ల్లోల బాళిరసాలపల్లవలతా ♦ లోలోచ్చలత్కోకిలా
హేలాభాసురనాళికాళిచరహం ♦ సేంద్రాళిగానంబులన్
బాళిన్ మందసమీరణుండు వినుచు ♦ న్మాంద్యంబునం రాజిలెన్. 31

చ|| పాటీరాద్రివిహారకిన్నరసతీ ♦ వ్యాలోలలీలాకలా
కోటీగేహనటీనటత్కుచఘటీ ♦ కోటీతటీవాటికా
వాటీప్రోత్థితసారభోత్కటపరీ ♦ వ్యాలీఢసర్వాంగుఁడై
పాటీరాద్రినటత్సమీరుఁడువనిన్ ♦ భాసిల్లెమాంద్యంబునన్. 32

చ|| క్షితిమనుజశ్రమంబణఁచి ♦ చెల్వగు కైరవసారసాళిశో
భితసరసీతటాలిశయ ♦ పేశలకోమలమల్లికాలతా
వితతిసుమాళికాసురభి ♦ వేష్టితమై నిరతంబు మందమా
రుతము నటించుచుండె నతి ♦ రూపవిరాజితకేలికావనిన్. 33

సీ|| ముద్దుపల్కులఁబల్కు ♦ ముద్దులాఁడిని నాత్మ, కుఁమంచుఁ దలఁచి కో ♦ యిలలుఁగలియ
నెలుఁగెత్తి చెలియలం ♦ బిలచుముద్దియ నాత్మ, కులమంచుఁ జిల్కలుఁ ♦ జెలిమిఁ జేర
వెడజాఱుతుఱుముతో ♦ విలసిల్లువాల్గంటిఁ, దమవియ్యమనుచుభృం ♦ గములుఁ గదియ
లీలతో నడచునా ♦ లేమ నాత్మీయబాం, ధవమంచు కలహంస ♦ తతులు మూఁగ

గీ|| జాణలై నట్టినిజసఖీ ♦ సమితిఁ గూడి, సరస మాడుచు వైదేహి ♦ సంచరింప
ననుచరులనటనిల్పిసూ ♦ ర్యాన్వయుఁడు, రహిని నభ్యంతరవనాంత ♦ రంబుఁ జొచ్చె.

సీ|| ఒకపాలి పికబాలి ♦ కకుఁ దాలిమిం జూపు, విమలమంజులభాషి ♦ తములనాడు
నొకమాఱు బకదారు ♦ లకు దూఱుఁగల్పింపఁ, దగు వినిర్మలభాషి ♦ తములఁబల్కు
నొకతూరి నటశారి ♦ కకుఁ బేరిమిం జూపు, లలితంపుమధురవా ♦ క్కుల వచించు
నొకసారిసుకుమారి ♦ శుకపాళికిం బ్రమో, దముఁ గూర్చుమధురవా ♦ క్యములఁబల్కు

గీ|| రాజహంసాళికెల్ల గ ♦ ర్వంబుఁ బాపు, చతురలీలామయగతుల ♦ సంచరించు
మిన్నయై జాణతనమున ♦ వన్నెలలర, రహిని నమ్మేదినీసుతా ♦ రత్న మచట.

సీ|| అచలాత్మజామంద ♦ హాసకాంతులతో స, మంబులై తనరారు ♦ మల్లెసరులు
జనకాత్మజాదంత ♦ సత్కాంతులకు సమా, నంబులై చెలఁగుకుం ♦ దకుసుమములు
భూమికన్యాకుచం ♦ బులతో సమంబులై, కులుకులం గాంచు [illegible] ♦ [illegible]ఫలములు
మైథిలీభామినీ ♦ మణిదేహరుచులతో, సమములై రాజిల్లు ♦ చంపకములు

గీ|| జానకీలోచనములతో ♦ సమములగుచు, నళులు మురిపెంపు మెట్టదా ♦ మరలునచట
నేర్పుతో దెచ్చి శ్రీమైథి ♦ లీశ్వరునకు, నెలమి వనపాలకులు కాను ♦ కలుగ నిడిరి.

కం|| జనకజనయ్యెడలం గని, వనజాప్తకులేశ్వరుండు, ♦ భామిని భవదం
గనికరసమవస్తువులం, గొనుటం జిత్తము నిలుచునొ ♦ కో మాకనుచున్. 37

మ|| వరమందస్మితరాజితాస్యుఁ డగుచున్ ♦ వాల్గంటి నెమ్మోముచం
దురు వీక్షింపఁగ నా వెలంది నిజకాం ♦ తుం డాడునర్మోక్తికిన్

శిరము వ్రాంచి రహిం గటాక్షముల నీ ♦ క్షించెం దదీయేక్షణో
త్తర బాణంబుల మన్మథుండు రఘునా ♦ థస్వామి నేసె న్వడిన్. 38

చ॥ చెలినును చెక్కుటద్దములఁ ♦ జెల్వగు ముద్దుల మోము వాలుగ
న్నుల బలితంపువన్నెలచ ♦ నుంగవలం జెలువంపు మేనిచి
న్నెలఁ జిఱునవ్వుఁ గెంబెదవి ♦ నిం దిలకించు నె కాని తోఁటలో
నెలమిఁ దనర్చు నన్యముల ♦ నేమియుఁ జూడఁడు రాముఁ డయ్యెడన్. 39

—* రాముఁడు సీతను వర్ణించుట. *—

సీ॥ నెఱజాణ సిద్దంపు ♦ నెమ్మొగంబు మెఱుఁగు, వరసుధాకర కాంతిఁ ♦ బరిభవించుఁ
దలిరాకుబోఁడి బి ♦ త్తరి చూపుల బెడంగు, సారంగముల విలా ♦ సంబు నణఁచు
ముద్దులాఁడి మెఱుఁగు ♦ సిద్దపు నెమ్మోవి, లలితంపు బింబఫ ♦ లంబు గెల్చు
మించుబోఁడి నును నె ♦ మ్మేను సోయగములు, బంగారు వన్నెలఁ ♦ బాఱఁదోలుఁ
గీ॥ కులుకులమిటారి గబ్బిగు ♦ బ్బల మెఱుఁగు, చారుకనక కలశవిలా ♦ సము నెదుర్చు
భళిరె యీ సతి వర్ణింప ♦ నలవియగునె, నల్వకైనను వేనోళ్ల ♦ చిల్వకైన. 40

సీ॥ తనరు కమ్మని తావి ♦ తావులై సిద్దంపు, పసిమిచే నెసఁగు పూ ♦ బంతు లనఁగ
మురిపెంపు వగలతో ♦ మోహ గేహంబులై, భాసిల్లు హేమకుం ♦ భము లనంగఁ
దళుకు బెళుకుల ముద్దు ♦ కులుకు యౌవనముతో, శోభిల్లు జక్కవ ♦ జోడనంగ
నతిచారు నిత్యక ♦ ల్యాణలీలల మించు, మత్తేభ రాజకుం ♦ భము లనంగఁ
ఆ॥ వె॥ వెలయు సామదాన ♦ భేదదండములనఁ, జతురుపాయముల న ♦ వతినిఁ గాంచుఁ
బరమలీల లందుఁ ♦ బడఁతి సిబ్బెపు గుబ్బ, నిబ్బర ఫుటుబ్బు ♦ గుబ్బచనులు. 41

సీ॥ సారంగముల మీఱు ♦ సారంగములఁ దూఱు, నాతి శృంగారేక్ష ♦ ణములు నడలు
జలజాతముం బోఁగు ♦ జలజాతముం జీఱు, ముద్దుముద్దంపు నె ♦ మ్మోము గలము
హరిరాజు నెదిరించు, హరిరాజుఁ బెదరించు నధిక మనోజ్ఞమ ♦ ధ్యంబు వేణి,
కాంచనంబు నణంచుఁ ♦ గాంచనంబు న్మించు, సన్నిభాగేహానా ♦ సంబు మేను
గీ॥ పరమబింబంబు గెల్చు న ♦ ధరఫలంబు, వినుల నీలాంబుదముల గే ♦ శములణంచు
నూరువులు హేమరంభల ♦ నక్కడంచు; గా చరణములుఁ దమ్ములఁ ♦ బరిభవించు.

సీ॥ ఎలనాఁగ తుఱుము న ♦ కెనరానిదై గండు, కోదమ తేఁటుల బాఱు ♦ పోదలఁ దూఱె
ననబోఁడి నును గొప్ప ♦ నకు దీటుగానిదై, చెలఁగు చీఁకటులు మూ ♦ లలనణంగె
ముద్దులాఁడి మెఱుఁగు ♦ ప డికీడు సేసిదై, లలితనీలములు శై ♦ లముల డాగెఁ
దలిరాకుబోఁడి వే ♦ నలి కీడులేనిదై, తొలిమబ్బుతుటుములు ♦ మలలఁ బట్టెఁ

గీ॥ జూచి నల్లనిచాయల ♦ సోయగంబు, నింపుకుల్కుమిటారిచె ♦ల్వంపు నెఱుల
గుంపునకు జోకగాక ని ♦ ద్దంపునాచు, జొంపములు నీటఁబడెఁగడుఁ ♦ దెంపుజేసి.

చ॥ ఇదివదనంబుగాదు మృగ ♦ హీనకలానిధిమండలంబు చ
క్కదనపుగబ్బిగుబ్బ లివి ♦ గావు మెఱుంగుపసిండికుంభముల్
మృదుకచపాళికాదిది చ ♦ రింపనినీలబలాహకవ్రజం
బిది కనుదోయిగాదు బహు ♦ హేలల మేలగుశృంఖలంబగుర్. 44

చ॥ కులుకుమిటారికెంజెదవి ♦ కోమలనూతనపల్లవంబులర్
లలితనవప్రవాలకము ♦ లర్ నవబింబఫలంబులర్ మెఱుం
గుల నలరారుమంకెనలఁ ♦ గుంకుమజాతితతిర్ మెఱుంగుకెం
పుల నెదిరించి మించెఁ బరి ♦ పూర్ణవిలాసవితానగేహమై. 45

సీ॥ చెలిపెన్నెఱులగుంపు ♦ చీఁకటిఁ బరిమార్చు, మురిపెంపు మోము చం ♦ దురునిగెల్చు
జలజాక్షిలోచనం ♦ బులు చేపల జయించుఁ, బలుకావిమోవి బిం ♦ బంబుఁదఱుము
వెలఁదిగుబ్బలు చక్ర ♦ ములఁ బట్టి బంధించు, నారు నాగేంద్రంబుఁ ♦ బాఱఁగోలుఁ
జెలినితంబంబులు ♦ పులినంబుల నణంచు, లలితోరువులు నసం ♦ టుల నెదుర్చు

గీ॥ మిసిమిబంగారు పైకెక్కు ♦ మేనిచాయ, నఖము లలతారకావితా ♦ నముల జీఱు
మించు యీకల్కికుల్కుల ♦ నెంచవశమె, నల్వకైనను వేనోళ్ల ♦ చిల్వకైన. 46

కం॥ కుందంబుల నవముక్తా, బృదంబుల జాజికుసుమ ♦ వితతుల లీలా
సుందరమందారకుసుమ, బృందంబులనుక్కడంచు ♦ వెలఁదిదంబుల్. 47

తే॥ గీ॥ ధరణిజ నిటులవర్ణించి ♦ సరసిజాప్త, కులవిభూషణుఁ డయ్యెడ ♦ వలపుఁగాంచి
భావమున దివ్యగుణధాము ♦ దేవిఁగూర్చి, పలికె నీరీతిసరసంపుభాషితములు. 48

## —* రాముఁడు సీతతో సరసోక్తులాడుట. *—

సీ॥ ఈబింబఫలమున ♦ కీడేమొ నీమోవి, యీపారిరుచిఁజూడ ♦ నీవెయింతి
యీగుచ్ఛకంబుల ♦ కీడేమొ నీగుబ్బ, లీసారి బట్టనీ ♦ వేలతాంగి
యీహేమరంభల ♦ కెనయొ నీయూరువు, లీతూరి బట్టనీ ♦ వే వెలంది
యీజుంటితేనెల ♦ కెక్కువో సామ్యమో, యీమాటుబల్కు మో ♦ యించుబోఁడి

గీ॥ కలికి నూతనస్నిగ్ధకి ♦ సలయములకు నెక్కువోనీదుచెక్కిలి ♦ నొక్కనీవె
యనుచు సీతామహాదేవి ♦ నర్కవంశ, పావనుఁడుబల్కునుపవనా ♦ భ్యంతరమున.

చ॥ అరయుచుఁబువ్వుదేనియల ♦ నానెడుతేఁటులు సుందరాననాం
బురుహపరీమళగ్రహణ ♦ ముంబొనరింపఁగమీద మూగినర్

వెఱచి కవుంగలించురమ ♦ ణీమణి నక్కునఁజేర్చి తోఁటలో
నరపతిచంద్రుఁ డర్కకుల ♦ నాయకుఁడిష్టఫలాప్తి రంజిలున్. 50

చ॥ భ్రమరకులంబు లల్లపుడుఁ ♦ బైకొన నేగతిఁ దోలినారటం
చు మహితనూజ పల్కు విని ♦ సూర్యకులాధిపుఁ డింతి యేయుపా
యమని విచారమేటి కట ♦ నందపునీదగుఘ్రాణచంపకం
బు మెయి మరల్పఁగా నవియ ♦ పోయె నటంచనె సుస్మితాస్యుఁడై. 51

గీ॥ రమణి నీమంజుముఖదర్ప ♦ ణమునఁ గీర,దష్టపక్వబింబఫలంబు ♦ తగినలీలఁ
బ్రతిఫలించె నని విభుండు ♦ భావగర్భ,ముగ వచింపఁగ నగి యింతి ♦ మోము వాల్చె.

ఉ॥ అక్కునఁజేర్చి మైథిలిని ♦ నాతఁడు రాగముతో వెలందిరో
చిక్కితి వెందుబోదువని ♦ చెక్కిలి నొక్కుచుఁ గంచుకంబుఁ దా
దక్కనఁ దీయఁబూన నట ♦ దాపున నొక్కశుకంబు బల్కఁగా
నొక్కవెలందిపల్కని భ ♦ యోద్యమముం గను జానకి న్నగెన్. 53

చ॥ చెలియలఁ జెల్వలం గదియఁ ♦ జేర్చెదు మారునివాజియయ్యు నీ
చిలుకలరాజు విఘ్నముగఁ ♦ జేసె మతేమణిఁ జూపి దీని భ్రాం
తిలనొనరింతు నంచు నతి ♦ దివ్యవిలాసకులాలయాత్మని
ర్మలమణిఁ జూప బింబమని ♦ వ్రాలె శుకం బట సీత మెచ్చఁగన్. 54

ఉ॥ శ్రీరఘురాముఁ డావెలఁది ♦ చిత్తము రంజిలఁ గాంచి బోటిరో
బేరిమి నీను నీయధర ♦ బింబరసం బిటఁ గాఱఁ జూచి యీ
కీరము సేరెనో యనియెఁ ♦ గ్రీవము వాలిచి మందహాసముల్
మీరిన మాటవైచెదవు ♦ మోసము సేతురె యాశ్రితావళిన్. 55

మ॥ చిలుక ల్నీపలుకు ల్నిరంతరమునం ♦ జెల్మి న్వసింపన్ ఫలం
బుల నైనం దగుపంచదారలయినన్ ♦ మోహంబుఁ గావించు నీ
లలితాలాపసుధారసంబయినఁ గ్రో ♦ లం బ్రీతితో నియ్యవే
చెలి యంచున్ రఘురాముఁ డాసతిని ముం ♦ చెన్ గాఢరాగాంబుధిన్. 56

మ॥ తనగుజ్జంబును బట్టినారమని కం ♦ దర్పుండు కోపంబుతో
మనపై వైచినబాణపంక్తులన నా ♦ మత్స్యాజపార్శ్వంబులన్
ఘనసూనంబులు రాలెఁ గాంచితివె శ్లా ♦ ఘ్యస్పర్శనక్రీడలన్
గనఁ జోద్యం బగునంచు దానిదరికిం ♦ గాకుత్స్థుఁ డేగెం దమిన్. 57

చ॥ కరమున శోణవారిజముఁ ♦ గైకొని దీనిని నందుకోవె సుం
దరియని కోర్కిఁ జూపి రఘు ♦ నాయకుఁ డాచెలి నిక్క ప్రీతితోఁ

గరమును సాచినన్ స్వకర ♦ కంజము నంతకునంత కెత్తు మీ
సరవుమెఱుంగుచున్నవలఁ ♦ జాతెఱుఁ గప్పుడె యొదఁ జూచు పేరిమిన్. 58

సీ॥ నిలచినిక్కినఁ జాలు ♦ నీవిఁ గాంచెదుబుద్ధిఁ,దరుణి కందనిలతాం ♦ తములఁ జూపు
నాడు తేంట్లటఁ దేంట్ల ♦ కాలింగనం బిడు,ననుకోర్కి సుమనిశాం♦తములఁ జూపు
బడలి పైఁబడునంచు ♦ బాళిచే బోటికిం, గర్పూరమిళితభా ♦ గములఁ జూపు
బట మెత్తఁగా నూరు♦భాగంబులం గాంచు,తమి సుగంధాంబుమా♦ర్గములఁజూపు

గీ॥ నధరబింబఫలంబుపై ♦ నధికకాంక్షఁ,జిల్కఁ దోలంగఁ దేనెలు ♦ జిల్కఁ బల్కు
కల్కి కట మావివనుల నౌ ♦ క్కటికమూని,చూపు మంజులరఘువంశ♦దీపకుండు.

శా॥ లేదీఁగె న్విరికోర్కిఁ జేరవల దీ ♦ లేదీఁగెకున్ మేనికిన్,
భేదం బేమియు లేదు హంసలకునై ♦ నీవిట్లుఁ బోనేల యీ
కాదంబాళికి నీకు యానములలో, ♦ గాన్పింప దొక్కింతయున్
భేదం బంచు వచించు రాముఁ డచటం ♦ బ్రీతిం ధరాపుత్త్రితోన్. 60

కం॥ చిలుకం గేల ధరింపకె, చెలి! కలకలమనుచుఁ బల్కఁ ♦ జిల్కపలుకులో
చెలువంపు నీపలుకులో, తెలియను భేదం బటంచుఁ ♦ దిలకించు సతిన్. 61

ఉ॥ అంటితి వీవె పుష్పవతి ♦ వైనలతాలలితాంగి నింక న
న్నంటకు మంచుఁ దా నగుచు ♦ నవ్వలి కేగిన నింతి నవ్వుచున్
వెంటనె కుంజము ల్దిరిగి ♦ వేసరుట న్ననుమై చెమర్చినన్
బంట వెలందియల్లుఁడుఁ గ్ర ♦ పామతిఁ గౌగిటఁ గ్రుచ్చె నంతటన్. 62

—* పుష్పాపచయవర్ణనము *—

చ॥ సుమములఁ గోయ నెచ్చెలులు ♦ సుందరపీనకుచాగ్రభాగవి
భ్రమయుతతారహార లతి ♦ రామఝుణంఝుణఝుంఝుణధ్వని
క్రమయుతవజ్రనూపుర ల ♦ ఖండమనోజ్ఞనితంబబింబభూ
మిమిళితరత్నసంఖచిత ♦ మేఖలలై చనుదెంచి రంతటన్. 63

శా॥ ఈరీతిం దమిఁ గేలికావనములో ♦ హృష్టాత్ములై మించి సీ
తారాము ల్విహరించుచుండ నటకుం ♦ దాల్మిం జెలు ల్వచ్చి వే
శ్రీరామేశుని కింపుగా మెలఁగుశ్రీ ♦ సీతామహాదేవితో
నారామంబునఁ గోయసాగిరి సుగం ♦ ధాగారసూనావళిన్. 64

ఉ॥ నీయభిధానముం బలుకు ♦ నెచ్చెలిపల్కుల నాలకించి యీ
కోయిల మాటలాడదని ♦ కోమలి పల్కఁగ నింతి దానఁ గా

దీయెడ నీదుమాటవిని ♦ యీగతిఁ బల్కఁగ లేక లజ్జ ని
క్కోయిల మూఁగలై తరుల♦కుం జనె నంచు రఘూత్తముం డనెన్. 65

చ॥ అలిసముదాయ మెల్లఁ బ్రియు ♦ రాండ్రకుఁ దియ్యదనంపుఁబూవుదే
నెల నిడుచుండె నంచు నొక ♦ నెచ్చెలితో నట నొక్కభామినీ
తిలక మనంగఁ గాంచి నిర ♦ తిం జెలు లందరు రాగవార్ధిమ
గ్నలగుచుఁ దీగెల న్సుమగ ♦ ణంబులఁ గోయఁ జెలంగి రయ్యెడన్. 66

మ॥ క్షితినాథోత్తమబాణగేముల ర ♦ క్షింపన్ బలస్తోము మే
గతి ద్వారంబుల నుండునో యటుల నీ ♦ కామక్షితింద్రేషుగే
హతతిం గావఁగఁ జంచరీకనికరం ♦ బాతీఁగలం జేరెఁ జూ
చితిరే యంచని చూపె నొక్కచెలి వై ♦ చిత్ర్యంబుతో నయ్యెడన్. 67

చ॥ జలజదళాక్షి నిజలుగు ♦ చక్కనిపయ్యెట జాఱ నీగతిన్
వెలిగడ కేగి కోఁకముడి ♦ వీడఁగ నిక్కెదవేల మల్లెపు
వ్వుల నిఁక సంగ్రహింపకుము ♦ పూవిలుకాని భజించు గండుతేఁ
టులిచటఁ దల్లతాతతిఁ గ ♦ డుం బ్రముదంబున వీడవేయెడన్. 68

చ॥ కులుకుమిటారి యీలలిత ♦ కుందసుమంబులు మాలతీలతా
కులములు మల్లికాలతలుఁ ♦ గోమలమంజులమాధవీసుమం
బులు గిరిమల్లికాకుసుమ ♦ ము ల్వకులంబులు మాగధీలతా
కులములు నీవనేందిరకుఁ ♦ గోమలభూషలు చూడు మీవిటన్. 69

చ॥ ఇవి సహకారపాదపము ♦ లియ్యవిగంధఫలీకులంబు లి
య్యవిబదరీమహీరుహము ♦ లయ్యవి నిమ్మలు శారదంబు లి
య్యవి ఫలపూరపాదము ♦ లయ్యవి హారిసమీరణంబు లి
య్యవి పనసాగమంబు లిట ♦ హాళి ఘటించు లతాంగి జూడుమా. 70

కం॥ అని మైథిలికిం జూపుచు, వనజాక్షులు విరుల గోసి ♦ బడలిక చేను
న్ననిమేనులుం జెమర్చిన, జనకజకడ నిల్చి రట్టి ♦ సమయమున నటన్. 71

సీ॥ ఇగురు లన్నియు సంగ్ర ♦ హించితి రింక మీ,కరపల్లవములచేఁ ♦ గావు డనుచుఁ
దేనెలెల్లం ద్రాగి ♦ తి రిఁకనైనను మీదు,మధురోక్తిమధువుచే ♦ మనుపుడనుచు
విరులెల్ల హరియించి ♦ తి రిఁకనైన న్మీసు,గంధంబుల నొసంగి ♦ కావు డనుచు
వెతకి పండ్లెల్లఁ గో♦సితి రింక నైన మీ, మోవిబింబములచేఁ ♦ బ్రోవుడనుచుఁ
గీ॥ జెలిమిఁ జూపుచు వచ్చి కో ♦ యిలలు తేంట్లు,మలయపవమానములు చిల్క ♦
లలకరవద, నాంగరదనచ్ఛదంబుల♦నాశ్రయింప, బడలి వసియించి రొకచోటఁ ♦
బడఁతులపుడు. 72

చ॥ చెదరినయట్టిముంగురులు ♦ జెమ్మటఁదోగిన ముద్దుచెక్కులున్
వదలుగజాఱుపెన్నెఱులు ♦ వాడినగాత్రము జాఱుజిల్గుప
య్యెదయుఁ జలించుపాదములు ♦ నెక్కుడునూర్పులుఁ గల్గి యొప్పునా
సుదతిని రాఘవుం డపుడు ♦ చూచి మదిం దమి మీఱ నిట్లనున్. 73

చ॥ అలసితివే లతాంగి యొడ ♦ లంతయుఁ జెమ్మటఁ దోగె గబ్బిగు
బ్బల అయికన్నడల్చి శ్రమ ♦ వాయ నిట న్వసియింపు మీవు నీ
చెలియలు మేము నీయెడల ♦ జేసెద మెద్దియున్నైన నూడిగం
బుల గొనుమం చన న్విభుఁడు ♦ బోటి మొగంబును వాల్చియిట్లనెన్. 74

మ॥ కలితార్కాన్వయదుగ్ధవారినిధిరా ♦ కాచంద్ర మీముద్దుమా
టలు చిత్తంబు లగు న్వనిం దిరిగుచుం ♦ టం జేసి యీరీతిగా
నలసెం గాత్రము దాని కిట్టులనఁగా ♦ న్యాయంబె మైనం దమిం
జెలికష్టంబులఁజూచి యోర్వఁగలఁడే ♦ చెల్వొందు భూమండలిన్. 75

కం॥ అని మైథిలి పల్కఁగ విని, వనితలు సేవింప రామ ♦ వసుధేశుఁడు జ
వ్వనితో వనిలోపలికిం, జనె మలయానిలమువీచు ♦ సరణి న్సిరతిన్. 76

—* రాముఁడు సీతతో విహరించుట. *—

చ॥ అట నతిచారుకుందలతి ♦ కాలయపంక్తుల మాలతీలతా
పటలపరీతవాటికలఁ ♦ బ్రద్యుతిరాజితమాగధీలతా
నటదతిసుందరాలిమిథు ♦ నంబుల మంజులమాధవీలతా
ఘటితపటీయడోలికలఁ ♦ గమ్మనితావుల నింపుమల్లెలన్. 77

చ॥ లలితరసాలపల్లవము ♦ లన్ భుజియించి మదించి చెట్లపై
కలనినదంబుల న్మిగుల ♦ గంతులవైచు పికంబులం ఫలం
బులఁ దిని కూయుకీరముల ♦ ముద్దుగ నాడు మనోజ్ఞకేకిపం
క్తుల సరసీవితానములఁ ♦ గోరికతో విహరించుహంసలన్. 78

మ॥ జనమానోత్తమబంధుజీవకములం ♦ జాంపేయపున్నాగచం
దనసాలంబుల మల్లికాకుటజముం ♦ దారప్రతానంబులన్
ఘనహింతాలరసాలలుంగబదరీ ♦ కాండంబులం జూపుచున్
వనజాప్తాన్వయభూషణుండు విహరిం ♦ పం గల్గె రాగంబునన్. 79

చ॥ క్షితిసుత కయ్యెడన్ శ్రమము ♦ చెల్వగుకైరవసారసాతిశో
భితసరసీవిశుద్ధబిస ♦ బృందవిహారివిలాసిరాజహం
సతతిమనోజ్ఞపక్షమణి ♦ చామరసంభవశైత్యమందమా
రుతతతులన్ హరింపబడె ♦ రూపవిరాజితకేళికావనిన్. 80

సీ॥ కలికిచక్రములునీ ♦ కులుకుగుబ్బలఁ గాంచి, విచ్చేసెఁ జెల్మిఁ గా ♦ వించెనేమొ
చెలి తేఁట్లు నీదువే♦నలిఁ జూచి పఱతెంచెఁ,దమకులంబని చెల్మిఁ ♦ దనరెనేమొ
వెలఁదిహంసలునీన♦డల గాంచివేంచేసెఁ, జెలఁగుబాంధవ్యంబు♦ తెలిసెనేమొ
చెలిజలేభము లూరు♦వులఁగాంచి యేతెంచె, స్నేహంబుమ్రొక్కి వాం♦ఛించెనేమొ

గీ॥ చెలియ శుకములు నీతేనె ♦ లొలుకుముద్దు,పలుకులన్విని విచ్చేసెఁ♦జెలిమిఁగోరె
నేమొ యనుచుముదంబున♦రామవిభుఁడు,రమణితోఁబల్కె నిటులనా♦రామభువిని.

సీ॥ ఈహంసకుల మింక ♦ నీవుబట్టఁ గడంగ,సారసాకరములఁ♦ జేరకున్నె
యీద్విరేఫము లింక ♦ నీవు హాసిం జేయఁ, బార్శ్వకుంజంబులఁ ♦ బట్టకున్నె
యీచిల్క లింకమీఁద ♦ నీవు బట్ట నటింప,నారామఫలములఁ ♦ జేరకున్నె
యీరథాంగము. లింక ♦ నీవు బట్టఁగ జూడఁ,గంజాతవనములఁ ♦ గలయకున్నె

గీ॥ యీసరోజములింకమీఁద♦నీవుబట్టఁ; దలఁప గతమరందంబులై ♦ వెలయకున్నె,యను
చు రఘువంశభూషణుం ♦డధికరాగ, మున మహీపుత్త్రితోఁ వచిం♦చెనటనపుడు. 82

చ॥ సకి యకలంక వారకణ ♦ సంగతవారిజపత్త్రమధ్యహా
ల్లకరుచు లచ్చటం గొలను ♦ లచ్చి హరిన్మణిపాత్రలోన మౌ
క్తికములుఁ జంటగాఁ గురిది ♦ దివ్యమనోహరనూత్నరత్నదీ
పకలన నిచ్చునారతుల ♦ వైఖరి నున్నవి చారులీలలన్. 83

—* జలక్రీడాభివర్ణనము. *—

మ॥ అనివర్ణింపగ నంత నాచెలివయ ♦ స్యల్వచ్చి మైసొమ్ములన్
మినుకుంబంగరుజిల్గుకంచుకములన్ ♦ మేలైనవల్వల్విడ
ల్చి నెఱిం జందురుకావిపావడల బా ♦ ళిం దాల్చి హస్తంబులన్
స్తనగుచ్ఛంబుల మాటొనొంచు నటఁ గా ♦ సారంబునం గూరిమిన్. 84

మ॥ లలితాకారలు వారిజాననలు లీ ♦ లాచారుసంపత్కలా
కులసద్దేహనటీనటత్కుచఘటీ ♦ కోటీతటీవాటికా
గలదుద్యత్స్ఫుటశాటిక ల్దిగిరి స ♦ త్కాండక్రియాసక్తలై
కలితారామసరోవరాంతరమునన్ ♦ కాంతామణీరత్నముల్. 85

శా॥ శంపోద్దామకలాకచాకచికలా ♦ చాతుర్యనిర్యన్నిభా
సంపద్రాజితసుందరాంగులు చెలుల్ ♦ సత్కాంతిలీలాకలా
సంపన్నప్రసవాళికాపచయక ♦ శ్రాంతాంగసౌఖ్యార్థమై
సొంపారం జలకేళికిం గడఁగి రా ♦ శుద్ధాతరంగాంబుజల్. 86

శా॥ ఆహా మ ల్విలసత్కపోలయుగల ♦ వ్యాలోలతాటంకికల్
వ్యావల్గత్కుచకుంభభారవహన ♦ క్లాంతోచ్చలన్మధ్యమల్
శ్రీవామామణులోయనం దగిరి స ♦ త్క్రీడాస్థలై వచ్చి లీ
లావిస్ఫూర్జితవారిలీలల నటన్ ♦ లాలిత్యముల్ గాంచుచున్. 87

సీ॥ మెలఁతలముఱిపెంపు ♦ మీఁగాళ్లచేనటఁ, గమఠాళి కొకరీతి ♦ కాంతి కల్గెఁ
జెలులచక్కని పెందొ ♦ డలచే నచటవారి, గజపాళి కొకరీతి ♦ కాంతికల్గె
లలనామణివళికాం ♦ తులచే నచటఁ దరం, గశ్రేణి కొకరీతి ♦ కాంతికల్గె
వెలఁదులనాభిలీ ♦ లలచే నచటజలా, వర్తాళి కొకవింత ♦ వగలుకల్గె
గీ॥ భామినీమణివక్షోజ ♦ పరమరుచుల, చే నచట నూత్నకోరక ♦ శ్రేణికొక్క
రీతికాంతి లభించెఁ గో ♦ ర్కెం జెలంగి, వింతగా వారికేళిఁగా ♦ వించునపుడు. 88

ఉ॥ ఆలలితాంగి యీవెలఁది ♦ నవ్వులకుం బడ ద్రోయ నీటిపై
లీలలఁ జూపి యీఁదుటలు ♦ లెస్సగనుండెనటంచు నీరుచుం
బాళి నొకర్తుజేసె యనఁ ♦ బద్మదళాక్షులఁ జూచి వెంటఁ దా
మాలలితాంగిరీతి నటఁ ♦ దంతట నీఁదఁ గడంగి రయ్యెడన్. 89

కం॥ పుష్కరపికకీరాదిక, విష్కిరరాజప్రతాన ♦ విలసితకేళీ
పుష్కరిణీపుష్కరమునఁ, బుష్కరపుష్కరకదంబ ♦ ము ల్విలసిల్లెన్. 90

సీ॥ నిర్మలాస్యములై కా ♦ న్పింప నీఁదఁ సరోవ, రము పూర్ణచంద్రబిం ♦ బమయమ
య్యె, బాహుదండములై చూ ♦ పట్టనీఁదఁ సరోవ, రము వారిజాతనా ♦ ళమయమయ్యె
వక్షోరుహములై చూ ♦ పట్టనీఁదఁ సరోవ, రము చారుచక్రవా ♦ కమయమయ్యెఁ
దుఱుములై చూపట్టఁ ♦ దోఁగి యీఁదఁ సరోవ, రము నటచ్చంచరీ ♦ కమయమయ్యెఁ
గీ॥ బాదములై కానుపింపఁగా ♦ నీఁదఁ నాజ, లాశయం బెల్ల రక్తోత్ప ♦ లమయమయ్యె
బరమసుందరాంగములై చూ ♦ పట్టనీఁదఁ, గమలజాకర మెల్ల హే ♦ మమయమయ్యె.

శా॥ ఈలీలన్ విహరించుచుం జెలు లటన్ ♦ హేలాకరాంభోజ ప
త్రాళిం బాపఁ దటాకలక్ష్మి కసి లీ ♦ లాకారగండంబులన్
స్థూలోరోజములం జెలంగు వరక ♦ స్తూర్యాదిసత్పత్రభం
గాళిం బాపె మహోగ్రకోపమున ను ♦ ద్యద్భంగసంగాహతిన్. 92

శా॥ తలపం. దల్లలనాతనూపరిమళ ♦ ద్ద్రవ్యాభియోగంబునన్
గలితాబ్జాకరలక్ష్మి తా నపుడటం ♦ గాపాయితాకారయై
చెలఁగెన్ నిర్భరరోషపూర్ణమతియై ♦ జీవేశు నిందించుచున్
మెలఁగున్నానిని యో యనన్ సతతముల్ ♦ నీరేజనేత్రంబులన్. 93

ఉ॥ వారివిహారముం గని య ♦ వారితవారివిహారవాంఛలోఁ
గూరిఁగ నామెకోర్కెఁ గను ♦ కూలుఁడుఁ గావున మించుబోలు నా
సారసగంధితో మెయిలు ♦ చందము కేళికి యోగ్యమైనయా
కారముఁ దాల్చి రాముఁడు జ ♦ గన్నుతుఁడున్ దిగె గద్దె నయ్యెడన్. 94

సీ॥ అసమాననిజముఖం ♦ బబ్జబింబమె యంచు, నట జక్రవాకంబు ♦ లదరి బాఱ
ఘనమనోజ్ఞాత్మీయ ♦ కబరిసత్కాదంబి, నియె యంచు కాదంబ♦నిచయ మదర
మంజులాగోచరా♦త్మవలగ్నమలమృగేం, ద్రమెయంచు జలగజేం♦ద్రములు బెగడఁ
గమనీయనిజదేహ ♦ కాంతిచాంపేయమో, యంచు లోలంబంబు ♦ లదరి బాఱఁ
గీ॥ జరణరుచులుసంధ్యారుణ ♦ చ్ఛవులటంచుఁ, బరమసారసాకరలక్ష్మి♦ వెఱపుఁజెంద
సారసాప్తకులేంద్రహ♦స్తంబుఁ బట్టి, భామినీమణి సరసిలో♦పలికిడిగ్గె. 95

కం॥ డిగ్గినచెలి లోనికిఁ గ్రతు, భుగ్గణ వినుతుం డిలాధి ♦ పుఁడుఁ దివియంగా
బెగ్గిలి పతికంఠంబున్, సిగ్గెడలం గౌఁగిలించి ♦ చిఱునగవు నగెన్. 96

శా॥ భూనాథాత్మజఁ గాంచి యొక్కకలశం ♦ బుం దాల్చి వారెంతలో
లైనన్ లోపలికేగి యీఁద నిలలో ♦ నంభోజపత్రాక్షి నీ
వీనీటం గుచహేమకుంభయుగమున్ ♦ హృద్యస్వరూపంబుతోఁ
బూనంజాలియు భీతియేల యని రా ♦ ముం డయ్యెడన్ నవ్వినన్. 97

కం॥ విని లజ్జానతముఖియై, జనకజ చిఱునగవు నగుచు ♦ జలజాప్తకులాం
బునిధిసుధాకరు శ్రీరా, ముని నయ్యెడఁ గౌఁగిలించె ♦ మోహమున నటన్.

సీ॥ నరనాథుబాహుదం ♦ డములఁజూచుఁజూచి,జలవారణేంద్రహ ♦ స్తములఁజూచుఁ
బ్రాణేశలలితనే ♦ త్రములఁ గాంచుం గాంచి,కమనీయపుండరీ ♦ కములఁ గాంచుఁ
బతిచారుగాత్రంబుఁ ♦ బరికించుఁ బరికించి, లలితనీలాబ్జంబు ♦ లఁ బరికించుఁ
జెలువునికంఠంబుఁ ♦ దిలకించుఁ దిలకించి, నెదకి సుందరదరం ♦ బుఁ దిలకించుఁ
గీ॥ దనప్రాణనాయకునిమం ♦ దస్మితములుఁ, జూచుఁ జూచియుఁ గలహంస
సుందరగరు, దమలకాంతుల వీక్షించు♦ రమణి విభుని, విమలసుందరాంగములుఁ
ద ♦ త్సమములనుచు. 99

సీ॥ జలజాక్షు లీఁదురీ ♦ తులఁ గాంచితివికదా, యట్లీఁదుమని నడ ♦ యాడనేర్చె
నలవారిజములఁ దె ♦ మ్మని లోనబడవైచి, తెఱవకీఁతల నీటఁ ♦ దిరుగనేర్చె
మొలలోఁతునీళ్లలో ♦ పల భయంబేయంచుఁ,దిగిచి లోఁతగునీటఁ♦దిరుగ నేర్చె
నిచట నీహంసల ♦ నెగిరి పట్టుమటంచుఁ,జెలిమితో రానియీ ♦ తలను నేర్చె

గీ॥ నిటులఁ బద్మాకరంబున ♦ నినకులాబ్ధి, చంద్రుఁడైనట్టి శ్రీరామ ♦ చంద్రుఁడపుడు
సరసతరజలక్రీడల ♦ సల్పు నపుడు, ధరణిపుత్త్రికి నన్నిచం ♦ దముల నేర్పె. 100

క॥ రామకరాంబుకణంబులు, శ్రీమహిజాకబరిఁ జొచ్చి ♦ శీఘ్రమె నును నె
మ్మోమునఁ బడి మీఁదౌ న్ముఖ, సోముం గనవచ్చినట్టి ♦ చుక్కలన నటన్. 101

మ॥ లలితాంభోరుహవల్లిపై కవిసి లో ♦ లంబం బటం బూవుదే
నెలనుం గ్రోలువిధంబు వారిగజము ♦ ల్మీట న్మహోవర్తపం
క్తుల హస్తాగ్రము లుంచురీతి బహుసం ♦ తోషంబున న్వీచికో
లల నంచ ల్విదురించు వైఖరుల లీ ♦ లం గంటివే భామినీ. 102

చ॥ తనకతిదూరమై రుచుల ♦ దాఁకొనుఁబద్మినిఁ జూచి పేర్మితో
జనకజ కోర రామనృప ♦ చంద్రుఁడు నవ్యలతాంగి నంటఁ గై
కొను మిఁక నీవె నిన్నటుకుఁ ♦ గోమలి దెత్తునటంచు నచ్చటన్
ఘనభుజమధ్యఁ బూనె నెడఁ ♦ గల్మిచెలి న్మనునంచు కైవడిన్. 103

చ॥ వనజమరందబిందువు క ♦ బంధమునం బడి చంద్రికాక్రమం
బున నలరార నేమియిది, భూపతియంచు లతాంగి వేడ జ
వ్వని సరసీజలక్ష్మితగు ♦ వజ్రపుకర్ణిక నీయఁ బూనెఁ గై
కొనుమని రాఘవుండనఁగఁ ♦ గూరిమిఁబోవు లతాంగిని న్నగెన్. 104

చ॥ చెలియలలోన నన్నగడు ♦ సేసితివే రఘురామ యంచు నా
జలజదళాక్షి యొక్కజల ♦ జంబును రామునిపైన వైచినన్
లలనలు బాళిఁదాల్చికమ ♦ లంబుల ముంచిరి రాముఁడందునన్
దలఁకినరీతిఁ బోయె వసు ♦ ధాసతిచాటునకుం జెలు ల్నగన్. 105

మ॥ లలనారత్నమ! తప్పు నెంచి నృపతు ♦ ల్దండింత్రు బాలింతు ర
ట్టుల నాదోషము నెంచి నీచెలులతో ♦ డుం గూడి యీమాఱుతూ
పుల నేయంగఁ జెలంగితే యిఁక ననుం ♦ బ్రోవంగదే యంచనం
జెలువుం డంతట నామె నవ్వి సుదృఢా ♦ శ్లేషం బిడెన్ భర్తకున్. 106

చ॥ కులుకుమెఱుంగునిబ్బరపు ♦ గుబ్బలువక్షము నంటగానె త
మ్ములవలనం జనించుశ్రమ ♦ బోయి రఘూత్తమవీరుఁ డయ్యెడం
గలసి కరేణువుం జెలిమిఁ ♦ గాంచి నటించు గజంబుపోల్కి నా
కలికినిఁ గూడి వేడుకల ♦ గాంచె నటం జలకేళిసల్పుచున్. 107

సీ॥ అబ్జాక్షిహస్తవి ♦ న్యస్తాంబుజములచే, నలసహస్రాక్షుసా ♦ మ్యంబుఁగాంచు
క్షితిసుతామణికరో ♦ జ్ఝితవారికణములచే, ఝురయుతాంజనశైల ♦ సామ్యమొందు

మోహాలలామస ♦ ముత్కీర్ణకల్హార, ధూళిచే హేమాద్రి ♦ తుల వహించు.
నారీమణిన్యస్త ♦ కైరవశ్రేణిచే,నలపూర్ణచంద్రుసా ♦ మ్యంబుఁ గాంచు
గీ॥ భూమికన్యాకరాంభోజ ♦ ముక్తహేమ, జలజజాలంబుచేఁ దటి ♦ న్మిళితజలధ
రంబుతో మేలమాడుశ్రీ ♦ రామచంద్రుఁ,డంబుకేళులఁ దేలుచు ♦ నచటనపుడు.

చ॥ మెలఁతలు మేఘముం గడచు ♦ మించులనం జలజాకరంబునన్
లలితసరోజహల్లకము ♦ లం గొని కేళి యొనర్చి లీలలన్
వెలువడ వారల న్మఱల ♦ వేడుకతో సరసీలతాంగి తాన్
బిలుచుచు నుండెనోయన ధ్వ ♦ నించెఁ దరంగముఖంబులం గడున్. 109

చ. వెలువడివచ్చి నెచ్చెలులు ♦ వెంటనె ముద్దుమెఱుంగుమేనులన్
లలితసువర్ణభూషణము ♦ ల న్వెలిచాయల మించు పట్టుచీ
రల జిగిబెళ్కులం గులుకు ♦ తైకలఁ బూని సుమంబులెత్తి వే
నలుల ఘటించి రచ్చరల ♦ సం గమనీయవిలాసలీలలన్. 110

క. కొందఱు రఘురామునకుం, గొందఱు శ్రీమైథిలికిని ♦ కువలయనే
త్రల్,సుందరఫణితిం గైసే,యం దగిరిద్దరుఁ జతుర్వి ♦ ధాలంకృతులన్. 111

ఉ. ఆవసుధేశ్వరుం డలరె ♦ నయ్యెడ మంజులకాంతిమందిరేం
దీవరలీలలం గెలుచు ♦ దేహవిలాసముల న్మనోజ్ఞరా
కావిధుబింబముం గెలువఁ ♦ గాఁదగు ముద్దుమెఱుంగుమోమునన్
భావజుగెల్చు నాకృతి సు ♦ వర్ణమయాభరణంబులం గడున్. 112

చ. తొలకరిమించుబోలు మెయి ♦ తో నవమౌక్తికరత్నచారుకాం
తుల నగునవ్వువెన్నెలల ♦ తో నునుమేల్మిపసంటులం గనుం
దొలఁకగఁజేయుచన్గవల ♦ తో జిగిరాజిలు దొండపండుతోఁ
దులయగుఁ గావికెంబెదవి ♦ తోఁదగె నాచెలి గెల్చుచున్ రతిన్. 113

సీ. కడుమనోజ్ఞంబైనఁ ♦ గబరిఁ గాన్పించుగే, దఁగిరేకు లెమ్మెతోఁ ♦ దగనటించె
బెడగుపైఠాణిపా ♦ వడపైమెఱుంగుతో, బురుసావలువలీలఁ ♦ బరిఢవిల్లె
నునుముద్దుమోముచం ♦ దురుపై మనోజ్ఞక, స్తూరికాతిలకంబు ♦ సొగసుఁగాంచె
నీలోత్పలంబులఁ ♦ బోలునేత్రద్వయం, బులఁ గజ్జలంబు లీ ♦ లలఁజెలంగె
గీ. నమలమణికర్ణికలుతార ♦ హారములు సు, వర్ణమయకంకణంబులు ♦ వరుసగ నవ
యవముల విలాసములఁ గాంచె ♦ నవనివిభుండు,భూమికన్యకాలంకార ♦ ములనుతించె.

మ. లలనారత్నముఁ గూడి రాముఁడధికో ♦ ల్లాసంబుమై సద్వని
ర్మలలీలామయమాలతీరచితధా ♦ మశ్రేణులం భూరిజా

తిలతానిర్మితచారుమందిరములన్ ♦ దివ్యల్లతామల్లికా
స్థలులందు న్విహరించుచుండె సువిలా ♦ సశ్రీసముచ్ఛ్రాయుఁడై. 115

—* విందులారగించుట. *—

మ. రవివంశోత్తముఁ డిట్టుల న్నిజసతీ ♦ రత్నంబుతోఁ గూడి వే
డ్కవిహారంబుల మైఁ జెలంగు తఱిని ♦ గౌసల్య సద్భోజ్యవ
స్తువితానం బటకున్ ఘటించి స్వసఖీ ♦ స్తోమంబుచేఁ బంపె వా
రు వినోదంబుగ నారగించుటకుఁ ద ♦ ద్రోచిష్ణుకుంజంబులన్. 116

చ. వరుగులు శాకము ల్వడలుఁ ♦ బాయసము ల్వడియాలు కండచ
క్కెరలు ఫలంబు లన్నములుఁ ♦ గిచ్చడు లప్పడము ల్ఘృతంబు ఖ
జ్జురములుఁ దెచ్చి నెచ్చెలులు ♦ సుందరిపాత్రల నుంచి పిల్వఁగా
సరసిజమిత్రవంశనిధి ♦ చంద్రుఁ డటం భుజియించె సీతతోన్. 117

క. మధురసఫలములు రుచికర, మధురాహారములు విమల ♦ మకరందములుం
బ్రథితసుధారసములవలె, నధికముగా నారగించె ♦ నాతఁడు సతితోన్. 118

మ. భువనాధీశుఁడు రాముఁడిక్కరణి నా ♦ భూపుత్రితో భోజ్యవ
స్తువితానంబుల నారగించి కడుసం ♦ శుద్ధాంగభృంగారకాం
బువుల న్నిర్మలవక్త్రహస్తచరణా ♦ బ్జుం డైన నాక్షోణిపు
త్రి వెసం బైఁటచెఱంగుతోడఁ దడియొ ♦ త్తెన్ భర్తృపాదంబులన్, 119

మ. పిదపం భానుకులప్రదీపకుఁడునా ♦ విశ్వేశుఁడున్ మైథిలీ
సుదతీరత్నముఁ గూడి నీలమణిసం ♦ స్యూతాసనంబు న్వడిం
బ్రదివాగారగణాధిసేవితశచీ ♦ దేవియుతేంద్రుండనన్
విదితుండై చెలులెల్లపార్శ్వముల సే ♦ వింపంగ నెక్కెం దమిన్. 120

సీ॥ నెఱజాణయొక్కతె ♦ నిల్వుటద్దముఁజూపె, జలజాక్షియొకతె పోఁ ♦ కలనొసంగెఁ
గమలాక్షియొకతె బం♦ గారుగిండిం దాల్చె,లలితాంగియొకతె కా ♦ ళంజిఁబూనె
సరసాంగియొక్కతె ♦ చల్వవల్వల వైచె,జోటియొక్కతె వచ్చి ♦ సురటివిసరెఁ
గాంతాలలామయొ ♦ క్కతె నుతిం గావించె,ననబోఁడియొకతె ♦ గానంబుఁ జేసెఁ
గీ॥ దరుణియొక్కతె తగుబిరు♦దములఁ జదివె, సకియొకర్తుక తగుహెచ్చ♦రికలఁ జేసె.
సీతతోఁగూడి శ్రీరామ• భూతలాధి, నాయకుఁడుఁగొల్వుఁదీరియు♦న్న సమయమున

ఉ. ఆరమణుల్ నుతించిరి ధ ♦ రాధిపు నిట్టుల నీవిహాపితం
బారక రాబ్జజాబ్జజక ♦ రాబ్జవిలాసము నీదువిక్రమం

బారకరాబ్జజాబ్జజక ♦ రాబ్జవిలాసము నీదుసద్యశం
బారకరాబ్జజాబ్జజక ♦ రాబ్జవిలాస మటంచు నర్యేడన్. 122

—* వేశ్యలు రాముసన్నిధిని నృత్యగానాదుల సేయుట. *—

సీ॥ కులుకుపైఠాణిమొ ♦ గ్గలపైకలోపల,బిగిగబ్బిగుబ్బలు ♦ పిక్కటిల్ల
నిద్దంపుమగరాల ♦ ముద్దుకమ్మలడాలు,చెక్కుటద్దములతోఁ ♦ జెలిమిసేయ
నిద్దంపునగవు వె ♦ న్నెలలు నెమ్మోముక, ల్వలతేనితోఁగూడి ♦ వాదులాడ
మెండ్పుహస్తాంభోజ ♦ ములు ఘాలతలమాని, కుటిలకుంతలభృంగ ♦ కులముఁజేర
గీ. నధికయౌవనులగు వెల ♦ యాండ్రురామ,చంద్రునకువందనంబుల ♦ సంఘటించి
యవనినాథాజ్ఞవడసి యొ ♦ క్కస్థలముల, సకలనృత్యంబుల రచించి ♦ చారులీల.

శా॥ కైవారంబుల సేయువందులవలెం ♦ గైవారముం జేసి సీ
తావామామణినాయకాగ్రగుణసం ♦ తానంబు శ్లాఘించి వి
ద్యావైదుష్యముఁ జూపు నాట్యములు స ♦ ద్గానంబులుం జేసి వీ
ణావాద్యంబుల మించి రమ్యోడల నా ♦ నారీతులం దద్వనిన్. 124

చ. గవిసెనఁ దీసి బంగరపుఁ కాయలు గుబ్బల నంటఁబూని యొ
క్కవరుస మీటి తంతియులఁ ♦ గమ్మనిపద్ధతులన్ స్వరంబులన్
సవురువహించుతాలలయ ♦ సంగతి గీతములఁ న్విచిత్రవ
ర్ణవితతిఁ బాడె నొక్కచెలి ♦ రామునిసన్నిధి పెక్కురీతులన్. 125

ఉ. తంబురఁబూని యొక్కచెలి ♦ తాలవిధానము లుబ్బరింప రా
గం బనురక్తి రాలుగరు ♦ గన్నిగిమోడులు పల్లవింప న
య్యంబుజబాంధవాన్వయసు ♦ ధాకరుపైని పదంబుఁ బేర్మిఁ బా
డెం బులకాంకురంబు లట ♦ డీకొని సభ్యులకున్ జనింపగన్. 126

ఉ. ముద్దులగుమ్మ యొక్కరితె ♦ మోదముతో రఘురాముసన్నిధిన్
మద్దెలమ్రోతతోఁ బరమ ♦ మంజులతాళలయస్వనంబుతో
నొద్దికఁ జూపి నృత్తముల ♦ నుత్తమనర్తననృత్యలీలలన్
సుద్దముగా రచించె నట ♦ సుందరు లందరుఁ జూచి మెచ్చఁగన్. 127

మ॥ ఇటులన్ శ్రీరఘురామసమ్ముఖమునన్ ♦ హేలావిలాసాదులన్
స్ఫుటలీలామయవాచికాద్యభినయ ♦ స్ఫూర్తిం దగం జూపుచున్
నటనాబ్జాక్షివితాన మయ్యెడల స ♦ న్నాట్యంబుఁ గావించె న
చ్చట సభ్యావళిమానసాంబుజములన్ ♦ సంతోష మేపారఁగన్. 128

క. అపుడుం దగుఁబద్మకోశ, త్రిపతాకారాళకర్త ♦ రీముఖశుకతుం
డపతాకాదికరాభిన, యపరిస్ఫూర్తి నటుఁజూపి ♦ రతిశయలీలన్. 129

గీ. అధికకరుణతోఁ దత్తత్క ♦ లాధికముల, ధరణిజ కెఱిఁగించుచుండార ♦ తమ్మ మెఱిఁగి
కోరుపారితోషికముల ♦ వారికిచ్చి, కొల్వుఁజాలించె మీఁదర ♦ ఘుప్రవరుఁడు.

గీ. అంతలో నబ్జబాంధవుం ♦ డపరదిగ్వ, ధూమణిం జేరె నపుడుం గ ♦ ద్రామపద్మ
రాగసంఘటితాగ్రహ ♦ ర్మ్యగణకాంతు, లనఁగ నాసంజకెంజాయ ♦ లమరెమింట.

—* సంధ్యాకాలవర్ణము. *—

సీ॥ అపరదిఙ్నాథసౌ ♦ ధాగ్రరాజద్భర్మ, కలశనిర్యత్కాంతి ♦ గణములనఁగ
సమయాంతవిలసద ♦ స్తకుధరోన్నతశిఖా, జ్యోతిర్లతాతతి ♦ ద్యుతులనంగ
వారుణీసీమంతి ♦ నీరత్నసౌధాగ్ర, ఖచితపద్మరాగాధి ♦ దీప్తులనఁగ
యామినీరామాభి ♦ రామకంఠారుణ, మణిహారరుచికదం ♦ బములనంగ
గీ॥ రేవెలందినిఁ బెండ్లాడ ♦ రేవెలుంగు, రాగలఁడటంచు దేవతా ♦ రాము లంగ,ముల
ధరించుకెంబట్టుకోఁ ♦ కల మెఱుంగు, లనఁగ నాసంజకెంజాయ ♦ లమరెమింట.

గీ॥ అపరదిక్కామిని నిజాల ♦ యమున కినుఁడు, రాఁగ మేన దుకూలాంబ ♦ రంబుఁ దాల్చి
కోర్కితోఁ గబ్బిగుబ్బలఁ ♦ గుంకుమంబు, నలఁదెనోయన నపుడు సాం ♦ ధ్యంబుతోఁచె.

—* అంధకారవర్ణనము. *—

సీ॥ అసమానలలితలీ ♦ లాధిరాజితవిని, ర్మలవినీలమణిప్రా ♦ రంబు గెల్చి
ఘనతమాలావృత ♦ కాంతారరాజదం, జనమేదినీధరా ♦ జము నణంచి
సారంగకాదంబ ♦ శారికాదిఖగప్ర, శిక్షాణపూర్ణకా ♦ ళింది గెల్చి
రమణీయజలజాంత ♦ రమకరందమనోర, ధవిచరల్లోలంబ ♦ తతులఁ బోరి
గీ॥ కవిసెఁ గోకిలకాకోల ♦ కాలకంఠ, ఖంజరీటమతంగజ ♦ ఘనపయోధ
రసికురంబంబుల జయించి ♦ ఘనతరాంధ, కారమచలాతలవ్యోమ ♦ గహ్వరముల.

సీ॥ నిరతంబు ధరణిపై ♦ నిర్మలాంజనమును, మిన్నదియె వర్షించు ♦ మిన్ననంగ
సవరించుకొని మేని ♦ సంకేతముల కేగు, జారిణీశ్రేణికి ♦ సఖియనంగ
రజనీవిలాసినీ ♦ రత్నంబు నెమ్మేనఁ, దాల్చిననీలవ ♦ స్త్రంబనంగఁ
బరులవిత్తంబుల ♦ హరియించుమోషకా, వళికి బంగారంపు ♦ పంటయనఁగఁ
గీ॥ గడుభయంకరాస్తాచల ♦ కాననమున, మండుసంధ్యాగ్నిజాతధూ ♦ మంబనంగ
ధరణితలసంచరద్వారి ♦ ధర మనంగ, నంధకారంబు జగమెల్ల ♦ నాక్రమించె. 135

సీ॥ ఉడుకామజయవర్ణ ♦ యూధంబు తెలియఁగా, రహినలందిననల్ల ♦ రంగనంగ
నాత్మీయరత్నంబు ♦ నచలాతలంబుపై, నెమకఁగా వచ్చిన ♦ నింగియనఁగఁ

కులటాశిరోరత్న ♦ ముల దయారసముతోఁ, గాపాడుతారుపు ♦ కత్తెయనఁగఁ
గేరించితిరుగుశా ♦ కిన్యాదిభూతక, దంబకంబులకుఁ జు ♦ ట్టంబనంగ
గీ॥ దేవతాలోకమందిర ♦ దీపికాప్ర, తాననిష్క్రాంతధూమసం ♦ తానమనఁగ
నంజనాచలామలకాంతి♦ పుంజమనఁగ, నంధకారంబుజగమెల్ల♦ నాక్రమించె. 136

## —* తారావర్ణనము. *—

ఉ॥ అంతటఁ బ్రాగ్వధూమణికి ♦ నైకడుమోహముఁ జెంది యామినీ
కాంతుఁడు మౌక్తికప్రచయ ♦ కంబులవశ్యముగాఁగ వేడ్కతో
నంతటఁ బంచెనో యనఁగ ♦ నభ్రతలంబునఁ జారుతారకా
సంతతు లుల్లసిల్లినవి ♦ చక్కనిబారులుఁదీర్చి వెల్గులన్. 137

మ॥ వనవిల్తుం డనుభూమిపాలునకు ది ♦ ఙ్నారీమణు లాప్తులం
గని పుష్పంబులు లాజలుం గలిపి వే ♦ డ్కన్ సేసలుం జల్లిరో
యన రారాజదనంతసౌధమునఁ జె ♦ ల్వారుం గనద్దివ్యవ
జ్రనికాయంబుల గెల్చి యొప్పినవి తా ♦ రాశ్రేణు లశ్రాంతమున్. 138

సీ॥ గాఢాంధకారమే ♦ ఘములెల్లగుమిఁగూడి, కురిసినవడగండ్ల ♦ గుంపులనఁగ
నాకాశకటమున ♦ నచ్చరలెండించు, విమలముక్తాకదం ♦ బములనంగఁ
గమలాసనుఁడుసృష్టి ♦ కాలంబున న్వినో, దముగ మీటినకందు ♦ కములనంగ
రాత్రిసుందరిఁగూడ ♦ రాజువచ్చునటంచు, బుధకామినులుఁజల్లు ♦ పువ్వులనఁగ
గీ॥ జగములజయింపయత్నించు♦ మగనిమీఁద, లీలతో రతిసల్లుపే♦ లాలనంగ
నినకిరణతప్తతనువున ♦ నెసఁగుచెమట, చుక్కలోయనవిద్దంపు♦ రిక్కలమరె. 139

## —* చంద్రోదయవర్ణనము. *—

సీ॥ ప్రాగ్దిగ్విలాసినీ ♦ ఫాలభాగంబునఁ, జెలువారుకుంకుమ ♦ తిలకమనఁగ
గగనాంగనామణి ♦ కంఠహారంబులో, రాజిల్లునాయక ♦ రత్నమనంగ
నలిగికాలకిరాతుఁ ♦ డంధకారమృగంబుఁ, బరిమార్పఁదాల్చిన ♦ పవియనంగఁ
బుణ్యాంబరతమాల ♦ పూర్వదిక్శాఖామ, లనిభావిలసితప ♦ ల్లవ మనంగ
గీ॥ రాగమునఁ బ్రాగ్విలాసినీ♦రత్న మలర, ద్వారమున నుంచిన విమలా♦దర్శమనఁగ
శర్వరీవధూకర్ణ భూ ♦ షణ మనంగ, నుదయగిరిఁ జంద్రమండలం ♦ బుదితమయ్యె.
గీ॥ అచటనయ్యెడసాంధ్యకృ♦త్యములఁ దీర్చి, తగురవణములఁదాల్చిత♦త్ప్రాంతమునకు
సోదరభటాదిగణమువ♦చ్చుట నెఱింగి, జనవిభుఁడు రామచంద్రుఁడా♦వనము వీడి.

—* రామచంద్రుఁడుఁ బురిం బ్రవేశించుట. *—

సీ॥ పటహమర్దళశంఖ ♦ పణవాదివాద్యస్వ, నములెల్ల రోదోంత ♦ రముల నిండఁ
బడఁతులు సేవింపఁ ♦ బసిఁడిపల్లకి నెక్కి, విశ్వంభరాపుత్రి ♦ వెంటరాఁగఁ
బార్శ్వభాగంబుల ♦ భరతాదు లెలమితో, రమణీయమణిచామ ♦ రముల వేయ
వందిమాగధులునా ♦ నందించుచుం బురో, భాగంబున మహాస్త్ర ♦ వములఁ జేయ

గీ॥ సురకదంబకయుతపురం ♦ దరుఁడనంగ, భద్రకరి నెక్కి శ్రీరామ ♦ భద్రుఁ డపుడు
బాంధవులుమంత్రులనుజులు ♦ భటులుహితులుఁ, జేరిసేవింపనగరంబుఁ ♦ జేరెనపుడు.

—* పౌరకాంతలు రాముని జూచుట. *—

చ॥ పలుమఱుఁ బౌరకామినులు ♦ భానుకులేశ్వరురూపవైభవం
బులఁ దిలకించినప్పటికి ♦ మోదపయోధి మునింగి యిండ్లలో
పలఁ గలకార్యము ల్విడిచి ♦ బంగరుమేడల నెక్కి ముద్దుచె
క్కులఁ జిఱుచెమ్మట ల్వెలయ ♦ క్షోణితలాధిపుఁ జూచి రయ్యెడన్. 143

ఉ॥ రామ యొకర్తు మారుని శ ♦ రంబులఁ బోలెడు వాడిచూపులన్
రామునిఁ జూడఁగాఁ బరిస ♦ రంబున నుండు నెలంది కాంచి యో
భామిని నీవిట న్నిరుఁ ♦ బాసి కడుం బిగివాడిచూపులం
గోమలగాత్రు శ్రీయుతు ర ♦ ఘుప్రవరుం దిలకింతురే యనున్. 144

ఉ॥ జాజినఁ బుష్పమాల జడఁ ♦ జక్కఁగఁ జేర్పక చారుపాణిపం
కేరుహసీమఁ బూని యొక ♦ కేశిని పల్వడి కాంచెఁ బ్రీతిమై
సారణగండ్లనుండి నినుఁ ♦ జూచిన మారుఁడు వంచె నన్ను నా
క్రూరునిమార్గణంబు లివి ♦ గో యని చూపఁగఁ దెచ్చెనోయనన్. 145

చ॥ వెలఁదియొకర్తు చన్నవల ♦ వెల్గు మెఱుంగుల కెంపుతాళిలో
పల రఘువంశసింధువిధు ♦ భాసురరూపము గానుపింప ము
ద్దులచనుదోయిఁ గప్పకొని ♦ తోషముతోఁ దరినుండుబోటిచె
క్కులఁ గనుపించురామరఘు ♦ కుంజరవీరునిఁ గాంచె నయ్యెడన్. 146

చ॥ తరుణియొకర్తు తాఁ బటముఁ ♦ దాల్చుచుఁ నట్టులనెత్తిపట్టి భా
స్కరకులదుగ్ధవారినిధి ♦ చంద్రు రఘూద్వహుఁ జూడఁబోవ భా
సురనిజకంకణస్థనవ ♦ శోణమణి ప్రతిభాకదంబ మా
గరితకు మానరక్షణము ♦ గాఁ దగె నాసమయంబునం దమిన్. 147

చ॥ జలజదళాక్షి యోర్తు సర ♦ సంబుగ గుబ్బలఁ బత్త్రరేఖలన్
వలపునఁ గూర్చుచుండి యది ♦ వచ్చె రఘూద్వహుఁడన్న భ్రాంతిమై
బలితపు రామనామములె ♦ బంతులుగా లిఖియించి యట్లె తా
వెలువడెఁ బేరుమీఁదియని ♦ వింతగ భర్తకుఁ జెప్పెనోయనన్. 148

చ॥ కులుకుమిటారి యోర్తుక ర ♦ ఘుప్రవరామలరూపవైభవం
బుల నవరత్నకాంచనవి ♦ భూషితసౌధము నెక్కి కూర్మి ని
ర్మలనిజచారువీక్షణప ♦ రంపరలం గని దృష్టిమేపచి
హ్నల విడనాడి దేవగణి ♦ కాబ్జదళాక్షియన న్విరాజిలెన్. 149

చ॥ జలజదళాక్షి యొక్కరితె ♦ చక్కదనంబగు బైఁడిమేడపై
లలితసువర్ణభూషణము ♦ లం ధరియించుచుఁ దర్పణంబునన్
గలితపయోజమిత్రకుల ♦ కంధిసుధాకరురూపవైభవం
బులఁ దిలకించి మిక్కుటపు ♦ మోహముఁ గాంచె మనోంబుజంబునన్. 150

గీ॥ ఇటుల హృదయాంబుజములను ♦ త్కటముదంబు, తోఁ నగరకామినీమణి ♦ స్తోమమపుడు
లలితలాజలు విరులు సే ♦ సలుగఁ జల్ల, సొగుతోఁ మీఱు మొగసాలఁ, జేరె విభుఁడు.

క॥ కరినిం దిగ భరతుఁడు నిజ, కరమిడె లక్ష్మణుఁడు జరణ ♦ కంజంబులకుం
గరిమం బాదుకలఁ దొడిగె, నరితిఁ బిదపఁ జేడెలిచ్చి ♦ రా రతులపుడున్. 152

శా॥ శత్రుఘ్నుం డతిభక్తిఁ బాద్యమొసఁగెన్ ♦ సౌమిత్రివేడ్కన్ సిత
చ్ఛత్త్రగ్రాహకుఁడై చెలంగఁ బిదపన్ ♦ క్ష్మాపాలుఁ డీతండు స
న్మిత్రామాత్యభటాదివర్గముల నె ♦ మ్మిం బంపి విశ్వంభరా
పుత్త్రీమంజులహేమసౌధమునకుం ♦ బోయె న్విలాసంబుగన్. 153

గీ॥ పోయి నెచ్చెలులం గూడి ♦ భూరిహేమ, సౌధతలమున విహరించు ♦ సతినిఁ గూడి
కొంకక నొకజాము సరసంపు ♦ గోష్ఠి సలిపి, చెలుల మూఁదట నిజగేహ ♦ ములకుఁ బంపి.

—* రాముఁడు సీతా సౌధమున కేగుట. *—

సీ॥ క్ష్మాపుత్త్రికారత్న ♦ గమనారిరంసాప, రాయత్తమానసుం ♦ డై చెలంగి
తత్కాలయుక్తకృ ♦ త్యముల నిర్వర్తించి, నవమల్లికాసుగం ♦ ధముల విమల
కస్తూరికాసార ♦ కర్పూరశకలాది, కాంతిప్రశస్తప ♦ దార్థకముల
నళిరూపవైభవం ♦ బుల నణంచు మెఱుంగు, నీలంపు రాల వ ♦ న్నెలఁ జెలంగి
గీ॥ మందమారుత విహరణా ♦ నందకరన, వమణిసంఖచితఁ గవాక్ష ♦ సముదయములఁ
బరమశోణమణియుతసో ♦ పానతతుల, నింపుమీఱెడు సౌధంబు ♦ నెక్కియచట. 155

సీ॥ రతిని మోహించి యా ♦ రమణీకుచంబుల, వలపుచే వ్రాలు పూ ♦ విలుతులీలఁ
గుసుమభూషితవేణి ♦ విసరి రోహిణిఁగొట్టఁ, బ్రీతితో వేడు జా ♦ బిల్లిలీలఁ
బలుగిన్కతోఁ జూచు ♦ పౌలోమి నెదనుంచి, తనరారు పాకశా ♦ సనుని లీల
నెలమిఁ గెమ్మోవి తే ♦ నెలఁ నిమ్మటంచు రం,భను వేడు నలకూబ ♦ రునివిలాస
గీ॥ ము నతియోగ్యంబుగా లిఖం ♦ చినపసిండి, గోడల మెఱుంగు రతనాల ♦ గుబ్బలజిగిఁ
బరిమళద్రవ్యములఁ జూచి ♦ ధరణివిభుఁడు, మదిని వర్ణింపఁజాలని ♦ ముదముఁ గాంచె.

సీ॥ పగడంపు జిగినింపు ♦ పట్టెమంచము దోమ, తెఱలఁ జెల్వంపు క్రొ ♦ వ్విరులపాన్పుఁ
బలుమెఱుంగుల నింపు ♦ బైఁడిపళ్లెరముల, లీలలం జెలఁగుమ ♦ ల్లెవిరిసరులఁ
గపురంపుబరణులఁ ♦ గ్రాలుజాళ్వాగిండి, నిల్వుటద్దములఁ బ ♦ స్నిటిక్రోవి
సౌరులం గుల్కు బం ♦ గారుసేలలఁ దావి, వెదజల్లు శృంగార ♦ వీజనములఁ
గీ॥ దళ్కులం గూర్పు మంచిగం ♦ దంపుఁగోరఁ, బచ్చికస్తురిపెట్టె సం ♦ పంగినూనె
మాలతీమల్లికాదిక ♦ తైలములను, గాంచి రఘురాముఁ డపుడును ♦ త్కంఠుఁ డయ్యె.

సీ॥ చెలువంపు జిగినింపు ♦ చికిలిబంగరుకోళ్ళ, బలితంపుఁ బగడంపు ♦ పట్టెయలును
సరిలేనిరతనాల ♦ మెఱుఁగుతోఁ దగుదోమ, తెఱలు నిద్దంపుపం ♦ దిరిమెఱుఁగులుఁ
నతిసుగంధంబుతో ♦ నలరు పూపాన్పుపైఁ, బఱచినవలిపంపు ♦ మెఱుఁగువల్వ
లతివిలాసంబుతో ♦ నలరు ముద్దులముత్తె, ములకూర్పుతో వెల్గు ♦ తలగడలును
గీ॥ మెఱుఁగుబురుసా తెరయు లీలఁ ♦ బరిఢవిల్లఁ, బట్టెమంచముపై రామ ♦ భద్రుఁడున్న
సమయమున నాత్మమానసా ♦ బ్జమున మోద,మలర నయ్యెడ నవనిక ♦ న్యాలలామ.

చ॥ తిలకము ముద్దునెన్నుదుటఁ ♦ దిన్నఁగ దిద్ది మెఱుంగుమేన నూ
త్నలలితరత్నభూషణవి ♦ తానములం ధరియించి నూపురం
బులు గలుగల్లుమంచుఁ గడు ♦ బ్రోవఁగఁ గట్టి దుకూలచేలముం
బలుతవిం వచ్చె రామమహి ♦ పాలకుచిత్తము పల్లవింపఁగన్. 159

క॥ వచ్చికపురంపుఁబోఁకల, నిచ్చి మడుపుల నిడి పిదప ♦ నెక్కుడు సేవ
ల్మచ్చికతోఁ జేయంగా, నచ్చెలినిం గలసి రాముఁ ♦ డానందించెన్. 160

క॥ విరివిల్తుఁడు విరితూపులఁ, బరువడి నేయంగ నరుణ ♦ వంశాబ్ధిసుధా
కరుఁడున్ మైథిలియును న, య్యిరువురు రతిలోలు రైరి ♦ హేలలు మీఱన్.

సీ॥ అలరుపుక్కిటివిడెం ♦ బుల గ్రహించి తమితో, నధరామృతరసంబు ♦ లానియాని
ద్యూతంబు వైఖరి ♦ నొగ్గి పందెము వైచి, వివిధబంధములలోఁ ♦ బెనఁగిపెనఁగి
చుంబనాలింగన ♦ స్ఫూర్తులం గావించి, సొలపుతో లీలలఁ ♦ జొక్కి చొక్కి

కడలేనిమోహసా ♦ గరమునం దేలుచుఁ, గడువిలాసములతోఁ ♦ గలసి కలసి
గీ॥ సొలపుఁజూపులనొండొరుఁ ♦ జూచి చూచి, చెలిమితో నేర్పులీలలఁ ♦జిక్కి చిక్కి
పులక లుబ్బంగ సుమశితం ♦ బుల వినివిని, చెలఁగిరి సతీపతులు నట♦లలితగతుల.
సీ॥ మదనమోహనబాణ♦మంత్రాక్షరములనం, జెలఁగునొండొరుల భా♦షితములెల్లఁ
బంచబాణుండేయు ♦ వాల్తూపులనఁ జెల్లు, సోలియొండొరుఁ జూచుఁ♦ జూపులెల్ల
నతనులీలారహ ♦ స్యస్థానములనంగఁ, దనరు నొండొరులంటు ♦ తావులెల్ల
సుమబాణఘనఖేల ♦ నములనం దగునొండొ,రులురాగమున నెంచు♦ తెలఁపులెల్ల
గీ॥ వారిసొరులు వలపులు ♦ వారివగలు, వారిచేష్టలు వన్నెలు ♦ వారికళలు
వారిలీలలు హేలలు ♦ వారిపనులు, వారిచిన్నెలు నెన్న నె ♦ వ్వారికగునె.
సీ॥ మురిపెంపునుదుటిముం ♦ గురులుతిన్నఁగఁదువ్వి, కోర్కితోఁదగుకీలు♦కొప్పువెట్టి
వన్నిటితో నాస్య ♦ పద్మంబుఁ గడిగి చ, క్కఁదనంబుగాఁ దిల ♦ కంబు దిద్ది
డెక్కలంగను ముద్దు ♦ చెక్కుటద్దంబుల, రమణీయపత్త్రిభం ♦ గములవ్రాయు
ఘనసుగంధంబుతోఁ ♦ దనరారు జవ్వాదిఁ, గమనీయవక్షోరు♦హములఁబూయుఁ
గీ॥ బచ్చవిల్తునిపనులలో♦నొచ్చెనేమొ, యొత్తుదునెయంచుఁబదముల♦నుంచుకరముఁ
డెక్కఁజూపుచు నోటపీ ♦ డెంబు నిచ్చు, బాళిఁ జెలినిట్లుఁగరగించి ♦ పతిచెలంగె.
చ॥ చతురిమఁ జూపి బంధముల ♦ సారెకు సల్పుమెలంగుచుక్ రద
క్షతనఖరక్షతంబు లెసఁ ♦ గం దగునేర్పులలోఁ జెలంగుచుక్
రతులకు సోలుచుక్ మదన ♦ రాజు విలాసముగా రచించు స
త్ప్రతిమలవైఖరి న్వఱల ♦ రాతిరియే చనె నివ్విధంబునన్. 165.
కం॥ ఈలీల రేల మైథిలి, నేలుచుఁ బగలెల్ల ధరణి ♦ నేలుచుఁ గీర్తి
శ్రీలోలుఁడై సకలభూ, పాలురు వినుతింపఁ నతఁడుఁ ♦ ప్రఖ్యాతిఁగనెన్. 166.
కం॥ శ్వశ్రూజనవిహారిదిక, శుశ్రూషాఁగతుల నధిక ♦ సుకృతాయనబ
ద్ధశ్రద్ధాభక్తులతో, నశ్రాంత మలరె జనకన్య♦హాత్మజ మిగులన్. 167.
సీ॥ స్నానసంధ్యావంద♦న జపాదు లర్హా కా, లమునందె విధివిధా ♦ నముగ సల్పి
చారుకేయూరభూ♦షణమాలికాదుల, సమయోచితంబుగా ♦ సంగ్రహించి
భోజ్యవస్తువులఁదాం ♦ బూలాదులందేహ, మునకు నింపగురీతి ♦ ననుభవించి
కామలీలాదిభో ♦ గములలీలలతోఁ ద, గినవిధానంబుగా ♦ ననుసరించి
గీ॥ మహితవర్ణాశ్రమాదిధ♦ర్మంబునెఱిఁగి, జానకింబ్రోచుచు న్సర్వ ♦ జనులఁగాఁచు
చు ననుజులఁ బ్రోచుచుం బ్రీతిఁ ♦ జూడఁ దల్లు, లర్కకులభూషణుండు రా ♦
జ్యంబు నేలె. 168.

కం॥ పదివేలవత్సరంబులు, వదలక మహి రాముఁ డేల ♦ వలెనని లోకు
ల్మదిఁ దలఁపఁగ మైథిలితోఁ, బదివేలేడులు సుఖించె ♦ బహుసంప్రీతిన్. 169

చ॥ జనవిభుఁ డావెలంది నెఱ ♦ జవ్వనమంతయుఁ గొల్లలాడఁగా
జనకజగర్భచిహ్నల వె ♦ సన్ ధరియించె విలాసిరీతులన్
ననవిలుఁదుండు మించి మది ♦ నాటఁగఁ బువ్వులముల్కు లేయ ము
న్ననువుగ నీశుఁ గూడి యుచ ♦ లాత్మజ గర్భిణిఁదాల్చునై వడిన్. 170

## —* దోహదవర్ణనము *—

సీ॥ మగరాలకమ్మల ♦ జిగిక్రమ్మెనో యన, నలరారుజెక్కులఁ ♦ దెలుపుమీఱె
న్యస్తకస్తూరికా ♦ హారికాంతియొ యన, న్వాలఁదిచూచుకముల ♦ నలుపు మించె
సురతకాంక్షంగృశిం ♦ చువిధంబుఁజూపెనో, యనఁ జెలంగు చెలిదేహ ♦ హముకృశించె
నీలంపుసరముల ♦ డాలువ్యాపించెనో, యన నొప్పువెలఁదినూ ♦ గారుమీఱె

గీ॥ వరమణివిభూషణంబులు ♦ బరువులయ్యె, బహుమనోరథమొదవెమృ ♦ ద్భక్షణమునఁ
జెలులమాటలు బెట్టిదం ♦ బులుగఁదోఁచె, క్ష్మాసుతకు దౌహృదంబులు ♦ గలిగినపుడు.

చ॥ వెలఁదిపయోధరంబు లతి ♦ వేలపయోధరపూర్ణభావమై
నిలిచెడువేళఁబోవుతమ ♦ నెయ్యపువృత్తినిఁ బూన ముందుగా
వెలువడెనో యన న్మొగుల ♦ వింతలతోఁ దనరారుగర్భిణీ
లలనకుఁ జూచుకంబులు వి ♦ లాసముగా నలుపెక్కె నత్తరిన్. 172

సీ॥ కంజేక్షణకు వింత ♦ గాఁ దోఁచె శేఁజూలి, రవణంబులెల్ల దు ♦ ర్భరములయ్యెఁ
దినుబండములమీఁదఁ ♦ దీపు లగ్గలమయ్యె, మృద్భక్షణాదుల ♦ మెప్పుకల్గెఁ
బరులతో భాషింప ♦ బహుకష్టతరమయ్యెఁ, గోమలాంగికి నడ ♦ లొక్కిసులయ్యెఁ
జెలువంపుఁజెక్కులఁ ♦ దెలుపుచాయలుమీఱె, విమలమంజులశరీర ♦ ముకృశించెఁ

గీ॥ జెలులమాటలు బెట్టిద ♦ ములుగఁ దోఁచె, నమలనీలంబులో యన ♦ నమరెనారు
ప్రకటగుణరాజితశ్రీజ ♦ నకతనయకు, నలరదౌహృదచిహ్నలు ♦ గలిగినపుడు.

కం॥ కుదురైనబొంగరంబుల, నదికిన నీలంపుముల్కు ♦ లన చూచుకముల్
సదమలకుంభములో యన, సుదతీమణికుచములపుడు ♦ సొగసులమీఱెన్. 174

గీ॥ ఇటులగర్భంబుఁదాలిచి ♦ యింతియొక్క, నాఁడుఁజెలియలుమణిభూష ♦ ణములఁదెచ్చి
తెలివిఁగైసేయ దేవతా ♦ స్త్రీయనంగ, హెచ్చిరహిఁబతిచెంతకు ♦ వచ్చెనపుడు. 175

శా. ఆలోకించిజగత్పవిత్రరవివం ♦ శాంభోధిసోముండు న
చ్చాలాలిం దొడఁ జేర్చి సద్రుచుల మిం ♦ చుం జెక్కులన్ స్వేదబిం
ద్వాళిం జారుకరంబుచేఁ దుడుచుచున్ ♦ హారిప్రభాగేహహా
రాళిం జిక్కులఁ దీర్చుచుం బలికె రా ♦ గాంభోనిధిం దేలుచున్. 176

మ॥ వరమందస్మితకాంతులుంట నెపుడున్ ♦ వ్యాపించెనో తద్రుచు
ల్వరకల్యాణముఖేందుబింబసురుచు ♦ ల్వ్యాపించెనో చారువ
జ్రరుచిం గెల్చినకీర్తియోయన జగిన్ ♦ రాణించు నీచెక్కులం
బరగెం బాండిమ తారదర్పణనిభా ♦ భాగ్యంబు సేకూరఁగన్. 177

ఉ॥ చారువిలాసమందిరకు ♦ చద్వయనిర్మలసాంద్రసారశృం
గారరసంబు చూచుకవి ♦ కాశితనీలిమఁ గానుపించి శృం
గారకురంగనాభనవ ♦ కాంతి విరాజిలి మీద నీదునూ
గారుమెఱుంగులం జెలఁగె ♦ నబ్జదళాక్షిమనోహరంబుగన్. 178

కం॥ మురిపెంపునీదుగుబ్బల, బరువునకు న్వెఱచి దీన ♦ భావముతోడం,
బరఁగెడునీనడుమున కి, త్తఱి గర్భం బభయమిచ్చె ♦ తరుణి ఘనదయన్. 179

కం॥ సోముం గెలిచెడు నీనె, మ్మోముం బ్రీతిం ధరిత్రి ♦ ముద్దిడుకొనెనో
భామిని కాదేనియు నీ, మోమున మృద్గంధమెట్లు ♦ ముడివడెఁ దలఁపన్. 180

చ॥ కులుకుమిటారి నీకుఁగల ♦ కోర్కి ఘటించెదఁ గోడుమంచు ని
స్తులసరసీజబంధుకుల ♦ దుగ్ధపయోధిసుధాకరుండు దే
నెల నిరసించుమాటల వి ♦ నిర్మలమానసవారిజంబునం
జెలిమినిఁ బల్కఁగా నపుడు ♦ సీత తమి న్వచియించు నీగతిన్. 181

శా॥ సారంగాళికి డప్పిఁ దీర్పఁగఁ బులుల్ ♦ సారంగహస్తాంబువుల్
సారంగాదికులశ్రమం బణఁప ని ♦ చ్చ ల్గూర్చుభాగీరథీ
తీరారణ్యములం జెలంగు మునిప ♦ త్నీశ్రేణితోడ న్ఫలా
హారంబుం గొని యొక్కనాఁడుఁ దిరుఁగన్ ♦ బ్రార్థింతు రాగంబునన్. 182

చ॥ అనవుడు సమ్మతించి మను ♦ జాధిపుఁడు న్నిజభామినీమణిం
గని నినుఁగోరినట్టుల జ ♦ గజ్జనసంస్తవనీయతీర్థపా
వనతరగాంగభూములకుఁ ♦ బంపెద నంచని ముద్దుచెక్కులం
జనవున నొక్కి యావెలఁది ♦ సౌధములోపలికన్ని మీదటన్. 183

క॥ నరవినుతసద్గుణాఢ్యులు, గురుబలులుం ద్వారపాల ♦ కులు మ్రొక్కలిడన్
నరవిభుఁడు మధ్యకక్ష్యాం, తరముం జేరి పరమకరు ♦ ణాశీలుండై. 184

—* రాముఁడు భద్రుఁడను నర్మసఖుని పౌరవృత్తాంతములడుఁగుట. *—

గీ॥ లలితరత్నాసనంబు న ♦ లంకరించి, మంత్రిపుంగవబంధుసా ♦ మంతధరణి
నాయకులుభద్రమత్తాది♦నర్మసఖులుఁ గూడిపార్శ్వంబులంగొల్వఁ♦గొల్వుఁదీర్చి.

సీ॥ శ్రుతులనాగమముల ♦ స్మృతులం బఠించివి, ద్వజ్జను ల్సల్పువా ♦ దముల వినుచు
ఘనపురాణజ్ఞులు ♦ వినుపించుసర్వపు, రాణకప్రౌఢిమా ♦ ర్థముల వినుచు
నవరసాలంకార♦నైపుణ్యములు మీఱఁ, గథకోత్తములుఁజెప్ప ♦ కథలవినుచు
సరసంబలరసర్వ ♦ జాతీయకములలో, హాసకు ల్నుడువుహా ♦ స్యముల వినుచు

గీ॥ నలరఁగాలముఁబుచ్చుచుఁ♦గొలుచువారి, నెల్లరనుఁబంపిమీఁదట♦హితులుఁగొల్వఁ
గొంతతడవు నిదానించి♦కూర్మిఁభద్రుఁ, గాంచిరఘునాయకుండుభా♦షించెనిటుల.

ఉ॥ వింతలు ధాత్రి నేమయిన ♦ వింటివె పౌరులు నన్ను నెట్లు భా
వింతురు తద్విశేషముల ♦ వీనుల సోకిన సోదరాదు లే
మెంతురు తద్వచస్సరణి ♦ నీవయెఱుంగుదు వింక నాకు వి
న్నంతయు దాచిపెట్టక య ♦ థార్థముగా వివరింపు మంచనన్. 187

—* భద్రుఁడు పౌరవృత్తాంతముల రామునకు విన్నవించుట. *—

మ॥ విని భద్రుండు నమస్కరించి పలికెన్ ♦ విశ్వంభరాపాల మీ
ఘనచారిత్రము వేయినోళ్ళఁ దలఁపం ♦ గా విందుఁ బిత్రాజ్ఞచే
వనులం జేరి మహోగ్రజీవననిధిన్ ♦ బంధించి దైత్యాళిఁ గూ
ల్చినకార్యంబుల నెల్ల నెంచుటలు భా ♦ ళి న్మాని నిందింతురే. 188

చ॥ ఇలనరకోటికిం దరమె ♦ యిట్టిమహాఖరదూషణాది దై
త్యుల నలవాలినిం దునుమ ♦ దోర్బలకీశులచేఁ బను ల్గొనన్
జలము లఁ గొండలన్నిలుపఁ ♦ జాలఁగ నీతఁడు నాగిరీశుఁడో
జలజదళాక్షుఁడో యని వె ♦ సన్ జను లాడఁగ విందు నేయెడన్. 189

చ॥ అనవుడుఁ గ్రమ్మఱం బలికె ♦ నావిభుఁ డాతని కిట్లు భద్ర నీ
వనుపలుకు ల్నిజం బయిన ♦ నందరుఁ బౌరులు లోకులు న్ననున్
జనకజనుం గురించి సద ♦ సద్వచనంబులఁ బల్కుచోట నే
మనుకొను చుందు రాపలుకు ♦ లాడుమటంచని నావుఁ డయ్యెడన్. 190

శా॥ ఆతం డిట్లనె నాలకించి రఘువం ♦ శాధీశ పల్మాఱు స
న్నీతిజ్ఞు ల్నిజము న్వచింపుమనినన్ ♦ హీనాత్మకు ల్పల్కు స
త్కే తథ్యంబని విన్నవింతు నది మీ ♦ కేలా విచారింప నీ
రీతిన్ మూర్ఖజనంబులే యెడల ధా ♦ త్రి న్మెచ్చ రేరాజులన్. 191

సీ॥ కరుణతోఁ నిల నేలు ♦ధరణిపాలుం గాంచి, మెత్తనివాఁ డంచు ♦ మెచ్చ రతనిఁ
దగుశిక్షల విధించి ♦ ధర నేలు నృపుఁ గాంచి, హింసకుం డని లోకు♦లెంచ రతనిఁ
బరమధైర్యౌదార్య♦వంతుఁడౌ నృపుఁ గాంచి, కర్కశుండని జను♦లాడియ రతని
సాధుబృందముఁ గాచు♦క్ష్మాపాలకుం గాంచి, పక్షపాతి యటంచుఁ♦బడయ రతని
గీ॥ ననుచు నిటులఁ బల్కెడు మూర్ఖు♦లవని నెమ్ముఁగుదు రటువంటి దుష్టమూర్ఖు♦
లను సరకుఁ జేసి వారల మాటలఁ ♦ జెవులఁ బెట్ట, మీకుఁ జెల్లునె శ్రీరామ♦
మేదినీశ. 192

గీ॥ ఐన భూమిజనులుఁ బౌరు♦లాడుమాట, లు విన మీరలు నతిశయ♦ లోలుపమతి
నడుఁగమీశాసనము చేభ♦యంబుఁ జెంది, తెలిపెదంబౌరభాషిత♦ములను వినుఁడు.

సీ॥ పరమపావనతరే ♦ క్ష్వాకువంశంబునఁ, జన్మించి శ్రీరామ ♦ చంద్రవిభుఁడు
సమరారినాథుండు ♦ స్యందనంబున నుంచుకొని యెత్తికొనిపోయి♦ కూర్మిమీఱ
లంకలో నేటికా ♦ లముదాఁక నుంచినఁ, బద్మాక్షి సంశయిం ♦ పక యె మఱల
నెలమితోఁ గొనివచ్చి♦ యెబ్బెరికము లేక, వలరాజు మేలుతూ ♦ పులకుఁ జిక్కి
గీ॥ యేలుచున్నాఁడు పగతు లే♦యింతులఁ జర,లఁగొనిన మఱలఁ గొనివచ్చి♦కలియ
వచ్చుఁ, బ్రజకు రాజాయనంబె ధ ♦ ర్మంబుగాదె, యనుచు దుర్జను లెవ్వలో ♦
యనిన నేమి. 174

చ॥ విని విని ప్రాణము ల్విసికె ♦ వీథుల నెచ్చట నైనఁగాని యి
ట్లనుకొనువార లట్లనెడు ♦ నజ్ఞుల నాపఁగ శక్యమౌనె యో
యినకులచంద్ర! యీజనుల ♦ నేమనజెల్లునటంచుఁ దెల్పఁగా
విని విని శూలము ల్చెవుల వ్రేసినవైఖరి నుండె జేనికిన్. 195

—* రాముఁడుఁ దమ్ములఁ బిలిపించుట *—

ఉ॥ ఈవిధి మాటలాడక ను ♦ హీశ్వరుఁ డించుక మౌనమూని తా
నావెతనుం ద్యజింపఁ దగు ♦ నాప్తజనంబులఁ బంపి మీదటన్
సేవకు నొక్కనిం బిలిచి ♦ శీఘ్రగతిం జనుదెంచి వెంట నీ
తావున కీవు నాయనుఁగుఁ ♦ దమ్ములఁ దోడ్కొనిరమ్ము పొమ్మనన్. 196

గీ॥ వాఁ డధికశీఘ్రగామియై ♦ వారి వారి, యిండ్లకడ కేగి రామధా ♦ త్రీశ్వరాజ్ఞఁ
దెలియఁజేయఁగ లక్ష్మణా ♦ దులుఁ బిలుచుట, కిప్పు డేమో యటంచు వా ♦
రేగుదెంచి. 197

మ॥ పలునిట్టూర్పుల వాడు కెంబెదవితో ♦ బాష్పాళిరుద్ధేక్షణం
బులతో హాసములేని నెమ్మొగముతో ♦ భూయిష్టదైన్యాకృతిం

జెలఁగుచు౯ రామునిఁ గాంచి వారలట ని ♦ శ్చేష్టత్వముం బూని భీ
తిలి కట్టా! యనుచు౯ దిగుల్వడుచు బ ♦ త్తిం జేరి తత్సన్నిధి౯. 198

ఉ॥ ఏమిటి కిట్టి తాపము మ ♦ హీశునకుం జనియించెఁ గారణం
బేమియుఁ దోపదాయె గణి ♦ యించిన నెట్టిది తీరునో గదా
స్వామి కటంచు మ్రొక్కి కడు ♦ సంకటముం గను ముద్దుతమ్ములం
బ్రేమఁ గవుంగలించి పృథి ♦ వీవిభుఁ డయ్యెడ వారికిట్లను౯. 199

—* రాముఁడు దమ్ములకుఁ బౌరవృత్తాంత మెఱింగించుట. *—

మ॥ కనుల న్నీరటఁ గాల్వలై పఱఁగ భూ ♦ కాంతుండు దైన్యంబుతో
ననుగుం జుట్టము లాప్తబంధువులు జీ ♦ వార్థంబులు న్నీరలై
నను ధాత్రీశ్వరుఁ జేసి కొల్తు రిటఁ గా ♦ నం జేయ నే నెద్దియై
నను మీతో ననకిష్టు లోకులను నిం ♦ దావాక్యము ల్వింటిరే. 200

మ॥ అనవారల్విని యేమినిందయొ మహీ ♦ శాగ్రేసరుం డెప్పుడై
నను నీవైఖరిఁ బల్కనేరడని చిం ♦ తాబాధితస్వాంతులై
తనరారం గని వారినెమ్మొగములన్ ♦ ధాత్రీశ్వరాగ్రేసరుం
డనె నీరీతి మనంబునం దిగులుతో ♦ నాలింప వారందఱున్. 201

చ॥ చెఱఁగొనిపోయి రావణుఁడుఁ ♦ జెచ్చెర నాత్మపురంబుఁ జేర్చి కీ
డ్పఱచిన భూమిపుత్త్రి మఱి ♦ బారికి లోఁబడి కోడి తెచ్చి యె
బ్బెఱిక ములేక కూడె రఘు ♦ వీరుఁడు బాపురె రాజధర్మము౯
మఱచినటించె నంచు భువి ♦ మానవులాడెడు దూఱు వింటిరే. 202

చ॥ పరుఁడిపుడే లతాంగిఁ జెఱ ♦ పట్టిన నా ఖలుఁ జంపి సాధ్వి యీ
తరుణి యటంచుఁ జేకొనుట ♦ ధర్మముగా గణియించె ధాత్రి భా
స్కరకులవార్ధిచంద్రుఁ డిఁక ♦ సందియ మేటికటంచు మేదిని౯
నరు లనునట్టిపల్కులు వి ♦ న౯ మదినాటె శరంబులో యన౯. 203

క॥ మీ కేమి చెప్పవాఁడీ, కాకుత్థ్సుం డిఁక యటంచు ♦ కన్నీరిడుచు౯
లోకారాధ్యుఁడు రాముఁడు, శ్రీకరు సౌమిత్రిఁ గాంచి ♦ చెలిమిం బలికె౯. 204

శా॥ అవురా! లక్ష్మణ నీ వెఱుంగవె సమ ♦ స్తాదిత్యగంధర్వరు
ద్రవిధాత్రాదులు సిద్ధసాధ్యులు మునీం ♦ ద్రశ్రేణులుం జూడఁగా
నవనీపుత్త్రిని నేను నొల్లక మహా ♦ గ్రాగ్నిం బ్రవేశింపు మ
న్నవిధి౯ మైథిలి వహ్నిలోఁబడుటయు ♦ న్శ్లాఘించుట ల్లోకముల్. 205

చ॥ అనలసురాగ్రగణ్యుఁ డచ ♦ లాత్మజ మీఁదటఁ దెచ్చియిచ్చి యీ
వనజదళాక్షి సాధ్వి తలఁ ♦ పన్ భువనం బఖిలాంతరాత్మునై
ఘనదయఁ జూతు నేనెపుడుఁ ♦ గన్బడ దించుకయైన దోషమం
చనదె తదీయవాణి సుర ♦ లాడరె తథ్యమటంచు నయ్యెడన్. 206

చ॥ అని దనుజాధినాయకు గృ ♦ హంబుననుండెనటంచు నేను మూ
ర్ఖనరులు దూఱువారనుచుఁ ♦ గాదె బుధాదులుఁ జూచుచుండఁగా
ననలము నుండఁజేసి చొం ♦ మంటి నిటు ల్సురలెల్ల రిచ్చ్వకం
బునకు మహీజ మంచిదని ♦ బొంకిరొ నేనిపుడేమి సేయుదున్. 207

మ॥ అలహీనాత్మకు లాడుభాషితములన్ ♦ న్యాయంబటంచెంచి భే
తిలఁగా నేటి కటంచు మీరనిన థా ♦ త్రిం దుష్టచిత్తంబునం
దులువ ల్దారిన నింద్యుఁడై చనియు నా ♦ దుష్కీర్తిమంతుండు బా
ధలఁగాంచు న్నరకంబుల న్మిగుల నా ♦ తారార్క చంద్రంబుగన్. 208

క॥ స్వర్గద్వారంబు సుజన, వర్గంబుల కబ్బు నధిక ♦ పాపాత్ములకున్
దుర్గతినగరము నిజము, స్వర్గముచే నబ్బు ననుచు ♦ చాటించె విధుల్. 209

క॥ ఇలఁ బ్రతికియుఁ జచ్చినవా, రలు నిందలఁగాంచువారు ♦ రమణీయ విని
ర్మల కీర్తిమూర్తులేగియు, నిలఁ బ్రతికిన ఘనగుణాఢ్యు ♦ లేయెడనైనన్. 210

గీ॥ కాన సడికోడి ప్రాణంబు ♦ లైనఁ బ్రాణ, సమితికెల్లఁ బ్రాణములగు ♦ మిముల నైన
విడుతునవిపల్క నీబోటి ♦ విడుచుటెంత, తమ్ములార మనమున నీ ♦ తలఁపులేల. 211

—* లక్ష్మణాదులు దుఃఖించుట. *—

ఉ॥ మానవు లాడుదూఱెడల ♦ క్ష్మాతనయామణిఁ గాన కంపఁగా
నే నిపుడు న్సుఖం బనుచు ♦ నెంచితి నయ్యది మంచిదైనఁగీ
డైనను మాఱుమాటలిఁక ♦ నాడకు డాడితిరేనిమీకు నా
యానసుమీ యటంచు నతఁ ♦ డాడఁగఁ గొందల మంది రందఱున్. 212

క॥ అనిరాముఁడు సౌమిత్రిం, గని మీవదిన ననుఁ బరమ ♦ గాంగతటతపో
వనులం గను కోర్కి కలిగె, నని వాక్రుచ్చెనది తథ్య ♦ మయ్యె నటంచున్. 213

—* రాముఁడు వాల్మీకివనసన్నిధానంబున సీతను విడిచిరమ్మని
లక్ష్మణున కాజ్ఞాపించుట. *—

మ॥ పలుకష్టంబునఁ బల్కి రేపె మనుజ ♦ వ్రాతంబులుం బల్కనిం
దలు మాన్పంగ సుమంత్రిసజ్జితరథా ♦ ధ్యారూఢఁ గావించి కా
నలశృంగారముఁ జూడరమ్మనుచు వెం ♦ ట న్నీవు గొంపోయి ని
ర్మలవాల్మీకిమనోహరాశ్రమము చే ♦ ర్వం డించి రమ్మా వెసన్॥ 214

గీ॥ ఇంతిపై యిట్టి కాఠిన్య ♦ మేల యనకుఁ, దొయ్యలికి నాకు నిక నేటి ♦ తోఁబుట్టంబు
దీఱెఁ గాదేని చెలి క్రిట్టి ♦ దూఱు కల్ల, దిట్టిమాటల నాడఁగా ♦ నేమిఫలము.

కం॥ అనియిట్లుఁ బల్కి రాముం, డనుజుల శాలలకుఁ బంప ♦ నానతముఖులై
కనులం బాష్పము లొలయం, జనిరి పిదపఁదా వగచుచు ♦ శాలకుఁ బోయెన్.

గీ॥ లక్ష్మణాదులు స్వస్వశా ♦ లలకుఁ బోయి, బాష్పధారలు లోచనా ♦ బ్జములనాని
నిద్రమాన్పంగ రేయెల్ల ♦ నెగులుఁ గాంచి, యవ్విధమున వేగించిర ♦ య్యవసరమున.

కం॥ ఖలుఁ లాడు మాటలకు నీ, కలికి న్విడువందలంపఁ ♦ గానోయే మో
జలజాప్తాన్వయనాథున, కల రాతిరి బ్రహ్మకల్ప ♦ మయ్యెన్మదికిన్. 218

—* లక్ష్మణుఁడు వనములకు సీతం గొంపోవ యత్నించుట. *—

చ॥ జనములు దూఱఁగా నిపుడు ♦ జానకిఁ గానల కంపఁబూనె నీ
జనవిభుఁ డంచుఁ దాఁ దలఁచి ♦ సద్గుణవంతుఁడు లక్ష్మణుండు సూ
ర్యునిఁ గని కాల్యకృత్యముల ♦ యుక్తవిధంబుల నాచరించి వెం
టనె కడుధైర్యముఁ బూని సుగు ♦ ణస్థితు మంత్రినిఁ జూచి యిట్లనెన్. 219

ఉ॥ సారపయోజబంధుకుల ♦ సాగరచంద్రుఁడు రాముఁ డంప గం
గారమణీయతీరవన ♦ కాండము మైథిలి చూడఁ బోయెడిం
దేరిపు డేగి తెమ్మని వి ♦ ధింపఁగ వాఁడరదంబుఁ దెచ్చి శృం
గారమొనర్చి గుఱ్ఱములఁ ♦ గట్టివెసన్ నిలుపంగ నయ్యెడన్. 220

మ॥ వగపుం దోఁపఁగనీక తాల్మి వదనా ♦ బ్జాతంబున న్వచ్చి శీ
ఘ్రగతిన్ లక్ష్మణుఁడా వెలందికి నమ ♦ స్కారంబులం జేసి యో
జగతీపావని గాంగతీరవనదే ♦ శప్రేక్షణాసక్తి చేఁ
దగు నిన్నుం గొనిపొమ్మటంచు నటకున్ ♦ ధాత్రీవిభుం డంపినన్. 221

కం॥ వచ్చితిఁ దేరుం దెచ్చితి, విచ్చేయుమనంగ సీత ♦ వేడుకతోడన్
సచ్చరితుఁడు నాథుఁడు సెల, విచ్చెనె వనములకుఁ బోవ ♦ మే యనిపలికెన్. 222

—* లక్ష్మణుఁడు దుఃఖించుట *—

చ॥ అని వచియింప నీవెలఁది ♦ కావిధమేమియు గోచరంబు లే
దనుచు నతండు నాత్మహృద ♦ యాబ్జమునం గడుఁ గుందికుంది యే
మని వని నిట్టిముగ్ధ నచ ♦ లాత్మజ నొంటిగ డించివత్తునం
చు నతిశయార్తిచే నడలె ♦ క్షోణిసుతాణిఁ జూడకుండఁగన్. 223

చ॥ పరమసతీలలామ ముని ♦ పత్నులకంచని కాంచనాంబరా
భరణములం గ్రహించి గుణ ♦ వంతుఁడు దేవరుఁ డెక్కఁగా సువ

ర్ణరథము నెక్కి నిర్మలచి ♦ రత్నమణీంద్రమయాసనంబునన్
వఱలుచుఁ గూరుచుండె రథ ♦ వాజులఁ దోలె సుమంత్రుఁ డంతటన్. 224

—* సీతకు మార్గంబున దుశ్శకునంబులు గాన్పించుట *—

క॥ తరణికులనాయకాజ్ఞకు, వెఱచుచు సౌమిత్రి వాన ♦ విధివృతమతియై
నరుదెంచుచుండ వగపున, సరణిన్ మైథిలికి దుష్ట ♦ శకునము లయ్యెన్. 225
క॥ ఆదుశ్శకునములం గని, వైదేహి వెఱచి ముదంబు ♦ వాఱఁగ దానెం
తో దైన్యార్త్యావృతమతి, యై దేవరుఁ గూర్చి పలికె ♦ నట సీరీతిన్. 226

—* సీత దుశ్శకునముల లక్ష్మణునితోఁ జెప్పి దుఃఖించుట *—

సీ॥ చెవులపో తెదురయ్యెఁ ♦ జెమరుఁగాకులు గూసెఁ, బలుమాఱు నఱచె సీ♦పైడికంటు
సుడిగాడ్పు తేఱి న ♦ ల్బుట్టుల న్వ్యాపించె, నిక్కి యీవైపుగా ♦ నక్క యఱచె
నదె కాలపన్నగం ♦ బడ్డమై వల్మీకా, గ్రము నెక్కె ధ్వజముపై ♦ గ్రద్దలాడె
నరుగు మార్గంబాగెఁ ♦ బరుగునఁ నెడమునుం, డియువచ్చి గఁరుడి కు♦డిన్వసించె
గీ॥ ధరణితలమెల్ల గిరగిర♦దిరుఁగునట్లు,దోఁచెనదె ఘూకములు మ్రోసె♦ద్యుమణిమాసె
దలఁప నావిరియాదిగం ♦ తములఁ గవిసె, నకట యిది యేమివింతయో♦యనుఁగు
మఱఁది. 227
చ॥ తొలఁకుచుఁ ద్రోవలో నిటుల ♦ దుశ్శకునంబులు గానుపింపఁగా
దఁలకుచునుండె నామనము ♦ దక్షిణపార్శ్వగతాంగసంచయం
బులు విచలించె నీసకల ♦ ఘోరములు పాడుగఁదోఁచె నాదు శూ
పుల కిఁక నేమిఁజెప్పుదుఁ బ్ర ♦ పూర్ణగుణామృతరాశి లక్ష్మణా. 228
ఉ॥ నాసఖు నాపతిం బ్రియుని ♦ నారఘురాముని నాదుకాంతునిం
బాసి వనాళిలో మునుల ♦ పత్నులఁ గాంచుట కేటికిట్లు పే
రాస వహించి వచ్చితి హా ♦ తాహతబుద్ధులు లేనివారు గా
రే సతులంచు నెంచ కిటు ♦ నె దుల కాతఁడు బంపెనో గదా. 229
చ॥ మనమునఁ గోర్కెఁ దెల్పుమని ♦ మద్విభుఁ డాడఁగ నేను మున్నుఁ గాం
చినవను లిట్టివే యని వి ♦ శేషము నన్యము నిచ్ఛగింప కే
మని వనిఁ గోరి వచ్చితిఁ గ ♦ టా! యిటుఁ గోరఁగ రానికోర్కె పొ
త్తునఁ జనుదెంచు పాపినికి ♦ దుశ్శకునంబులు గానుపింపవే. 230
చ॥ కుమతి వినాశకాలమున ♦ కున్ విపరీతపుబుద్ధి కల్గి యా
క్రమములఁగోరి కోరి చెడుఁ ♦ గావునఁ గోరఁగరానికోర్కె ని

ష్టమని తలంచి యీగతి వె ♦ సఁ జనుదెంచితి నీనిమిత్తసం
ఘము లిఁక మీద నిక్కటుల ♦ కై తగుహేతువు లేమొకో గదా. 231

చ॥ ధవు విడనాడి వచ్చితెగు ♦ దారికిఁ గష్టము లేటికిట్లు నీ
యవశకునంబులం గలుఁగు ♦ నాపదలం దెగబాపి వీట రా
ఘవునకు నీకు నత్తలకు ♦ గాదిలిబాంధవకోటికెల్లఁ బౌ
రవితతికిన్ శుభంబుల సు ♦ ర ప్రచయం బిడుమంచు మ్రొక్కెనన్. 282

ఉ॥ ఆసతిచిత్తశుద్ధికి న ♦ యంబునకున్ భయమొంది లక్ష్మణుం
డీసతి యీజగజ్జనని ♦ యీయెడ దా నిజకాంతుఁ గూడి వేం
తో సుఖయించునట్లు దయ ♦ తోడ లిఖింపక బమ్మ వ్రాయఁగాఁ
జేసె గదా యటంచుఁ గడుఁ ♦ జింతిలె డెందము తల్లడిల్లఁగన్. 238

క॥ ఈపగిదిన్ రామానుజుఁ, డాపడఁతియు నరుగు ద్రోవ ♦ నపశకునంబుల్
జూపట్టు తెఱఁగుఁ గాంచియు, భీపరివృతులగుచుఁ జనిరి ♦ బెగ్గిలుచు మదిన్. 234

మ॥ ఇటులన్ లక్ష్మణుఁ డాధరాత్మజ మహా ♦ హేలామయాకారవి
స్ఫుటసాంద్రాటవులన్ మహోన్నతగిరి ♦ స్తోమంబులన్ భీకరో
త్కటకల్లోలకదంబరాజితనదీ ♦ కాండంబులన్ దాటి సం
కటపర్యావృతచిత్తులై కడచి పేఁ ♦ కన్ ముందటం బిమ్మటన్. 235

—* సీతాలక్ష్మణులు గంగానదిం జేరుట. *—

మ॥ సరసీజాప్తుఁడుఁ గ్రుంకఁగా నపుడు నా ♦ సౌమిత్రి వైదేహి త
త్పరిభాస్వత్సరిదంతికాశ్రమములన్ ♦ వర్తించి యానాటికిన్
మరునాఁడే గిరి గాఢసత్వరమునన్ ♦ మధ్యాహ్నకాలంబులో
వరగంగాతటినీతటస్థలులకున్ ♦ వ్యామోహ మేపారఁగన్. 236

మ॥ పిదపం జెంగటఁ గాంచె మైథిలి మహా ♦ ప్రీతిన్ మహోత్తుంగరం
గదభివ్యాయతశీతలానిలహతో ♦ త్కల్లోలసంతానశా
రదనాట్యక్రమయుక్త హంసకకుల ♦ వ్రాతంబులం బద్మపా
ళిదృఢాసక్తవిహారిమత్తమధుపా ♦ ళిం జక్రకీరాదులన్ 237

క॥ ఈరీతిం గంగాశృంగారంబుల మిగులఁ జూచి ♦ గనుమైథిలికిన్
శ్రీరామేశ్వరునాజ్ఞల, నేరీతి న్విన్నవింతు ♦ నీసమయమునన్. 238

క॥ అని నిలుపరానికొందల,మునఁ గన్నుల నీరువెట్టు ♦ భూనాథసుతుం
గని వెఱపువగపుఁ బెనఁగొన,జనకాత్మజ పల్కె నిట్లు ♦ సత్కరుణాత్మన్. 239

—* వైదేహి లక్ష్మణుని దీనత్వమునకు గారణమడుగుట. *—

ఉ॥ విన్నదనంబు నీకిటుల ♦ వెల్వడినప్పటినుండి మించె నీ
వున్నవిధంబుసూడ భయ ♦ మొందు మనంబు దలంకుచుండె మీ
యన్నకు వానిసోదరుల ♦ కాప్తులకందరికిన్ శుభంబె నీ
కన్నుల నీరుగాఱుటకుఁ ♦ గారణ మేమగుఁ దండ్రి లక్ష్మణా. 240

చ॥ అడవికి మున్నుఁ బాసి పురి ♦ నన్నకుఁ దోడుగ వచ్చునప్పుడుం
జెడుఁగగు మేఘనాథు రణ ♦ సిద్ధు ననిం దెగటార్చు నప్పుడున్
జడుఁడగుఁ బంక్తికంధరుని ♦ శక్తి యురంబున నాటినప్పుడుం
బోడమదె కంట నీరిపుడుఁ ♦ బుట్టినదేటికి తండ్రి దెల్పవే. 241

ఉ॥ మానసికవ్యథాతతుల ♦ మాన్పఁ జెలంగెడుఁ బుణ్యరాశి గం
గానదిఁ జేరి యాకరణి ♦ గాసిలఁ జెల్లునె నీకు వేడ్కతో
నీనదిఁ దాటి పావనము ♦ నీట్సుతులం దిలకించి వారికిం
గానుకలిచ్చి దీవనలఁ ♦ గైకొని వత్తము రమ్ము లక్ష్మణా. 242

చ॥ అనివచియించి యాఫణితి ♦ నాసతి లక్ష్మణుదైన్యభావముం
గని తలపోయుచు న్మిగుల ♦ గాసిలుచున్ మది వీనితత్త్వమె
వ్వని కెఱుఁగ న్వశంబె గుణ ♦ వంతులు లోకులకున్ స్వకీయభా
వనిజరహస్యభావము ర ♦ వంతయు నైనను వెల్లడింతురే. 243

కం॥ మునుకొనుదుష్టశకునములఁ, గనినప్పటినుండి మనము ♦ కలతవహించెన్
వను లేటికింకఁ బోదమె, నినుఁ జూచిన నాకు వగపు ♦ నెక్కొనెననినన్॥ 244

—* సీతా లక్ష్మణులు గంగను దాటుట. *—

ఉ॥ కన్నుల నీరు గాఱఁ గడు ♦ గాసిలి పంక్తిరథాత్మజుండు ము
న్నన్న తెఱంగు నెంచి జన ♦ కావనిపాలజఁ గాంచి తల్లిరో
నిన్నటిదుర్నిమిత్తములె ♦ నెవ్వగఁ గూరిచె నింటికేల వి
ద్వన్నుతమంగళత్రిదివ♦వాహిని దాటుదమంచు మీఁదటన్॥ 245

చ॥ సరవిఁ నతండు తేరుడిగి ♦ సారథి నచ్చట నుంచి యోడపై
ధరణిజ నెక్కఁగాఁ బనిచి ♦ దా నతికష్టముతోడ నెక్కి స
త్వరగతి నన్నదిం గడచి ♦ తత్తటముం గని శోకవార్ధిలోఁ
దరలమనస్కుఁడై మునిఁగి ♦ ధారగఁ గన్నుల నీరు గాఱఁగన్. 246

చ॥ ధరణిసుతాననంబుఁగని ♦ దైన్యముతోఁ బలుఁగుంది తల్లిరో
సరకట మీను నాహృదయ ♦ శల్యము దుఃఖదవాగ్నిఁ గ్రాఁగుకం
టె రహిఁ ఘటించు చేటు జన ♦ నిందితకార్యముఁ బూనినాఁడ ని
త్తరి నిఁక నన్నుఁ బంపవని ♦ తాఁ జరణంబుల వ్రాలి వేఁడ్వఁగన్॥ 247

కం॥ ఆక్ష్మాకన్యారత్నము, లక్ష్మణుఁ గని మిగుల వగచి ♦ లక్ష్మణ శ్రీరా
మక్ష్మాధిపాలకాదుల, కీక్ష్మామనుజులకుఁ గుశల ♦ మేయనియనుచున్॥ 248

చ॥ అడవి ననేకకష్టముల ♦ నందినవేళలనైనఁ దొల్లి యీ
బెడిదఁపుశోకముం గనవు ♦ బెట్టగు తాలిమిఁ బాసి యిట్లునీ
వడలుట కేమిహేతువు మ ♦ హాగుణశాలివటంచు లోకులే
యెడ నుతియింతు రెవ్వరికి ♦ నెగ్గుఁ దలంచితివయ్య లక్ష్మణా. 249

చ॥ ధరణిఁ బరాంగనామణులఁ ♦ దల్లులకైవడిఁ జూతువేయెడం
బరులధనంబుల న్విషము ♦ వైఖరి జూతువు నిందసేయ వె
వ్వరినయిన న్మహీవిబుధ ♦ భక్తియు శ్రీరఘురామసేవయుం
దిరమగు నీకు నీయెడల ♦ నిందితకార్యము లెవ్వి లక్ష్మణా. 250

మ॥ నిను మీయన్న దురుక్తులం బలికెనో ♦ నీకీయెడన్ రామచం
ద్రునిపై భక్తిదొలంగెనో జననికిం ♦ ద్రోహంబుగావించితో
కని నిందించితివో గురుప్రవరులం ♦ గాపాడుమం చన్న వా
రినిఁ బాలింపక త్రోచితో తెలుపు మా ♦ ర్తిం బాసి యో లక్ష్మణా. 251

శా॥ శ్రీరామేశ్వరునాజ్ఞ లేక నను బే ♦ ర్మి న్నీవు దోడ్తెచ్చితో
శ్రీరాముఁ గని దూరితో మహీసుర ♦ శ్రేణిం గడుం దిట్టితో
నార్యశ్రేణి దురుక్తులం బలికితో ♦ నాతండ్రి నీ కేటికీ
ఘోరంబైదగు శోక మీయెడల నా ♦ కుం దెల్పుమో లక్ష్మణా. 252

చ॥ అనఘగుణాగ్రగణ్య! భయ ♦ మయ్యెఁ నిఁక న్వచియింపుమయ్య పా
వనతరవారిజాప్తకుల ♦ వార్ధిసుధాకరుఁడున్ దయాత్ముఁడున్
వనజదళాక్షుఁడు న్విబుధ ♦ వందితుఁడున్ లలితాంబుదాంగుఁడున్
దనుజగజేంద్రసింహుఁడు ము ♦ దంబుగ నుండెనె తండ్రి లక్ష్మణా. 253

కం॥ ఘనగుణుఁడు రామచంద్రుఁడు, మనమునఁ గరుణం ద్యజించి ♦ మహితకుపితుఁడై
నిను విడిచెనె నను విడిచెనె, యనుమానము లేక తెల్పు ♦ మన నాచెలితోన్.

—* లక్ష్మణుఁడు రామునాజ్ఞ సీతకుఁ దెలుపుట. *—

చ॥ తెలుపుట కయ్యెడన్నెగులు ♦ తెర్లఁగ లక్ష్మణుఁడెంచి కుందుచుం
దెలుపక పోవరాదని వి ♦ నిశ్చలబుద్ధి నతండు లేచి మై
థిలికి నమస్కరించి కడుఁ ♦ దీండ్రభయంకర శోకవార్ధిలోఁ
దలఁకుచు మున్గుచుం బలికెఁ ♦ దా వగ నశ్రువు లుబ్బ నెంతయున్. 255

చ॥ దుడుకఁడు రావణాసురుఁడుఁ ♦ దొల్లి తమిం గొనిపోయి లంకలో
నిడుములఁ బెట్టినట్టిసతి ♦ నెగ్గని సిగ్గని చూడకిట్లు రా
ముఁడెలమి నేలుచుండెనని ♦ మ్రుక్కుడు లాడఁగ నాలకించి దూ
ఱెడల రఘూద్వహుండు నిను ♦ నివ్వనభూముల డించి రమ్మనెన్. 256

కం॥ క్షుల్లకమానవు లాడెదుఁ, బ్రల్లదముల హృదయ మగలఁ ♦ బలువెతతో భూ
వల్లభుఁ డోరిచె నెట్టులఁ, దల్లీ నీవిట్టిప్రల్ల ♦ దములవినెదవో. 257

చ॥ మునులు మహాతపోధను ల ♦ మోఘదయాత్ములు సంచరించునీ
ఘనవిపినంబులం గదిసి ♦ కష్టము లందుమటంచు నీగతిన్
వనజభవుండు నీనొసట ♦ వ్రాసెనొకో యిదిగానిచో జగ
జ్జనని! మహాటవిం గఠిన ♦ సంకట మెట్లు వహింపఁగా నగున్. 258

చ॥ లలితపయోజబాంధవకు ♦ లప్రవరాధివిభుండు లోకనిం
దలఁ బడఁజాల కిట్లు విపి ♦ నంబులలో నిను డించి రమ్మనం
జెలఁగితి నిట్టిదాని కెడ ♦ చింతలలోఁ బడి మున్గుచుండె నె
ట్టుల ననుఁబోలు మూర్ఖు సజుఁ ♦ డున్ జగతిన్ సృజియించెనో గదా. 259

ఉ॥ అంచితవామలూరుజవ ♦ నాంతరసీమల నిన్ను డించి ర
మ్మంచు నిలావిభుం డనిపె ♦ నావనసీమలఁ గాల మెట్లు వే
గించెదవో మనం బధిక ♦ ఖేదపయోనిధి మున్గెఁ దల్లి త
ప్పించుట కెవ్వరైనఁ బృథి ♦ విం బలవంతులె నల్వవ్రాతలన్. 260

ఉ॥ నీవిమలాత్మశుద్ధియు వి ♦ నీతిదయాదిక సద్గుణంబులన్
దేవ్రఁ డెఱింగి నీకిటుల ♦ నిందలఁ గూరిచె నిన్ను నోజగ
త్పావని నీవు గోరినవి ♦ ధంబుగఁ గానల కంపి యీజగ
త్పావనుఁ డాతఁ డావిరహ ♦ తాపము నేకరణిన్ సహించునో? 261

చ॥ పగతులకైన నీకరణి ♦ బాధలు గల్గినఁగాని చూడఁగా
నగునె యిటన్ జగజ్జనని ♦ నే నిను నెట్టులడించిపోదునా

నగ ధరుఁ డీవని న్నను నో ♦ నర్పఁగఁ బొమ్మని నెద్దియైనఁ జే
యఁగ మదినోడ డిట్టికతి ♦ నాత్మఁ డటంచు నెఱింగి పంపెనో? 262

సీ. అతిశయోత్తుంగఘో ♦ రాచలాధరములుఁ, గనకసౌధంబులే ♦ జనని నీకు
మితిలేనిదుర్మార్గ ♦ మృగసమూహంబులుఁ, దగుసఖీజనములే ♦ తల్లి నీకు
ఘోరనక్రగ్రాహ ♦ కులముతో వ్యాపించు, హ్రదములు సరసులే ♦ యంబ నీకుఁ
గంటకావృతమహా ♦ కాననస్తోమము, లగినఁబూఁదోఁటలే ♦ తల్లి నీకుఁ

గీ॥ బరమకాఠిన్యతరమహా ♦ పలగణంబు, లిందుమణివేదికలె జన ♦ యిత్రి నీకుఁ
గటకటా యీవనంబున ♦ నెటుల నొంటి, గావసింతువో యెట్టియి♦క్కటులు వచ్చె.

చ॥ జనని మహాపతివ్రతవు ♦ సాధ్వులకుఁ భవదీయవర్తనం
బనుగుణరత్నకంచుకము ♦ హారిరఘూత్తమపాదపద్మమే
ళనవిమలాత్మవై యిట్టఁ జె ♦ లంగుమటంచన నేనెవండ ని
వ్వనముల నిన్ను డించి చనఁ ♦ బాపుఁడ నీఖలు నింకఁ బంపుదో. 264

—* వైదేహి మూర్ఛిల్లుట *—

క॥ అనవుడు నాతనిమాటలు, వినివిని మొదలంట నఱకు ♦ వృక్షమువలె హా
జనని యటంచు వగపుతో, జనకావనిపాలజ వడె ♦ క్ష్మాస్థలి నపుడున్. 265

సీ॥ పదిరెండుగడియల ♦ వఱకు దేహ మెఱుంగ, కుండి మీఁదట లేచి ♦ మెండు నెగుల
నమలనేత్రాబ్జని ♦ ర్యద్బాష్పధారాప్ర, వాహము ల్గండద ♦ ర్పములజాలు
వాఱఁగా నధికని ♦ శ్వాసంబులజనించు, నెగులందనదు ముద్దు ♦ చిగురుమోవి
వాడఁగాఁ జెమటచే ♦ వ్యాపించు నెమ్మేను, గడుభీతిచేఁ గడ ♦ గడవడంక

గీ॥ నాననము విన్నదనమున ♦ కాలయంబుఁ, జూప ధైర్యంబువోనాడి ♦ శోకముబ్బఁ
నక్కటా తండ్రి! లక్ష్మణా! ♦ యనుచు వానిఁ, జూచి యిట్లని శోకించె ♦ క్షోణి
పుత్త్రి. 266

—* వైదేహి దుఃఖించుట *—

చ॥ అడలకుమయ్య లక్ష్మణ! ద ♦ యామయ! కానలలోన నిక్కటు
ల్వడుమని గీర్వభుండు సుర ♦ వంద్యుఁడు వ్రాసినయట్టివ్రాతలం
దుడువఁ దరంబె నావిభుని ♦ తో నికనైనను సౌఖ్యమొందఁగాఁ
గడఁగితిఁ గాని నేనెఱుఁగఁ ♦ గానల నిట్లగునంచు నీయెడన్. 267

గీ॥ అట్టిదుశ్శకునఫలమిా ♦ యాపదలకుఁ, గారణముగాదె యిట్టిదుః ♦ ఖంబుఁ గూర్ప
నంబుజాసనుఁ డాసమ ♦ యమున నిట్టి, కామముం గూర్చె లిఖితంబుఁ ♦ గడువ
వశమె. 268

చ॥ ఎడ నెలమిం ద్యజించి మును ♦ నేమిధునంబుల కెగ్గుఁజేసి వా
రడలఁగఁ జూచితో యిపుడు ♦ నాయఘ మూరకపోనె నాఁడుఁ గా
అడవుల రామచంద్రుని ప ♦ దాంబుజచింతల నుంటి నేఁడు న
న్నడవుగ వీడినట్టి జగ ♦ తీశ్వరుఁ బాసి వసింతు నేగతిన్. 269

ఉ॥ ఏనిల సాధ్వినంచు నను ♦ నెల్ల జను ల్నుతియింతురంచు నా
మానసికవ్యథాతతులు ♦ మానెనటం చెద సంతసించితిం
గాని జనాపవాదమున ♦ కైనను శ్రీరఘురాముఁ డీగతిం
గానలఁ ద్రోయునంచు నెఱుఁ ♦ గం గలలోపలనైన లక్ష్మణా. 270

చ॥ కటకట! వజ్రఘాతమునఁ ♦ గంటెఁ గడుం బెడిదంపుమాట ని
చ్చటవినియుండియుం దిగులు ♦ సంకటమొందక నాదుచిత్త మె
ప్పటివలె నుండె నిప్పగిఁది ♦ ప్రాణములన్ భరియించి యెట్లు ని
య్యటవిఁ జరింతునెంతటి మ ♦ హాపద లందుదునో గుణాంబుధీ. 271

మ॥ కలయో సత్కరుణావిహీనమతివై ♦ కాకుత్స్థవీరుండుఁ గా
నల నన్నిట్టులఁ ద్రోయఁగాఁ బనిచెనో ♦ నాతంద్రి విభ్రాంతియో
కలతం దెల్పితివో పరాకుమతి నా ♦ కర్ణించితో యేదియో
తెలుపంగాఁ దగునైన నీవెపుడు భ్రాం ♦ తిస్ఫూర్తిచిత్తుండవే. 272

ఉ॥ ఎన్నటికిన్ రఘుప్రవరు ♦ నేను ననున్ రఘురామచంద్రుఁడుం
గన్నులఁ జూడఁగల్గుదుమె ♦ కల్గకయుండినఁ బ్రాణముండునే
నన్నుఁగురించి రామ మహి ♦ నాథునకెంతటి వాదువచ్చెనే
నున్న మఱెట్టినిందలగు ♦ నో విధివ్రాసిన వ్రాలు తప్పునే. 273

క॥ అనియీవైఖరి మైథిలి, ఘనదుఃఖాంబుధి మునింగి ♦ కడుదైన్యమునన్
జననుతసుగుణున్ లక్ష్మణుఁ, గని యిట్లనిపలికె రాలు ♦ గరఁగుఁబలుకులన్.

చ॥ పతినెదనెంచెనో తనునుఁ ♦ బాసి యశోకవనంబులోపలం
బ్రతుకదె మున్నటం చదియుఁ ♦ గ్రమ్మఱఁ దానిటకేగుదెంచి దు
స్థితు నరి జంపి కాచునను ♦ చేవగదా బ్రతికించె నిప్పు డే
గతిఁగని జీవముల్నిలిపి ♦ కానలలోఁ జరియింతు లక్ష్మణా. 275

మ॥ ఇలలో మూర్ఖులువల్కు మాటలకు భూ ♦ మీశాగ్రగణ్యుం డెదం
దలఁకుం జెంది మహాబాధురాటవులకున్ ♦ వన్నంపె నారీతి ని
ట్టులటంచు ననుఁబిల్చి తెల్పికలగుం ♦ డుం బాపి ని న్నీడనం
చెలమిం బంపఁగరాదె మానసములో ♦ నేమెంచెనో లక్ష్మణా. 276

శా॥ ఆకర్ణాయతలోచనాబ్జములతో ♦ నాకుండలద్వంద్వ లీ
లాకీర్ణాములగండభాగములతో ♦ హారావ్యలక శ్రేణితో
శ్రీకమ్రస్మితపూర్ణచంద్రికలతోఁ ♦ జెల్వారు శ్రీరాము మో
మేకాంతంబునఁగాంచు భాగ్య మిఁక లే ♦ దేమో సుమిత్రాత్మజా. 277

సీ॥ ఉర్విలోపలనేన ♦ యోనిజనై పుట్టి, మిథిలలోఁబెరిఁగిన ♦ విధమువినరె
త్రిభువనంబులు సన్ను ♦ తింపఁగాలంకలో, వహ్నిలోఁబడినట్టి ♦ వార్తవినరె
యీసీతపావని ♦ యేలుకొమ్మని రాము, బ్రహ్మాదులనినట్టి ♦ పల్కువినరె
యనసూయమొదలైన ♦ వనితామణులువచ్చి,యెలమి శ్లాఘించిన ♦ పలుకువినరె

ఆ॥ వె॥ వినియుఁగనియుమూర్ఖ ♦ జనములుదూషించి, రనివిభుండుమదిభ ♦ యంబుఁగాంచి
యింత తెగువఁబూనె ♦ నింతకు నాయభా, గ్య మిది కాని వేఱు ♦ గాదుతలఁప. 278

చ॥ వనులకుఁ గాంతుని న్విడిచి ♦ వచ్చితివేలఁనుటంచు మానిరా
ద్వనితలు వచ్చి నన్నడుఁగ ♦ వారలమోములఁగాంచి వారికే
మని వచియింతు నిట్టివిప ♦ దంబుధి నెట్లుఁదరింతు నాకిటన్
దినము యుగంబుగా నరుఁగు ♦ దెంచుచునుండెఁ గృపాత్మ! లక్ష్మణా. 279

చ॥ వగవు జనింప నేనిటులఁ ♦ బల్కితి రామున కియ్యెడ న్మహా
జగదపవాదముం గడు వ ♦ శక్యము కాననలోఁ జరింపఁగా
నె గులని రామచంద్రు జన ♦ నింబుతుఁజేతునె వానినామమె
ల్లగతుల సంస్మరించుచుఁ జె ♦ లంగెద నివ్విపినాంతరంబులన్. 280

—* మైథిలి లక్ష్మణుని పొమ్మని యాజ్ఞాపించుట. *—

సీ॥ ఆలస్యమేల నీ ♦ వరుఁగుము ధృతి లక్ష్మ,ణా! యింక సాకేత ♦ నగరికీవు
ముప్పూర్తలకు నా ♦ మ్రొక్కులంచని తెల్పు, మటఁ జుట్టములనెల్ల ♦ నడిఁగితినను
మతిదయామతికిసూ ♦ ర్యాన్వయేంద్రునకునా, మ్రొక్కటంచని తెల్పి ♦ మ్రొక్కుమీవు, తన పుణ్యనామము ♦ ధ్యానించుచుంగాన, నాంతరంబుల సంచ ♦ రింతునను ము

గీ॥ పురజనంబులఁ గరుణతోఁ ♦ బ్రోవుమనుము, ధాత్రినాథుశరణ్యంబు ♦ దానె యనుము
హృదయమే యెడఁదనమూర్తి ♦ వదలదనుము, తలఁచినామీఁదఁ గూరిమి ♦ నిలుపు
మనుము. 281

గీ॥ పోయిరమ్ము శుభంబులుఁ ♦ బొందు నిన్ను, మానసంబున ననునీవు ♦ మఱువకుమని
నేత్రముల బాష్పధారలు ♦ నిండుకొనఁగ, నాధరాత్మజ ఖిన్నయై ♦ యడలుచుండ.

కం॥ చనఁ గాళ్ళాడక కాంచుచుఁ, జనకరహింఁ గోవుఁ బాయ ♦ జాలని వత్సం
బునఁబోలి లక్ష్మణుండో, జననీ! రఘురాముఁ గొల్వ ♦ జనియెదననుచున్. 283

—* లక్ష్మణుఁడు వనదేవతలఁ బ్రార్థించుట. *—

ఉ॥ అల్లన సత్ప్రదక్షిణము ♦ నామెకుఁ జేసి నమస్కరించి మే
నెల్లఁ దలంక హాహారుమని ♦ యేడ్చుచు సత్కరుణాంబురాశి మా
తల్లిని డించి పోయెదనె ♦ దన్వనదేవతలార! ప్రీతి సం
ధిల్లఁగఁ గావ జేయనుచుఁ ♦ దివకరాన్వయుఁ డేగె మీఁదటన్. 284

ఆ॥వె॥ ఏగి యోడ నెక్కి ♦ యెద తల్లడిల్లఁగా, దిగులుతో ధరాజఁ ♦ దిరిగి కనుచు
దిక్కుగల్గి నీకు ♦ దిక్కులేదాయెనో, తల్లి యనుచు నవలి ♦ తటముఁ జేరి. 285

క॥ చనుదెంచుచుండె నిచ్చట, జనకజయు నతండుఁ దిరిగి ♦ చనుదెంచు నటం
చని యాతఁ డరుగుమార్గముఁ, గనుచుం గటకటయటంచుఁ ♦ గడుదుఃఖముతోన్.

—* జానకి లక్ష్మణుని మార్గముఁ జూచి దుఃఖించుట. *—

గీ॥ తరుణిమఱికొంతసేపు స్యం ♦ దనముఁ గాంచు, నాతి మఱికొంతవడి కేత ♦ నంబుఁ జూచు
రమణిమీఁదట రథశిఖ ♦ రంబుఁ గాంచుఁ, బడఁతిపిమ్మటఁ దావట్టి ♦ బయలుఁ జూచు. 287

ఆ॥వె॥ చూచి చూచి మిగుల ♦ సొక్కి తాలిమివీడి, వగచి వగచి యూర్పు ♦ సెగల నొగిలి
దిగులుగల్గి మిగుల ♦ బెగడుఁ గాంచి తలంకి, భూమిపుత్త్రి మూర్ఛ ♦ వోయి లేచి. 288

చ॥ ఎడపయి నన్నుఁ జేర్చుటయు ♦ నింపగు నానునుఁ జెక్కుచెమ్మటం
దుడుచుటయు న్మది న్వలపు ♦ తోవిడె మిచ్చుటయు న్ముదంబుతో
నడిగినఁ గోర్కిఁ దీర్చుటయు ♦ నల్లన వాతెఱముద్దుఁ గొంటయుం
గడపటి మోహమే మొయని ♦ కన్నుల నీరిడుచుండె నచ్చటన్. 289

మ, అని యీవైఖరిఁ గుందుచుం ధరణి వం ♦ శాధీశ్వరుం డిట్లు వం
చనఁ గావించు నటంచు నేఁదలఁపనా ♦ స్వాంతంబునం దైన భ
వ్యనిదానామలరూపు రాము ననుఁ బా ♦ యంజేసి గంభీరశో
కసిధిం ద్రోఁచితివో యటంచుఁ బ్రభమూ ♦ క్రాంతాత్మ రంగాబ్జయై. 290

సీ॥ వనవిహారంబులలో ♦ మను జేశ్వరుండాడు, నర్మోక్తుల్ దలంచి ♦ నాతితల్కు
లలితాంబు కేళిలోఁ ♦ జెలువుండుఁగావించు, సరసంబులఁదలంచి ♦ పరితపించు
భోజనాదుల రామ ♦ భూపాలుఁ డొనరించు, గౌరవంబుల నెంచి♦కలఁతఁగాంచుఁ
కేళీగృహంబులో ♦ క్షితినాయకుఁడొనర్పు, వింతలం దలపోసి ♦ ప్రీతిమించు

గీ॥ ద్యూతకేళుల రామచం♦ద్రుండు సలుపు, పనుల మానసమున నెంచి♦వలపుఁగాంచు
వలపుముచ్చటలఁదలంచి♦తలఁకుగాంచుఁ,గాంచివిలపించుఁబికములుఁ♦గదియనపుడు.

క॥ వనితారత్నంబిటు ల, వ్వనమున విలపించుచుండ ♦ ఫలములకొఱకై
చనుదెంచిన మునితనయులు, విని చెంతలనుండివచ్చి ♦ వీక్షించి వెసన్. 292

—* వాల్మీకితో మునికుమారులు సీతావృత్తాంతముఁ జెప్పుట. *—

శా॥ ఆవాల్మీకుల చెంతకేగి కరుణా ♦ యత్తాత్ములుం జేసి ల
క్ష్మీగ్రామామణియో సురాధిపతియో ♦ పృథ్విరత్నమో యొంటిగా
భావంబు ల్విచలింప నియ్యటవి దీ ♦ నస్వాంతయై యెట్టువా
పోవం దెల్పఁగవచ్చినార మిపు డ ♦ ప్పూఁబోఁడి ప్రోవందగున్. 293

—* వాల్మీకి వైదేహియుని నెఱింగి వచ్చుట *—

చ॥ అనవుడు నమ్మునీశసుతు ♦ లంతట నాతఁడు దివ్యదృష్టిచేఁ
గని రఘురాముదేవి జన ♦ కక్షితిపాలజ యంచుఁ బల్కి గ్ర
క్కునఁ దగునర్ఘ్యపాత్రఁ గొని ♦ కూరిమి శిష్యులు వెంటరాగ పా
యనికరుణారసంబు మొన ♦యం జని తత్తటకాననంబునన్. 274

చ॥ పలుమఱుఁ దేరుబోవు దెసఁ ♦ బాయని చూడ్కులు లోచనాంబుజం
బులఁ దెగఁగాఱు నశ్రుఝర ♦ ము ల్వ్యవధానము లేనియట్టియూ
ర్పులు బలితంపువంతయును ♦ ముద్దుకపోలమునం గరాబ్జముం
గలిగి చెలంగునట్టి జన ♦ కక్షితిపాలజఁ గాంచి కూరిమిన్. 295

శా॥ చేరం బోవఁగ నారవంబు విని శ్రీ ♦ సీతామహాదేవియుం
గారుణ్యాంబుధి నామునీశ్వరమణిం ♦ గన్నీరుగండంబులం
జాఱన్ ఱెప్పల నొత్తి కాంచి కడు వి ♦ శ్వాసంబుతో నూరుపుల్
చేరంగా విలపించుచుం జరణరా ♦ జీవంబులన్ వ్రాలినన్. 296

—* వాల్మీకి భూపుత్త్రిని బుజ్జగించుట *—

మ॥ మునిచంద్రుం డట బుజ్జగించి పగపుం ♦ బోనాడు మోతల్లిరో
ఘనుఁడున్ రాముఁడు నీగుణం బెఱిఁగియుం ♦ గ్రౌర్యంబునన్ లోకులా
డిననిందోక్తులకుం దలఁకి యిటులన్ ♦ డించె న్వని న్నిన్ను దీ
నిని నాబుద్ధి నెఱింగి వచ్చితి పనన్ ♦ నీతండ్రిగా నెంచుమా. 297

చ॥ సరసగుణాఢ్య నీమదికి ♦ సందియమేటికి సేవసించు మం
దిరములు నీవెకావె యిటఁ ♦ దేఁకువతోఁ జరియించుమానిసుం
దరు లుచితోపచారములొ ♦ నర్చుదు రెంతటివారికైన ని
ద్ధరణితలంబునం గలుఁగు ♦ దైవగతిం గడువంగ శక్యమే. 298

చ॥ జనకుఁడుఁ దండ్రి నీకు నృప ♦ చంద్రుఁడుఁ బంక్తిరథుండు మామ దు
ర్జనసురవైరివిక్రమువి ♦ రాముఁడు రాముఁడు వల్లభుండు నీ
వనుపమపుణ్యరాశివిక ♦ దా వగపేల మదాజ్ఞ నీవు గై
కొని చరియింపు మర్ఘ్య మిదె ♦ గో కొనుమమ్మ దయారసంబునన్. 299

క॥ అమ్మా యూరక వగవకు, మిమ్మావన మిచట నీకు ♦ హేలావనమా
నమ్మా నీళ్లివిగో కై, కొమ్మా వదనంబుఁ గడిగి ♦ కొమ్మా యనుచున్ 300

—* వాల్మీకి సీతను నిజవనంబునకుఁ దోడ్కొని పోవుట. *—

క॥ అనిబుజ్జగించి సీతా, వనజాక్షికి నర్ఘ్యమిచ్చి ♦ వాల్మీకియుఁ దో
డ్కొనిచనె నిజాశ్రమంబున, కును హేతువులేనిబంధు ♦ గులుగారె మునుల్.

క॥ జనకాత్మజతో నాతఁడు, వనమునకుం బోయి తనకు ♦ బహుసంప్రీతిన్
వినతులొనరించు తాపస, వనజాక్షులఁ గాంచి యిట్లుఁ ♦ బలికెం గరుణన్. 302

చ॥ రవికులవార్ధిసోముఁడగు ♦ రాముని దేవి విదేహమేదినీ
ధవునితనూజయున్ దశర ♦ థక్షితిపాలుని పెద్దకోడ లి
య్యువిద సుధామయూఖునిస ♦ హోదరిఁబోలుఁ దలంచి యీమెకున్
సవినయబుద్ధి సేవలను ♦ సల్పుఁడు మీరలు సత్కృపామతిన్. 303

చ॥ క్షితిఁ జెడుగు ల్దశాననుఁడుఁ ♦ జేడ్పడఁ జేసిన బోటిఁ దెచ్చి స
మ్మతమతి నేలుచుండె రఘు ♦ మాన్యుఁ డటంచనిపల్క రాముఁడీ
సతి పడి నోర్వలేక విడి ♦ సంగడిఁ గానలకంపెఁ గాన మీ
రతిదయ నీమెఁ బ్రోవుఁడని ♦ యాసతి వారల కప్పగించినన్. 304

—* మునిపత్నులు వైదేహి కుపచారములఁ జేయుట. *—

ఉ॥ వారు మహాప్రసాదమని ♦ వారిరుహేక్షణ గౌరవించి యెం
తోరహి నాశ్రమంబులకుఁ ♦ దోడ్కొనిపోయి దయామనస్కలై
సారెకుసారెకు న్నదుప ♦ చారమొనర్చుచునుండి రంత న
క్కారుణికుండు సంతసిలె ♦ క్ష్మాతనయామణి మానెఁ గుందుటన్. 305

సీ॥ లలితచీనాంబరం ♦ బుల ధరించుసతీల, లామంబ ములవల్క ♦ లములఁ దాల్చెఁ
బుడమిలోకులుమెచ్చ ♦ భోజనంబులఁ జేయు, లలితాంగి కందమూ♦లములనమలె
లలితకాంచనసౌధ ♦ ములవసించులతాంగి, మునివరేణ్యాశ్రమం ♦ బులవసించె
వలపుతో శ్రీరాము ♦ వక్షంబునఁ బరుండు, వనజాక్షి యొంటిగాఁ ♦ బవ్వళించె
గీ॥ హాళి శుద్ధాంతకామిను ♦ లాచరించు, సేవలకునెల్ల వినుతించు ♦ క్షితికుమారి
రహిమునిసతీకృతోపచా♦రములఁ గాంచె, బ్రహ్మలిఖితంబుగడువ నె♦వ్వారికివశమె?
మ॥ అట మార్గంబున లక్ష్మణుండు ఘనశో ♦ కాంభోధిమగ్నాత్ముఁడై
పటునీతిజ్ఞు సుమంత్రు ధీరుఁగని దౌ ♦ ర్భాగ్యంబుచే నిష్ఠు నెం
తటికష్టంబులు నిర్నిమిత్తముగ నీ ♦ ధాత్రీజకున్వచ్చె న
క్కటినైపోతినటంచుఁ దానెచట నీఁ ♦ కం బ్రాణము ల్వీడునో. 307
చ॥ అడవులకేగి పెక్కుడుము ♦ లంది సురారికులాధినాథుచేఁ
బడి యట నెవ్వరుంబడని ♦ బాధలనుం గని ప్రత్యయార్థమై
మిడుఁగుల మీఱుచిచ్చుఁబడి ♦ మీఁదటఁ గొంచెముసౌఖ్యమొందఁగాఁ
గడపట రామచంద్రునికిఁ ♦ గాపుర మివ్విధమయ్యెఁగా మహిన్. 308

మ॥ హరచాపంబు నణంచె వాలినణఁచెన్ ♦ హర్యాత్మజుం బట్టె వా
నరసంఘంబులఁబ్రోచె జీవననిధిన్ ♦ బంధించెఁ బౌలస్త్యు ఘో
రరణాంగంబునఁ ద్రుంచెఁ నీవెలఁదికై ♦ గామాధిపుం డిట్టి యీ
తరుణీరత్నముఁ బాసి నిల్వఁగలఁడే ♦ తాల్మి న్మనోబ్జంబునన్. 309
గీ॥ మనుజులీరీతి దూఱినా ♦ రని రఘుప్రవరుఁడు మైథిలి విడనాడె ♦ ధరణిజాతి
తాపమున నగు పాపంబు♦భూపవరుని,దో నరులదో తలఁపుముస ♦ ద్గుణవిశాల.

—* సుమంత్రుఁడు లక్ష్మణునకు దుర్వాసుని వాక్యములఁదెలుపుట *—

మ॥ అని దుఃఖించుచుఁ బల్కు లక్ష్మణుని వా ♦ క్యశ్రేణి నాలించి వం
దనముం జేసి సుమంత్రుఁడిట్టి వెతలు ♦ న్నందంబు కాలక్రమం

బున నేతెంచెడి నేరికిన్ విధికృతం ♦ బుం దప్పఁగానోనె యం
చని మున్బండితులాడు పల్కులను నీ ♦ వాలింపుమంచిట్లనెన్. 311

గీ॥ తలఁచియొకనాఁడు మీతండ్రి♦దశరథావ, నీశముఖ్యుండు నిజపురో♦హితునిఁజూడ
స్యందనంబెక్కి సూతకా♦ర్యంబునేనుఁ, జేయఁగ వసిష్ఠమునివనిం♦జేరియచట. 312

సీ॥ క్షితినాథుఁడచ్చటఁ ♦ గేశవార్షికముఖ, వ్యాసకీర్తిమైవచ్చి ♦ భూసురోత్క
ర ప్రబర్హుండు దు♦ర్వాసుండు మునివరుం,డు గురుసన్నిధినుండు♦టఁగనివారిఁ
జేరఁగాఁజని బత్తి ♦ చేనతుల్గావించి, మ్రొక్కి తత్ప్రసన్న ♦ మునకునుబ్బు
చుంగొల్చి నిల్వఁగాఁ♦జూచి నిర్మలనిజ, స్వాంతంబులఁ గృపా ర♦సంబుమీఱ

గీ॥ నతిథివైతివి మాయింటి♦కధిపయనుచుఁ, గందమూలఫలప్రము♦ఖముల నొసఁగి.
తాముసుభుజించివారలం♦దఱటమాట,లాడుకొనుచుండఁగా సమ♦యంబునరసి.

క॥ అల దుర్వాసుని కంజలి, సలిపి మునీంద్ర రఘురామ ♦ చంద్రుం డెన్నా
ళ్లిల నేలుపుత్త్రులెందరుఁ, గలుఁగుదు రాయుః ప్రమాణ ♦ కంబెట్టిదియో. 314

గీ॥ తదనుజస్థితులెట్టి వో♦తరణివంశ,మునని నెందాఁక వెలయునో ♦ యూనతీయఁ
దగునననిమంతింపనాలించి♦సుగుణవంతుఁ,డామునీంద్రుఁడు మీతండ్రి♦కనియెనిటుల.

క॥ జననాథచంద్ర! రాముఁడు, విను మీక్షితిఁ బదునొకండు♦వేలేండ్లేలున్
ఘనయాగములం జేయుం, గనుఁబుత్త్రిద్వయము వీర♦గణ్యముఁ బిదపన్. 316

గీ॥ అందుసాకేతపురమున♦కగ్రసూనుఁ, బతినిఁగాఁజేసి బాంధవా ♦ ప్తబుధమంత్రి
పౌరమిత్త్రిగణంబుతో♦ బహుముదంబుఁ, గనుచుఁగడపట బ్రహ్మలో♦కంబుఁజేరు.

గీ॥ ధరఁగడమవారికిర్వురి♦ర్వురుతనుజులు, గలిగి యన్యభూముల నేలఁ♦గలరు పెద్ద
కాలముండతిపావనే♦క్ష్వాకుకులము, వినుము గలదింక నొకవార్త♦మనుజనాథ.

మ॥ ధరణీజ న్విడనాడి శ్రీరఘుకులా ♦ ధ్యక్షుండుఁ బెక్కేండ్లు త
ద్విరహంబుం గనుకారణంబు గలదా ♦ వృత్తాంతమేమన్న మున్
భరవీరాత్ములు నిర్జరు ల్దనుజులన్ ♦ భంగించినన్ వారు సు
స్థిరధీరన్ భృగుపత్నిఁ గావుమని భీ ♦ తిన్ వేడ నక్కాంతయున్. 319

గీ॥ వారికభయంబిడి రిపులఁ ♦బాఱఁదోలఁ, జేరిదైత్యారి నిజచక్ర ♦ ధారఁ దత్స
తీమఃశిరంబు ఖండించి ♦ దేవవైరి, కులగణంబుల నణఁప భృ ♦ గుండుఁ గినిసి.

ఉ॥ దేవుఁడవంచు నిన్ను విను ♦ తింతురు లోకులుఁ గ్రూరబుద్ధి వి
ప్రావని నెట్లుఁ జంపితివి ♦ బాపురె యీయఘమంటకుండినం

బోవుని మానుషత్వమున ♦ భూమి నిఁకన్ జనియించి నీవు దా
రావిరహార్తిఁ గుందుదువు ♦ చాలదినంబులటంచుఁ దిట్టినన్. 321

కం|| ఆభృగుశాపంబంబు జ, నాభుండువహించి సీత ♦ నందనుఁ డయ్యెన్
భూభృద్వరేణ్యరాఘవ, భూభుజుఁ డిలఁ దత్ఫలంబుఁ ♦ బొంది చరించున్. 322

గీ|| సరసిజాసనునకు నైన ♦ హరికినైన, హరునకైనను విప్రవా ♦ క్యములఁ ద్రోయఁ
దరమగు నెయంచు నమ్ముని ♦ వరుఁడుఁ దెల్ప, ధరణినాయకుఁ డత్యద్భు ♦ తంబుఁ గాంచె.

గీ|| ఈరహస్యముఁ బురిఁ జేరు ♦ నెడలఁ జెప్ప, నాలకించితి నేనప్పు ♦ డంతె కాని
యితరులు నెఱుంగరీవార్త ♦ నిపుడు నీకుఁ, దెలిపితిని మానసంబులో ♦ పల నిలుపుము.

గీ|| కతిపయాబ్దంబులరుగఁగాఁ ♦ గడఁగి నిఖిల, కార్యములఁ దీర్చి శ్రీరఘు ♦ క్ష్మావిభుండు
మిమ్ములను ముందుగాఁ బంపి ♦ మీఁద సకల, బాంధవముఖులతో బ్రహ్మ ♦ పదముఁ
జేరు. 325

—* లక్ష్మణుఁడు బురముం బ్రవేశించుట. *—

మ|| అనిపల్కన్విని లక్ష్మణుండు వరవి ♦ ద్యాపూర్ణసుజ్ఞాను వా
నినిఁ గీర్తించుచుఁ బోయి నాటి కపుడున్ ♦ దివ్యాత్మ శ్రీ గోమతీ
ధునిఁ జేరె న్మరునాడు లేచి రథముం ♦ దోలన్ సుమంత్రుండుఁ జే
రె నయోధ్యానగరాగ్రగణ్యము నతి ♦ శ్రీ సంపదాగారమున్. 326

సీ|| ఏకాంతమున మున్ను ♦ నింతిపలికినఁ గూర్మి, పలుకులం దలపోసి ♦ కలఁగి కలఁగి
మనుజాపవాదంబు ♦ మది నెంచి నేనెట్టి, తెగువఁ బూనితినంచుఁ ♦ బొగిలి పొగిలి
యీమాట లక్ష్మణుం ♦ డెఱిఁగింప వెలఁదియే, మయ్యెనో యనియంచు ♦ నడలి యడలి
జీవితేశ్వరిఁ బాసి ♦ జీవంబు లెట్లింక, నిలుచునో యనియంచుఁ ♦ దలఁకి తలఁకి
గీ|| యింక నాకేల సుఖమని ♦ యెంచి యెంచి, నేత్రముల దుఃఖబాష్పము ♦ ల్నింపి నింపి
పట్టరానట్టి నెగులుతో ♦ వగచి వగచి, యలయు విభుఁ గాంచి లక్ష్మణుం ♦ డార్తుఁడగుచు.

కం|| చేరి విమలరామచరణ, వారిజముల వ్రాలి శోక ♦ బాష్పము లేత్తై
పాఱఁగ నడలఁ దలంకుచు, నా రాముం డనుజుశిరము ♦ నశ్రులముంచెన్. 328

—* లక్ష్మణుఁడు రాముని నోదార్చుట. *—

ఉ|| అంతట లక్ష్మణుండు హృద ♦ యాబ్జమునన్ ధృతిఁ జెంది చూచి భూ
కాంతకులాగ్రగణ్యుని ము ♦ ఖంబును నిర్భర శోకముబ్బ నే

నంతటి సాధ్వి ఘోరభవ ♦ దాజ్ఞ వెసం గొనిపోయి గాంగభూ
ప్రాంతతపోవనస్థలుల ♦ భానుకులాధిప డించి వచ్చితిన్. 329

ఉ॥ ఆ వెతలం దరింపఁ దర ♦ మా భువనంబుల నేరికైన నీ
దైవగతు ల్నిరంతరముఁ ♦ దార్కొను మూలలలోన డాగినన్
బోవునె తత్త్వముం దలఁపఁ ♦ బుట్టినశించుట కూడిపాయుటల్
జీవులకుఁ స్వభావములు ♦ చిన్మయరూపుఁడ వీ వెఱుంగవే. 330

మ॥ వగపుం జెందుట పాటిగాదు ధరణీ ♦ పాలేంద్ర? మీవంటివా
డు గణింపన్ విమలాత్మతత్త్వముఁ బృథ ♦ గ్రూపంబె? లోకాత్మకం
బగు దేవుండవు సత్యరూపుఁడవు లో ♦ కాతీతకాత్ముండవై
తగు నీకిట్లుపదేశము న్సలుపు త ♦ త్త్వజ్ఞాగ్రగణ్యుండ నే. 331

ఉ॥ పావనభూమివారిశుచి ♦ వాయునభోయుతలోక మంతయున్
నీవయి వెల్గుచుండ ధర ♦ ణీతనయామణి యెందుఁబోవు నీ
భావము లేల మీకిల భ ♦ వద్వ్యతిరిక్తపదార్థ మున్నదే
వావిరి లోకము ల్మఱుకు ♦ వం గని యిట్లుఁ దలంక నేటికిన్. 332

మ॥ అమలాత్మాత్మల మిమ్మెఱుంగుమనుశే ♦ హాళిం గళత్రాదివ
ర్గముపై మోహరసంబుఁ బాసి కడువై ♦ రాగ్యంబుతో నుండ నీ
భ్రమ మీకుం దగునే సతి న్విడిచి గో ♦ త్రాపాలనంబుం ద్యజిం
చె మహిన్ రాముఁ డటంచుఁ బల్కరె జనుల్ ♦ సీతామనోనాయకా. 333

క॥ అనిబోధింపఁగ రాముం, డనుజునిముఖముం గని భవ ♦ దనవద్యోక్తు
ల్విని నాల్గురోజులయ్యెన్, జనరక్షణ మెల్లికైన ♦ సల్పంగవలెన్. 334

క॥ అనివచియించి తరణికుల, వననిధిసోముండు మఱలఁ ♦ బరమకృపాత్మన్
ఘనగుణశీలు సుమిత్రా, తనయుం గని పల్కె నిట్లుఁ ♦ దగువచనములన్. 335

మ॥ క్షితిఁ బాలించుచు సజ్జనప్రతతులన్ ♦ శిక్షించుచుం దుర్జన
ప్రతతిన్ లోకులుఁ దెల్పువిన్నపములన్ ♦ బాళి న్విచారించుచున్
క్షితిఁ బాలించి ధరావిభుం డమలస ♦ త్కీర్తిం గనుం గాని ధూ
ర్తతతు ల్దిట్టఁగ నిచ్చట న్నిరయసం ♦ తప్తాంగుఁడౌ నచ్చటన్. 336

క॥ ఇలఁ బుణ్యుఁడ ననుచున్ లో, పల నె వసించునరవిభుఁడుఁ ♦ బౌరుల విజ్ఞ
ప్తుల వినఁడేనిం గీడగుఁ, గల దిందొక్క కథవినుము ♦ కారుణ్యానిధీ. 337

—* రాముఁడు నృగమహారాజు చరిత్రము లక్ష్మణునకు వినుపించుట .*—

ఉ॥ నృగుఁ డనుభూమిపాలుఁ డతి ♦ నిర్మలచిత్తుఁడు లోకవందితుం
డగణితసత్యవంతుఁడు ద ♦ యామయుఁడుం బ్రతివాసరంబునం
దగు నవరత్నభూషణవి ♦ తానవిభూషితచారుగాత్రవ
త్సగణవిశిష్టధేనుతతి ♦ దాన మిడున్ ధరణీసురాళికిన్. 338

చ॥ అతఁ డొకనాఁడు బ్రాహ్మణుల ♦ కర్బుదసంఖ్యల మీఱుధేనుసం
తతుల సదక్షిణాకముగ ♦ దానముఁ జేసెడుఁ జోటఁ బావన
వ్రతుఁ డగునొక్కవిప్రకుల ♦ వర్యుని ధేను వనేకధేనుసం
గతి కటరా నృపాలుఁ డొక ♦ క్ష్మాసురుఁ బిల్చి యెఱుంగకిచ్చెనన్. 339

మ॥ కొని సంతుష్టమనస్కుఁడై చనఁగ నా ♦ గోత్రానుగుండావుగ
ల్గిన ధాత్రీసురుఁ డాత్మధేనువను గా ♦ లింపం బ్రయత్నించి దే
శనికాయంబుల నెందుఁగానక మహా ♦ క్ష్మాధ్రప్రతానంబులం
గని గాత్రిం బలయుంగఁ గష్టసమధి ♦ క్రాంతాతిదైన్యంబునన్. 340

ఆ॥ వె॥ కడకుఁ దిరిగితిరిగి ♦ కనకలాహ్వాయ దేశ, మునకుఁ బోయి యచ్చ ♦ టనొకధరణి
సురకులాగ్రగణ్యు ♦ శరణంబునం దూడ, తోవగలఁదగుతన ♦ గోవుఁగాంచె.

క౦॥ కని పిల్చి సమ్మదంబునఁ, దన ధేనువు తన్నుఁ జేర ♦ ధాత్రీసురుఁడున్
జనుదెంచిన గోవుం గొని, చనుచుండఁగ దానిఁ గొన్న ♦ క్ష్మాసురుఁడలుకన్. 342

మ॥ తెగువ న్నాయిలుఁ జొచ్చి నామొదవున్ ♦ దృప్తుండవై కొంచుఁ బో
వఁగఁ జౌర్యం బిది యిట్టికార్యములు భా ♦ వ్యంబే యటంచుద్ధతిన్
సిగ వీడ న్వెనువెంట నంటి కినుకం ♦ జేఁబట్ట నే తెంచినన్
నగి యావిప్రవరేణ్యుఁ డన్యధనమై ♦ న న్నేను గైకొందునే. 343

క౦॥ నాయావిది సత్యంబుగ, నేయావులఁ జేరి యిటకు ♦ నే తెంచినఁదో
యీయావుఁ గానకయె నే, నాయాదేశములఁ దిరిగి ♦ యలసితి ననినన్. 344

ఉ. ఇచ్చినసద్వదాన్యుఁడు నృ ♦ గేశుఁడు దీనినిఁ గొన్నవాఁడ నే
నిచ్చటనే వసించితిమి ♦ యిట్లనృతంబుల విప్రుఁడాడఁగా
వచ్చునె రమ్మికం ధరణి ♦ పాలునిచెంత కనంగఁ గాదన
న్వచ్చునె యంచు నయ్యెడల ♦ నైచికితోఁ జనుదెంచె నాతఁడున్. 345

గీ॥ వచ్చివారలు పెక్కుది ♦ వసము లవని, ధవునివాకిలిఁ గాచి త ♦ ద్దర్శనంబు
లేమిచే రోసి విప్రులా ♦ భూమినాధ, ముఖ్యు నూసరవెల్లివై ♦ పుట్టుమనుచు.346

గీ॥ తిట్టిపోయిరి పిదప నా ♦ బెట్టిదంపు, శాపము న్నృగపార్థివ ♦ చంద్రున కట
బాహ్యకద్వారపాలకు ♦ ల్వచ్చి తెలుప, నగచి వగచి నెగులుఁ దోఁప ♦ నృగవిభుండు.

మ॥ నెనరుం బూని నిజాశ్రితాప్తహితమం ♦ త్రిశ్రేణి రావించి త
ద్ఘనఘోరక్షితిదేవశాపమును వ ♦ క్కాణించి రాజ్యార్హుఁడౌఁ
దనుజుఁ సర్వధరాధినాయకునిఁగాఁ ♦ దత్సన్నిధిం జేసి త
క్కిన రాజ్యార్హనయానయంబుల హితో ♦ క్తిం దెల్పి ధైర్యంబునన్. 348

ఆ॥వె॥ వలియు నాతపంబు ♦ వానయు గాలియుఁ, జేరనీని కలుఁగు ♦ జేయఁ బంచి
యదియుఁ గానకుండఁ ♦ బొదలుఁ బుట్టలసంఘు, టెంపుడను చురూపు ♦ డించి చొచ్చె.

గీ॥ అందు నలయుచు నిప్పటి ♦ కానృగాధి, పుండు నూసరవెల్లిరూ ♦ పున నటించు
చుండె నతిదృప్తుఁడగు ధరా ♦ మండలాధి, నాయకుం డిట్లు వెలయుస ♦ న్మాత్రన్యచరిత.

గీ॥ ఇవ్విధంబున నిమిమేది ♦ నీశ్వరుండు, గురువరోగ్రశాపంబుచేఁ ♦ గుందుటయును
నధికమత్తుఁడై కాదె య ♦ క్కథయు నీకు, నెప్పుడైననుఁ దెల్పుదు ♦ నిద్ధగుణ.

కం॥ అని ఋషిమొదలైనఁ బురా, తనగాథల సోదరునకుఁ ♦ దగుసంప్రీతిన్
వినుపించుచు నారాత్రిన్, దినమణికులవార్ధిచంద్ర ♦ తిలకుఁడుఁ గడిపెన్. 352

—* ఆశ్వాసాంతము. *—

ఉ॥ అంబుసుహోక్ష దీనమను ♦ జావనదీక్షనిబద్ధకంకణా
తుంబురనారదాంబుజజ ♦ ధూర్జటిదేవధవాదిసేవ్యపా
దాంబుజ భక్తవత్సల మ ♦ హాకరుణారసవారిరాశి దు
గ్ధాంబుధికన్యకామలహృ ♦ దబ్జదివాకర దైత్యభీకరా. 353

మాలిని॥ సరససుగుణమూర్తీ ♦ సత్యమార్గానువర్తీ
పరమపదవిహారా ♦ భక్తచింతాపహారా
సరసిజదళనేత్రా ♦ సర్వలోకాళిజైత్రా
కరపతిపరిపాలా ♦ కామినీరత్నలోలా. 354

—* గద్యము. *—

ఇది శ్రీనారాయణకరుణాప్రసాదలబ్ధచతుర్విధకవిత్వచాతుర్యశతావధా
నిత్యాదిబిరుదాంకితరత్నాకరవంశపయఃపారావారరాకాసుధాకర
గౌతమగోత్రోద్భవరంగాచార్యపుత్త్రిరాజమాంబావధూటి
కాగర్భశుక్తిముక్తాఫలానంతార్యకవిప్రణీతంబగు
నిర్వచనకుశలవాభ్యుదయమహాకావ్యంబున
ద్వితీయాశ్వాసముసంపూర్ణము.

శ్రీ * శ్రీ * శ్రీ * శ్రీ * శ్రీ

శ్రీరస్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# నిర్వచనకుశలవాభ్యుదయము

## తృతీయాశ్వాసము



శ్రీరామాసుందరశ్యా, గారాగారకుచకనక ♦ కలశయుగాలం
కారా నీలజలధర, శ్రీరుచిరశరీర ధీర ♦ శ్రీహరినాథా. 1

గీ॥ అవధరింపుము రామచం ♦ ద్రావనీశ, సార్వభౌముఁడు లక్ష్మణ ♦ స్వామికిట్లుఁ
గథలఁజెప్పుచునారాత్రిఁ ♦ గడుపుచుండె, దిక్కులన్నియునంతలోఁ ♦ దెల్లఁగాంచె.

### —* ప్రాతఃకాలవర్ణనము. *—

సీ॥ అలినీవితానంబు ♦ కలనాదములఁ గేరెఁ, జిల్కపల్కులఁ దేనె ♦ లొల్కవారెఁ
గలకంఠనిక్వాణ ♦ ములమహాసుధలూరెఁ, జక్రజాలముసఖీ ♦ జనముఁ జేరెఁ
గమలాకరంబులు ♦ విమలకాంతులమీరెఁ, దిమిరంబు శైలాంత ♦ రములఁ దూరెఁ
గుక్కుటంబులు మేలు ♦ కొల్పులం జెల్వారె, నిఖిలలోకాళికి ♦ నిద్రవారె
గీ॥ విమలతరతారకాసమూ ♦ హములు జారె, సకలదీపోత్కరంబులఁ ♦ జాయలారె
లలితగతిశాలిమలయాని ♦ లంబు దారె, తరణికిరణప్రతానంబు ♦ దిరుగువారె. 3

సీ॥ ప్రాగ్దిగ్విలాసినీ ♦ ఫాలభాగంబున, దీపించుసిందూర ♦ తిలకమనఁగఁ
బ్రాగ్వధూమణికి నై ♦ వరుణుండు వలపుతోఁ, బంపిన కెంబువ్వు ♦ బంతియనఁగఁ
ద్రిదివాధినాథుండుఁ ♦ ద్రిదశాలయంబునఁ, దనర నెత్తినజయ ♦ ధ్వజమనంగ
దైతేయులవధింప ♦ దామోదరుండు హ, స్తమునఁ దాల్చినసుద ♦ ర్శనమనంగ
గీ॥ నలరనుదయాద్రిసౌధజా ♦ లాంతరమునఁ, దాపబడినట్టి కెంపుట ♦ ద్దంబనంగఁ
బ్రాగ్వధూమణికర్ణాభ ♦ రణమనంగ, నుదయగిరిఁ జంద్రమండలం ♦ బుదితమయ్యె.

గీ॥ జలజబాంధవకులదుగ్ధ ♦ జలధిపూర్ణ,చంద్రుఁడైనట్టిశ్రీరామ ♦ చంద్రుఁడపుడు
లేచిసంధ్యాదికృత్యము ♦ లాచరించి, సకలసామంతసహితుఁడై ♦ సభకుఁబోయి. 5

సీ॥ భరతాదిసోదరు ♦ ల్పార్శ్వంబులనమస్కృ, తులఁజేసితగుకార్య ♦ ములనొనర్ప
ఘనతరప్రేమతోఁ ♦ గనివసిష్ఠాదిక, మునులునాశీర్వాద♦ములఘటింప
రాజాధిరాజ ! ప ♦ రాకంచుసారెసా, రెకుఁగంచుకులుహెచ్చ♦రికలఁదెల్ప
నాప్తమంత్రిపురోహి ♦ తాశ్రితాదులుగూడి, వెనువెంటమిగులసే ♦ వించుచుండఁ

గీ॥ గలసికొనిమన్నెదొరలూడి ♦ గములఁజేయు, నవమణిఖచితసింహాస♦నంబునెక్కి-
యుదయగిరినెక్కుబాలసూ ♦ ర్యుండనంగఁ, గొల్వుఁదీరిచెశ్రీభాను♦కులవిభుండు.

గీ॥ ఇత్తెఱంగునఁగొల్వుండి♦ యినకులప్ర, ముఖుఁడుముందటలక్ష్మణు ♦ మోముఁగాంచి
యీవుముంగిటికేగియుం ♦ దెవ్వరేని, మనవిగలదన్ననిటుకుఁదె ♦ మ్మనుచుఁబనుప.

ఉ॥ చిత్తమటంచు లక్ష్మణుఁడు ♦ శీఘ్రగతిన్ మొగసాలకేగియుం
దొత్తుగసిల్చినట్టి మను ♦ జోత్కరముం గని రామచంద్రభూ
భృత్తిలకోక్తినందఱికి ♦ వెంటనెతెల్పినభక్తిసమ్మిళ
చ్చిత్తులుఁ గీర్తిమంతులు సు ♦ శీలురు వారు వచించి రీగతిన్. 8

గీ॥ కోమలంబైనశ్రీరఘు ♦ రాముమోముఁ, గనులఁజూచెడుభాగ్యము ♦ క్కటిమెకాక
వాంఛితార్థప్రపూరిత ♦ స్వాంతులమగు, మేమిపుడుఁజేయువిన్నప ♦ మేమిగలదు?.

సీ॥ మత్తవారణకదం ♦ బములందెమదవృత్తి, మధుపసంఘములందె ♦ మలినగుణము
సౌదామినులయందె♦ చపలస్వభావంబు, మహిలాగతులయందె♦ మాంద్యగుణము
మిథునసంగతులందె ♦ మేలైనబంధంబు, లర్ధశీతాంశుని ♦ యందెకొఱంత
కడిదిపుట్టలయందె ♦ ఘనభుజంగత్రాస, మలకృష్ణపక్షంబు ♦ లందెతమము

గీ॥ ఘోరభల్లాకపోత్రిసిం ♦ ధారవార, ణాదిమృగములయందెక్రౌ ♦ ర్యంబుగలదు
గానిమఱియెందుఁజూచినఁ ♦ గానమయ్య, రామధాత్రీశ్వరుండేలు ♦ రాజ్యమునను.

సీ॥ గహనంబులందెకా ♦ కసుమనోభావకై, శ్వర్యంబుసర్వప్ర ♦ జలకుఁగలదు
గంధంబునందెకా ♦ కమహితామోదంబు, భూజనప్రనిచయం ♦ బులకుఁగలదు
గగనంబునందెకా ♦ క ఘనలక్ష్మముసర్వ, పురజనప్రనివహం ♦ బులకుఁగలదు
విమలగాంగేయచే ♦ లమునందెకాకసు, గుణచయంబుజనుల ♦ కుంజెలంగు

గీ॥ మహితధానుష్కకరసరో♦రుహములందె, కాకధర్మముజనులకుఁ ♦ గలదురామ
చంద్రుఁడెప్పుడుసత్కృపా♦ సాంద్రబుద్ధి, రాజ్యమొనరింపనొక్కకొ ♦ అంతగలదె.

గీ॥ ఇట్లు శ్రీరఘురామధా ♦ త్రీశ్వరుండు, రాజ్య మేలఁగ నొక్కకొ ♦ అంతగలదె
యనుచుఁ బ్రజలనఁగా సుమి ♦ త్రాత్మజుండుఁ, బిదపనరుదెంచి శ్రీరామ ♦ విభునిఁగాంచి.

గీ॥ వందనంబులఁ జేసి త ♦ ద్భాషితముల, నాతనికిఁ దెల్పుచుండఁగా ♦ నంతలోనఁ
బరమగుణశీలుఁడు నమాత్యుఁ ♦ డరుగుదెంచి, జనపతికిఁ గేలుమోడ్చి యి ♦ ట్లనె
వచించె. 13

—* చ్యవనాదులు రామునితోఁ లవణునివృత్తాంతముఁ జెప్పుట *—

గీ॥ స్వామి శ్రీభానుకులదుగ్ధ ♦ జలధిచంద్ర, చ్యవనశుచికాదిమౌనీంద్రు ♦ లరుగుదెంచి
ద్వారమున నిల్చినారని ♦ పల్క లేచి, యెదురుగాఁ బోయి వారల ♦ కినకులుండు.

గీ॥ బహువినయముతోఁ దత్పదా ♦ బ్జముల కెఱఁగి, వారలందోడుకొనివచ్చి ♦ పరమరత్న
ఖచితపీఠికల నొసంగి ♦ కడువినమ్రుఁ, డై సపర్యలఁ జేయ వా ♦ రపుడు నెలమి.

ఉ॥ రాజజరాజరాజులన్సు ♦ రద్వరభావకళాభవంబులన్
రాజజరాజరాజులన్సు ♦ రద్వరభావకళాభవంబులన్
రాజజరాజరాజులన్సు ♦ రద్వరభావకళాభవంబులన్
రాజవరేణ్య ! గెల్చితివి ♦ రాజేఁవడుం దగు నీకటం చటన్. 16

ఉ॥ తెచ్చిన లోకపావనన ♦ దీసలిలంబుల సత్ఫలంబులన్
మెచ్చి యొసంగి దీవన ల ♦ మేయదయారస మొప్ప నీయఁగా
సచ్చరితుండు భానుకుల ♦ సాగరచంద్రుఁడు సంతసించి వా
రిచ్చినవాటినిం గొని ము ♦ నీశుల కిట్టులనె న్వినీతుఁడై. 17

శా॥ ఆధుల్దీర్పఁజెలంగు మీచరణతో ♦ యంబుల్శిరంబానె నా
నాధున్యంబువు లేల మిమ్ములను సం ♦ దర్శింపగా నౌ ఫలం
బేధన్యాత్మునిఁ జేసె నీఫలము లిం ♦ కేలా యమైనం బ్రహ్మా
జ్యాధరోత్తములార ! మీరు దయసే ♦ యం గాదన న్వచ్చునే. 18

శా॥ నాసామంతులు బాంధవానుజవితా ♦ నంబుల్మదీయాంగముల్
నాసర్వస్వము మీయధీనము గదా ♦ నన్నుం గటాక్షించి నే
నాసక్తిం దమ కీయెడ న్సలుపు కా ♦ ర్యంబుల్దయం గాంచుడం
చాసూర్యాన్వయనాయకుం డన మునుల్ ♦ హర్షాభిమగ్నాత్ములై. 19

శా॥ ఏభూపాలకులైన నీనయముతో ♦ నిట్లాడఁగా నేర్తురే
నీభక్త్యాదులఁ గాంచి మెచ్చితిమి యీ ♦ నీరేజమిత్రాన్వయుల్

శ్రీభామాపతిభక్తులం చనిగదా ♦ శ్రీలక్ష్మినే తెంచి నీ
వీభాన్వన్వయమందుఁ బుట్టితివి శ్రీ ♦ హేలాకృతిన్ రాఘవా? 20

శా॥ నీ కారుణ్యరసంబుచేనటబుధా ♦ నీకంబు చిత్తంబున
న్వీకం గాంచి చరింపఁగాఁ దగె మహా ♦ నిష్ఠాత్ములం దాపసా
నీకంబుగ్రవనంబులం దిరుగఁబూ ♦ నెన్ సంతతంబున్ జగ
ల్లోకారాధ్య! యటంచనెంజ్యవనుఁడా ♦ లోచించియువ్వైఖరిన్. 21

చ॥ అని మఱల న్వచించె దను ♦ జాన్వయజుండు గుణాఢ్యుఁడున్ మధుం
డను నొకదానవుం డలరె ♦ నాతఁడు భూమిసురు ల్మునుల్ గణిం
డని వినుతింపనెల్లెడ స ♦ మంచితభక్తియుతాంతరంగుఁడై
ఘనతపముం బొనర్చెఁ గఱ ♦ కంఠునిఁ గూరిచి పెక్కునాళ్లిలన్. 22

ఉ॥ అంతట నాతపంబునకు ♦ నాతనిపై దయఁబూని సజ్జటా
సంతతికాంతిసాంధ్యరుచి ♦ జాలమునీలగలప్రభామహా
ధ్వాంతము సత్తనూరుచి సు ♦ ధాకిరణా తపమొప్పఁ బార్వతీ
కాంతుఁడు దర్శనంబిడినఁ ♦ గైకపమోడ్చి నుతించె నాతఁడున్ 23

ఉ॥ సోమధరుండు మీఁదనిజ ♦ శూలముచే మఱియొండు శూల మొం
తో మహిమన్ సృజించి దయ ♦ తో నిడి వానికి ఘోరశాత్రవ
స్తోమములన్ జయించి కలిఁ ♦ దోడనె సన్నిధిఁ గేగుదెంచెడిన్
సీమది ధర్మమున్మఱచి ♦ నిల్చిన నయ్యది నన్నుఁ జేరనన్. 24

ఉ॥ అందుకుఁ జిత్తమంచుఁ ద్రిపు ♦ రారికి మీఁదట మ్రొక్కి దైత్యసం
క్రందనవంద్య! మాకులమిఁ ♦ క న్మహిలోపలనుండుదాఁక మా
కందరికీ త్రిశూలము ద ♦ యామతినిల్పవెయుంచనన్ జగ
ద్వందితుఁడాతఁడు న్మఱల ♦ వానికి నిట్లనె సత్కృపామతిన్. 25

ఉ॥ నీసుతుఁడొక్కరుం డెలమి ♦ నీవెనుకన్ ధరియించి దీనిచే
వాసివహించు యుద్ధముల ♦ వైరులఁ గూలుచు దీనిసేమెడం
బాసినవైరిజాలముల ♦ వాఁడు హతుండగు నప్పుడిద్దియున్
రోసి మదీయశూలమున ♦ రూపమువీడునటంచు నేగినన్. 26

ఉ॥ ఆనరభోజిమీఁదట ద ♦ శాననుఁగూరిమి చెల్లెలైనఁగుం
భీనసఁదోడితెచ్చి బలి ♦ మిం దమకంబలర న్వివాహమై
యానలినాక్షి యందు లవ ♦ ణాసురు దుష్టమనస్కుఁ గ్రూరు నం
భోనిధి మున్ను ఘోరవిష ♦ ముం గనినట్టులఁ గాంచె భూవరా. 27

చ॥ తనుజుఁడుదుష్టుఁడౌటకు వె ♦ తంగనివానిక తండుపార్వతీ
శునివరపద్ధతిం దెలిపి ♦ శూల మొసంగి భవన్మనంబులోఁ
బనివడిధర్మమార్గములఁ ♦ బాయకుమంచని ప్రోలఁగట్టి వెం
ట నెజలరాశిఁజొచ్చె మది ♦ నాటిన తాపము వోవ నయ్యెడన్. 28

కం॥ అది మొదలుగానతండతి, మదమత్తుండై చెలంగి ♦ మాదృశుల వనిన్
మొదలఁగనియ్యఁడు లోకుల, నిదుమాదుండటికి మేమిఁ ♦ జెప్పఁదు మనఘా. 29

ఉ॥ ఈశునిశూలరాజము వ ♦ హించినవాడని భీతి సర్వభూ
మీశులువానిదాపునకు ♦ నేగరు మమ్ములమీరుఁ బ్రోచుధా
త్రీశవరేణ్యులై వఱల ♦ నెవ్వరితోఁబని యేల నేటికీ
యాశరువార్తఁ దెల్పుటకు ♦ నైచను వెంచితిమయ్య రాఘవా. 30

క॥ ఇఁక నిట్టిఖలుని దేవరి,పుకులాధముఁ గపటచిత్తుఁ ♦ బుణ్యవిహీనున్
వికటాత్ముఁ జంపి యీమా, నికదంబము ప్రోవఁ జెల్లుఁ ♦ నెమ్మిన్ నీకున్. 31

మ॥ వనధిం గట్టి ససూనబాంధవబల ♦ వ్రాతంబుతో నద్దశా
ననుఁ బోకార్చిన నీకు నీలవణుఁ డౌ ♦ న్నన్ లక్ష్యమే యీదురా
త్ము నసీతున్ లవణు న్వధించి వికలం ♦ బుంగాంచు మాచిత్తముల్
ఘనమోదాంబుధి నోలలాడుకరణిం ♦ గావింపుమీ వంచనన్. 32

శా॥ ఆ రాముండు నమస్కరించి మునులా ♦ రా! వాని కేమేమియా
హారం బెచ్చట సంచరించు బహుదు ♦ ష్టాత్ముం డతం డెట్టియా
చారుం డాసకలంబుఁ దెల్పు డిపు డా ♦ సంక్రందనారిన్ దురా
చారుం బట్టి వధించు టెంత యన సు ♦ స్వాంతాబ్జు లమ్మౌనులున్. 33

సీ॥ నూఱువారణము లి ♦ న్నూఱుసింహంబులు, వేయుసైరిభము లా ♦ ర్వేలదుప్పు
లార్న్నూరు హరిణంబు ♦ లైదువేల చమరు, లుబ్భదారలక్షయుఁ ♦ బూట కతని
కాహారము మధువ ♦ నాంతరంబె విహార, యోగ్యప్రదేశంబ ♦ యోగ్యమయిన
మని తెల్ప వానిశౌ ♦ ర్యంబు రాముఁడుఁ దృణ, ప్రాయంబనితలంచి ♦ పరమమునులఁ
గీ॥ గాంచి యిఁక లవణాసుర ♦ ఖలు దురాత్ముఁ, బట్టివధియించి మీదగు ♦ బాధలెల్లఁ
బాపెదనటంచుఁ బ్రేమతోఁ ♦ బల్కిపిదప, దోర్బలయుతులభరతశ ♦ త్రుఘ్నులఁగని.

క. మీయిద్దరిలో నెవ్వఁడు, నీయమరారి న్వధింప ♦ నేగెదరో నా
కీమొడఁ దెల్పుఁడు నావుడు, ధీయుతుఁడగు భరతుఁడిల్లు ♦ తేఁకువఁ బలికెన్. 35

—* రాముఁడు లవణాసురునిఁ జంపుటకు శత్రుఘ్నునిఁ బంపుట *—

శా॥ ధాత్రీశోత్తమ! నన్నుఁ బంపుము మహా ♦ దర్పాంగు గుంభీనసా
పుత్రున్ నేఁ బరిమార్చివత్తు నిఁక వి ♦ ప్రుల్ నాకవాసుల్ మను
ల్విత్రాసాత్మకులై నటింతురన హా ♦ ళిన్ లేచి భూనేతకున్
శత్రుఘ్నుండు నమస్కరించి వినయ ♦ స్వాంతుండునై యీగతిన్. 36

సీ॥ సారసాప్తకులాబ్ధి ♦ చంద్ర మిమ్మెడఁబాసి, పదునాలుగేడులు ♦ వగపుతోడఁ
గూరలే భక్షించి ♦ నారచీరలఁ దాల్చి, బడలి నందిగ్రామ ♦ వాస మొనరి
చినవాఁడు భరతుండు ♦ తనరు మీసేవకు, నిటనుంచి నన్ను న ♦ కుటిలులవణు
వధియింపఁబంపుఁడు ♦ స్వాంతంబులో భక్తిఁ, దలఁచియుష్మత్పాద ♦ జలరుహములఁ
గీ॥ జేరిమధుపురిగడియలోఁ ♦ గ్రూరు లోక,కంటకు దురాత్ము లవణరా ♦ క్షసు వధించి
వత్తు ననవుడుసకలభూ ♦ పాలకులవ, రేణ్యుఁ డనుజుని మెచ్చి పే ♦ ర్మి ననె నిటుల.

చ॥ అవిరళధైర్యశాలివి శ ♦ రాస్త్రవిదుండవు యుద్ధకోవిదుం
డవగుట నిన్నుఁబంపుటకు ♦ నామది నెంచితి వైరిఁజంపి వై
భవయుతతత్పురంబుఁ బరి ♦ పాలనఁజేయుము భూమినేలు ధ
ర్మవుఁనకు సాటిలేదనిరి ♦ మున్నగుణాఢ్యులు రాజనీతులన్. 38

మ॥ పరు నాజిం బరిమార్చి తత్పురము సం ♦ భావించి ధర్మంబుతోఁ
బరిపాలింపక యున్న ఘోరతరపా ♦ పం బబ్బు నార్యాజ్ఞ బా
లురకున్ గ్రాహ్యము మాఱుబల్కకుము మే ♦ లుం గాంచి తద్దైత్యరా
ట్పురసుశ్రీలకు ధారుణీశ్వరుఁడవై ♦ పోషింపుమీనావుడున్. 39

చ॥ అళుకుచు నారిపుఘ్నుఁ డట ♦ నగ్రజుఁడుండఁగ రాజ్యవైభవం
బుల వహియింప బాలురకుఁ ♦ బోలునెయంచు వచింప వెండియుం
జెలిమిఁజెలంగి తమ్మునకుఁ ♦ జెప్పెడిమాటలఁజెప్పి మీఁదటన్
లలితవయస్కులా భరత ♦ లక్ష్మణులం గని ధైర్యమూనుచున్. 40

సీ॥ అభిషేకవస్తువు ♦ లరసితేఁ దగువారి, నంపుడార్య పురోహి ♦ తాప్తగురు స
చివులఁబిల్వుఁడు ముద్దు ♦ చిన్నితమ్మునివైరి, పట్టణంబునకు ♦ భూపతినిఁజేయు
మాటఁ బట్టణములోఁ ♦ జాటఁగాభటులఁ బం, పుడటంచుఁబల్కన ♦ ప్పుడెచనివిభుఁ
డానతిచ్చినరీతి ♦ నన్నియు సమకూర్చి, గురుపురోహితులనం ♦ దరినిఁబిలిచి
ఆ॥వె॥ సకల కార్యములను ♦ సంఘటించితిమని, భరతలక్ష్మణాదు ♦ లరుగుదెంచి
చెప్ప భానువంశ ♦ సింధుచంద్రుండగు, రామచంద్రుఁడపుడు ♦ రహివహించి. 41

మ॥ క్షితిదేవోత్తములెల్ల సత్కరుణ నా ♦ శీర్వాదముల్సేయ వా
ద్యతతుల్ మ్రోయఁగ నృత్యముల్ సలుప వే ♦ శ్యారత్నముల్ మాతృస
మ్మతిచేఁ బెద్దలకెల్ల మ్రొక్కి కడుఁ బ్రే ♦ మం దన్ముఖాబ్జంబునన్
క్షితిపాలుండు సువర్ణపట్టము నరు ♦ ల్గీర్తింపఁ గట్టె వెసన్. 42

గీ॥ భవదనుజు నేఁడు మధుపురీ ♦ ధవునిఁ జేసి, నప్పుడే లవణాసురుం ♦ డణఁగె రామ
మీరు తలఁచినపని వ్యర్థ ♦ మేయటంచుఁ, జ్యవనముఖులెంచి రల రామ ♦ చంద్రు నపుడు.

ఉ॥ క్రచ్చఱరత్నభూషణక ♦ రంబుల బాలదివాకరుండనన్
వచ్చి పదాంబుజాతముల ♦ వ్రాలిన ముద్దుల చిన్నితమ్ములన్
సచ్చరితుండు రామనృప ♦ చంద్రుఁడు నక్కున జేర్చి మీఁదటన్
ముచ్చటలాడుచు న్మదిని ♦ భూరిదయాకరబుద్ధి నిట్లనెన్. 44

మ॥ సరసీజాసనుఁ డెంచి మున్నొక మహా ♦ స్త్రంబున్ సృజించె న్మది
నరుసం గ్రుంగిరి కైటభాదికులు దా ♦ నం గానఁ దద్బాణమి
ద్ధరణిన్ నాకు లభించె లోకములకుం ♦ ద్రాసంబగున్ దాని ని
త్తరి నీకిచ్చెద సంగ్రహింపుమని మో ♦ దస్వాంతుఁడై యిట్లనెన్. 45

మ॥ అనుజా నీకిది యుండినన్ లవణ సం ♦ హారంబు దుస్సాధ్యమే
యనుచున్ వానికిఁ దత్ప్రయోగ ముపసం ♦ హారంబు మంత్రక్రమం
బును వాక్రుచ్చి తదస్త్రరాజమిడి త ♦ మ్ముం గౌఁగిటం జేర్చి రా
మనరాధ్యక్షువరుండనెన్ మఱల వా ♦ గ్మాధుర్యమేపారఁగన్. 46

చ॥ హరుఁ డిడినట్టిశూలమును ♦ హస్తమునం ధరియించియుండనా
శరుని జయింప శూలికిన ♦ శక్యము దానినిఁ బాసి క్షుత్తృషా
స్ఫురణమతి న్వనిం దిరుగు ♦ చోఁ గనిపెట్టి యెదిర్చినన్ జయం
బరమర లేక నీకమరు ♦ నన్నియు సేకురు లక్ష్మణానుజా. 47

ఉ॥ ఆలమొనర్పవచ్చె రిపుఁ ♦ డంచని యించుక వాఁడెఱింగినన్
శూలముతో బయల్వెడలు ♦ సుమ్మదినీయెదనుంచి దవ్వులం
బాళెము డించి యొంటిగనె ♦ బాణములం ధరియించిపోయి యి
య్యాలవణుండుఁ దా వెడలి ♦ నప్పుడె ముల్కులఁ గ్రుమ్మరింపుమీ. 48

చ॥ ఖరశరతాడనంబులకుఁ ♦ గాసిలుచుం బురిఁ జేరఁ బోయినం
దుఱమును సల్పుచుం దనుజు ♦ తో నటఁబోవఁగనీక నిల్పుమ
ప్పురమున కేగనేని ఫణి ♦ భూషణుఁ డిచ్చిన శూలరాజముం
దుఱమునఁ దెచ్చి నిల్చు నల ♦ ధూర్జటి కయ్యెడ వాఁడజేయుఁడౌ. 49

క॥ ఆశూలము లేనియెడల, నాశరవీరుని జయింప ♦ నగునని వీరుం
డౌ శత్రుఘ్నుని కారా, మేశుఁడు మఱువకుమటంచు ♦ నెలమిం బలికెన్. 50

సీ॥ నిమిషంబులో గిరీం ♦ ద్రములదాటుజవంబు, నఁ జెలంగుతురగము ♦ ల్వాల్గు వేలు
లలితకాంత్యౌన్నత్య ♦ ముల మేరుశైలంబు, దండించుతేజులు ♦ రెండు వేలు
నభముతో నొరయు ను ♦ న్నతగాత్రవిస్ఫూర్తి, నమరుమత్తేభంబు ♦ లైదు వేలు
విలయధూర్జటినైన ♦ వెఱపించుబలముతోఁ, బాఱాడువీరులు ♦ నూఱు వేలుఁ
గీ॥ గొల్వ కవిగాయకాదులు ♦ కోటిమంది, వంది మాగధబృందంబు ♦ లంద మొంది
వెంటరా నూఱుకోటులు ♦ వెచ్చమునకుఁ, గొని లవణునిపురమునకుఁ ♦ జనుము నీవు.

సీ॥ సేనాధిపతులం బ్ర ♦ ధానులం భటుల బాం, ధవులం గవుల హితా ♦ ప్తప్రతతుల
నెలమితోఁ దగినరీ ♦ తుల గౌరవింపుము, సమయంబుఁ జూచి కా ♦ ర్యములఁ గొనుము
భటవీరుల ధనలో ♦ భంబుచేఁ బ్రోవకుం, డెదు సుమీ యాభట ♦ నివహాకములఁ
గాదె రాజ్యంబు దు ♦ ర్గముల విత్తము రక్షణముఁ జేయుట ధరణీ ♦ నాయకుండఁ
గీ॥ గాననాతపతప్తాశ్వ ♦ కభటహస్తి, పకముఖులు సంతసంబుతో ♦ వఱల గాంగ
తీరతలముల నిల్పినఁ ♦ దీరు నీశ్ర, మమలగంగాతిశైత్యవా ♦ తమునఁ బిదప. 52

గీ॥ జాహ్నవిందాటి తత్తట ♦ క్ష్మాతలముల, సేనలం డించి కాళిందిఁ ♦ జేరి యచట
నొక్కరుండవె పొంచి దై ♦ త్యోత్తము లవ, ణాభిధానుని సాధింపు ♦ మయ్య తండ్రి.

సీ॥ ఎప్పుడీ వాడాన ♦ వేశుఁ గూల్చెద వప్పు, డే నీదువిజయ లే ♦ ఖానిచయముఁ
బంపింపు మిచటికి ♦ ప్పనికి నాలస్యంబుఁ, జేసిన మేనిలో ♦ జీవముండు
నేయంచుఁ బల్కి భూ ♦ నాయకప్రవరుండు, నెమ్మితోఁ బయనంబు ♦ నిర్ణయించి
తెలిపిన నాతఁ డా ♦ తీరున సేనతో, మునుకొని గురువరే ♦ ణ్యునకు మ్రొక్కి
గీ॥ యాతఁడు "రిపుక్షయోస్తుతే" ♦ యనఁగఁ దల్లు, లందరికి మ్రొక్కి దీవన ♦ లందిపిదప
స్వామి కభివందనంబుల ♦ సల్పి భరత, లక్ష్మణులకుం బ్రణామంబు ♦ లఘటియించి.

—* శత్రుఘ్నుండు రామాజ్ఞచే లవణాసురునిమీఁది కేగుట *—

ఉ॥ విఘ్నములేక గెల్వు మట ♦ ద్విడ్వరు నీ వని వారు సత్కృపా
విఘ్నమనస్కులై పనుప ♦ నెమ్మి నిలామరులం భజించి శ
త్రుఘ్నుఁ డనేకవాద్యముల ♦ తో భటవర్గముతో సమస్తలో
కఘ్ను జయింపగాఁ గదలెఁ ♦ గాంచి సురాదులు సన్నుతింపఁగన్. 55

క॥ కదలి సరణిం జెలంగెడు, నదుల న్నిధిగిరిగహనగ ♦ ణంబుం గనుచున్
హృదయాంభోజాతంబున, ముదముబ్బఁగ నేగుచుండె ♦ ముఖ్యబలుండై. 56

గీ॥ ఇటులఁగాన్పించు మహితగి ♦ రీంద్రనిచయ, కములలోపల రేణుక ♦ క్ష్మాధరాజ
మధికలీలాభిశోభిత ♦ మై సమస్త, సుమసుగంధాలయంబన ♦ నమరుచుండె. 57

## —* రేణుకాద్రివర్ణనము *—

క॥ అలగిరిపై హరిమార్గం, బుల వెదకుచుఁ బోవునట్టి ♦ బోయల కతితుం
దిలహతగజకుంభస్థల, గలితామలమౌక్తికములు ♦ గతిఁ జూపించెన్. 58

సీ॥ అలగారుడంబుల ♦ కతిభీతిఁ గని భాను, రథసర్పరజ్జువా ♦ రంబు వీడఁ
గమనీయనీలాళిఁ ♦ గాంచి హస్తిభ్రాంతి, నులుకుంజసుప్తోగ్ర ♦ హరులువాఱ
స్ఫటికజాలముఁ గాంచి ♦ చారుగంగాఝరం, బని యోగిజాలంబు ♦ మునుఁగఁజూడ
నలశిఖాధాతుకాం ♦ తులఁ జూచి ఘాసాంకు, రము లంచు హరిణవా ♦ రంబు వాఱఁ

తే॥ బుష్యరాగమణులఁగాంచి ♦ పువ్వులనుచు, సురుచిరాగమసుమపరి ♦ చ్యుతమరంద
బిందుపానాతితుందిలేం ♦ దింగరములుఁ, గ్రమ్మ రేణుకశైలంబు ♦ గ్రాలుచుండె. 59

చ॥ నిరతముఁ జారుసూనపట ♦ నిష్యూతమై కమనీయతల్పటాం
తరములలో మనోహరని ♦ నాదము సల్పు కపోతసంతతిం
దరినతిసాంద్రమేఘసము ♦ దాయము నెల్ల నిరాకరించి భూ
ధర మతిపూజ్యమై మునివి ♦ తానని కేతనమై విరాజిలెన్. 60

చ॥ చరియలు రాత్రికాలములఁ ♦ జంద్రకరాహతచంద్రకాంతకో
త్కరవిపరిచ్యుతాంబుకుల ♦ కంబులతో జలకంబు నాడి సుం
దరరవికాంతజానలము ♦ తారసిలం గడుఁ దీవ్రయోగముం
బరువడిఁదాల్చియొప్పినవి ♦ భాసురకాంతిని కేతనంబులై. 61

చ॥ మరకతభూములం బడిక్ర ♦ మంబుగ సుందరకేతకీసుమాం
తరపతితాణురేవులు ♦ తామరసాప్తమయూఖపాళితోఁ
బరిమిళితంబులై లలిత ♦ బర్హిణకంధరలీలలం దగెన్
మరువనిరీతిఁ గూర్చినవి ♦ మాన్యధరిత్రి ధరాంతరంబునన్. 62

ఉ॥ తుంబురులామహీధ్రమునఁ ♦ దోయరుహాక్షులఁగౌఁగిలించి మో
విం బలుముద్దులాడి బహు ♦ వింతలతో రతిఁగూడువేళ న
భ్రంబునఁ గైరవాప్తుఁగని ♦ పాపహరాంబరగంగలో విలా
సంబులతోఁ జెలంగు జల ♦ జం బని భ్రాంతిఁ దలంచిరేయెడన్. 63

చ॥ మలయసమీరణం బచట ♦ మంజులకూటములం జరించువా
రలకు సుఖంబులిచ్చుచు ని ♦ రంతరమున్ సకలాబలాగణం

బులకు మనోజునిం బగిఁది ♦ మోదమునుం దమకంబుఁ గూర్చి రా
జిలె ధరణీస్థలిం జెలఁగు ♦ జీవులఁ గాచు సురాధిరాజమై. 64

చ॥ నిరతముఁ దల్లతాలయవి ♦ నిర్మలభూములపై వసించి యో
గ్యరవము లుల్లసిల్ల సుర ♦ కాంతలు గానము సల్పువేళ సుం
దరతరవేణునాదములు ♦ తానములం బరిమార్చుకోకిలో
త్కరమధురస్వరశ్రుతి ప ♦ థంబులఁ గూర్చుచునున్న వెంచిరన్. 65

ఉ॥ చారుగిరిప్రవాహములు ♦ జాజి తటంబుల నుండి ధారగాఁ
జారము నన్ శిలాతతుల ♦ పైబడి మిక్కిలి ముక్కలయ్యు వే
మారు జగత్ప్రమోదకర ♦ మన్మథపీడితనిర్జరాంగనా
చారుశరీరనిర్వృతుల ♦ సల్పుచు నున్నవి తన్నగంబునన్. 66

చ॥ అట విహరించుచుండు రసి ♦ కౌఘము మేలగుఁబువ్వుటిండ్లలోఁ
గటరతులై నిరంతరముఁ ♦ గాముని కేళులఁ దేలు వేళ వి
స్ఫుటతరతారకావితతిఁ ♦ జూచి మనంబున నభ్రగంగలోఁ
గటరుచితోఁ జెలంగు సిత ♦ కంజములంచుఁ దలంచె విభ్రమన్. 67

చ॥ నిరతము మందమారుతము ♦ నిర్గుణయోగిమనోవికారమున్
గరముగఁ గూర్చుచు స్మరుని ♦ కైవడిఁ బాంధులనెల్ల మోహసా
గరమునఁ ద్రోఁచి లోకములఁ ♦ గాచుటకై కరుణారసంబుతోఁ
బరగె జనప్రతానసుత ♦ పావనమూర్తి సురాధిరాజమై. 68

కం॥ త్రిదశాదులు వినుతింపఁగఁ, గదనాంగణకోవిదుండు ♦ క్ష్మాపతిసుతుఁడున్
సదమలతరజలగంగా, నదిఁ జేరెం బలములఁ ద్రిది ♦ వంబులలోనన్. 69

సీ॥ చేరి భాగీరథీ ♦ వారిశీకరపూర్ణ, శీతమంజులవాత ♦ పోతతతి వి
హారంబులం గాసి ♦ దీఱ నవ్వలికేగి, తత్తీరపార్శ్వభూ ♦ స్థలిఁ జమూప్ర
చయముల్విడియ నాకు ♦ జవన మోయనఁ జేరి, కరుణాత్మువాల్మీకిఁ ♦ గాంచి మ్రొక్కి
రామాజ్ఞచే లవ ♦ ణామరారిం గెల్వ, వచ్చితి వేకువ ♦ బయలుదేఱి

గీ॥ పోయెద న్నేటి కిటనిల్తు ♦ నేఁడుని విను, తింప నవ్వుచు నావహాని ♦ తిలకుఁ డెలమి
రాజనందన! నీవు వె ♦ అచుచు నితరు, లోయన వచింపఁగా న్యాయ ♦ మేయటంచు.

సీ॥ అని సేమమారసి ♦ యర్ఘ్యమిచ్చి ఫలాదు, లనొసంగి బర్ణశా ♦ లాస్థలముల
నాత్మీయుకశ్రమం ♦ బాఱనిల్పినమీఁద, శత్రుఘ్నుఁ డతనికం ♦ జలిఘటించి
మునిచంద్ర! యీమహా ♦ వనములో యూపంబు, లగ్గలంబై యున్న ♦ వధికయజ్ఞ
ములనిందు నెవ్వారు ♦ సలిపిరో యనఁగ న,య్యతికులాగ్రేసరుం ♦ డానతిచ్చె

గీ॥ నయ్య మున్నర్కవంశదు ♦ గ్ధాబ్ధిపూర్ణ, చంద్రుఁడైన సుదాసరా ♦ జప్రవరుఁడుఁ
బుత్రకాంక్ష మనంబులోఁ ♦ బూనిలోక, పుణ్యతరధర్మసంచయం ♦ బుల నొనర్చె.

గీ॥ ఇవ్విధంబున బత్తితో ♦ నినకులజుఁడు, ఘనగుణాఢ్యుఁడు వాల్మీకి ♦ మునివరేణ్యుఁ
డధికకరుణారసంబున ♦ నానతీయు, గాథల వినుచు నాఁగోజు ♦ గడిపె నచట.

—* జానకి వాల్మీక్యాశ్రమంబునఁగుశలవులం గనుట. *—

మ॥ ధరణీపాలునిసాధ్వి నాటినిశి స ♦ త్స్థానంబులన్ సద్గ్రహా
త్కరము ల్నిల్వఁ గులాభివర్ధనులఁ బు ♦ త్రశ్రేష్ఠులం గాంచె ని
ర్వ్వరఁ దత్కాలమునం దలంపఁ గురిసెం ♦ బూలాదివిన్ దుందుభుల్
మొరసెం జల్లనిగాలి వీచెఁ గడునా ♦ మోదించి గచ్చోమునుల్. 73

క॥ మునిసుతులువచ్చి వేగం, బున రామునిదేవి కాంచెఁ ♦ బుత్రిద్వయమం
చని విన్నవింపఁ, బేర్మి, న్వాని వాల్మీకిమునిరాజ ♦ వీరుఁడు పిదపన్. 74

సీ॥ యశము న్బలంబు భా♦ గ్యంబు దీర్ఘాయుష్య, మున్విద్యయు న్శుభం♦బులనుగాంతు
రాబిడ్డలు జనించి ♦ నట్టికాలము మంచి, దనుచు శీఘ్రంబుగా ♦ నరుగుదెంచి
తచ్ఛుభార్థమున కా ♦ తండు రక్షోనాశ, మంత్రస్ఫురత్కుశ ♦ మండలముల
నజలంబునిడి జరా♦ వ్రాతంబుతో నీకు, శలవమార్జన మాను ♦ తులకు నాచ
గీ॥ రింపు డందున దానవ ♦ శ్రేణికాది, భయమడంగుఁ జేకూరు శు ♦ భంబులనుచుఁ
బల్కి వారలు నాకుసం♦భవుఁడుఁజెప్పి, నట్లుఁజేసిరి పిదప న♦ య్యతివరుండు. 75

క॥ కుశమార్జితుఁ డగుబిడ్డకుఁ, గుశనామము లవజలములఁ ♦ గుశలుండైనన్
శిశువునకు లవాహ్వాయముం, గుశలకరుం డతఁ డొనర్చెఁ ♦ గుతుకాత్ముండై.76

క॥ ఇంద్రోపేంద్రులవైఖరిఁ, జంద్రదివాకరులవలెఁ గు ♦ శలవు లచట నా
సాంద్రతపోధనవరకగు, ణం ద్రాసంబు న్విడిచి త ♦ నరిరి ముదమునన్. 77

క॥ తనుజోదయమున్ సీతా, వనజాక్షి క్షేమ మతఁడు ♦ నకర్ణింపన్
విని శత్రుఘ్నుఁడు మోదాం, బునిధినిమగ్నాంతరంగ ♦ పుష్కరుఁ డయ్యెన్. 78

సీ॥ అంతలో నింద్రది ♦క్కాంతామణి దివాక, రుంగాంచెనపుడు శ♦త్రుఘ్నుఁడుఁదగు
నిత్యకృత్యంబుల ♦ నెరవేర్చి యమ్మునీం, ద్రునకుఁ గేల్మోడ్చి దీ ♦ వనలఁ గాంచి
పశ్చిమాశాధిభా ♦ స్వన్మార్గమున వడిం, జనుదెంచిచనుదెంచి ♦ సప్తదివస
ములకు విశ్వంభరా ♦ జలజాక్షి గట్టెడు, శ్యామలచేలమో ♦ యనఁజెలంగు
గీ॥ భానుజం జేరి యన్నది ♦ లోన మునిఁగి, చ్యవనముఖమౌనిముఖ్యుల♦ నచటఁగాంచి
మ్రొక్కి వారిచ్చుమధుఫలం♦బులఁదినివిగ, తశ్రముండై చ్యవనుతోన♦తండుఁబల్కె.

—* చ్యవనుఁడు శత్రుఘ్నునకు లవణాసురుబలంబుఁ దెల్పుట *—

సీ॥ యతిశిఖామణి లవ ♦ ణాసురుం డతిబలుం, డనిరఘూత్తమునితో ♦ నపుడుమీఱ
నఁగ నేను వింటి నై ♦ న శివదత్తాఖిల, శూలంబుచే నాజి ♦ శూరవరుల
నేరినై నంగాని ♦ యీతండణంచెనే, యారీతుఁబండిన ♦ నానతీయుఁ
డనిన నాచ్యవనుఁ డి♦ట్లనెఁ దండ్రి లవణుంబ, లంబుతోఁగదిసి శూ♦లమునఁ దొల్లి
గీ॥ కలిఁబడినభూపతుల నెన్నఁ ♦ గాఫణీంద్రు, నకుఁ దరమె యైన నీవు త ♦ ద్వికటమార్గు
రేపు గెల్తువు నేఁడని ♦ ద్రింపుమిచట, ననవు డతికరుణాపూరి ♦ తాత్ముఁ డగుచు.
శా॥ ఆగం డాతఁడుఁ జెప్పినట్లు విని ని ♦ ద్రావేశముం గాంచి ఖ
ద్యోతుం డంతటఁ బ్రాగ్ధరాధరమునం ♦ దుం జేఱఁగా లేచి దాఁ
బ్రాతఃకృత్యము లాచరించి మునివ ♦ ర్యశ్రేణికిన్ మ్రొక్కి సం
ప్రీతిన్ దీవనలిచ్చి వారనుప ని ♦ స్త్రింశేషుతూణాదులన్. 81
క॥ తాలిచి కాళిందిఁ గడిచి, యాలవణుపురంబుఁ గాంచి ♦ యతిధైర్యముతో
నాలక్ష్మణానుజుఁడు రో, షాలోలుండగుచు వేచి ♦ నట్టితతిఁ దగన్. 82

—* శత్రుఘ్నుఁడు లవణునితోఁ బోరుట. *—

సీ॥ సారంగసారంగ ♦ శార్దూలసింహాది, జంతుసంతానమాం ♦ సగ్రసన ప
రాకాంక్ష నాత్మ గే ♦ హముఁ బాసి గహనంబుఁ, జేరి సందిటఁబట్టి ♦ భూరికోల
శార్దూలసింహాది ♦ జంతుజాలంబులఁ, గఱకుదంతములతోఁ ♦ గొఱికికొనుచు
బహుమదోన్మత్తుఁడై ♦ పదతాడనములచే, క్షోణిజంబుల వ్రాలఁ ♦ గొట్టికొనుచు
గీ॥ విబుధులడలంగ దిక్కులు ♦ పిక్కటిల్ల,వచ్చు నమ్మధుపుత్రు నా ♦ ధ్వసకరాళ
వక్త్రు నతిఖరానలనేత్రు ♦ బహుళగాత్రు, కుపితమానసుఁడై రిపు♦ఘ్నుండుగాంచి.
సీ॥ కోదండమౌర్వి సి ♦ నాదంబుల నొనర్ప, నసురాధముండతం ♦ డంబకాగ్ర
ములఁ గోపవహ్నికి ♦ లలురాల నాజాను, బాహు సత్కోదండ ♦ పాణిజలజు
దుష్టసంహారు శ ♦ త్రుఘ్నుఁ గాంచి కరాళ,వదనుం డగుచు నవ్వి ♦ వదరి లేచి
కరతలంబునఁ గార్ము ♦ కముధరించి భవాదృ,శుండొకో నన్ను సం ♦ స్ఫోటధరణి
గీ॥ గెలుచువాఁడిట్టిబుద్ధి సి ♦ కెజనియించె,నో యెవండైన వచియించె ♦ నో లవణుని
బారిబడినట్టివారలీ ♦ వఱకు నెవ్వ,రైనఁ బ్రతికిరె? విధినిఁద్రో ♦ యుంగవశమె. 84
క॥ దినమున మృగపలలంబులఁ, దిను నాకీయెడలనీ దు ♦ దివ్యాకింపముల్
తనివిగలభయించెఁ గదా, యనులవణుం గుటిలుఁగాంచి ♦ యాడుఁ గఱచుచున్

చ॥ పెటపెట పండ్లుగీటుచు వి ♦ భీకరుఁడై నయనద్వయంబులం
బొటబొటరాల నిప్పుకలు ♦ పొంగఁగఁ జెక్కులు హుంకరించి వి
స్ఫుటతరశౌర్యవంతుఁడు రి ♦ పుఘ్నుఁడు నీవొకపోటుబంటవై
యిటులఁ దురుక్తులాడెదవె ♦ యీతఁడెవండనుచుం దలంచితో. 86

ఉ॥ కావరమా నసుర్ భువన ♦ కంటక! మున్పటిరాజులట్ల దు
ర్భావముతోఁ దలంచితివె ♦ రమ్మికఁగూల్చెద నిన్ను నీయెడన్
రావణుఁ బుత్రమిత్రనిక ♦ రంబులతోఁ గలిఁగూల్చినట్టి రా
మావనికాంతు దమ్ముఁడఁ గృ ♦ తాంతుఁడఁ నిన్నిఁకఁ బోవనిత్తునే. 87

శా॥ శత్రుఘ్నాఖ్యుఁడనైతినేని విబుధుల్ ♦ క్ష్మాదేవమానీశపం
క్తిత్రాసంబెడలన్ మహాగ్రరణధా ♦ త్రి న్నేఁడు ఖండించి నీ
గాత్రం బీమృగకంకసంతతుల పా ♦ ల్గావింతు రమ్మింక నో
సుత్రామారియటంచుఁ నావుడల ర ♦ క్షోవీరుఁ డుగ్రాకృతిన్. 88

మ॥ అల దోర్దండపరాక్రమోజ్జ్వలితు లం ♦ కాధీశు మన్మాతులుం
గలిలోఁ గూల్చిన రాముసోదరుఁడవే ♦ కానిమ్ము నీయగ్రజా
ప్తుల నిన్ను న్వధియించి కాలుపురిఁ జే ♦ ర్తు న్నేఁడటంచు న్మహా
జ్వాలకోపంబున నేగుచుండఁ బురికిన్ ♦ వైవస్వతుండో యనన్. 89

మ॥ అలుకం గాంచి రిపుఘ్నుఁ డడ్డమయి దు ♦ ష్టా! క్రూర! యీమాటలు ప
ల్కులు వాకొచ్చి తొలంగిపోదువె రిపు ♦ ఘ్నుం డీతఁడు న్నిన్ను నీ
కలిలోఁ జంపక వీడునే యిటుల బిం ♦ కం బాడి భీరుండవై
దలఁగన్ లోకులు నవ్విపోరె యనినన్ ♦ దర్పోద్ధతాకారుఁడై. 90

ఉ॥ ఓరినృపాధమా యిటుల ♦ నుద్ధతిఁ బల్కకుమంచుఁ బల్కి దే
వారికులోత్తముండు లవ ♦ ణాఖ్యుఁడు బాహువు లప్పళించుచుం
గేరుచు నార్చుచు న్నగుచుఁ ♦ గిన్క వహించుచు నొక్కసాలమున్
ధీరమనస్కుఁడై పెఱికి ♦ నెట్టన వక్షము నంటవేయఁగన్. 91

క॥ అదరక బలుఁడు రిపుఘ్నుం, డది పదితుండెములఁ జేయ ♦ నైదమ్ములతో
మదమత్తమానసుండై, వదలక కురిపించె సాల ♦ వర్షం బతఁడున్. 92

చ॥ కురిసెడు సాలవర్షమున ♦ కు న్వెఱగందక సూర్యవంశజుం
డురుతరమార్గణత్రయము ♦ నొక్కుమొగి న్నిగిడించి తన్మహా
ద్ధురతరసాలవర్షమునుఁ ♦ ద్రోయఁగ నార్చుచుఁ గేరుచు న్నిలల్
గురిసె సురారి వజ్రశర ♦ కోటులఁ ద్రుంచె రిపుఘ్నుఁ డంతటన్. 93

ఉ॥ ఆతఁడు దుష్టబుద్ధిఁ బ్రబల ♦ యాంతకుఁడో యన నార్చి కేరి నా
నాతరుజాలముం ధరణి ♦ నాథునిపై తమకించి వేయఁగా
భూతలనాథపుత్త్రుఁడు రి ♦ పుఘ్నుఁడుఁ గేరుచు తెప్పపాటులో
నాతరుసంచయం బణఁచె ♦ నచ్చటిచెట్లు నశించె నన్నియున్. 94

ఉ॥ చేరువ సాలము ల్మ్రగియఁ ♦ జెచ్చెర దానవుఁ డర్కజాసరి
త్తీరమహీజసంఘములఁ ♦ దెచ్చి పయిం బడవైచి వెండియున్
దూరముపోవఁ గాంచి పురి ♦ దూరునొ యీతఁడటంచు నాతఁడున్
ధీరత రామదత్తఘన ♦ దివ్యతరాశుగ మేయ నెంచఁగన్. 95

ఉ॥ అంతటఁ గోపగించి లవ ♦ ణాసురుఁ డొక్కకుటుంబుఁ దెచ్చి దు
ర్దాంతజవంబున న్మొగము ♦ దాఁకఁగ వేయ రిపుఘ్నుఁ డంతటన్
భ్రాంతి వహించి మూర్ఛిలె సు ♦ రప్రకరంబులు మౌను లప్సరః
కాంతలు భీతిఁజెందిరి జ ♦ గంబులు బెంగవహించె నయ్యెడన్. 96

చ॥ అది మరణం బటంచు లవ ♦ ణాసురుఁ డార్చుచు శూలమేల నా
మెదిరి నశించె నంచు నట ♦ నెల్లమృగంబుల మాంసఖండముల్
వదరుచు మెక్కుచున్నయెడఁ ♦ బార్థివపుత్త్రుఁడుఁ దెల్విఁ గాంచి లే
చెఁదమి వహించె లోకములు ♦ చెందిరి మౌనులు సంతసం బెదన్. 97

క॥ తరువాయి లేచి వరని, ర్జరకిన్నరగరుడసిద్ధ ♦ సాధ్యక విద్యా
ధరగంధర్వాదులకున్, దరమొదవఁగ నాత్మ చిత్త ♦ తామరసములన్. 98

గీ॥ జగముల న్మ్రింగురుద్రతే ♦ జమొ సమస్త, లోకసంహారఘోరాగ్ని ♦ యో కరాళ
భూరి భాస్కరామల తేజ ♦ మో యనంగ, నలరు శ్రీరామదత్తసా ♦ యకముఁదీసి.

—* శత్రుఘ్నుఁడు లవణాసురుఁ జంపి తన్నగరంబు నేలుట *—

మ॥ అలశత్రుఘ్నుఁడు నమ్మహాగ్రశరది ♦ వ్యాస్త్రంబు సంధించి పే
రలుకన్ దానవరాజుఱొమ్ముగల నే ♦ యన్ మంట లాశాతతి
న్వ్యాలయన్ రక్కసుఱొమ్ముఁ దూఱి ధరణిన్ ♦ భేదించి పాతాళవా
సుల భీతిల్లఁగఁజేసి వచ్చి పొదిలోఁ ♦ జొచ్చెన్ నుతింపన్ సురల్. 100

క॥ బాణంబు వెడలినతరిం, బ్రాణంబులుపోయి కర్బు ♦ రవిభుండచటన్
క్షోణీధ్రమువలెఁ గూలెన్, వాణీశేంద్రాదిసురులు ♦ వఱలముదమునన్. 101

క॥ ధరణిన్ లవణాసురుఁ డిట్లరుగం దన్మందిరమున ♦ నలరెడు శూలం
బరుదెంచి పార్వతీశ్వరు, కరశూలములో నణంగెఁ ♦ గడువేగమునన్. 102

క॥ కురిసెం బ్రసూనవర్షము, మొరసెన్ దుందుభులు నాట్య ♦ ములఁ జేయఁగడం
గిరి రంభాదులు విద్యా, ధరులెల్లరుఁ బాడి రతిము ♦ దంబున నపుడున్. 103

సీ॥ సేవింపనిర్జరు ♦ ల్దేవాధినాథుండు, వైశ్వానరాదిది ♦ క్పాలకాన్వి
తుండై స్వవిద్వేషు ♦ ఖండించినట్టినా, యకుఁ జూడఁజనుదెంచె ♦ నపుడు బ్రహ్మ
మునులాదిగాఁగల ♦ ఘనులు శత్రుఘ్నుదీ, వించి రావణు సంహ ♦ రించినట్టి
శ్రీరాముఁబొగడిన ♦ రీతిగా సన్నుతిం, చిరి వానికిట్లనె ♦ సురవిభుండుఁ

గీ॥ బరమమహాసీంద్రులకు నెల్ల ♦ వెఱపుదీఱె, మాకుసౌఖ్యంబు సేరె నీ ♦ లోకతతికిఁ
దీఱెదినగండములు ధాత్రి ♦ మీఱెనీదు, విక్రమము జేయమై ధరా ♦ విభుకుమార.

క॥ నచ్చితిమి నీప్రతాపము, మెచ్చితిమి భవద్దయా స ♦ మృద్ధిన్నిన్నున్
వచ్చితి మొక వరమొసఁగఁగ, నచ్చినకామంబడుగుము ♦ నావుడుఁబిదపన్. 105

శా॥ శత్రుఘ్నుం డచటం దపోధనులకున్ ♦ సాష్టాంగ మర్పించి త
త్సుత్రామాదులకెల్ల మ్రొక్కి కరుణా ♦ త్ముల్మీర లీసర్వలో
కత్రాత ల్వరదాత లట్లగుట వీఁ ♦ కన్ మీపదాబ్జంబులన్
ధాత్రిం గొల్వఁగఁజాలు నైననిపుడున్ ♦ బ్రార్థింతునే నొక్కటిన్. 106

మ॥ ఎలమిన్ లోకులు నీపురంబుఁ గనినన్ ♦ హేలాగతిన్ వైభవం
బులతో మున్నటికంటెమీఱెడు విధం ♦ బుం గూర్పుమన్నావు డ
ట్టులనౌనంచని వారలేగఁగ నతం ♦ డున్ శత్రుసంహారవా
ర్తల నారామునకు స్వచింపఁ దగు దూ ♦ త శ్రేణిఁ బంచె న్వెసన్. 107

గీ॥ పిదపమంత్రులేతెంచినఁ ♦ బ్రీతినాదరించి వచ్చినసైనిక ♦ శ్రేణిఁగలసి
పటహగోముఖభేర్యాది ♦ వాద్యతతులు, భోరుమని మ్రోవలవణుని ♦ పురముఁజొచ్చె.

## —* మధుపురీ వర్ణనము. *—

క॥ అలసౌధంబులపై నిశి, వలపులతోఁ బతులఁగలసి ♦ వలపుల దొరచి
న్నెలఁ దేలుచు ముగ్ధలు విధుఁ, దలఁచిరి మిన్నేట నలరుఁ ♦ తామరసమునన్. 109

క. హిమకరమణికుట్టిమసౌ, ధములం జెల్వారు జలప ♦ ధంబు లతులవి
భ్రమగతి నధశ్చరాంబుద, సమితివిధంబు నలరినవి ♦ సతతంబు నిశిన్. 110

క. లలితాలయంబులఁ దనా, బులపై చెక్కినఁ గపోత ♦ ములఁ దినుటకు ని
శ్చలగతిఁ దాల్చుబిడాలముఁ, దలఁచిరి కృత్రిమముగ ముగు ♦ దలు గాంచి మదిన్.

క. అనవరతము మణిసౌధము, లినగతిచేఁ దప్పిఁగాంచి ♦ మెలమిఁ బతాకా
గ్రనిబిడజిహ్వలతో ని, క్కి నాకుచున్నవి సుధాంశు ♦ కిరణముల నటఁన్. 112
క. నిలయావళిచలచేలాం, చలదండవితాడనములు ♦ సతతం బచటన్
జలజాప్తసారధికి విర, తులఁ గూర్చుచునున్నవి బహు ♦ తోషం బలరన్. 113
క. వెలఁదులు దివ్వెల నారిచి, వలపులతో జాలమార్గ ♦ వ్యాప్తేందుకరం
బులలో మార్జాలేక్షణ, ములఁ జూచి కెలఁచిరి పురిని ♦ బురుషులఁ గలయన్.
చ. కులుకుమెఱుంగుచన్నవలు ♦ గ్రొమ్ముడులుం బిగికొనులుం బిఱుం
దులు గదలం బుఱుంగులను ♦ దోలునెపంబునఁ గొంతులెత్తి గా
జులు గలగల్లన న్వలపుఁ ♦ జూపులతోఁ దమకంబుఁ గూర్పఁగా
గలుఁగుదు రచ్చటం బొలయు ♦ కాపరికాపుతుటారికత్తియల్. 115
చ. పరువడి జారకామినుల ♦ పల్కులు జారులకుం దదీయవా
క్స్వరములు జారకాంతలకు ♦ సమ్మతిగా వినుపించుచు న్నిరం
తరము మహానురాగములఁ ♦ దాల్చుచుఁ గూరిమితోఁ రమించుచుం
దిరుగుదు రిమ్ముగా సుభగ ♦ తిం బురవీధుల శంభళీసతుల్. 116
గీ॥ చొచ్చి యట్టిపురి జనులు♦స్తుతులఁజేయఁ, బరమమణిమయులవణుమం♦దిరముఁ జేరి
ధనముల సమస్తవస్తువా♦హనములఁగొని,న్యాయపద్ధతి రాజ్యంబుఁ♦జేయుచుండె.
చ॥ తనపురి నాకమంచు జన ♦ తండము సూడఁగ నైతికస్థితిన్
జనములఁ గాచుచు న్మనుజ♦సంఘము వర్ధిల ద్వాదశాబ్దముల్
ఘనతరరాజ్యము న్సలిపి ♦ కంజభవాదినుతార్క్యవంశనీ
రనిధితుషారభానురఘు ♦ రామపదేక్షణకాంక్షియై వెసన్. 118

—* శత్రుఘ్నుఁడు శ్రీరామపాదసేవార్థియై యయోధ్యకుఁ జనుదెంచుట *—

చ॥ సుగుణుల మంత్రిపుంగవుల ♦ సూనృతవాదుల నుంచి తత్పురిం
దగినబలంబు వెంటఁగొని ♦ నవ్యసువర్ణరథాధిరూఢుఁడై
నగరనివాసుల న్విడిచి ♦ నాల్గుదినంబులలో రిపుఘ్నుఁడున్
జగదతిపూజ్యభవ్యతర ♦ నాకుభవాశ్రమభూములం గనెన్. 119
గీ॥ చేరి వానికినట నమ♦స్కృతులఁజేసి, యతఁడు నాశీర్వచనముల ♦ నాదరించి
యిచ్చుసుఫలాదికముల గ్ర♦హించి,శమము,వోయిసైన్యాభియు క్తి♦పుఘ్నుఁడలరె.
ఉ॥ అమ్మునిచంద్రుఁ డంతట ద♦యామతి నాతనిఁజూచి పల్కె లో
కమ్ములకెల్లబల్లెమగు ♦ కంటకు నీవవలీల నొక్కకాం

డమ్మునఁ గూలనేసితి వ ♦ నంతబలాఢ్యుఁడవైతి వెంచఁగా
నిమ్మహి నీసముల్గలరె ♦ యుద్ధగుణాంబుధి లక్ష్మణానుజా. 121

ఉ॥ ఎప్పటికైన నీలవణుఁ ♦ డీల్గును లోకుల కేరికి న్వెత
ల్గప్పును వానిగెల్చు బల ♦ ధాముఁడుఁ బుట్టును యీవనంబులో
నిప్పుడు నస్మదీప్సితము ♦ లెల్ల ఫలించె మనంబులోపలన్
ముప్పుతొలంగెడి న్నిను రి ♦ పుఘ్ను నుతింపఁదరంబె యేరికిన్. 122

ఉ॥ రావణుఁ గూల్చునాఁడు రఘు ♦ రామునికిం బరమప్రయత్నము
ల్గావలసెంగదా యతని ♦ కంటెఁ బరాక్రముఁడై సమస్తధా
త్రీవరులన్ జయించిన న ♦ రిం ద్రుటిలోఁ బరిమార్చెనంచు న
ద్దేవసభన్ బుధేంద్రుఁడె ను ♦ తింపఁగ వింటి భవత్ప్రతాపమున్. 123

చ॥ లవణునితోడ నీవు ప్రబ ♦ లస్థితిఁ బోరెడునాఁడు మేము వా
సవుదరిఁ జేరి కాంచితిమి ♦ సర్వము నీబల మెంచినన్ ఫణీం
ద్ర విభులకుం దరంబెయని ♦ తా నెదఁజేరిచి మూర్కొనెం దలం
బ్రవిమలమానసుం డతఁడు ♦ భవ్యగుణాకరు లక్ష్మణానుజున్. 124

చ॥ ఇటుల నుతింప నాకుజము ♦ నీశ్వరుఁ డుత్తమసైన్యరాట్సుహృ
ద్భటయుతుఁడైన భూమిపతిఁ ♦ బక్వఫలంబుల నాదరించి మీ
దట నుటజంబున న్నిలువఁ ♦ దా సెలవిచ్చిన నారిపుఘ్నుఁడున్
భటులుపచారము ల్సరిపము ♦ వాయ ఘటింప వసించె వేడుకన్. 125

సీ॥ అసమాననవసుధా ♦ రసధారలొల్కుపోల్కి సరసస్వరగతు ♦ ల్విస్తరిల్ల
నిబిడామలమరంద ♦ నిర్ఝరుల్వాఱెను, చందానఁ దానము ♦ ల్సంఘటిల్లఁ
గలకండపానక ♦ మ్మొలువాఱు విధమున, రమణీయ రాగజా ♦ లములువఱలఁ
బరమేక్షుదుగ్ధ ప్ర ♦ వాహముల్వాఱువై, ఖరిమహాలాపమా ♦ ర్గములు వెలయఁ

గీ॥ గుశలవులు వీణెలవహించి ♦ కోర్కెఁ గాంచి, మహిమనుజనుతవాల్మీకి ♦ మౌనిరచిత
కలితరామాయణశ్లోక ♦ గానలీల, నచటఁ బఠియింప శత్రుఘ్నుఁ ♦ డాలకించె. 126

క॥ ఆ మధురార్థంబుల న, య్యా మృదుకీర్తనలనాస్వ ♦ రావృత్తులన
య్యామధురరసాంచితవా, క్ప్రామాణికములఁ దలంచి ♦ పరవశుఁడయ్యెన్. 127

ఉ॥ వానిహితాప్తసైన్యభట ♦ వర్గములు న్వని నిర్భరాద్భుతాం
భోనిధిలో మునింగి నిజ ♦ మో కలయో యిది భ్రాంతినిట్టి స
ద్గానము లాలకించితిమె ♦ కానఁగ నీమహనీయులెవ్వరో
మానులదాపునం జెలఁగు ♦ మాన్యుల నెంచఁదరంబె నావుడున్. 128

క॥ శత్రుఘ్నుఁడిట్లు సీతాపుత్త్రులఁ గానంబువినుచు ♦ మోదముతో నా
రాత్రింగడిపెం బిమ్మట, మిత్త్రుం డుదయాచలమున ♦ మెఱయుచు నెక్కెన్. 129

ఉ॥ అంతట నాహ్నికక్రియల ♦ నన్నియుఁదీర్చి మునీశునాజ్ఞ భూ
కాంతసుతుండు వీడుకొని ♦ గాఢరయంబున సైన్యసత్సహా
త్సంతతులు న్నుతింపఁజని ♦ తామరసాప్తుఁడు నిర్మలాభ్రవీ
థ్యాంతర మొందునంతకుని ♦ నాన్వయుఁడేలు పురంబుఁ గన్గొనెన్. 130

సీ॥ కనిచేరి కరితురం ♦ గరథాదికములతో,ముదమొంది సామంతు ♦ లెదురుకొనఁగ
నుర్వీసురోత్తమా ♦ శీర్వాదములతోడ,వందిమాగధులు పై ♦ వారమొసఁగఁ
బౌరకాంతాకదం ♦ బములు మేడలనుండి,నవసుగంధిప్రసూ ♦ నములఁజల్ల
విమలపాండ్వాతప ♦ త్రములతో ముందట,భటులు బెత్త్రంబులఁ ♦ బట్టినడువఁ
గీ॥ బౌరనికురంబకము గాంచి ♦ ప్రస్తుతింప,బహుళమంగళ వాద్యర ♦ వంబులెల్ల
మీఱమొగసాలముందరఁ ♦ దేరుడిగ్గి,శిరముపైఁచేర్చి కరసర ♦ సీరుహముల. 131

చ॥ కొలువునకేగి శ్రీయుతు ర ♦ ఘుప్రవరుం గని తత్పదాంబుజం
బులకట మ్రొక్కి భక్తుఁడు రి ♦ పుఘ్నుఁడు శత్రుపురాభినీతని
ర్మలనవదివ్యరత్ననిక ♦ రంబులవానికిఁ గానుకఁజేసి చూ
పులు ఫలియింపరాము మొగ ♦ ముంగనుచు న్వచియించె నిట్టులన్. 132

ఉ॥ దేవర! లోకకంటకు వ ♦ ధించి తదీయపురంబు నన్మహా
శ్రీవిధులుల్లసిల్ల నొన ♦ రించి దమిం బది రెండువర్షముల్
దేవతలెల్లమెచ్చుమవి ♦ ధిం బురినేలుచు నిల్వలేకమీ
పావనమూర్తిఁ గాంచుటకు ♦ వచ్చితి నంచట నిల్వమీదటన్. 133

మ. నగుచుం దమ్ముని గౌఁగిటం దనిపి భూ ♦ నాథుం డట న్వాని నె
మ్మొగముం గూరిమిమీఱ ముట్టుఁగొని యీ ♦ భూమిన్నినుం బాసి ని
ల్వఁగశక్యంబె యటంచు నేడుదినము ♦ ల్వాసంబిటం జేసి బం
ధుగణంబుం బరికించిపోవు మతిసం ♦ తోషంబున న్వీటికిన్. 134

ఉ. రాజులుసేసి రాజ్యము ల ♦ రాజకము ల్మహి నావుడున్ జగ
త్పూజితవిక్రమాఢ్యుఁడు రి ♦ పుఘ్నుఁడు రాఘవునాజ్ఞచే గుణో
ద్రాజితు లక్ష్మణుం భరతుఁ ♦ దల్లులఁ గాంచి నమస్కరించి స
త్పూజితభూసురాప్తహిత ♦ పూజల నెట్టనఁజేసి మీదటన్. 135

చ. ఇనకులుఁ డాడినట్లుచట ♦ నేడుదినంబులు నిల్చి రాఘవుం
డనుమతిసేయఁగాఁ బయన ♦ మై బుధబంధు హితాప్త సైన్యముం

గాని భరతుండు లక్ష్మణుఁడు ♦ గూరిమిఁజూపుచు వెంటవచ్చి పం
ప నతఁడు వీటికిం జనియెఁ ♦ బౌరులపై కరుణాంతరంగుఁడై. 136

క. ఆశత్రుఘ్నుచరిత మే, ధీశాలురు శ్రద్ధతోఁ జ ♦ దివిన న్వినినన్
గాశలి వ్రాసిన శత్రువి, నాశనమగు వారికిన్ ధ ♦ నంబులు గలుగున్. 137

సీ॥ ఆతఁడిట్లరుదెంచి ♦ యాత్మీయపురజను,ల్సంతసింప దయార ♦ సప్రపూర్ణ
మానసుండై ధరా ♦ మండలం బేలుచు, శ్రుతకీర్తిదోహద ♦ స్ఫూర్తి సేయు
చుం ధర్మమూర్తియై ♦ శోభిల్లుచుండెని, చ్చట నయోధ్యాపురి ♦ క్ష్మాతలేంద్రుఁ
డగు రామచంద్రుఁడు ♦ నచలామరాదుల, నిర్జరౌఘముల మా ♦ నిప్రవరుల

గీ॥ భక్తితోఁ బూజసేయుచుం ♦ బరమసత్కృ, పారస ప్రపూర్ణస్వాంతుఁ ♦ డైరహింజన
తతులఁ బాలించుచుం ధర్మ ♦ మతిఁ జెలంగి, న్యాయపద్ధతి రాజ్యంబు ♦ సేయుచుండె.

వృద్ధవిప్రమిథునంబు మృతుండగుకుమారుని రామునివాకిటవైచి దుఃఖించుట.

చ॥ కతిపయ మాసముల్గడువఁ ♦ గా నొకనాఁడు విశేషశోకబా
ష్పతతులు గండభాగములఁ ♦ బాఱ విశేషతరవ్యథాభరా
నతమగు నొక్కవిప్రమిథు ♦ నంబు మృతుండగు నాత్మబాలుని
ప్రేతముగఁ దెచ్చి రామనృప ♦ వీరుని వాకిటవైచి దీనతన్. 139

ఉ. హా సుకుమార హా తనయ ♦ హా కులదీపక హా దయాకరా
హా సుగుణాంబురాశి వసు ♦ ధామరవంశపయోధిచంద్ర మా
గాసిలఁ జేసి మమ్ముఁ జనఁ ♦ గా నిది న్యాయమె నీకు మాయెడన్
దోసముగల్గెనంచు నతి ♦ దుఃఖపయోనిధిలో మునుంగుచున్. 140

గీ. సకలసురులను సేవించి ♦ సద్గుణాత్మ, నిన్నుఁ గని నేటికి కులంబు ♦ నిల్పెనని త
లంచియుండఁగ నిపుడ కా ♦ లము నమృత్యు, వునిను మ్రింగు టెఱుంగ మో ♦ ఘునగుడాధ్య.

ఉ. ఎక్కడఁ జొత్తు మేమిపుడు ♦ నెవ్వరు దిక్కగువార లింక నీ
చక్కదనంపు పాదజల ♦ జంబుల గజ్జెలు మ్రోయుచుండ మా
చక్కి నటించువా రెవరు ♦ చక్కని ముద్దులతండ్రి మాయెడన్
మక్కువదీరెనో నిమిష ♦ మాత్రములో మముఁ బాసిపోతివే. 142

సీ. పంచవత్సరముల ♦ బాలుఁడెక్కడ మృత్యు, వెక్క డేదిక్కున ♦ నిట్టివింత
గలుగునే తల్లిదం ♦ డ్రులకౌర్ధ్వదైహికం, బెచటనైననుఁ బుత్రు ♦ లుచితగతుల
ఘటియింత్రు పుత్రశో ♦ కదవానలంబుచేఁ, దలఁకుచు నాత్మపు ♦ త్రులకుఁ దండ్రి
దహనాదిసకలకృ ♦ త్యములు సేయునొకో ర, వికులుఁ డామాధవు ♦ నకు సమాన

గీ. మందు రద్దియు లోకుల♦కిందువలన, నన్పృతమంచని నిశ్చయు♦మయ్యెఁ దండ్రి
నిన్ను విడనాడి జీవము♦ల్నిల్వఁగలమె, మారసుకుమార ధీర కు♦మారయనుచు.
మ. ధర వర్ణాశ్రమధర్మమార్గముల స♦ద్ధర్మానుసారస్థితిం
ధరణీనాథుఁడుఁ బ్రోవఁడేని దయతో ♦ ధాత్రీశుఁ డాతండు ని
ష్ఠురపాపంబుల కెల్ల బొంకియగు నె ♦ చ్చో రాజదోషంబులన్
దొరయున్ లోకులకెల్ల నిట్టియపమృ ♦ త్యువ్యాధిపీడాదులున్. 144
క॥ అని యీగతి వారు తనూ,జునిపై పడి యేడ్చి యేడ్చి ♦ సూర్యాన్వయదు
గ్ధనిధిసుధాకరు రఘురా, ముని నుద్దేశించి దుఃఖ ♦ మున ననె మఱలన్. 145
ఉ॥ శ్రీసరసీజమిత్రకుల ♦ శీతకరుం డిల రాజ్యమేలఁగా
భూసురబాలుఁ డిట్లు మృతిఁ ♦ బొందినవాఁ డనుమాట వాసితో
నీసహజాతులుం భటులు ♦ నిన్ను భజించుచునుండ నంచిత
శ్రీసుఖయుక్తి రాజ్య మొన ♦ రింపుము శ్రీరఘురామభూవరా. 146
గీ॥ అరయ నిక్ష్వాకువంశజు ♦ లవనినేల, నిట్టియపమృత్యుసాధ్వస ♦ మెన్నఁడైనఁ
గలదె శిశుమృత్యుభయమునీ♦కాలమునను,సంభవించెనుశ్రీరామ♦చంద్రయుదియు.
ఉ॥ సత్యదయాదిధర్మముల ♦ క్ష్మావిభుఁ డూనిన నిట్లు పిల్లలన్
మృత్యువు దాఁకునే యిఁక న ♦ దేల తనూజున కగ్నికార్య మా
చిత్యమె సేయ మేమిటఁ ద్య ♦ జించెద మీ వెతవాయ జీవముల్
హత్యలు మూఁడునుం గని ధ ♦ రాధిప సౌఖ్యముఁగాంచుమం చనన్. 148
క. ఆవచనముల న్విని భీ, త్యావృతచిత్తుండగుచు ధ ♦ రాధీశ్వరుఁ డా
భూవిబుధాగ్రాత్మజు స, ద్భావుం బ్రతికించుఁదమి స ♦ భకుఁ జనుదెంచెన్. 149
క. హితుల నిలాపతులఁ బురో, హితుల నమాత్యప్రవరుల ♦ హితబాంధవసం
తతుల సహోదరుల నిజా, శ్రితులం బిలిపించి మిగులఁ♦జింతిలుచుండన్. 150
గీ॥ గౌతమాత్రి మార్కండేయ♦ కణ్వ మంద, పాలనారదాగస్త్య జా ♦ బాలికాశ్వ
భృగువసిష్ఠాదిమునులు శి♦ష్యగణయుక్తు, లగుచువచ్చిరి రఘురాము♦నాత్మనెఱిఁగి.
గీ॥ సభయులై లేచి రపుడట♦ సభికులెల్ల, రామచంద్రుండు మౌనిచం ♦ ద్రపదములకు
వందనంబులఁ జేసి సా ♦ నందుఁ డగుచు, నుచితరత్నాసనంబుల ♦ నునిచి పిదప.
చ॥ స్థిరమతి నర్చనావిధులఁ ♦ జేసి తపోధనులార మీక గో
చరమగు వస్తుజాలముల ♦ స్వాంతములోనఁ దపఃప్రభావవి
స్ఫురణల మీ రెఱుంగుదురు ♦ పుణ్యవిధిం దనరారు నీధరా
మరుసుకుమారుఁ డేమిటికి ♦ మ్రందె నధర్మము లెట్లువచ్చెనో. 153

క. తెలుపందగునని వేఁడఁగ, నల మౌనికులాగ్రగణ్యుఁ ♦ డగు నారదుఁడున్
బలికెన్ రామునకు న్ని, ర్మలమధురసుభాషితముల ♦ మహితదయుండై. 154

సీ॥ క్షితిసురు లెల్ల రం♦చితతపోనిష్ఠాతి, కామ మాత్మ న్వివే♦కంబు సత్య
మూనఁగాఁ గృతయుగం♦బుల్లసిల్లు నితాంత, ధర్మవిస్ఫూర్తి స♦త్యముల నెపుడు
గాంభీర్యధైర్య వి♦క్రమ మహౌదార్య మై, భవయుక్తిచేఁ బ్రజా♦వ్రజము వఱలు
నాయుగంబున ధర్మ♦ములరుం జతుష్పాద, చారిణై త్రేతలో♦సత్యపదము

గీ॥ తెగి పదత్రయగామిని యై♦తగు ధరాధి, పతుల తపమయ్యెడలమించుఁ♦బరమ నిజత
పోమహిమల జనంబులఁ♦బ్రోతురచ్చ, టచ్చటజనంబులనృతంబు♦లాడుచుంద్రు. 155

గీ॥ ద్వాపరంబున సగబాలు♦ధర్మమేగు, నందు భూదేవశుశ్రూష♦లాచరించి
వైశ్యులు తపంబుఁ జేతుర♦వ్యాజభక్తిఁ, గలియుగమునశూద్రులతపం♦బులు తఱచగు.

గీ॥ ఆయుగంబున ధర్మంబు♦లరయ మూఁడు, పాదము లతిక్రమించు న♦బద్ధమధిక
మై తగుననర్హధర్మంబు♦లాచరింత్రు, జనులు వింతలు ప్రబలునో♦క్ష్మాతలేంద్ర. 157

శా॥ ఆలీలన్ వృషలుండొకం డతితపో ♦ వ్యాసక్తిచే ఘోరని
ష్ఠాలీల న్విహరించె నందువలనం ♦ జచ్చె న్మహీదేవతా
బాలుం డాతనిఁ జంపి విప్రతనయుం ♦ బ్రాణాన్వితుం జేయుమీ
జాలం బేటికి లెమ్ము నీవిపుడె యి ♦ క్ష్వాకుప్రధానాగ్రణీ. 158

క॥ పాపాత్ముల దండింపని, జ్యాపాలోత్తమునకందు ♦ షడ్భాగ మిలం
బ్రాపించుం గావునఁ గృప, భూపాలుఁడుఁ బాపమెడలఁ ♦ బ్రోవంగవలెన్. 159

ఉ॥ ఏమెడనైనఁగాని జనుఁ♦డెవ్వఁడు లోపల నొక్కసారి రా
మా యనుచున్ నినుం దలఁచి♦నంతనె భీకరపాపజాలముల్
పాయుక తన్నుఁ జెందునె కృ♦పామతి జీవితు నిక్కమారు నిం
జేయుటదెంత మున్ను కపి♦సేనఁ గలిం బ్రతికింపవే వెసన్. 160

—* రఘువరుండు శంబుకునిఁ జంపి బ్రాహ్మణపుత్త్రుని బ్రతికించుట. *—

సీ॥ అనిపల్కు నారద♦మునిభాషితముల నా, కర్ణించి రామభూ♦కాంతుఁ డపుడు
మునిజనంబులకు వం♦దనమాచరించి త, దాశీర్వచనముల♦నంది నగర
రక్షణంబునకు భ♦రతలక్ష్మణుల నియ, మించి శూద్రుశిరంబు♦ద్రుంచుయత్న
మున మనోజ్ఞకవచం♦బుధరించి ఖడ్గకా, ర్ముక ఘోరమార్గణం♦బుల వహించి

గీ॥ బలహితామాత్యశాలియై♦బయలు దేఱి, పోయి పశ్చిమదిగ్భాగ♦ముఁ బరికించి
పిదప దక్షిణభాగంబు♦వెదకుట కరు, దెంచి తటినీతటంబులఁ♦గాంచి కాంచి. 161

సీ॥ గిరిపార్శ్వతలములఁ ♦ బరికించి పద్మాక, రములఁ గాంచి తపోవ♦నములఁ జూచి
సకలజానపదసం♦చయము లన్వేషించి, విమలగోకులసంచ♦యములఁ దిరిగి
ఘననదీనదముల ♦ గాలించి కోవెల,ల్దిలకించి బోయప♦ల్లియల వెదకి
పానీయశాలలఁ♦బరికించి మఠములం, బరికించి యజ్ఞమం♦దిరములఁ గని
గీ॥ యగ్రహారంబులం గాంచి యలయక పిద,ప నచటనచటఁ దిరుగుచు♦ఘనమరాళ
చక్రముఖఖగయుక్త కా♦సార మొకటి, నతివిలాసముఁ గాంచి త♦దంతరమున. 162
శా॥ శ్రీరామక్షితిపాలవీరుఁడు నిరీ ♦ క్షించెం గృశాంగు న్నిరా
హారున్ శోణజటాధరున్ సుగుణు ఘో ♦ రాకారు సన్నైష్ఠికా
చారుం ధీరు నధోముఖున్ సువిమల ♦ స్వాంతాంబుజాతుం దపః
పారీణాత్ము విజీర్ణచేలు నొకనిన్ ♦ భక్తప్రధానోత్తమున్. 163
కం. కని భరితాశ్చర్యంబుం, గని దాపునకరుగుదెంచి ♦ ఘనుఁడై తగునా
తని కపరోక్షగతిన్ రా, మనృపుఁడు సాక్షాత్కరించె ♦ మహితదయుండై. 164
చ. స్థిరమతి నత్తపోధనుని ♦ దృష్టిపథంబున నిల్పి రాముఁడో
పరమగుణాఢ్య యెవరము ♦ వాటిల సల్పుదువీతపంబు దు
ర్భర మిది నీవు సత్యముగఁ ♦ బాలుఁడవో ధరణీధరుండవో
స్ఫురమతిమించు వైశ్యుఁడవో ♦ శూద్రుఁడవో యెఱిఁగింపుమంతయున్. 165
కం. నాపేరు రాముఁడందురు, భూపరిపాలుండ నేను ♦ మోదముతో నీ
తాపసధర్మంబుం గని, నీ పాలికి వచ్చినాడ ♦ నినుఁ దెల్పుమనన్. 166
చ. పరమవివేకహీనుఁడను ♦ భవ్యుఁడవై తగునీవె వేడినన్
సరణి నతిక్రమింతునె ని ♦ జంబుగ శూద్రుఁడ శంబుకుండనో
నరపతి బొందితో నిపుడు ♦ నాకముఁ జేరెదుఁ గోర్కిఁ గాంచి దు
ర్భరమగు నీతపంబు సలు ♦ పంగఁ జెలంగితినంచుఁ బల్కినన్. 167
కం. విని యిట్టిభక్తిమానసుఁ, జనునే దునుమాడ రాజ ♦ జన్మమవద్యం
బనిరోసి ధారుణీబుధ, తనుజుమృతిఁ దలంచి వాసి ♦ దయఁ గోపమునన్. 168
చ. కలకల నవ్వుచున్ ధరణి ♦ కాంతుఁడు భూతనయాధినాథుఁ డి
ట్టలపు మెఱుంగులం దగుఁ గ ♦ టారిఁ దటాలునఁ దూసి కేల మం
త్రులు గన వాని కంఠముఁ గ ♦ రుక్కునఁ ద్రుంచెఁ దదీయరక్తమే
ఱులుగుచుఁ బాఱె నిర్జరవ ♦ రుల్గురిపించిరి పుష్పవర్షముల్. 169
మ. అమరేంద్రాగ్నికృతాంతకాదు లలసా ♦ ధ్యాదిత్య గంధర్వసి
ద్ధమునీంద్రు ల్గరుడాదులున్ రవికులా ♦ న్వత్థాగ్రభాగంబునన్

బ్రమదాత్మం జనుదెంచి నిల్చి సుమనః ♦ ప్రాప్తి న్నుతిం జేసిరం
త మరున్నాథుఁడు వల్కె నిర్మలసుధా ♦ ధారానుసారోక్తులన్. 170

మ. ధరణీ విప్లవముల్ హరించి దయతో ♦ ధాత్రీ భరంబీగతిన్
భరియింపంగ మహావికారచయము ♦ ల్నాశంబులయ్యెన్ భవ
త్కరవాలంబునఁ బూతుఁడై వృషలుఁడ ♦ క్కాయంబుతోఁ జేరె ని
ర్జరలోకం బదె వానిఁ జూడుము రఘు ♦ క్ష్మాపాలకాగ్రేసరా. 171

చ. ఖలుల వధించి సాధువులఁ ♦ గాచెదు మిమ్ములఁ జూచి మెచ్చి నే
డెలమి సురల్వరం బొకటి ♦ నిత్తుమటంచని యేగుదెంచినా
రలిపుడు సమ్మతంబగు వ ♦ రం బిఁకఁ దెల్పుడటన్న రాఘవుం
డలరుచు లోకపూజ్యవిబు ♦ ధాళికి నంజలిఁ జేసి పిమ్మటన్. 172

చ. వరమిదుబుద్ధి మీ కిపుడు ♦ వాటిలిన న్సురలార తద్ధరా
మరసుతుజీవ మిందు మహి ♦ మం బలరం బ్రతికింతునంచు ని
ర్భరదయఁ బల్కి వచ్చితి స ♦ భాస్థలి నాతఁడు నట్టులౌట నా
యరయమిఁ జేసికాదె యను ♦ నాతనికిట్లని రాసురోత్తముల్. 173

చ. శిఖి కడుఁ జల్లనైన నల ♦ శీతకరుం డధికోష్ణమొందినన్
నిఖిలశరణ్య మీరె తమ ♦ నిశ్చయవాక్కులు కల్లలౌనె మీ
స్వఖరకరాసి శంబుకునిఁ ♦ జంపిన యప్పుడె లబ్ధజీవుఁడై
సుఖముగనుండె భూమిసుర ♦ సూనుఁడు శ్రీ రఘువంశనాయకా. 174

ఉ. ఊహఁ దలంచి కుంభభవుఁ ♦ డుత్తమభక్తి మనస్కుఁడై మహో
త్సాహముతోడఁ గూడి ముని ♦ జాలము ద్వాదశవర్షయజ్ఞదీ
క్షాహితనిష్ఠలం జెలఁగి ♦ సాంతముగా నొనరించి దానిఁ బూ
ర్ణాహుతి సల్పఁ బూనె నిపు ♦ డందర మాతనిఁ జూడఁ బోదగున్. 175

గీ. యజ్ఞకర్తవు భోక్తవు ♦ యజ్ఞఫలదుఁ, డవుగదా నీవు యాగంబు♦నరితిఁ జూచు
వాఁడవీవెయటంచు దే♦వ ప్రచయము, ల నవుడట్లియటంచు న♦య్యవసరమున.

చ. కలశజుఁ గాంచుబుద్ధి మహి ♦ కాంతుఁడు రామవిభుండు సత్కృపా
జలధులు వాసవాదికులఁ ♦ జయ్యనఁ బుష్పకమెక్కి కానలన్
లలితమహాసరోవరకు ♦ లంబుల శైలనదీతతిం బురం
బుల సకలంబులం గనుచుఁ ♦ బోవుచునుండిరి సంతసంబునన్. 177

కం. అరుదెంచుచు నవ్వారలు, సరణిగత శ్రమము వాయఁ ♦ జందనవన్యాం
తరమున నించుక నివసిం, చి రయంబున వెడల నాశ ♦ చీధవుఁ డపుడున్. 178

మ. అదె కుంభోద్భవునాశ్రమం బదె సము ♦ ద్యత్పర్ణశాలావ్రజం
బదె గాఢావృత నీలమేఘచయదీ ♦ వ్యద్ధోమధూమోత్కరం
బదె పర్ణాలయమంత్రపాఠయుతహేలా ♦ త్రధ్వాగ్ర్యఋత్విక్చయం
బదె యూపాది సమస్తసాధనగణం ♦ బంచు న్వచింపం దమిన్. 179

కం. విని యింద్రుఁ డనిన యన్నియుఁ, గని రఘురాముండుఁ బుష్పకము దిగి మోదం
బున నచట వసించిన ముని, జనములకున్ మ్రొక్కులిడుచుఁ ♦ జనుదెంచె వెసన్.

—* రాముఁడగస్త్యాశ్రమముఁ జేరుట. *—

చ. అమరులు దెల్పఁగా విని ని ♦ జాగమనంబున కుబ్బ కుంభజో
త్తమచరణాంబుజాతములఁ ♦ దాఁకి శిరంబు నమస్కరించి రా
మ మహీధవుండు నాతఁడిడు ♦ మాన్యతకు న్వినుతించె నంత హ
వ్యముల వహించి దేవనిచ ♦ యంబులు వోయిరి దేవభూమికిన్. 181

చ. సముచితపద్ధతిం గ్రతువు ♦ సర్వముఁదీరిచి మీఁదటన్ ధరా
రమణునకు న్వసించుటకు ♦ రమ్యనివాస మమర్చి కందమూ
లముల నొసంగి తియ్యని ఫలంబులచేఁ గడుఁదృప్తిఁ జేసి వా
ని మొగమునం దగస్త్యముని ♦ నిర్మలదృష్టులఁ జేర్చి యిట్లనున్. 182

ఉ. నా దెసఁ గూర్మిఁ దాల్చి రఘు ♦ నాయక మీ రరుదెంచినందునం
గాదె ఫలించె నాదగుమ ♦ ఖంబు తపఃఫల మబ్బె నాత్మయున్
మోదముఁ గాంచె భూమిసురు ♦ పుత్త్రునికై వృషలున్వధించి యిం
ద్రాదిసురాళికెంతయుఁ బ్రి ♦ యం బొనరించుట వింటివారనన్. 183

కం. ఈ దాక్షిణ్యాదులునే, భూదారులకుం జెలఁగునె ♦ భూమి న్నీ శౌ
ర్యౌదార్య ధైర్య గాంభీ, ర్యాదుల వినుతింపఁ దరమె ♦ యహిపతికైనన్. 184

చ. నిను మదిమెచ్చి రామ ధర ♦ ణీపతి యేమియొసంగువాఁడనై
నను నిదె యొక్కరత్నమయ ♦ నవ్యవిభూషణమిచ్చెదం దయం
గొను మన రామభూధవుఁడు ♦ కుంభజ! మేమచలా సురార్థముల్
గొనఁదగునే మదిం దలఁచి ♦ కూర్మి నొసంగుము నావుడాతఁడున్. 185

చ. ఇల ధననాయకాంశమున ♦ నియ్యఁగఁ బుచ్చుకొనంగవచ్చు రా
జుల కది యెట్లన న్మనువు ♦ క్షోణిజనంబులు రాజహీనతన్
దలఁకి సురేంద్రుఁడు న్సురవి ♦ తానముఁగాచెడురీతిఁ దమ్మునే
ర్పలరఁగఁగాచు రాజుఁ బడ ♦ య న్విధిపాలికిఁబోయి దీనతన్ 186

సీ. ఎఱిఁగి వాణీశ్వర ♦ ధరణీధవుండొక్క, రుఁడు లేమిఁ జేసి యీ♦పుడమినుండ
లేము ధర్మాదుల ♦ నోమమమ్మలనేల, క్షితినాథునొక్కని ♦ సృష్టిసేయు
మని వేడఁ గమలజుం ♦ డమరేంద్రదండివా, రి పతికిన్నరగణా ♦ ధిపతిముఖులఁ
బిలిచి మీఁదగు బలం ♦బుల నాలుఁగిట నొక్క, పాలొసంగుడు భవ♦త్ప్రథితకాంతి

గీ. సహితుఁడై ధాత్రిభరియించు♦ఖ్యాతశేంద్రు, నేనుసృజియింతు మనవుడు♦నెనరుఁబూని
యిచ్చిరావైఖరి సరస్వ♦తీశ్వరుండు, క్షుపుని సృష్టించె గడియలో♦నప్రుసు నెలమి.

మ. క్షుపుఁ డట్లుద్భవమొంది బమ్మవనుపన్ ♦ క్షోణీశలాధ్యక్షుఁడై
కృపదాతృత్వము వైభవంబు జలనా ♦ థేంద్రోత్తమాంశంబులన్
రిపునాశంబలకాలునంశమున దా ♦ రిద్ర్యార్తినాశంబు య
క్షుపునంశంబునఁ బ్రోచుచుండె జనులన్ ♦ సత్యాత్మ సంశీలుఁడై. 188

ఉ. కావున దానమేరిడినఁ ♦ గైకొనఁజెల్లు నృపాలమౌళికిన్
నీవవనీశమాత్రుఁడవె ♦ నిర్మలబుద్ధివి మాధవుండ వి
ష్ణ్వవనరత్నభూషణ మ ♦ పార కృపం గొనుమం చతండనన్.
భూవలయాధిపుండు రఘు♦పుంగవుఁడయ్యెడఁ బ్రీతితోఁ గొనెన్. 189

సీ. కలశజుం డిడిన ని ♦ ర్మల భూషణంబు సం, గ్రహియించి కడునమ♦స్కారములను
సలిపి తద్భాషిత ♦ ముల నన్నిశం బుచ్చి, కమలజమిత్రోద♦యమున లేచి
కలశోద్భవునకు న ♦ తులఁ జేసి మునికులేం, ద్ర భవదీయక మహా♦దర్శనమున
నతిపవిత్రుఁడనైతి ♦ నాజ్ఞనిచ్చిన పురం, బున కేగుదెంతు నా♦ వుడతిగుణుఁడుఁ

గీ. గుంభజుండు వచించె ర♦ఘుప్రవీర, పావనాక్షర తత్వంబ ♦ వీవు నిన్ను
వినుతిసేయఁగ నేటికి♦నినుఁ దెలియఁగ, శక్తులే మాదృశమునిసం♦చయము లవని.

—* రాముఁడయోధ్యకు వచ్చుట. *—

మ. అని గంభీరవచోనిగుంభనల ము ♦ న్యాఢ్యుండు శ్లాఘించి పం
చిన రామావనికాంతుఁడుం బయనమై, ♦ శ్రీగాంగభూమ్యాదులం
గనుచుం బుష్పకమెక్కి సైన్యములు వెం ♦ టం గొల్వ మాధ్యందినం
బునకుం జేరె నయోధ్య మానసమిళ ♦ త్పూర్ణానురాగంబునన్. 191

గీ. చేరి రాజ్యంబుధార్మిక ♦ స్థితిఁ జెలంగి, కాచుచున్మంత్రి సామంత♦గణహితాశ్రి
తాప్తులెల్లను నిరతంబు ♦ నధికభక్తి, యుక్తచేతస్కులై కొల్వ♦నొక్కనాఁడు.

## —* రాముఁడశ్వమేధముఁ జేయుట. *—

చ. ఘనరఘువంశదుగ్ధనిధి ♦ కైరవమిత్రుఁడు రామచంద్రుఁడున్
ఘనహయమేధయాగము నొ ♦ నర్పఁగడంగి గుణాఢ్యు లక్ష్మణుం
గని సుగుణాఢ్య నీవఁగి ♦ కశ్యపకణ్వవసిష్ఠకుంభజా
దినిఖిలమౌనిసత్తము లఁ ♦ దెప్పునఁ దోడ్కొనిరమ్ము నావుడున్. 193

ఉ. శ్రీలలితుం డతండు రఘు ♦ శేఖరునాజ్ఞ వహించి గ్రక్కునన్
గాలవవామదేవభృగు ♦ కశ్యపకుంభభవాత్రికణ్వ జా
బాలివసిష్ఠకౌశికవి ♦ భాండకముఖ్యుల నాత్మ తత్త్వము
ల్చాలనెఱుంగు మౌనివరు♦లం దోడితెచ్చె నితాంత భక్తితోన్. 194

ఉ. అంతకు మున్నెవచ్చి భర ♦ తాదులతో సభఁదీర్చియున్న భూ
కాంతుఁడు వారిరాక విని ♦ కాంక్ష నెదుర్కొని భక్తిపూరిత
స్వాంతముతో మహేంద్రమయ ♦ చారుకిరీటరుచుల్ తదీయపా
దాంతికభూములం గలియ ♦ నామునిపాళికి మ్రొక్కి మీఁదటన్. 195

గీ. తోడుకొనివచ్చి వినయంబు♦తోడఁగాంచ,నాసనంబుల నునిచి హ♦స్తాంబుజములు
మొగిచి నిజవీక్షణంబులు♦మునిముఖాంబు, జముల నిగిడించిపల్కె న♦జ్జనవిభుండు.

సీ॥ మునులార లోకసం ♦ పూజితంబగు నశ్వ, మేధయాగము నేను ♦ మీయనుమతిఁ
జేయువాఁడ నని మ♦దీయాత్మలో నెంచి,తిని మీరలామఖం♦బున కనుజ్ఞ
నిండు నావుడు సంయ♦మీశ్వరు ల్రఘురామ, ముల్లోకముల కద్ది♦ముఖ్య మౌక్ర
తు వొనరింపుము నీదు♦దోహదం బన్యథా,భావమొందునె యంచుఁ♦బలికిన రఘు

గీ॥ రామచంద్రుఁడు నంతట♦రహివహించి, మ్రోలనిలుచున్న లక్ష్మణు♦మోముఁగాంచి
వత్స యిటరమ్మటంచు సు♦స్వాంతుఁడగుచుఁ, బలికె మధురవినిర్మల♦భాషితముల.

చ॥ హావమునుజూడ మైందపన ♦ నాత్మజవాలిజధూమ్రజాంబవ
ద్గవయగవాక్షనీలగజ ♦ తారనలార్కజగంధమాదన
ద్వివిదసుబాహుకేసరిసు ♦ ధీరసుషేణముఖాటవీచర
ప్రవరుల నందఱిం బిలువఁ ♦ బంపుము నీవిఁక వేగిరంబునన్. 198

మ॥ ఘనధర్మాత్మకు నవ్విభీషణుని లం ♦ కాభూపతిన్ నిత్యస
త్యనుతుం బిల్వుము కేకయాధిప విదే ♦ హక్ష్మాతలాధీశులన్
ఘనులన్ సత్ప్రియబాంధవాశ్రిత సుహృ ♦ త్కాండంబులం గూడి ర
మ్మనుచుం గమ్మలఁ బంపుమీ నిఖిలదే ♦ శాధ్యక్షసంశ్రేణికిన్. 199

శా॥ నానాదేశనివాసభూమిసురులన్ ♦ నానాసరిత్తీరవ
న్యానూత్నాశ్రయవాసులన్ నభమున ♦ న్భాసిల్లు సప్తర్షులన్
నానాదేవవసుంధరాంతరములన్ ♦ వర్తిల్లు దేవర్షులన్
నానాశాస్త్రమునీంద్రజాల మిపుడున్ ♦ రప్పింపుమీ లక్ష్మణా. 200

క॥ పరిహాసకులన్ గాయక, వరులం గవిమాగధప్ర ♦ వరుల నటవరో
త్కరముల వాంశికగణముల, నరితిన్ రప్పింపు మధ్వ ♦ రాలయమునకున్. 201

సీ. నైమిశారణ్య పుం♦ణ్యక్షేత్రమున వెల్గు, గోమతీతీరస్థ ♦ భూమియందు
శిల్పశాస్త్రాదుల ♦ శ్రేష్ఠులై వెలయు శి, ల్పాచార్యతతులచే ♦ యజ్ఞమంట
పంబుఁ గట్టింపుమా♦భవనంబునకునన్ని, యెడల భూమిసురధా ♦ త్రీశ్వరోరు
జ వృషలాదులు నిల్వ ♦ సరసమందిరములు, కమనీయఘన ధనా♦గారములును

గీ. వరమహానసములు మఠ ♦ ప్రకరములు న, నేకభోజనార్థాగార ♦ నిచయములును
లలితపటశాలలాపణ ♦ ములు విశాల, కరిరథాశ్వాలయంబులుఁ♦గట్టఁబనుపు. 202

ఆ॥ వె॥ చల్వచప్పరములు ♦ చలిపందిరులిరుపా, ర్శ్వముల నమరఁ జేయు ♦ మమితలీల
నాపణాంగణముల ♦ నఖిలవస్తువు లమ్మ, కొనుఁడటంచు నర్థ ♦ జనులకనుము. 203

సీ. తిలలు మినుములు ముద్గ♦ములు గోదుములు మొద, లైనట్టి కాయధా♦న్యనిచయంబు
రమణీయరుచి లస♦ద్రజితాచలముఁబోలి, విమలతండులకదం♦బములఁగూర్పు
మతి నిర్మలక్షీర ♦ ఘృతతైలదధి శర్క, రల్కదళీఫల ♦ రాజిఁ గంద
మూలాదులున్నాక ♦ టాలమిప్పటినుండి, శతయత్నములతోడ♦సంఘటింపు

గీ. మశ్వహావసాధనంబులై♦నట్టి వస్తు, జాలమున్ముందు గూర్పుము♦శతసహస్ర
సంఖ్యలన్మించునై చికీ♦ సమితివిత్త, పాళిజతఁ గూర్చియీయెడఁ ♦బనుపు మటుకు. 204

ఉ. పౌరుల నాప్తబంధువులఁ ♦ బ్రాజ్ఞుల నంతిపురాంగనానళిన్
దారకులం బలప్రతతిఁ ♦దల్లుల మిత్రుల మేదినీసుతా
కారసువర్ణవిగ్రహముఁ ♦ గ్రక్కునఁ జేరిచి నీవు తన్మఖా
గారమున న్వసింపు మటఁ ♦ గాఁదగువస్తువులం ఘటించుచున్. 205

క. క్రతువునకున్ శత్రుఘ్నుని, నతిసుగుణుం బిల్వఁబనుపు ♦ డనవుడుఁ దమితో
నతఁ డప్పనులం జేయఁగ, నతిధీరుఁడు రామచంద్రుఁ ♦ డాసమయమునన్. 206

క. సంపూర్ణాంగిశలక్షణ, సంపన్నంబై విశేష ♦ సౌందర్యమునన్
బెంపందు వాజివెంబడిఁ, బంపెం లక్ష్మణుని వీర ♦ బలసహితముగన్. 207

ఉ॥ రాజకులాగ్రగణ్యుఁడగు♦ రామునితమ్ముఁడు లక్ష్మణుండె యి
త్తేజికి పాలకుం డవని ♦ ధీమతు లుండినఁ బట్టుడంచు న
వ్వాజిముఖంబునం జెలఁగు ♦ వ్రాతలఁజూచి తలంకి దాని నే
రాజులుఁజేర రాత్మనగ ♦ రంబులదాపున సంచరించినన్. 208

సీ॥ దక్షిణాత్యాధవో♦త్తమగోపురద్వార, సముదయంబుల విహా♦రముల సలిపి
పశ్చిమోర్వీపాల♦పట్టణప్రాకార, భూమిశాద్వలఘాస ♦ ముల భుజించి
యుత్తరోర్వీనాయ♦కోద్యానపాదప, చ్ఛాయాంతరముల వి♦శ్రాంతిఁగాంచి
ప్రాగ్దిగ్వసుంధరా♦పాలలీలాబ్జాక, రములలో విమలనీ♦రములఁద్రావి
గీ॥ మఱియుఁ దక్షిణమేదినీ ♦ మండలముల,ధీరత న్యథేచ్ఛావృత్తిఁ ♦ దిరుగుచు రఘు
నాయకాధ్వరముక్తగం ♦ ధర్వ మలరె,విబుధరిపువైరిశిక్షచే ♦ వెఱపులేక. 209

ఉ. అంతకుమున్నె శ్రీ రఘు కు ♦ లాంబుధిశీతకరుండు సర్వసా
మంతులు బంధుమిత్ర హిత ♦ మంత్రివరేణ్యులుగొల్వ గోమతీ
ప్రాంతముఁజేరి యందు నను ♦ జాదికులం గ్రతుసాధనక్రియా
వంతులఁగాంచి వారిఁదగు ♦ వైఖరులం గడు నాదరించుచున్. 210

శా. నానాదేశనివాసులన్ సకల భూ ♦ నాథాదులన్ బంధుసం
తానంబున్ రవిజు న్విభీషణుని త ♦ త్పార్శ్వస్థులం బూజిత
స్థానాభ్యంతరసీమల న్విడియఁగా ♦ శత్రుఘ్నునిం బంచి భూ
జానాథుండుఁ గృపాభిపూర్ణవిమల ♦ స్వాంతాబ్జుఁడై వెండియున్. 211

సీ॥ భూదేవతాదులఁ♦బూజించుపట్ల నే, మఱకు మీవచట నో♦భరతయనుచుఁ
బార్శ్వంబుల వసించి♦వలయుయజ్ఞార్హవ, స్తువుల నిమ్మిచట శ♦త్రుఘ్న యనుచు
నడుగువారలకెల్ల♦నడిగినన్నిపదార్థ, రాసులిమ్మిటఁ గీశ♦రాజ యనుచుఁ
గ్రతువిఘ్నకారులఁ♦గట్టిశిక్షించి య, జ్ఞముఁ గావుమిట వి♦భీషణ యటంచుఁ
గీ॥ దక్కువైన పదార్థసం♦తతులఁదెచ్చి, నెమ్మి నెరవేర్పుభారము♦నీదెసుమ్ము
పవనజయటంచు రామభూ♦ధవుఁడు వారి,వారి నియమించె నుచితప్ర♦వర్తనముల.

గీ॥ ఇట్లు నియమించి రామభూ♦మీశ్వరుండు, సుఖదినాదికయూపసం♦శోభితాధ్వ
రాలయంబుం బ్రవేశించె♦నధికభక్తి, నలపులస్త్యవసిష్ఠాది♦కాజ్ఞఁబూని. 213

గీ॥ ఇవ్విధమునం బ్రవేశించి♦యీసమస్త, భువనరక్షణదీక్షాధి♦పూజితుండు
నబ్జమిత్రాన్వయాధిపుఁ♦డపుడు యజ్ఞ, దీక్షవహియించె నచట ది♦దృక్షులలర.

సీ॥ సకలపావనతర♦స్థండిలస్థితయూప, రాజ్యాదికాధివి♦భ్రాజితంబు
హోతృహస్తధవిత్ర♦జాతానిలోజ్జ్వలి,తగభీరకీలావృ♦తగగనంబు

విమలాన్నహైయంగ♦వీనహవ్యాదిక, హోమజస్వాహాస్వ♦నోచితంబు
తత్తత్క్రియాహ్వాష్ట♦తరదిదృక్షుజనాది, కముహుర్ముహుశ్శిరః♦కంపనంబు

గీ॥ ప్రవిమలోద్గాతృ సామగా♦నవిలసితము, ప్రియతమాధ్వర్యుఋగ్యజు♦ర్వేదమంత్ర
నివహసంశోభితంబు స♦ర్వవిబుధాళి, మోదకరమయ్యె నాయజ్ఞ♦మువిలసిల్లె.

సీ॥ భరతునిచే ధరా♦సురులు ధాత్రీమండ, లాధీశు లన్నపా♦నాదివిస్ఫు
రణలచేఁదృప్తులై♦రహివహించిరి సర్వ, వేదతత్వజ్ఞులు♦న్వాదు లలవి
భీషణార్చనలచేఁ♦బ్రీతిఁగాంచిరి యాచ, కజనసంతానంబు♦కమలమిత్ర
జుండిచ్చునర్థవి♦స్ఫూర్తులం గాంక్షలు, దీరి సౌఖ్యంబుతోఁ♦దేజరిల్లె

గీ॥ రివ్విధమున వత్సరకాల♦మేగ నంత,లో సుమిత్రాకుమారుండు♦వాసిఁగాంచి
వాజిఁ గొనితెచ్చెనఖిల భూ♦పాలకుండు, కడిఁది నధ్వరకృత్యము♦ల్నడుపుచుండె.

చ॥ వలసినభోజనద్రవిణ ♦ వస్త్రముఖంబులఁ దృప్తులై కడుం
బలుమఱుఁ జాలుఁజాలునని ♦ పల్కెడువారలెకాని మాకుఁ గా
వలయునటంచుఁ గోరఁగల ♦ వారలులేరఁట మందుకైన నా
స్థలమున నిట్లు రామవసు♦ధావిభునధ్వర మొప్పె నయ్యెడన్. 217

క॥ అర్థిజనంబులు నిజసక, లార్థములన్వడసి యిలఁగృ ♦ తార్థతఁజెందన్
వ్యర్థులయిరన్నదాతలు, సార్థత్వము లేమిలేమి ♦ యజ్ఞములఁ గనన్. 218

చ॥ మలినులులేరు లేరుకృశ ♦ మానశరీరులు లేరుబీద వా
రలు నటనున్నవారలటి♦రత్నవిభూషణరాజిభూషితుల్
సలలితకాంచనాంబరులు ♦ చందనదామసుగంధగంధిలా
ఖిలదిశు లర్థరాజిజిత ♦ కిన్నరనాయకు లెంచిచూచినన్. 219

మ॥ యతులయ్యధ్వరవైభవంబునకు న ♦ త్యాశ్చర్యముం గాంచుచున్
మతిలో నెంచిరి మున్ను ధాతృముఖమున్ ♦ మార్తాండపుత్రోత్తము
క్రతువున్ సోమునియాగమున్ వరుణయా ♦ గం బిరఘుశ్రేష్ఠుస
త్క్రతురాజంబును బోలునేయనవుడుం ♦ దత్తత్క్రియారీతులన్.

సీ॥ శతకోటిరజతాద్రి♦సంతానములుగుప్ప, వేసినప్పటికింత♦వెండియగునె
కోటికోటిసువర్ణ♦కుధరగాంగేయంబు, చేర్చిననింతప♦సిండియగునె
నిర్మలార్బుదకోటి♦నీహారగిరిమణు, ల్సమకూరిచినను ని♦న్నిమణులగునె
దశలక్షమందార♦తరువులొక్కటిగాన, సించియిచ్చిన నిన్ని♦చేలలగునె

గీ॥ నూఱులక్షలకామధే♦నువులుగూడి, నెట్టననిడినప్పటికిన్ని♦నిఖిలసముచి
తాంచితపదార్థసంఘంబు♦లగునెయాగ, మివ్విధమునసలిపిరెము♦న్నెవ్వరైన. 221

మ॥ అని సభ్యుల్ వినుతింప శ్రీరఘుకులా ♦ ధ్యక్షుండు సంవత్సరం
బును సంపూర్ణసువర్ణదక్షిణలచే ♦ బుణ్యాశ్వమేధంబు సే
యు నెడన్ దానిని జూచుకోర్కి సుతపో ♦ యోగుండు వాల్మీకి శి
ష్యనికాయంబు భజింప వచ్చెనపుడున్ ♦ సత్రాలయంబున్ వెసన్. 222

క॥ వచ్చినవాల్మీకిమునికి, హెచ్చినరహి నెదురుకొనిమ ♦ హీవిభుఁ డర్ఘ్యం
బిచ్చి సుపూజలనొనరిచి, యిచ్చమెయిం గుశలమడిగి ♦ యిట్లనె నపుడున్. 223

సీ॥ ఇటకుమౌనీంద్ర మీ ♦ రేతెంచుట మదీయ, యాగంబు ఫలియించె ♦ నతిపవిత్ర
యుష్మదీయపదాబ్జ ♦ యుగము సోకి మఖాల, యంబెల్ల పావనం ♦ బయ్యె మామ
కాధ్వరక్రియపూర్ణ ♦ మౌ దాఁక నీమౌని, వరులట్ల మీరుండ ♦ వలెనటంచుఁ
సమ్మానినవర్షా ♦ శాలాంతరంబున విడి, యించె ధీరుఁడు నమ్ము ♦ నీశ్వరుండుఁ
గీ॥ దన్ను వేఁడినరామచం ♦ ద్రవచనముల, దాఁటలేక తదధ్వర ♦ దర్శనేచ్ఛ
చే నిలిచి గాయకులనాత్మ ♦ శిష్యవరులఁ, గుశలవులఁ జూచి యీరీతిఁ ♦ గూర్మిఁ దాల్చి.

—* వాల్మీకి కుశలవులచే రామాయణము గానముఁ జేయించుట. *—

సీ॥ అతినేర్పుతో మీర ♦ లలరు రామకథా ప్ర, పంచమీ భూభృత్స ♦ భాస్థలమున
మఖమందిరంబుల ♦ మౌనీంద్రులున్నచో, ట్ల వనుల న్విపణాస్థ ♦ లములసకల
ధారణీపతిసభాం ♦ తరములం గవిజన, సంతానసన్నిధిం ♦ జదువవలయు
స్వరతాళములు లయల్ ♦ చక్కనౌ పద్ధతి, నింక మీరిర్వురు ♦ నెలమి మీఱ
ఆ. వీణలూని దినము ♦ వింశతిసర్గల, వరుస రామచంద్ర ♦ ధరణివిభుని
సభఁ బఠింపుఁ డెంచి ♦ సత్తచ్చరిత్రంబు, సభ్యులౌననంగ ♦ ఛాత్రులార. 225

మ. ఫలమూలాశనులై ధనేచ్ఛల వహిం ♦ పం బోక రామాయణం
బలరన్ రేపటినుండి గానమును జే ♦ యం బూనుఁ డెవ్వారు మీ
రలటంచు న్నిము రామ భూమిధవుఁడుం ♦ బ్రశ్నింప వాల్మీకి శి
ష్యులమంచు న్వచియింపుఁ డెంచుడు మహీ ♦ శుం దండ్రిగన్ నావుడున్. 226

శా. ఆమౌనీశ్వరుఁ డానతిచ్చిన క్రియన్ ♦ జ్యాపుత్త్రికాపుత్త్రు లెం
తో మోదంబున నా నిశిం గడపి ప్ర ♦ త్యూషంబునన్ లేచి ని
ష్ఠామేయాత్మకులౌచుఁ జేసి యుచితో ♦ షఃకాలకృత్యంబులన్
శ్రీమత్కాంచన వీణలూని కరరా ♦ జీవంబులం బిమ్మటన్. 227

కం. మునిజనసంచయసన్నిధి, జననాథసభాంతరముల ♦ సద్దేవాగా
రనికరముల నాపణయు, క్తనిలయముల బత్తిమీఱఁ ♦ జదువుచు దానిన్. 228

—* కుశలవులు రామునిసన్నిధి రామాయణము గానముఁజేయుట.*—

చ. సమయముగాంచి యొక్క దివ ♦ సంబున రాముని యజ్ఞశాల క
క్కొమరులు వచ్చి జోడుగన ♦ కుంఠితపద్ధతి వీణలూని తా
నములును రాగము ల్విన వి ♦ నం జెలువై విలసిల్ల నెల్లరుం
బ్రమదపయోనిధి న్మునుఁగఁ ♦ బాడిరి రామచరిత్ర మంతయున్. 229

మ. ఎదలో నెన్నఁదదీయగానమహిమం ♦ బేలాటిదో వార్ధులొ
క్కదెస న్నిల్చిన వైఖరి న్నినదయు ♦ గ్రామాచాలాంధిట్సభం
గదల న్వ్రాతెఱ పల్కఁ డొక్కఁడయిసం ♦ గ్వాణంబుల న్మాన్పుచుం
గదలంజాలక చిత్రరూపముల మా ♦ ర్గంబందిరాసొక్కునన్. 230

చం. కొలువున నున్న భూమిపతి ♦ కోటిసువర్ణమణీంద్రభూషణా
వళులు గరంగి నీరగుచుఁ ♦ బాఱఁజెలంగెనటంచుఁ బల్కునన్
సలలితమైథిలీతనయ ♦ సన్మధురామృతచారుగానవీ
చులకుఁ గరంగుటెంత బహు ♦ సుందరసభ్యజనాంతరంగముల్. 231

మ. పదసందర్భము లర్థమార్గములు శ ♦ బ్దస్ఫూర్తులుత్ప్రేక్షలిం
పుఁదలిర్పన్ మునిముఖ్యచంద్రకృత సం ♦ పూజ్యాదికావ్యంబునన్
మొదటం గల్గినఁ బద్యరత్నముల నా ♦ మోదంబుతో నాలకిం
చి దరి న్నిల్చిన వారి రామనృపుడుం ♦ జేసంజ్ఞ వారించుచున్. 232

సీ. కాలార్హమగు హోమ ♦ కార్యముల్నిష్ఠతోఁ, దీరిచి రమ్యప్ర ♦ దేశమందుఁ
గొలువుఁదీరిచి లోక ♦ కుల పూజితులు మౌను, లాచార్యులాశ్రితు♦లాగమజ్ఞుఁ
లఖిలశాస్త్రజ్ఞులు ♦ ననుజు లాప్తులు కవు, ల్పౌరాణికులు ధరా♦పాలవరులు
హితులు సేవింపఁగా ♦ నతిదయాపూర్ణుఁడై, లలితులఁ గుశలవు♦లఁబిలిపించి

గీ. సవిధమునఁ గూరుచుండఁగ ♦ శాసనం బి, డిన సభాస్తారమున్యాది♦జనసమూహ
కములుఁ బ్రతిబింబయుగళంబు♦కరణిఁజెలఁగుఁ,బరమసౌందర్యవంతుల♦వారలఁగని,

ఉ॥ ఈముఖకాంతు లీనగవు ♦ లీనయనాబ్జము లీస్వసంబు లీ
చామనచాయ లీఘనభు ♦ జంబులవైఖరు లీయురంబు లీ
కోమలరూపము ల్వచన ♦ గుంభన లీరుచు లెంచిచూడ శ్రీ
రామునిలీలనుండి రభి ♦ రామదయాత్ములు వీర లెవ్వరో. 234

ఉ॥ హారమనోజ్ఞరత్నమకు ♦ టాదికభూషణసంచయంబులన్
వీరు ధరింప కేజడల ♦ వేషము లేలధరించిరో నిజా

కారములన్ జగ్రుచిర ♦ కంతుజయంతుల గెల్చినారు వీ
రేరుసిబిడ్డలో మునుల ♦ కెక్కుడిపైనను నిట్టిరూపముల్. 235

చ॥ అని తమలోనఁదాను జను ♦ లాడెడుమాటలసద్దు నింగి నం
టనపుడు వచ్చిలక్ష్మణుఁ డ ♦ డంచె నట న్నిజహస్తసంజ్ఞ వెం
టనె జనకాత్మజాసుతులు ♦ నవ్వి మనోహరవీణలూనితం
తినిచయకంబునన్ శ్రుతుల ♦ నేర్పుఁదనంబున బాడిరొయ్యనన్. 236

గీ॥ ప్రథమసర్గము మొదలుగా ♦ మధురఫణితి, నాఁడువింశతిసర్గలఁ ♦ బాడిరచట
నున్నమునిచంద్రభూపాల ♦ కోత్తమాప్త, హితులుహితబాంధవులు పురో ♦ హితులు
మెచ్చ. 237

మ॥ స్వరచాతుర్యము మూర్ఛనాక్రమము స ♦ ద్వర్ణప్రతానంబులు
ద్ధురరీతిం దగుగ్రామవైభవము సా ♦ ధుశ్రుత్యభిజ్ఞానవై
ఖరులం బాపు రెయంచట న్మధురత ♦ ద్గానంబులాలించి భూ
వరుఁడున్ మెచ్చెఁ గృపాప్రపూర్ణవిమల ♦ స్వాంతాంబుజాతంబునన్. 238

క॥ మెచ్చి పదివేలవరహా, లిచ్చి భరతపీరికిమణి ♦ నీఘనులెడలో
నిచ్చంగోరినవన్నియు, నిచ్చెదనుపుమంచు నావు ♦ డెంచి కుశలవుల్. 239

చ॥ కరములు మోడ్చి పార్థివశి ♦ ఖామణి తాపసవృత్తిఁ గానలం
దిరుగుచుఁ గందమూలవిత ♦ తిం గడుమెక్కుచునుండుపూరుని
త్తతివచియించినట్టిమణి ♦ తండము లేమిటి కేటికన్యవ
స్తురతులు నావుడు న్మలల ♦ క్షోణితలేశుఁడుఁ గాంచివారలన్. 240

చ॥ అనెసుగుణాఢ్యులార! నిజ ♦ మానదియయ్యది యెవ్వరాచరిం
చిన యదియెట్టిమార్గమునఁ ♦ జెల్వగు నెవ్వరిదీచరిత్రమిం
దునకగునామ మేమి కదుఁ ♦ దూకొని మీరెచటం బఠించినా
రనవుడు నమ్రులై కుశల ♦ వాభిధులిట్లని రెంచివానికిన్. 241

సీ॥ క్ష్మాతలాధీశ! యీ ♦ కావ్యంబునిర్మించి, నసుకవీంద్రాఢ్యుండు ♦ నాకుజుండు
రామాయణంబను ♦ నామంబుదీనికి, నిది భవత్కథలచే ♦ నింపుఁగాంచు
వినుమిరువదినాల్గు ♦ వేలగ్రంథంబిగ, లలితపంచశతస ♦ ర్గలరహించుఁ
బట్టాభిషేకంబు ♦ వఱకుండుకథలారు, కాండంబులుగఁగూర్చెఁ ♦ గడపటికథ
గీ॥ నవలనుత్తరకాండంబు ♦ నందుఁజెప్పె, నమ్మునీంద్రునికరుణచే ♦ నచట మేము
నేర్చితిమిదీనినిందగు ♦ నిష్ఠకలిగ, నేని వినఁదగుదినమున ♦ నిట్టిసరణి. 242

క॥ ఈముఖనిష్ఠలుదీరిన, నామీఁదటఁ గొంతసేపు ♦ హర్షంబుననీ
వీమాకావ్యము వినవలె, మామాగానంబు సఫల ♦ మార్గంబందన్. 243

క॥ అనినావుడిష్టపడిరా, మనరవిభుఁడుఁవారిబనిచి ♦ మన్ననవెలయన్
మునివిప్రాదులతో యా,గనిలయముననుండె నర్హ ♦ కార్యనిరతుఁడై. 244

చ॥ దినదిన మిట్లువచ్చి జగ ♦ తీతనయాత్మజు లార్యులుంగ్రమం
బున సుమనోమరందఝర ♦ ముల్ప్రవహించినరీతి నచ్చటన్
ఘనలయతాళయుక్తముగఁ ♦ గమ్మనిగానకళాసిరూఢిన
జ్జనపతిచంద్రుమ్రోలఁగడుఁ ♦ జక్కఁగఁజూపుచునుండి రిమ్మునన్. 245

చ॥ జనపతిచంద్రుఁడొక్కదివ ♦ సంబున వారలరూపముల్దమిం
గని ధరణీసుతారమణి ♦ కైవడినున్నవివేరిరూపుల
వ్వనితకు రూపవంతులు క ♦ వల్మనుకల్గిరటంచువింటిన
త్తనయులెవీరలౌదురిలఁ ♦ దాదృశరూపములేరికుండునే. 246

చ॥ జడలుధరించి చారుమృగ ♦ చర్మములం బలువల్కలంబులం
గొడుకులుఁదానుఁదాల్చితగు ♦ కూరలనాఁకలి మాన్పుచు న్విధిం
గడుకొని దూరుచున్వ్రతలఁ ♦ గాంచుచునెట్లు గృశించియున్నదో
యడవులలో ధరాత్మజ కటా ♦ యిఁకఁగాంచక యెట్లుఁదాళుదున్ 247

ఉ॥ త్వన్మాతనయుం ద్యజించి బహు ♦ కాలము సైచితి నింకఁ దాల్మితో
నాతరుణీమణిం బిలువ ♦ నంపి జనాళికిఁ బ్రత్యయార్థమై
యీతఁడెఁబాసఁజేయుమని ♦ యేనువచించెదనట్లుఁగానిచో
నాతనుజాతు లీరనుచు ♦ నమ్మనె లోకమటంచుఁ జెచ్చెఱన్. 248

గీ॥ చెంతనుండిన శత్రుఘ్నుఁ ♦ జేరఁబిలిచి, పలికె నీగతివత్స యీ పవనజున్వి
భీషణసుషేణుల న్వెను ♦ వెంటఁ గొని య, కల్మషుండగు వాల్మీకిఁ ♦ గానఁబోయి

—* రాముఁడు నాశ్రమంబునన్న సీతంబిలిపించుట. *—

చ॥ జనకజ పుణ్యశాలినియు ♦ సాధ్వియునౌట నెఱింగి న స్మహిన్
జనులనునట్టి నిందఁబడఁ ♦ జాలక కానలకంపె నిప్పుడి
జ్జనులకు నమ్మకంబొదవ ♦ సభ్యులలోపలఁబాసజేయ న
వ్వనజదళాక్షిఁదోడుకొని ♦ వచ్చుట మేలనువానితోనటన్. 250

కం॥ ఆమాటకా మునీశ్వరుఁ, డేమని భాషించునో మహీతనయాహృ
త్తామరసస్థితులంగని, యేమనునో యెఱిఁగిమీర ♦ లేతెండనినన్. 125

ఉ॥ స్వామి మహాప్రసాదమని ♦ వారలు నల్గురు నత్తపోధన
గ్రామణియున్నచోటునకు ♦ గ్రక్కునఁబోయి నమస్కరించి శ్రీ
రామనరేంద్రు పల్కులతె ♦ ఱంగువచింపఁగ నాకుజుండు దా
నేమిఁదలంచెనో యిచట ♦ నిప్పుడు నట్లుఘటింపఁగాఁ దగున్. 252

కం॥ క్షితితనయారత్నంబతి, హితమతి శపథంబుసేయు ♦ నిదిసిద్ధము మీ
క్షితిపతికిం దెల్పుఁడనుచు, నతఁడనుపన్వారువచ్చి ♦ యనిరప్పతికిన్. 253

ఉ॥ అమ్మునిపల్కులన్విని ధ ♦ రాధిపతిప్రముఖుండు రాముఁడున్
సమ్ముదితాత్మలంజెలఁగు ♦ సభ్యులమానులఁగాంచి సర్వలో
కమ్ములు మెచ్చఁజేఁపు జన ♦ కక్షితిపాత్మజయిచ్చటన్యథా
ర్థమ్ముగఁజేయు ఘోరశప ♦ థంబు వినందగు మీరలందఱున్. 254

చ॥ శపథము సల్పుచోనయిన ♦ జానకి సత్యమెఱుంగుడంచు నం
దపసులు పార్థివోత్తముని ♦ తానము లాప్తులు బందుగుల్హితుల్
కపులు సురారిపుంగవులు ♦ కౌతుకవిస్మయ సాధ్వసాత్ములై
రపుడు నరేంద్రుఁ డాజనుల ♦ నందఱశాలలకంపె నాటికిన్. 255

సీ॥ అటుమీఁదట మఱునాఁ డరుణోదయంబున, దివసకృత్యంబులఁ ♦ దీర్చి లక్ష్మ
ణాములాదిత్య పు ♦ త్త్రాది వానరులు వి,భీషణాదిసురారి ♦ వీరులవని
పతులు మంత్రులు బంధు ♦హితులుసేవింపఁగాఁ,గొల్వుఁదీరిచిభాను♦కులుఁడువామ
దేవ విశ్వామిత్ర ♦ దేవలాగస్త్యపు, లస్త్యమైత్రేయ పులహవసిష్ఠ

గీ॥ కాత్రి రుచికాగ్నిమిత్త్రిక ♦ చ్యవన వాలఖిల్య గౌతమకణ్వమా ♦ ద్గల్యమంద
పాలశైలాదితాపస ♦ వరులనెల్ల, నుచితసింహాసనంబుల ♦ నునిచిపిదప. 256

క. మాళవకాశ్మీరమగధ, గౌళద్రవిడ మళయాళ ♦ గాంధారమహా
చోళాదిసకలజనపద, పాలురఁ దగుచోట్లనునిచి ♦ వఱలుచు నపుడున్. 257

సీ॥ నాకుసంభవముని ♦ నాథాగమనముం బ్ర, తీక్షింపుచుండ మా♦నీంద్రుఁడతఁడుఁ
దోలినాఁడుజనకజ ♦ నెలమితోఁగోమతీ, తీరాశ్రమమునకుఁ ♦ జేరఁగఁబిలి
పించి యావైదేహిఁ ♦ గాంచి చెప్పఁదగుధ, ర్మవచనంబులుసెప్పి ♦ బ్రహ్మరుద్ర
పురుహూతసమవర్తి ♦ వరుణాదు లమరకి, న్నరసిద్ధసాధ్యగం ♦ ధర్వయుతు

గీ॥ గరుడకింపురుషాదిక ♦ లరుగుఁదెంచి, గగనమునలంకరింపనా ♦ క్ష్మాజతోడ
వచ్చి వాల్మీకిసంయమి ♦ ప్రవరుఁడిట్లు, ఘనపయోధరగర్జిత ♦ క్వాణములననె. 258

—* సీత నిష్కల్మషయని వాల్మీకి సభాసదులు విన రామునితోఁ జెప్పుట. *—

మ॥ దిననాథాన్వయ యీసతీపరమపా ♦ తివ్రత్యసత్యాదులం
గనియున్ లోకజనాపవాదగతశం ♦ కన్నిండుచూలాలి ని
వ్వనులంద్రోయఁగఁబంపదైన్యవికల ♦ స్వాంతంబుతో మావనం
బునకు న్వచ్చి కుశుఁ లవుంగనియె నీ ♦ పుణ్యాత్మకు ల్నీసుతుల్. 259

చ॥ జలజదళాక్షి సత్యవతి ♦ ఖ్యాతనయామణి వీరు సుస్వభా
వులు సుగుణు ల్కవ ల్కుశల♦వు ల్గ్రహియింపుము వీరిమువ్వురన్
వలదనుమానమింక నిటు♦వంటిమహాసభలో నసత్యముఁ
బలుకుదు నెట్లుఁ బొంకినఁ ద♦పంబుఫలించునె మానికేయెడన్. 260

చ॥ బుధవినుతప్రచేతసుని ♦ పుత్త్రుఁడనై సకలంబెఱింగినే
నధికతపంబుచే యశము ♦ నందియబద్ధములాడనేర్తునె
ట్లధిపమనోవచఃక్రియల ♦ నన్యమెఱుంగదు భూమిపుత్త్రినీ
రధితనుజాతకుం గుధర ♦ రాజతనూజకు సామ్యమొందునన్. 261

ఉ॥ సారసతీత్వధర్మమున ♦ జానకిపెద్ద క్షమాగుణంబునన్
ధారుణి పెద్దమేరుగిరి ♦ ధైర్యసమున్నతిఁ బెద్ద తప్పులే
దారసినాడ భూమితన ♦ యాహృదయంబు మహావియన్మరు
త్సారసవైరి భాస్కర కృ♦శానుసురాదికులెల్ల సాక్షిగాన్. 262

ఉ॥ భూసుతకోసమేనిటుల ♦ బొంకితినేని విశేషవర్షముల్
జేసిననాతపంబు ఫల♦సిద్ధి వహింపదు లోకులెల్ల వి
శ్వాసముతో నటించుటకు ♦ స్వాంతములోపల నీవుకోరిన
ట్లీసభలోన నిప్పుడు మ♦హీజ యొనర్చు మహాప్రమాణమున్. 263

మ॥ అనివాల్మీకిమునీశ్వరుండపుడు న ♦ య్యాస్థానభూమి న్వచిం
చిన నాలించి దివాకరాన్వయనిధి ♦ క్ష్మీశేజుఁడాసంయమీ
శునకున్మ్రొక్కి వచించె నీరమణి యీ♦క్షోణీజ లోకైకపా
వనియంచు న్మను లంకలోనఁ దెలిసెన్ ♦ వహ్నిప్రవేశంబునన్ 264

చ॥ తెలిసిన లోకనిందలను ♦ దీర్పఁగ నిక్కరణిన్ ఘటించితిం
గల దపరాధ మోర్వుఁడిఁక ♦ కాంతశరీరులు వీరునాదుపు
త్త్రులు సతియీపెయానయినఁ ♦ దూకొని యింకొకసారి సీతయిం
దలిజనులౌనటంచనఁగఁ ♦ దాల్మిఁ బ్రతిజ్ఞ యొనర్చమేలగున్. 265

క॥ మీ రెట్లుపలికినప్పటి, కారమణివచించుశపథ ♦ మదిమెంతైనన్
ధీరులగు నిచటివారికి, నారమణీయోక్తిపత్య ♦ యుంబగుననినన్. 266

—* భూదేవి సీతనలంకరించి రసాతలంబునకుఁ గొంపోవుట. *—

ఉ॥ ఆరఘునాయకోక్తులకు ♦ నందరు విస్మయమందిరచ్చటన్
వారిరుహాసనాది బుధ ♦ వర్యులు మేలనిరాకసంబునన్
సారసుమంబులుం గురిసెఁ ♦ జక్కనిగంధము లుబ్బ నంతటన్
సారెకుసారెకు స్మలయ ♦ సారసమీరముపీచె దిక్కులన్. 267

మ॥ ధరణిజ రామచంద్రపద ♦ తామరసంబుల నిల్పితామదిం
బరమధృతిం ధరించి తల ♦ వాంచి యుదఙ్ముఖియై ధరిత్రిపై
యొరపునిజావలోకనము ♦ లుంచి కరద్వయము ల్మొగిడ్చి సు
స్థిరమతితోడ నిట్టుల వ ♦ చించెను సభ్యులకెల్ల వింతగన్. 268

శా॥ రామారాధ్యపదారవిందముల నా ♦ రాధింతునేనిన్ రఘు
స్వామీశాజ్ఞవసింతునేని నెపుడున్ ♦ జాగ్రత్స్వప్నస్వాదులన్
రామస్వామికి సాధ్వినౌటయు యథా ♦ రంభేని నాతల్లియో
భూమీ నాకిఁక మార్గముం దెలిపి గొం ♦ పోవమ్మ నీలోనికిన్. 269

ఉ॥ అంతట భూమియున్ బహు ర ♦ యంబున వచ్చి ధరిత్రికన్యకా
కాంతకుఁ గానుపించి కడుఁ ♦ గాసిలుస్వాత్మజఁ గౌఁగిలించి త
చ్చింతలఁ దీర్చి భూషల వి♦చిత్రగతిం గయిసేసి తద్రసా
భ్యంతరభూమి కయ్యెడల ♦ భద్రముగాఁ గొనిపోయెఁగూరిమిన్. 270

—* సీతాదేవి రసాతలంబున కరుగుటకు రాముఁడు చింతిల్లుట. *—

మ॥ జనకాధీశ్వరపుత్రి యిట్లరుగ వి ♦ శ్వంబంతయున్ శూన్యమై
తనకుం దోపఁగ దీనతన్ రఘుకులా ♦ ధ్యక్షుండు ధైర్యంబుతోఁ
గనులం బాష్పము లేఱులై తొఱఁగ హా ♦ క్ష్మాపుత్రి హా జానకీ
యనుచున్ మూర్ఛిలి లేచి ఘోరతరదుః ♦ ఖాక్రాంతుఁడై యిట్లనున్. 271

మ॥ జననిందం బడలేక నేనిటుల దు ♦ స్స్వాంతుండనై కాననం
బునకుం బంపినతప్పు నీదు హృదయాం ♦ భోజంబులో నెంచి నీ
చునిపోల్కిం గడుఁబొఁ గూర్చితినటం ♦ చుం దాగిపోనేల చ
య్యన నీవింకొకసారి నీముఖము లీ ♦ లాగారముం జూపుమా. 272

మ. అకటా! నీవు మహాసతీమణివి నా ♦ యందేమెడం బేర్మిఁ బా
యక నర్తింతువటంచు నెంచితిని న్యా ♦ యంబౌనె నీవేగుచో

టికిఁ గొంపోవక నన్ను నిష్కరుణ నొం ♦ టింబాసి పోవం దలం
పక నాదోషములేగుదెంచి యెదుటన్ ♦ భాషింపవే భామినీ. 273

మ. సదనంబున్విడనాడి పెక్కుదినముల్ ♦ శాంతి న్వనోర్వి న్నటిం
చి దురంతార్తివహించు నిన్ను నెలమిం ♦ జేపట్టి వర్తింపఁగా
నిదిమేలో వెరవంచు నెంచి శపథం ♦ బేఁ గొంటింగాని నీ
యెదనుంతైన నెఱింగినం దలఁతునే ♦ యీమాట యో జానకీ. 274

చ. అడరెడు పహ్నిఁజొచ్చు సమ ♦ యంబున నూఱక చూచుచుండు ని
ల్కడయునుఁ గానకంపి చిర ♦ కాలము సైచిన ధైర్యమిట్టి నా
యెడఁగని కుంది దుఃఖముల ♦ నెక్కుడి రాగవు వీనికంచు ని
ప్పుడమి నణంగి మాయమయి♦ పోతివె జీవములెట్లు నిల్పుదున్. 275

మ. కనులన్ సాంతెకఁగారు నశ్రుజల సం ♦ ఘాతంబుతో దైన్యముం
గను నిట్టూర్పుల వాడు కెంబెదవితోఁ ♦ గాంతాలక శ్రేణితో
ఘనలజ్జం దగు మోమువాంచి కర ♦ యుగ్మంబిచ్చుటన్ మోడ్చి ని
ల్చిన నిన్నుం దలపోయు మాత్రమున నా ♦ చిత్తంబు క్షోభిల్లెడిన్. 276

చ. అనుపమవామలూరుజవ ♦ నాంతర సీమలఁజెందినావు న
న్ననసిన కూర్మితోఁ గదిసి ♦ యెప్పటికైననుఁగాని కూడెదం
చనుమతి నిన్ని నాళ్ళిచట ♦ హాసతి తాలిమినుంటి నిప్పుడున్.
నను విడనాడి యిట్లరగి ♦ న న్మదిఁ బ్రాణములెట్లు నిల్పుదున్. 277

ఉ. ఎక్కడికేగితో యిపుడు ♦ నెక్కడఁ జింతలవీడి నిల్చినా
వెక్కడఁబోయె నాటిమరు ♦ లెంతటి నిర్దయురాలవైతివే
నెక్కడికేగువాఁడఁ దెలు ♦ వేది క్రమింతిఁకఁ గాలమెట్లు నీ
వెక్కడనుంటివో వెలఁది ♦ యేనెటుసైపుదు నీవియోగమున్. 278

సీ. పార్వతీపతి ధను ♦ ర్భంగంబుఁ జేయుట, నీకోసమేకదా ♦ నీరజాక్షి
నీరజాప్తజునితో ♦ స్నేహంబుసల్పుట, నీకోసమేకదా ♦ నీలవేణి
పరమవిక్రమపురం ♦ దర పుత్త్రిఁజంపుట, నీనిమిత్తముగదా ♦ నిర్మలాంగి
ఘోరాంబురాశిపై ♦ వారధింగట్టుట, నీనిమిత్తముగదా ♦ నీరజాస్య

గీ. బ్రహ్మవంశజుదానవే♦శ్వరుఁ దునుముట, నిన్ను గ్రహియించుటకుఁగదా♦వన్నెలాడి
యువిదయివియెల్లఁదలఁపక♦యొకఁటి రెండు, తప్పులకు నన్ను విడనాడఁ♦దగునె నీకు.

మ. అని ధాత్రీజ మనంబులోనునిచి శో ♦ కాక్రాంతుఁడై యిట్టు ల
య్యినవంశుండు ధరిత్రివచ్చి దయతో ♦ నిమ్మైథిలీదేవిఁ దో

డ్డాని పాతాళములోని కేగిన తెఱం ♦ గుఁ బుద్ధిలో నెంచి మిం
చిన కోపంబునఁ గాంచి సభ్యుల వచిం ♦ చెన్ ఘోర మేఘధ్వనిన్. 280

—* రాముఁడు భూమిపై బాణముఁ బ్రయోగింపఁ బూనుట. *—

ఉ. కంటిరె సభ్యులార జన ♦ క క్షితిపాలజ వేడినంత న
ప్పంట వెలందివచ్చి సుకృ ♦ పామతిఁ జింతలఁ దీర్చి పోకతాఁ
గంటున నన్నిటం జడునిఁ ♦ గా మదిలోఁ దలఁపోసి నాదు వా
ల్గంటిని వెంటఁ దోడుకొని ♦ గాసిలుచుం జనినట్టి చందమున్. 281

ఉ. బాలిశులీల దుఃఖముల ♦ పాలయి గాసిలుచుండ నేను నా
పాలిటిలక్ష్మి యీయనఁ గ ♦ భాసిలు మైథిలిఁ గొంచుఁ బోయె ని
న్నేల వెలంది ఛాట్ల్యసర ♦ ణిం బరికించినవారె మీరిటన్
దాలిమిఁ బూని యత్తయని ♦ దండనసేయక యూరకుందు నే. 282

మ. ఘనఘోరాంబుధి ఖేయమై వెలయు లం ♦ కం జేరి పంక్త్యాననా
దిని శాటోత్తముల న్వధించి మహిపు ♦ త్త్రీరత్నము న్మన్న తె
చ్చిన నాకియ్యది లక్ష్యమే ధరణి సు ♦ స్నేహంబుతోఁ గొన్న యిం
తి నిటం ద్రిప్పటఁ జూడు డిందఱు ధరి ♦ త్రి న్వత్తు బాణాహతిన్. 283

చ. మురుసుననాకుఁ గోపమెదఁ ♦ దోపకమున్నె ధరాజఁ దెచ్చి యి
ద్ధరణి యొసంగినం బ్రతుకుఁ ♦ దప్పిన మార్గణచాపనిర్వ్యధు
ర్ఘురఖరబాణజాలముల ♦ తోఁ బొడిఁ జేసి యజాండమెల్ల ని
త్తరి జలరాశిలోఁ గలిపె ♦ దం గనుడీ నిమిషంబులోపలన్. 284

మ. అని యీరీతి రఘూత్తముం డలిగి సా ♦ ధ్యాదిత్యగంధర్వసి
ద్ధనికాయంబులు శైలము ల్భువన సం ♦ తానంబు భీతిల్ల ది
వ్యనిజేష్వాసమునన్ శరం బునిచి వే ♦ యం జూచుచుండన్ భయం
బున బ్రహ్మాదికులేగుదెంచి నుతుల ♦ ప్పుం జేసి రీరీతిగన్. 285

—* బ్రహ్మాదులు రాముని స్తుతించుట. *—

చ. జయ జయ లోకరక్షణవి ♦ చారవిచక్షణ వారిజేక్షణా
జయ జయ సర్వదేవరిపు ♦ సంచయశిక్షణ మంజుభాషణా
జయ జయ సర్వకారణ ల ♦ సజ్జలజాప్త కులాభిభూషణా
జయ జయ సత్కృపాధిషణ ♦ సాగరశోషణ భూపభూషణా. 286

సీ. ఆత్మచాపముఁ ద్రుంచి♦నట్లు తేరుం ద్రుంపఁ, గడఁగెనంచును మాపి♦భుఁడుతలంకెఁ
దన్నుఁ గాంచీలీలఁ♦దాల్చు నారీరత్న, మడఁగుచుండెనటంచుఁ♦గడలివణఁకెఁ
దమ భూమి ధరసంజ్ఞ♦దప్పునే మోయుటం, చు మహీధరకదంబ♦కములు కలఁగె
నిఁక నేమి సేతు మే♦ మెందుఁ బోదుమటంచు, ఫణిరాజనివహంబు ♦ పరితపించె
గీ. నొక్క మహీదేవితోఁ బోనె ♦ సకల భువన, ములకుఁ గీడు ఘటిల్లునం♦చళుకుఁ గాంచి
రెల్ల జనములు మీరలు ♦ విల్లుఁ బూని, భూమిదేవిఁ జూచినమాత్ర♦ మున నరేంద్ర.

శా. తోయాగ్నిక్షితిమారుతాభ్ర మహదా ♦ దుల్ సృష్టిఁ గావించి నీ
వే యన్నింటికి రాజువై సకల లో ♦ కేశుండవై యుండి యి
ట్లా యీలోకగణంబుఁ జేయుటకు సృ ♦ ష్ట్యాదిన్ ననుం గంటివి
వే యీనాభిపయోరుహంబునను నీ ♦ వేరాజువో రాఘవా. 288

శా. సత్తామాత్రుఁడవై ప్రపంచములకున్ ♦ సాక్షిస్వరూపుండవై
చిత్తాదీంద్రియ పాళినాయకుఁడవై ♦ చిద్రూపవంతుండవై
తత్త్వాద్యత్రిగుణ స్వరూపమున నే♦ తజ్జన్మ రక్షాలయా
యత్తాశేషకలీలలం గనిన ని ♦ న్నాత్మం బ్రతీక్షింపవే. 289

సీ. అతిపూజితాగ్ని వి ♦ ద్యా పరాక్రమకృషి, వ్యాపార శుశ్రూష ♦ లందినీదు
వదనదోర్దండోరు ♦ పాదాబ్జములసిద్ధ, రాస్థలి నాల్గు వ ♦ ర్ణములుకలిగె
నీదుకర్ణంబుల ♦ నిఖిలాశలు జనించె, నేత్రద్వయంబుల ♦ మిత్రవిధులు
గలిగిరి నీజీవ ♦ ములనుండి పవనుండు, జనియించె జనియించె ♦ జగములిట్లు
గీ. నీవు సకలాంతరాత్ముఁడ ♦ వీవ సృష్టి, పోషణలయకారుఁడవీవె ♦ భువనవితతు
ల మహదంతరాత్ముఁడవెందు♦ లఁ దిలకింప, రమ్యగుణసాంద్ర శ్రీరఘు♦రామచంద్ర

చ. జనములు భీతిలన్ జనని ♦ చందము శోకము దైన్యకోపముల్
చనునె వహింప నీకు నిఁకఁ ♦ జాలును వీడుము విల్లు భూమిచే
సినయపరాధమేమి రఘు ♦ శేఖర నీదగు నాజ్ఞఁ జేసితె
ర్వ్యనిజధరాజ యెందరిగె ♦ బుద్ధిఁ దలంపుడు మీరలీయెడన్. 291

ఉ॥ నీకథలాదినుండి కడు ♦ నేర్పుగ బుద్ధి రచించె నాఁడు వా
ల్మీకిమునీంద్రుఁ డీకథ ల ♦ మేయఫలంబిడు నెందునన్ మహా
వ్యాకులమున్ హరింపఁదగు ♦ నన్నిజగంబులలోన భావుకా
నీకములన్ ఘటించు నిది ♦ నిక్కము నీకనుమాన మేటికిన్. 292

శా॥ సారప్రజ్ఞలఁ గూర్చు శ్రోతలకు వాం ♦ ఛాస్ఫూర్తి నీడేర్చు భా
గీరథ్యాపగవోలెఁ బంకమణఁచున్ ♦ గ్గ్రైవతానూపుర

స్ఫారారావముఁ గూర్చుఁగర్ణములకున్ ♦ భవ్యంబులం జేయు నీ
శ్రీరామాయణకావ్యరత్నమిలలో ♦ శ్రీజానకీనాయకా. 293

ఆ॥ వె॥ తత్తరంబువీడి ♦ యుత్తరకాండమా, మొదల వినుఁడుఁదాప ♦ మడఁగుఁ జిత్త
ముధికనిర్మలమగు ♦ ననివారిజాసనుం, డనవుడట్లయనుచు ♦ నాత్మలోన. 294

గీ॥ కోపమునుమాని శ్రీసూర్య ♦ కులవిభుండు, ననుజుచేతికి శరశరా ♦ సనములియ్య
నలరి వానిని వినుతించి ♦ జలజభవుఁడు, మునిబుధులుగొల్వ నిజలోక ♦ మునకుఁజనియె.

కం॥ ఆసమయంబున నట వీ, ణాసముదాయములు మ్రోసి ♦ నగతిన్వినఁగన్
శ్రీసీతాదేవియునన్, క్ష్మాసతిదరినుండి యొక్క ♦ మాటవినఁబడెన్. 296

శా॥ రామాధీశ్వర! దుఃఖమేటికి రమా ♦ రామామణీరత్న మీ
భూమిన్ సీతగఁబుట్టి తామరసనా ♦ భు న్నిన్నుఁ జేపట్టి నీ
వై ముఖ్యంబుఁ గడన్ భరింప కిటులన్ ♦ భవ్యాంచితాత్మీయమా
ధామంబుం గనె నీదురాకమదిలోఁ ♦ దాఁగూర్మిఁ గాంక్షించుచున్. 297

సీ॥ క్రియయును మేధయుం ♦ గీర్తియు ధృతియును, శక్తియులజ్జయు ♦ శాంతియు దయ
యునుఁ దుష్టియునుఁ బుష్టి ♦ యునుజానకియెసుమ్ము, తన్నైమిథిలిమనో ♦ దయితుఁడవగు
నీనెదైవంబవు ♦ నేతవుమీరిర్వు, రునుఁ దల్లిదండ్రులై ♦ ఘనతరదయ
సకలలోకాధిర ♦ క్షణమొనర్చుచునుందు, రెల్లకాలములనే ♦ యింతిచరణ

గీ॥ శోణకాంతిహరిత్పాల ♦ సుందరీక, దంబసీమంతములఁజెంది ♦ రంబుపగిది
దనరునేయింతిచూపద్ధి ♦ జనవితాన, నిఖిలదౌర్గత్యమునణంచు ♦ నఖిలగతుల. 298

కం॥ ఆలక్ష్మీదేవియు నీ, తాలలనామణివిధంబుఁ ♦ దమితోనిను భూ
పాలగ్రామణి కొన్నా, ళ్లిలీల భజించె నాత్మ ♦ నెంచుముదీనిన్. 299

చ॥ క్షితిసుత నెంచి యింక వెతఁ ♦ జెందకుమో రఘురామ యామెయుం
దతిశయమైన నీదగు ద ♦ యారస మిక్కువలందు నుంచుమా
శతధృతి సెప్పినట్లిపుడుఁ ♦ జక్కఁగ నుత్తరకాండమంతయున్
హితమతితోడ వీరలు ర ♦ హిన్వినుపింపఁగ విన్మనావుడున్. 300

—* రాముం డశ్వమేధయాగంబుఁ బరిసమాప్తిఁ జేయుట. *—

ఉ. ఆపలుకుల్ చెవిం బడఁగ ♦ నంతట ధైర్యముతో రఘూత్తమ
క్ష్మాపతి నాకసంభవునిఁ ♦ గన్గొని మీపలుకుల్ వినంగ ని
త్తాపసులీ ధరాధిపతి ♦ తండము గోరుచునున్నవారికన్
రేపటినుండి మీకరుణ ♦ నివ్వటిలన్ జదివింపు వీరలన్. 301

క. అనివర్ణించి మనంబున నతిశయరాగమొంది ♦ పుత్త్రికులం దో
డ్కొని మఖశాలకుఁ జనియెన్, వనజాప్తకులేంద్రుఁడంత ♦ భానుఁడు గ్రుంకెన్.

ఉ. ఆనిశి భూసుతాంచితగు ♦ ణాతిశయంబుల నెంచుచు న్మదిన్
మానవనేత నిద్రయను ♦ మాట యెఱుంగక యుండి వేకువన్
దానము సందెయుం జపము ♦ ధర్మవిధానము లాచరించి యా
స్థానముఁ జేరి సర్వముని ♦ జాలముల న్నివసించి మీఁదటన్. 303

గీ॥ స్రుతులు వీణామనోహర♦శ్రుతులు బెరయ, శ్రుతుల కింపని మునులిలా♦పతులు
మెచ్చఁ గతిపయదినంబు లుత్తర♦కాండకథలు, వారు పూర్తిగఁ జదివిర ♦ ధ్వర
ము నయ్యె. 304

ఉ॥ ఆతఁడె ఋత్విగాదులకు ♦ సంచితదక్షిణలిచ్చి యాచక
వ్రాతము కోరినట్లు తగు ♦ పద్ధతి దానములిచ్చి ధారణీ
నేతల వానరాళి రజ ♦ నీచరులం దగుభూషణాదులన్
బ్రీతులఁ జేసి పంపె ధర♦ ణీవిభుఁ డందఱ నర్హరీతులన్. 305

గీ॥ ఇటులఁ గృతకృత్యుఁడై ధార♦ణీశ్వరుండు, ధరణిజావిరహాగ్నిసం♦తప్తచిత్తుఁ
డగుచు ననుజులుబంధుహి♦తాప్తులెల్లఁ, గొల్వ సాకేతపురమున♦ కుఁ జనియెచట.

మ॥ నయమార్గంబున రాజ్యమేలె ధరణీ ♦ నాథుండు గీర్వాణస
త్ప్రియకార్యంబుల సల్పుచున్ సకలధా ♦ త్రీదేవతాపాళికి
చ్ప్రియమోదంబు ఘటించుచున్ సకలదు ♦ ష్టశ్రేణి నుగ్గాడుచున్
దయతో నర్థిహితంబుఁ గూర్చుచు ననా ♦ థవ్రాతముం గాచుచున్. 307

మ. నెనరొప్పన్ బహుళాశ్వమేధముల న ♦ గ్నిష్టోమయాగంబులన్
ఘనగోమేధమహాతిరాత్రమఖసం ♦ ఘాతంబులం బౌండరీ
కనికాయంబుల వాజపేయతతులం ♦ గావించె గాంగేయభూ
తనయారత్నసమేతుఁడై రఘుకులా ♦ ధ్యక్షాగ్రగణ్యుం డిలన్. 308

చ॥ ఇల ధరణీజవంటివన ♦ జేక్షణపోయిన మీఁద రాముఁడ
వ్వలఁ దితమిం జెలంగి మదిఁ ♦ బాయనిచింతల నెవ్వ రెన్నిభం
గుల వచియించిన న్వినక ♦ క్షోణిజఁబోలు సువర్ణవిగ్రహం
బలరఁగఁ జెంతనుంచుకొని ♦ యన్నిమఖంబులఁ జేసి భక్తితోన్. 309

గీ॥ ఇటుల ధర్మానువర్తియై♦ యెఱిమిఁ జూచు, ప్రజలనందఱఁ గాచుచుఁ♦బరమభక్తి
శాలియై యజ్ఞకోటుల♦సలిపి యచట, శ్రీరఘుస్వామి రాజ్యంబు ♦ సేయుచుండి.

చ. మఱువఁగనేర్తు లోకమున ♦ మానవులాడినయట్టిదూఱులన్
మఱువఁగనేర్తు నాశ్రితులు ♦ మాటికిసల్పిన తప్పులన్నియున్
మఱచిన మర్వరాక మది ♦ నాటినతద్విరహాతిశోకమున్
మఱువఁగనేఱఁ డా సుగుణ ♦ మాన్యుఁడు శ్రీరఘురాముఁడెంతయున్. 311

గీ॥ మంత్రిగురుహితబంధుసా♦మంతముఖులు, పృథివినేలుమటంచని ♦ వినుతిసేయ
నొప్పి శ్రీభూమిపుత్త్రికే ♦ కున్నకతన, సన్నియుఁ గొఱంతలైతోఁచె ♦నవనిపతికి.

గీ॥ ఒంటిగానున్న వేళల♦ నుత్పలాక్షిఁ, దలఁచి దుఃఖించు రఘుకులా♦ ధ్యక్షుఁడెపుడుఁ
గొలువులోనున్న వేళలఁ♦గొడుకులఁగని, క్షితిసూతారూపముఁదలంచి♦ వెతలఁగాంచు.

——* కౌసల్యాసుమిత్రాకైకలు దివమున కేగుట. *——

సీ॥ రాజ్యంబుసల్పు శ్రీ♦రామచంద్రుని మహైశ్వర్యంబు నేత్రోత్స♦వముగఁజూచి
భూరిదక్షిణలతోఁ♦బుత్త్రుండు సల్పిన, గంధర్వమేధాది ♦ కములఁ గాంచి
యవ్వయంచనిపూజ♦లాచరించెడు కృపా,పరులం గుశలవాది♦పౌత్త్రులఁ గని
క్షితిజపోయిన వెతఁ ♦ జెందనీయకకొల్చు,నట్టి సాధ్వుల నూర్మి♦ళాదులఁ గని

గీ॥ యెల్లబాంధవులం గాంచి♦యిహసుఖంబు, లెల్లఁగని మానసంబున ♦ నెలమితోడ
నపుడుఁగౌసల్య నిజకాంతుఁ♦డలసుచున్న, లోకమున కేగెఁ బుత్త్రిలు♦శోకమొంద.

క. తల్లీ రామారత్నమ,తల్లీ మము వీడిపోవఁ ♦ దగునె యటంచుం
దల్లడిలి రాముఁడంతటఁ, దల్లికి నపరక్రియల య ♦ థావిధిఁ జేసెన్. 315

సీ॥ ఆత్మకాంతునికడ♦కామెపోయిన యొక్క,పక్షంబులోఁ గేక♦యక్షితిపతి
పుత్రియు న్విభునిదా♦పునకేగె నంతలో, పలఁ గొన్నివాసరం♦బులకుఁ గాంతుఁ
జేరె న్సుమిత్రయు♦శ్రీరామచంద్రుఁ డం,తట వారిఁ దలంచి♦తల్లడిల్లి
రత్నాభరణనిక♦రంబులు కనకము, గ్రామంబులు మహిని♦ర్జరవరులకు

గీ॥ వారలంగూర్చి యొనరించు♦పారలోక, విధులసమయంబున నొసంగె♦వివిధదాన
ముల నిఖిలయాచకకదంబ♦మున కొసంగి, సత్కృపామతిరాజ్యంబు♦సలుపుచుండె.

——♦ లక్ష్మణుఁడు రామపరిత్యక్తుండై దివంబున కరుగుట. ♦——

సీ॥ ఇవ్విధంబున రాజ్య ♦ మేలురాఘవునిచే, సౌమిత్రిగొన్నివా♦సరములకట
త్యక్తుఁడై వాహినీ♦తండోత్తమంబైన,సరయూతరంగిణీ♦కరుగుదెంచి
క్రుంకి తన్నదిలోనఁ ♦ గురుయోగముందాల్చి, తనదుతొల్లిటిరూపుఁ♦ దలచునంత
లోన గంధిలమహా♦సూన వృష్టిఁగురిపిం, చుచువచ్చి నిర్జర♦స్తోమవిభుఁడు

గీ॥ కాహళాదికములు మ్రోయఁ గబుధవేశ్య, లాడనాతని మేనితో నమరపురికిఁ
దోడుకొనిపోయెనచట బుధులనుతింపఁ, బంకజదళేక్షణుని చతుర్భాగమనుచు.

సీ॥ ఈరీతిగివమున కేగిలక్ష్మణుఁడు నిర్జరులచేనచట న ర్చనలఁగాంచి
నిత్యముక్తాశ్రయ నిలయంబుఁజేరఁ బిమ్మట వసిష్ఠాదిక మౌనులఁగని
లక్ష్మణుంబాసి ని ల్వఁగలేనిఁక భరతు, నీయయోధ్యాపురి నేలునట్లు
ఘటియించిదేవలో కగతుండనై లక్ష్మ, ణునిఁజూడ నేగెద ననవుఁడువిని
గీ॥ భరతుఁడన్నకుఁ గేల్మోడ్చి ధరణినాథ, మిముమవిడిచియుండు నేకానఁ దమివహించి
కోసలాధీశుఁ జేయుము కుశుని లవునిఁ, జేయుముత్తరకోసల క్షితివిభునిఁగ. 318

కం॥ అనిపల్కు భరతువాక్కుల, వినిమీఁద వసిష్ఠమౌని వీర్యాఢ్య హితా
ప్తనికరబాంధవమంత్ర్యా, దినివహమును బిల్చి మిగుల దివ్యప్రీతిన్. 319

—* రాముండు గుశలవులకుఁ బట్టముఁగట్టుట. *—

కం॥ కోసలదేశమునకుఁబతిఁ, జేసెఁగుశుఁన్ సుగుణవంతు శ్రీమంతుఘనున్
వాసింగాంచిన యుత్తర, కోసలమునకుఁబతిఁజేసె గుణవంతులవున్. 320

చ॥ పురయుగమిట్లు సేసి నిజపుత్త్రులఁ బంపుతరిన్ రఘూద్వహుం
డిరువురకున్ సమానముగ నిచ్చెశతాంగహయాదిపాళి సు
స్థిరకరుణాత్మ భూమిజ మ దిం దలపోసి కవుంగలించి త
చ్ఛిరముల మూర్కొనెన్ గుణవి శేషములం దలపోసి మీఁదటన్. 321

ఉ॥ వారలు రామభూమిపద వారిజయుగ్మనఖప్రభ ల్నిజ
స్ఫారలలాటభాగమున సారసురేఖల నంటమ్రొక్కుచుం
జేరువ నిల్చి దీవనలఁ జేకొని పిద్కొని బాష్పవారిసం
పూరితనేత్రులై చనిరి భూపుఁడొసంగిన చోట్ల కయ్యెడన్. 322

—* శత్రుఘ్నుఁడు నిజకుమారులకుఁ బట్టముఁగట్టి రామునికడకు వచ్చుట. *—

సీ॥ పిదప శత్రుఘ్నుఁ బలపింప నాతండు, తగుభూములందు నం దనుల నిలిపి
వచ్చి యారఘుకుల స్వామి మిమ్ముఁ బ్రీడి, క్షణకాలమిటనుండఁ జాలననుచు
వేడ నారఘురామ విభుఁడు రమ్మనె నవ్వ, డనుచరులేగి రా మానవేశు
నూర్ధ్వలోకగమనం బుల్లాసమునఁ జెప్ప, వానరభల్లూక దానవులు వి
గీ॥ ని నిజనాథులఁగూడియా నిమిషమున న, యోధ్యకే తెంచి భూమిపా లోత్తముఁగని
మ్రొక్కి శ్రీరఘునాథ మిమ్ములభజించు, నమ్ముల నిట విడిపోవ సమ్మతమె మాకు.

చ॥ అని వినుతించుకాలమున ♦ నర్కసుతుండు నమస్కరించి యో
ఘనసరసీజమిత్రకుల ♦ శరధిసుధాకర కీశరాజ్యనా
థునిగ నొనర్చి వాలిసుతుఁ ♦ దోషముతో మిముఁ గొల్వవచ్చితిన్
నను నెడఁబాసి పోవలద ♦ నన్ రఘురాముఁడు సంతసించెడిన్. 324

శా॥ ఆలోనం గరము ల్మోగిడ్చి దనుజా ♦ ధ్యక్షుండు విచ్చేయ భూ
పాలుం డాతనిఁ జూచి దైత్యపతి యీ ♦ భావంబు నీకేటికి
లీల న్నీవల లంక నేలుము సురా ♦ ళిం ధర్మమార్గంబునన్
హాళిన్ నెయ్యము మర్వఁబోకు మెదలో ♦ నాచంద్రతారార్కమున్. 325

కం॥ అనిన రఘూత్తమశాసన, మునకు వెఱచి యూరకుండెఁ ♦ బుణ్యజనవిభుం
డినకులుఁ డంతటఁ బవనజుఁ, గని యిట్లనిపల్కెనధిక ♦ కరుణాన్వితుఁడై. 326

సీ॥ అంబుజాప్తదయాస ♦ మానాదితశ్రుతి, స్మృతివిశేషరహస్య ♦ సింధువదధి
కాధ్యాత్మతత్త్వవి ♦ ద్యానిరూఢమతివి, బ్రహ్మచర్యవ్రత ♦ ప్రవరుఁడవుభ
విష్యద్విధాతవు ♦ విమలాత్మకుఁడవుమ, త్కీర్తిచంద్రికలు ప్ర ♦ థ్వీతలమున
నెందాఁక రాజిల్లు ♦ నందాఁక భవదీయ, కాయంబమృతగతిఁ ♦ గాంచినిల్చు

గీ॥ నిజము నావచనంబులు ♦ నెగడుచుండు, నీదుకోర్కులు ఫలియించు ♦ నిత్యుఁడవగు
మింక నేమియుఁ బలుకకు ♦ మిపుడుఁ బవన,తనయ యనిపల్కె రామభూ ♦ ధవుఁడు పిదప.

గీ॥ బ్రహ్మమానససుతు జాంబ ♦ వంతుఁ గాంచి, నీవు చిరకాలజీవివి ♦ నిర్మలుఁడవు
కలఁగ కెప్పటికీతిగా ♦ నిలువుమనని, ననుచు మైందద్వివిదులఁ గాం ♦ చినరవిభుఁడు.

—♦ శ్రీరాముఁడు తమ్ములతోఁ, బౌరులతో సరయూనదిఁ బ్రవేశించుట ♦—

సీ॥ అతిదయాత్ములగు మీ ♦ రమృతపానముఁ జేసి, నట్టివారలుగాన ♦ హానిమీకుఁ
గలుగదు చిరకాల ♦ మిలవసింపుఁడటంచుఁ; దక్కిన కీశసం ♦ తతులు నాబ
డిఁ జనుదెంతురటంచు ♦ శివితో వచియించి, కల్యాణమిఁక నింత ♦ కంటెఁ గలదె
యని బంధుమంత్రి హి ♦ తాప్తులెల్లను పౌరజాలంబులాత్మలో ♦ సంతసించి

గీ॥ బంధములుదీరె మనతపః ♦ ఫలములొదవె, నెప్పుడా రామచంద్రుతో ♦ నేగువార
మనుచు జనములు సేవింప ♦ నపుడు రామ,ధరణినాయకుఁడు సరయూ ♦ తటముఁ జేరె.

ఉ॥ అన్నది కయ్యెడ న్వనరు ♦ హాసనుఁ డింద్రముఖాష్టదిక్పతుల్
కిన్నరయక్షకింపురుష ♦ ఖేచరగుహ్యకసిద్ధసాధ్యకు
ల్పన్నగసంచయంబు లల ♦ బ్రహ్మమునీంద్రులు గొల్వ దీప్తిసం
పన్నవిమానముల్దెసల ♦ భాసిలవచ్చి కృపాంతరంగులై. 330

సీ॥ దేవాధినాథభే ♦ రీవారనినదంబు, లాకసంబొరసె న ♦ త్యద్భుతగతి
నప్సరఃకామిను ♦ లాడిరి గంధర్వ,తతులు పాడిరి కల్ప ♦ తరుసుమములు
జడివట్టినట్లుగా ♦ వడివడిం గురిసె స్మే,రసరోచనుండు శ్రీ ♦ రామవిభుండు
సరయూనదిం జొచ్చె ♦ సహజన్మముఖులతో, నపుడు శ్రీరామము ♦ ఖాంబుజముగ
గీ॥ తనదువీక్షణాలోలంబ ♦ తతులు దార్కొ,నన్సరోజాసనుండు వా ♦ ఙ్నలినలోచ
నాంఘ్రినూపురనాదంబు♦లట్లదివివ,సించి యిట్లని తా సన్ను ♦ తించెమిగుల. 331
ఉ॥ ఈయఖిలప్రపంచమున ♦ కీవెవిభుండవు రామచంద్ర నీ
మాయ నెఱుంగ మాకగునె ♦ మానవ రూపముఁవీడి యాదినా
రాయణమూర్తి వైభటచ ♦ యంబు భజింప ఖగేంద్రు నెక్కి వేం
చేయుము కాలయాపనము ♦ సేయఁగ నేటికటంచుఁబల్కినన్. 332
కం॥ శ్రీరామజానకీమణి, శ్రీరామభవత్పదంబుఁ ♦ జేరియుసందే
హీరాకఁగోరుచున్నది, శ్రీరామేప్సితముఁదీర్పఁ ♦ జేరుముకరుణన్. 3 3
కం॥ అని వక్కాణింపఁగ విధి, విని రామవిభుండుపిదప ♦ విశ్వనుతలస
ద్ఘనలీలారాజితమగు, తనరూపము నాత్మలోనఁ ♦ దలఁచిన యంతన్. 334
సీ॥ ద్యుమణికోటి ప్రభా ♦ సముదయంబుల మించు, ఘనకిరీటము మౌళిఁ♦గానుపించె
ఘనవిలాసి ప్రభా ♦ గణముతో దనరు నా,జానులంబి చతుర్భుజములుదోచె
దైతేయులకు సుర ♦ త్వంబిచ్చు శంఖచ,క్రగదాసిశార్ఙ్గాది♦కంబులలరె
ఘనకాంతిరాజిత♦ కౌస్తుభశ్రీవత్స, ములతో నురంబులీ♦ లలవహించె.
గీ॥ ధాతఁగనినట్టి నాభిప ♦ ద్మంబువెలసెఁ, గనకచేలంబు గటితం♦బున రహించెఁ
బొలిచె నవయువముల దివ్య ♦ భూషణములు, సకలలోకముల య్యెడ♦సంతసించె.
గీ॥ ఇటుల నాదినారాయణా ♦ కృతివహించి, సకలనిజసేవకగణంబు♦ సన్నుతింప
గరుడవాహనమెక్కి ♦ లోకములు మెచ్చ, రాముఁడత్తరి వైకుంఠ♦ధాముఁడయ్యె.
మ॥ అపుడున్ ధాతృదిశాధిపాలవసుసా ♦ ధ్యాదిత్యసిద్ధుల్రమా
ధిపు లోకావళిపూజ్యసుందరమహా ♦ దివ్యాంగసౌభాగ్య స
చ్ఛవిబట్టిం దిలకించుచుం గడు నమ ♦ స్కారంబులం జేసి శ్రీ
ర్షపరీతాంజలులై నుతించి రధిక ♦ ప్రౌఢార్థశాల్యుక్తులన్. 337
కం. మొరసెన్ నిర్జరభేరుల, గురిసెన్ దివ్యకుసుమముల♦కుంఠితగతి న
చ్చరలాడిరి పాడిరి తుం, బురులాంగరుడాధిరూఢు♦ ప్రోలన్నిగులన్. 338
గీ॥ భరతశత్రుఘ్నులిరువురుఁ ♦ బంకజాస, నాదికులు గాంచుచుండ♦ నయ్యవసరమున
నధికనిర్మలతేజోమ♦యాత్మలగుచుఁ,గలసిరాహరిదివ్యవి♦గ్రహమునందు.

కం॥ సరయూనదిఁజొచ్చి దివా, కరజుఁడు రవిలోనఁగలసెఁ♦ గలసెం గ్రతుభు
గ్వరశిల్పిలోనలుఁడు గల, సె రహిఁ గీలుండు బలుఁడు♦ శిఖిలోనపుడున్. 340
కం॥ ఏయే విబుధవరాంశము, లేయేకపులూనిపుట్టె ♦ రిలలోపలము
న్నాయావానరసంఘము, లాయా వేలుపులఁగలసి♦ రద్దేవాజ్ఞన్. 341
గీ॥ గరుడగంధర్వయక్షకి♦న్నరగగనచ, రాది దేవాంశములఁ గల్గి ♦నట్టి ఋక్ష
వానరాదిబలంబులు ♦ వారివారి, రూపములలోనఁ గలసిరి♦రూపులవిడి. 342
మ॥ గరుడారూఢరమాధినాథునెదుటం ♦ గన్గొంచు నానాజనుల్
సరయూప్రోదినిఁజొచ్చి ముక్తతనులై ♦ సద్రూపముల్గాంచి యు
ద్ధురదివ్యాత్మ మహావిమానతతులం ♦ దుం బుత్త్రమిత్త్రాప్తసో
దరపత్న్యాదులతో వసించి రధికో ♦ ద్యన్నిర్జరాకారులై. 343
సీ॥ పశుకీటకక్రిమి♦పక్షిభూధరలతా, భూజంబు లల సర♦యూజలముల
నిక్షిప్తదేహులై♦ యక్షయదేవత్వ, మొందిరంచితవారి ♦ జోదరుదయ
నంతనారాయణుం♦డబ్జుఁగాంచి విరించి, తనకు నీప్రాణులం♦దరిలఁబాసి
ఘననిత్యపదచింతఁ♦గాంచి నావెంట వ, చ్చిరిమాకు వీరలె♦ల్లరును బ్రాణ
గీ॥ ములుగఁ జింతించి సత్కృపా♦మూర్తివగుచు వీఁకసౌఖ్యప్రదోపరి♦లోకములని
లుపుమనుచు నతికారుణ్య♦లోలుడై వ, చింపగనపుడు నలసుర♦జ్యేష్ఠుఁడెలమి. 344
సీ॥ ఆపశుప్రముఖతి♦ర్యగ్జంతు తతులతో, నమరత్వము వహించి♦నట్టి జనుల
సత్కృపామూర్తివై♦ సత్యలోకముచెంత, ఘనతరభోగభా♦గ్య నివహములఁ
గడునై భవంబులఁ♦గన్పట్టుసంతాన ♦ లోకంబులన్నిల్పె లోకవిభుని
కారుణ్యతకు శిరః♦కంపంబుఁ గావించు, చునపుడు భక్తితో♦ననిలజాంగ
గీ॥ దులు సురవిభుమైందద్వివి♦దులును ఋక్ష, విభుఁడు భువిలోవసించిరి♦విశ్వనాథుఁ
గొలిచి తక్కినవారలు♦ కుతుకమూని, చనిరి సద్భక్తిపూరిత♦స్వాంతులగుచు. 345
గీ॥ నృపుఁడు సరయూనదికి వచ్చు♦నపుడు భల్ల, వానరులలీల వచ్చిన♦వారలెల్ల
రతఁడు నాదినారాయణుం♦డై నిజపురి, కరుగ దేవతలైపోయి♦రధికరుచుల. 346

—♦ శ్రీరాముఁడు వైకుంఠధామమునకు వేంచేయుట. ♦—

గీ॥ ఇటులనమ్మిన ప్రజలకు♦నెల్ల సద్గ, తులిడు బ్రహ్మాదులిరుపార్శ్వ♦ములఁగొలువఁగ
గరుడవాహనారూఢుఁడై♦ పరమపదముఁ, జేరెమదిలోన మోదమే♦పారనపుడు.
సీ॥ ఫలములఁగోరక♦ వరనిజాంఘ్రులఁగొల్చి, తపములఁగావించు ♦ ధన్యమతులు
నారాయణ సమర్పణ♦మటంచు సర్వయ, జ్ఞములఁగావించిన ♦ శాంతనిధులు

నారాయణ జనార్ద♦న ముకుంద హరియంచుఁ, దనను ధ్యానించెడు♦ దాంతియుతులు
తీర్థయాత్రలకేగి ♦ దివ్యస్థలంబుల, దేహంబువిడిచిన ♦ ధీరమతులు
ఆ॥ వేయితులసీదళములెంచి ♦ వేయినోళ్ల, దినదినంబున స్వార్చన ♦ ల్చిన కృతార్థు
లచట సద్భక్తిపూర్ణచి ♦ త్తాబ్జులగుచు, నెదురుకొనిపూజలిచ్చిన♦ నెలమిఁగాంచి.
గీ॥ సలలితాఖిలద్వారసం ♦ చయముఁ గడచి, భక్తవర్యులఁ దగినట్టి ♦ భాషితముల
మెప్పులం జేసిమీఁదసం♦ తుష్టుఁడగుచు, సప్తమద్వారగతుఁడైన ♦ హరినిఁ గాంచి.
చ॥ ఎదురుగవచ్చి కల్కిచెలి ♦ హేలల మీఱు మెఱుంగుచూపులన్
మొదటనివాళినిచ్చి తన ♦ నోములుపండెనటంచుఁ జేర్మి తా
సుదతుల వెంటఁ బెట్టుకొని ♦ సుందర హేమవికారపాత్రికా
సదమలరత్నదీపికల ♦ శౌరికి నారతులిచ్చె నయ్యెడన్. 350

మ॥ కలితాంభోధిసుతాకరాంబుజముసోఁ ♦ కన్ మైగగుర్పార న
జ్జలజాక్షుండతిసాత్త్వికేక్షితుఁడునై ♦ సంతోషమేపార న
వ్వల సత్సాత్త్వికమూనెఁ బక్షిపతివి ♦ ష్వక్సేన శేషాధినా
థులునాత్మీయవిలాసవైఖరుల సం ♦ తోషింప వీక్షింపుచున్. 351

గీ॥ కుటిలకుంతల భార్గవిఁ ♦ గూడిపార్శ్వ, కముల వైష్ణవీతతులాడి ♦ గములు సేయ
నాదినారాయణుండుర ♦ త్ననికురంబ, రాజితాత్మీయవరమంది ♦ రంబుఁ జేరె.
సీ॥ లలితకాంతులతోఁజె ♦ లంగు బ్రహ్మానంద, మయమగు కాంచన ♦ మంటపమునఁ
జిత్రరత్నశ్రేణి ♦ చిత్రితభద్రాస, నంబుపైనివసించి ♦ డంబుమీఱ
శ్రీదేవినురమున ♦ మేదినీనీళల, నిరుపార్శ్వకంబుల ♦ నిడుకొని తమి
సర్వాధిరాజవి ♦ ష్వక్సేనగరుడాది, కులు భక్తిపూర్ణులై ♦ కొలుచుచుండ
గీ॥ సర్వభోక్తృత్వకర్తృత్వ ♦ సర్వపాల, కత్వవిజ్ఞత్వనిఖిలహే ♦ తుత్వశక్తి
యుక్తుఁడై మించిసరసీరు ♦ హోదరుండు, నిండుకొల్వుండెనప్పుడు♦ నీలగళుఁడు.

—* శివునితో నారాయణుండు రామచరిత్రమహిమం దెల్పుట. *—

గీ॥ పెక్కువితులఁ జేయగాఁ ♦ బ్రీతినపుడు, వానికిట్టులఁ బల్కెన ♦ వ్వారిజాక్షుఁ
డధికకరుణారసాదిపూ ♦ ర్ణాత్ముఁడగుచుఁ, బరమవర్షాంబుదగభీర ♦ భాషితముల.
మ॥ గిరిజాధీశ్వర నీవు నిర్వ్యాజుఁడు నీ ♦ గీర్వాణనాథాదిది
గ్వరులికిన్నరసిద్ధసాధ్యసురయ ♦ క్షశ్రేణులీరీతివా
నరరూపంబులుదాల్చి వైరిహతికిన్ ♦ సాయంబుఁ గావించుటన్
సురవైరీంద్రుఁడు నీల్గెఁ జాపసమున ♦ క్షోభంబుఁ దీరెన్మహిన్, 355

ఆ॥వె॥ శిష్టరక్షణంబు ♦ దుష్టశిక్షణ మెప్ప, డవనిఁ జేయుకొఱకు ♦ నవతరించి
మహితమత్కథాళి ♦ మహిమ చేజనముల, పాపము లణగింతు ♦ పాలనయన. 356

శా॥ శ్రీరామాయణపుణ్యనామకకథా ♦ శ్రేణు ల్ప్రసంగించినన్
బారీణత్వముతోఁ బఠించినమదిన్ ♦ ధ్యానించి యాలించినన్
సారప్రజ్ఞలు భోగభాగ్యములు స ♦ త్సౌభాగ్యజాలంబు సే
కూరున్ మానవకోటి కెప్పుడయినన్ ♦ క్షోణిన్ భవానీశ్వరా, 357

గీ॥ అనిభవానీశుతోఁ గృప ♦ నానతిచ్చి, యజముఖామరముఖ్యుల ♦ నాదరించి
పిదపనందరవీడ్కొని ♦ ప్రియకళత్రములుముగురుగొల్వహరియంతి♦పురముసొచ్చి.

శా॥ శ్రీరామామణి నుంచి వక్షమున ను ♦ ర్వీదేవిపై బాళిచె
ల్వారన్ దాఁ గరపంకజంబునిచి నీ ♦ ళాబ్జేక్షణాసక్తులన్
చారుశ్రీయుతహస్తముంచి ఫణిరా ♦ ట్పర్యంకం బ్రవేశించి శ్రీం
గారైకాధికలోలుఁడై మనములో ♦ గాంచెన్ మహామోదమున్. 359

గీ॥ రూఢమన్మథశతకోటి ♦ రూపవిభవ, మొనఁగనిట్టులనాదిభో♦గీశ్వరస్ఫు
టాళిపైనొరగినుముదం ♦ బందెనుగుణ, శీలుఁడధికసౌఖ్యసైక ♦ లోలుఁడగుచు.

గీ॥ ఇటులనైసర్గికవిభవం ♦ బెసఁగ బాళి, శ్రీమహీనీళ... ♦ శేషవిశ్వ
రాదిదాసులఁగాచుచు ♦ నలరుచుండె, నఖిలలోకేశ్వరుండు నా ♦ రాయణుండు.

## ప ఠ న శ్ర వ ణ ఫ ల ము.

గీ॥ ఈమహాకావ్యమతిభక్తి ♦ నెవ్వఁడువిను, నాతఁడిహమునఖిలసౌ ♦ ఖ్యనికరంబ
కములఁగని మీఁదటఁ బునరా♦గమనరహిత, శాశ్వతబ్రహ్మలోకవా♦సంబుఁగాంచు.

సీ॥ ఇదిజగత్త్రయమాన్య ♦ మిదిబుధాళిశ్రావ్య, మిదిదివ్యమంగళ ♦ ప్రద మిదిమహి
తాఘాళినాశనం ♦ బాదికావ్యం బిది, విప్రుండుసదువవా ♦ గ్విదుఁడనఁదగు
భూపాలుఁడుపఠింప ♦ భూనాయకుండగు, వైశ్యుండుపఠియింప ♦ వర్తకఫల
శాలియైమెతగు పాద ♦ జాతుండుపఠియింప, వంశంబులోపల ♦ వాసిఁగాంచు

గీ॥ నఖిలనిగమంబులుపఠింప ♦ నగుఫలంబు, నఖిలదానంబులురచింప ♦ నగుఫలంబు
నఖిలతీర్థయాత్రాదుల ♦ నగుఫలంబు, నొదవు నీగాథ సుంతైనఁ ♦ జదివినంత,

క. ప్రత్యక్షరమున నానా, హత్యలు హరించు నెపుడు ♦ నతిముదమమరన్
బ్రత్యక్షంబగు మోక్షము, సత్యంబీరామకథలు ♦ చదువునరులకున్. 364

క. ఎందాఁక నలరు నిగమము, లెందాఁకఁ జరించు సూర్యుఁ ♦ డిందుఁడు దివమం
దెందాఁక నుండు తారక, లందాఁకఁ జెలంగు నిమ్మ ♦ హాకావ్య మిలన్. 365

ఆశ్వాసాంతము.

మాలిని. సరససుగుణజాలా ♦ సర్వలోకైకపాలా
దురితహరణశూరా ♦ దుష్టదైత్యాపహారా
సురవరనుతకీర్తీ ♦ సుందరానంగమూర్తీ
పరమపదవిహారా ♦ భక్తపీడాపహారా. 366

గోమూత్రికాబంధము.

క. నలినేక్షణ వరభూషణ, లలితకనకధామ సకల ♦ లక్షణశాలీ
బలిశిక్షణ వరభూషణ, లలితకనకదామ సకల ♦ లక్షణమాలీ. 367

చక్రబంధము.

శా॥ సత్యా(నా)థ వి(య)త్పదాబ్జ జగదా ♦ చా(ర్య)ప్రవీ(ణ)స్థిరా
నిత్యా(రా)ధ్య య(నం)తశాయి జగదా ♦ నీ(క)స్తుతా (కృ)ష్ణభా
సత్యా(య)త్త కృ(తా)ర్థనామ జగదీ ♦ శా (వి)క్రమా(త్రి)స్థిరా
రాత్యగ్నీ సదయానిరూఢసదనా ♦ రాధానుభావాకరా. 368

—♦ గద్యము. ♦—

ఇది నారాయణకరుణాప్రసాదలబ్ధ చతుర్విధకవిత్వచాతుర్య
శతావధానిత్యాదిబిరుదాంకిత రత్నాకరవంశపయః
పారావారరాకాసుధాకరగౌతమగోత్రోద్భవ
వైఖానససూత్రానుష్ఠానపర రంగాచార్య
పుత్ర గాజమాంబావధూటికాగర్భశుక్తి
ముక్తాఫలానంతార్యకవిప్రణీతంబగు
నిర్వచనకుశలవాభ్యుదయకావ్య
మున తృతీయాశ్వాసము

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

# కఠినపద్యములకు టిప్పణము.

## ఆ ౧—౫౮ పద్యము.

1. ఆర = పాదరసము, తార = వెండి, హార = ముత్యాలహారము, అబ్జజాత = ఐరావతము, అబ్జ = శంఖము, అబ్జ = ఉచ్చైశ్శ్రవము, కర = శ్రేష్ఠమగు, కర = కాంతులకు, అబ్జ = నిధియగు అబ్జాబ్జ = అమృతనిధి, కర = పడగండ్లు. వీటియొక్క విలాసమువంటి విలాసముగలది.
2. ఆర = అంగారకుఁడు, తా = త = కోపముకు, ఆ = స్థానమగు రాక్షసులకు, ర = వీతిహోత్రుఁడగు హార = దేవేంద్రుఁడు, అబ్జజాత = అగ్నియందుఁబుట్టిన, అబ్జ = కుమారస్వామి, అబ్జ = అగ్ని కర = శ్రేష్ఠమగు, కర = కిరణములకు, అబ్జ = నిధియగు, అబ్జ = సూర్యుఁడు, అబ్జకర = శివుఁడు, వీరలయొక్క విలాసమువంటి విలాసముగలది.
3. ఆ = శ్రేష్ఠమగు, ర = వజ్రములు, తార = పరిశుద్ధమగు హార = మౌక్తికములు. అబ్జ = బంగారము వీటియొక్క జాత = పుట్టకక, అబ్జ = సముద్రమువంటి, అబ్జ = నిధి, కర = హస్తమంనుగలకు బేరుని, కర = కాంతలకు, అబ్జ = నిధియగు, అబ్జ = కల్పవృక్షమును, అబ్జకర = సముద్రశ్రేష్ఠమును. వి = విశేషముగా, ల = గ్రహించుటకు, ఆసము = స్థానమైనది.
4. ఆర = అరిసమూహముయొక్క, తారహార = ముత్యాలహారములకు, అబ్జ = బంగారముయొక్క జాత = పుట్టుకకు, ఆ = స్థానమగు, అబ్జాబ్జ = శంఖునిధికి, కరకరాబ్జ = శ్రేష్ఠకాంతులకు నిధియగు అబ్జా = లక్ష్మికిని, అబ్జకర = అమృతకిరణములుగల, వి = పరమాత్మయగు, ల = చంద్రునికి, ఆసము = స్థానమైనది.

## 1 ఆశ్వాసం॥ 55 పద్యము

1. ఆత్మజాత = కాంతిసమూహములకు, ఆ = స్థానమగు, ఆత్మజాత = చంద్రుఁడు, ఆత్మజాత = మన్మథుఁడు, అజుఁడు = విష్ణువు.
2. ఆత్మజాత = చంద్రునకు. ఆత్మజాత = కుమారుఁడగు బుధుఁడు, ఆత్మజాత = కచుఁడు, అజుఁడు = కుమారస్వామి
3. ఆత్మజాతాత్మజాత = బ్రహ్మదేవుని పుత్త్రుడు సనత్కుమా...డు, ఆత్మజాత = బ్రహ్మదేవుడు, అజుఁడు = ఈశ్వరుడు.
4. ఆత్మజాతాత్మజాత = బ్రహ్మపుత్త్రుడగు వసిష్ఠుడు, ఆత్మజాత = ఆత్మ = పరమాత్మయొక్క, జ = జపముయొక్క, అ = హేతువుయొక్క త = నిశ్చయముగలయోగి, అజుఁడు = వినాయకుఁడు.

## ద్వి ఆ 122

1. ఆరకరాబ్జ = కుబేరుఁడు, జాబ్జజ = కల్పవృక్షము, కరాబ్జ = సుధాసముద్రము.
2. ఆర = సూర్యుఁడు, కరాబ్జ = అగ్ని, జాబ్జజ = కుమారస్వామి, కరాబ్జ = ఈశ్వరుడు-
3. ఆర = పాదరసము, కరాబ్జజ = ఐరావతము, అబ్జజ = శంఖము, కరాబ్జ = చంద్రుఁడు-

## ఆ 3-16 పద్యము

1. రాజజ = బుధుఁడు, రాజ = బ్రహ్మ, రాజ = ఈశ్వరుఁడు, భవ = బుద్ధి, కళా = విద్య భవము = ఐశ్వర్యము-
2. రాజజ = కుమారస్వామి, రాజ = చంద్రుఁడు, రాజ = కుబేరుఁడు, భవ = క్రియ, కళా = కళలు, భవము = ధనము-
3. రాజజ = సనత్కుమారుఁడు, రాజ = మన్మథుఁడు, రాజ = విష్ణువు, భావ = ఆత్మజ్ఞానము, కళా = సౌందర్యము, భవము = సంసారము-

# శుద్ధాశుద్ధపత్రము

| పుట, | పద్యసంఖ్య. | పంక్తి, | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|---|
| 1 | 1 | 3 | న్విడచి | న్విడిచి |
| 3 | 12 | 1 | కార్గులు | కార్గురు |
| ,, | 13 | 6 | కీర్తివంతుఁడై | కీర్తిమంతుఁడై |
| ,, | 15 | 2 | మాంబయనెడుఁగాం | మాంబయనెడుకాం |
| 5 | 27 | 5 | బూపఱి | చూపఱి |
| ,, | 30 | 6 | మండిత | మండల |
| ,, | 32 | 3 | సోలుచుఁద్రావాలి | సోలుచుఁద్రావాలి |
| ,, | 34 | 1 | శ్రీరవిభుండుఁ | శ్రీరవిభుఁడు |
| ,, | | 2 | ఒడిగిబూని | ఒడిగిపూని |
| 6 | | 2 | జేసెడుఁగోకిల | జేసెడుకోకిల |
| ,, | | 2 | ఘటియుంచుబణితుఁడు | ఘటించుపణితుఁడు |
| ,, | 3 | 2 | వర్క. | నక్ర |
| 7 | 46 | 4 | మిన్నలగుజన్ను | మిన్నలగుచన్ను |
| ,, | 47 | 2 | నీటుఁజూపుల | నీటుచూపుల |
| ,, | ,, | 6 | బలుజిందు | బలుచిందు |
| ,, | 48 | 1 | జాములుబట్టినో | జాములుపట్టినో |
| 8 | 49 | 6 | సుడుపుచు | నుడుపుచు |
| 9 | 60 | 2 | ఘనులైనఁగవి., తేజము | ఘనులైనకవి., దేజము |
| 10 | 62 | 1 | డైదగు | డైతగు |
| ,, | 63 | 1 | డైనఁబుఁ | డైనపుం |
| ,, | ,, | 2 | నిట్లుఁ | నిట్లు |
| ,, | 67 | 3 | దినఁబిక | దివంబిక |
| 11 | 69 | 5 | చేఁ | జేఁ |
| ,, | 70 | 4 | నటులుబల్గుల | నటులుపుల్గుల |
| ,, | 72 | 1 | జనకుండుఁబంప | జనకుండుపంప |
| ,, | 75 | 1 | రాముఁడుబిమ్మటన్ | రాముడుపిమ్మటన్ |
| 12 | 78 | 3 | జేయఁగానిపంత్రము నెట్లుబూనె | జేయగానిపంతము నెట్లుపూనె |
| ,, | 80 | 2 | గూడినఁగీర్తి | గూడినకీర్తి |
| 13 | 89 | 2 | గలిగినొక | గలిగినయొక |
| 14 | 91 | 3 | గారంబైదగు | గారంబైతగు |
| ,, | 98 | 2 | వనపాలులం | వనపాలురం |
| 15 | 100 | 4 | దీవింపుచున్ | దీవించుచున్ |
| 16 | 111 | 2 | నాధుండుఁబ్రా | నాథుండుప్రా |
| 17 | 116 | 3 | శైత్యముసం | శైత్యంబుసం |